

# చైతన్య భగవద్గీత

## అథ నవమోఽధ్యాయః - తొమ్మిదవ అధ్యాయము

## రాజవిద్యారాజగుహ్యయోగః - రాజవిద్యారాజగుహ్యయోగము

**జ్ఞానము - విజ్ఞానము**

***జ్ఞానం తేఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యామ్యశేషతః*** - అర్జునా! విజ్ఞానముతో కూడిన జ్ఞానాన్ని సంపూర్ణంగా నీకు బోధిస్తాను అంటూ ఏడవ అధ్యాయాన్ని ఆరంభించి జ్ఞాన విజ్ఞానాలను గూర్చి ప్రసంగించాడు గీతాచార్యుడు. ఈ విధమైన జ్ఞానాన్ని తెలుసుకున్న తరువాత తెలియ దగింది మరొకటి ఉండదు అని కూడా భరోసా ఇచ్చాడు.

శాస్త్రజ్ఞానమును జ్ఞానమని, అనుభవ జ్ఞానమును విజ్ఞాన మని అర్థం చేసుకున్నాం. శాస్త్రజ్ఞానం పరోక్షం కాగా, అనుభవ జ్ఞానం అపరోక్షం అని దాని అర్థం. అంటే, పరోక్షం అపరోక్షం కావడమే పరిపూర్ణం. పరిపూర్ణ జ్ఞానంతో తృప్తి చెందిన పూర్ణ పురుషుడు, ఆప్తకాముడే జ్ఞానవిజ్ఞాన తృప్తాత్ముడు అని ఆరవ అధ్యాయం లోనే గ్రహించాము *(6 - 8)*.

ఏడవ అధ్యాయంలో ***జ్ఞానం తేఽహం సవిజ్ఞానం*** అంటూ ప్రవచించిన జ్ఞాన విజ్ఞాన విషయమునే తొమ్మిదవ అధ్యాయం ఆరంభంలో ***జ్ఞానం విజ్ఞాన సహితం*** అని ప్రస్తావిస్తూ, ప్రవచనాన్ని కొనసాగించాడు. అంతేకాదు. ఈ జ్ఞానాన్ని పొందితే అశుభము నుండి విడిపడటం జరుగుతుంది అని కూడా వాగ్దానం చేశాడు.

ఏడవ అధ్యాయం జ్ఞాన విజ్ఞానాలతో ఎలా ఆరంభమైందో, తొమ్మిదవ అధ్యాయం కూడా జ్ఞాన విజ్ఞానాలతో అలాగే ప్రారంభమైంది. ఏడవ అధ్యాయం ఆరు, ఏడు శ్లోకాలలో జ్ఞాన విజ్ఞానాలు ఎలా ప్రస్తావించ బడ్డాయో, తొమ్మిదవ అధ్యాయం నాలుగు, ఐదు శ్లోకాలలో కూడా అలాగే విస్పష్టం చేయబడ్డాయి.

విజ్ఞాన సహితమైన ఈ జ్ఞానమును పొందిన వాడు తిరిగి పొంద దగింది మరొకటి ఉండదు అని ఏడవ అధ్యాయంలో చెప్పడం వల్ల, అది పరిపూర్ణమైన జ్ఞాన మని స్పష్టమైంది ***(యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే)***. అలాగే, విజ్ఞాన సహితమైన జ్ఞానమును పొందిన వ్యక్తి అశుభము నుండి శాశ్వతంగా విడిపడతాడు అని తొమ్మిదవ అధ్యాయంలో చెప్పడం వల్ల అజ్ఞాననాశము సమూలంగా జరిగి పోతుంది అనేది కూడా సుస్పష్టమైంది ***(జ్ఞానం విజ్ఞాన సహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్)***.

కనుక, విజ్ఞాన సహితమైన జ్ఞానము అజ్ఞానమును సమూలంగా నిర్మూలించి, పరిపూర్ణ జ్ఞానమును ప్రసాదిస్తుంది అనేది నిర్దిష్ట మైంది. ఈ కారణం గానే జ్ఞాన విజ్ఞానములను హరించే కామాన్ని జయించమని మూడవ అధ్యాయంలో హెచ్చరించి (***పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్,*** *3 - 41*), విజ్ఞాన సహిత మైన జ్ఞానమును పొంది జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముడవై శోభించమని ఆరవ అధ్యాయంలో ఆదేశించాడు (***జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,*** *6 - 8*).

ఏడవ అధ్యాయంలో సగుణ నిర్గుణ బ్రహ్మ స్వరూపమును గూర్చి ప్రవచించి, చివరగా అధిభూత, అధిదైవ, అధియజ్ఞ సహితంగా బ్రహ్మ సాక్షాత్కార వైభవాన్ని వివరించి, మరణకాలంలో, ప్రాణ ప్రయాణ సమయంలో మనస్సును పరబ్రహ్మము నందు నిలిపి, సహస్రారమున సుషుమ్నానాడి ద్వారా ప్రాణోత్క్రమణం చేసి, అర్చిరాది మార్గంలో బ్రహ్మలోకము చేరే ధ్యేయ బ్రహ్మోపాసకుల గతిని సూచన ప్రాయంగా భగవంతుడు

ప్రస్తావించి నపుడు అధిదైవ, అధిభూతాదులను తెలుసుకోవాలని కుతూహల పడిన అర్జునుడు ప్రసంగం మధ్యలో దూరి ***కిం తద్బ్రహ్మ కిం అధ్యాత్మం?*** అంటూ వరుసగా ఏడు ప్రశ్నలను సంధించడంతో, వాటికి సమాధానంగా ఎనిమిదవ అధ్యాయాన్ని ప్రవచించిన పరమేశ్వరుడు, ఆ విషయం సమాప్తం కాగానే, ఏడవ అధ్యాయంలో ఆగిన జ్ఞాన విజ్ఞాన ప్రసంగాన్ని తిరిగి చేదుకొని తొమ్మిదవ అధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు.

**సంశయ బీజము**

***అష్టమే ధారణా యోగః సగుణః ఉక్తః*** - ఎనిమిదవ అధ్యాయంలో సగుణ రూపమైన ధారణాయోగం చెప్పబడింది. తత్పదము ధ్యేయ విషయంగా నిర్దిష్ట మైంది. ధారణాయోగం చేత సుషుమ్నా నాడీ ద్వారము గుండా స్వేచ్ఛగా ప్రాణాన్ని విడిచిన సగుణ బ్రహ్మోపాసకుడు దేవయాన మార్గంలో పయనించి బ్రహ్మలోకాన్ని చేరుతాడు. అక్కడ బ్రహ్మదేవుని సన్నిధిలో ఉపదేశమును పొంది, కల్పాంతమున పరబ్రహ్మ ప్రాప్తిని పొందుతాడు. దీనినే క్రమముక్తి అని తెలుసుకున్నాం. కల్పాంతమున బ్రహ్మమును పొందడము అనే ఈ మోక్షప్రాప్తి అనావృత్తి రూప ఫలం. అంటే, తిరిగి జన్మకు రాని సుగతి. క్రమముక్తిని పొందిన బ్రహ్మోపాసకుడు తిరిగి జన్మించడు. జనన మరణ వలయం నుండి విముక్తు డవుతాడు. ఇదే అనావృత్తి రూప ఫలం. ఈ విషయం ఎనిమిదవ అధ్యాయంలో స్పష్టంగా అర్థమైంది.

ధారణాయోగంతో కూడిన సగుణ బ్రహ్మోపాసన మోక్షమును ప్రసాదిస్తూ ఉంది. సగుణ బ్రహ్మోపాసన ఫలంగా బ్రహ్మలోకము ప్రాప్తిస్తూ ఉంది. అక్కడ బ్రహ్మోపదేశము జరుగుతూ ఉంది కనుక, పునరావృత్తి ఉండదు. జన్మరాహిత్యం జరుగుతుంది.

ఆత్మయే బ్రహ్మము అనే బ్రహ్మాత్మజ్ఞానము కలుగుతూ ఉంది కనుక, ఆత్మకు జనన మరణాలు లేనందున, ఆత్మయే తాను అనే జ్ఞానము కలిగిన బ్రహ్మోపాసకునికి జనన మరణాలు ఉండే అవకాశం లేదు. ఇదే అనావృత్తి రూప ఫలం. బ్రహ్మాత్మజ్ఞానం వల్ల సిద్ధించిన జనన మరణ రూప సంసార నివృత్తి ఫలం.

ఇంతవరకు బాగుంది. ముక్తి అయితే వస్తుంది. కాకపోతే, అది మరణానంతరము బ్రహ్మ లోకంలో ప్రాప్తిస్తుంది. అంటే, ఈ జన్మలో మోక్షం లేదు, రాదు అనే అర్థం కూడా ధ్వనిస్తూ ఉంది. ముక్తి అనేది మరణానంతరమే సాధ్యము అని భావించే ప్రమాదము కూడా ఉంది. కనుక ముక్తి అనేది బ్రహ్మలోకంలో సిద్ధించే క్రమముక్తి రూపం లోనే సాధ్యమా? మరొక విధంగా ప్రాప్తించే అవకాశం లేదా? అనే సందేహం కలుగుతుంది. ఈ సంశయాన్ని నివృత్తి చేస్తూ ఆరంభ మవుతూ ఉంది తొమ్మిదవ అధ్యాయము.

**భవద్రూపమే గాని భవిష్య ద్రూపం కాదు**

మరణించిన తరువాత బ్రహ్మలోకంలో బ్రహ్మప్రాప్తి కలిగే టట్లయితే, ప్రస్తుతం బ్రహ్మము లేకుండా మనం ఉన్నట్లే కదా! ఇది సాధ్యమేనా? భగవంతుడు లేకుండా మనం ఉండగలమా? ఉండలేము అనేదే కదా శాస్త్రసందేశం!

పరమేశ్వరుడు భవిష్యత్తుకు సంబంధించిన వాడు అయితే, మనం వర్తమానంలో ఎలా ఉండగలం? మరణానంతరము బ్రహ్మలోకంలో ఉపదేశము అందవచ్చు. అలాగని, బ్రహ్మజ్ఞానము బ్రహ్మలోకం లోనే లభ్యమా? బ్రహ్మము బ్రహ్మలోకానికే పరిమితుడా? అదే వాస్తవ మైతే, బ్రహ్మము మానవలోకంలో లేనట్లే కదా! ఒక లోకంలో ఉండి మరొక లోకంలో లేనివాడు బ్రహ్మము ఎలా అవుతాడు?

భగవంతుడు రేపటి వాడు అయితే, మనం నేడు ఎలా ఉన్నాం? భగవంతుడు అక్కడ ఉండేవాడు అయితే, మనం ఇక్కడ ఎలా ఉన్నాం? మనం ఉన్నాము అంటే, ఆయన ఉన్నాడు అని అర్థం. కాకపోతే,





ఈ సత్యం అర్థం కావడం లేదు. బుద్ధికి తెలిసి రావడం లేదు. తెలియక పోవడం సమస్య అయినప్పుడు, పరిష్కారం తెలుసుకోవడమే గదా! అలాంటప్పుడు తెలుసుకోవడమే ప్రధానం గాని, ఎక్కడ తెలుసుకోవాలి? ఎప్పుడు తెలుసుకోవాలి? అనేది ప్రధానం కాదు గదా!

తన స్వరూపం మట్టే అని తెలుసుకోవడానికి కుండ ఎక్కడికి పోవాలి? అలా తెలుసుకోవడానికి ఒక సమయము గాని ప్రదేశము గాని అవసరమా? జ్ఞానము కలగడమే ముఖ్యం. మరి జ్ఞానం ఎలా కలుగుతుంది? జ్ఞానం కలవాడు బోధిస్తేనే కలుగుతుంది. బోధించే వాడు ఉండి, బోధను అందుకొనే అర్హత గలవాడు ఉన్నప్పుడు జ్ఞానం కలగక పోయే అవకాశం ఉందా? బోధించే వాడు చతుర్ముఖ బ్రహ్మయే అయి ఉండాలి అనే నియమ మేదైనా ఉందా? అది కూడా బ్రహ్మలోకం లోనే బోధించాలి అనే నిబంధన మాత్రం ఉందా?

జ్ఞానం అనేది ప్రదేశానికి పరిమితం కాదు. కాలానికి పరిమితం కాదు. బోధించే వాడికి జ్ఞానం విషయంలో స్పష్టత ఉండాలి. బోధను అందుకొనే వాడికి అంతఃకరణ శుద్ధి ఉండాలి. అంతే. అర్హుడైన వానికి జ్ఞానం కలిగిన వాడు బోధిస్తే, జ్ఞానం ప్రాప్తిస్తుంది. జ్ఞానమే ప్రధానం కనుక, జ్ఞానమున్న వాడు ఎవడు బోధించినా జ్ఞానం కలుగుతుంది. బ్రహ్మలోకంలో బ్రహ్మదేవుడే బోధించాలి అనేది లేదు. మానవ లోకంలో బ్రహ్మజ్ఞానం కలిగిన శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన గురువు బోధించినా సరిపోతుంది.

కుండ ఎక్కడుందో మట్టి అక్కడే ఉంది. మట్టిపాత్ర లన్నిటిలో మట్టే ఉంది. కారణానికి దూరంగా కార్యం ఉండలేదు. సృష్టిలో పరమేశ్వరుడు సర్వకారణంగా శోభిస్తున్నాడు. సృష్టి కారణము తానే. సృష్టి కార్యమూ తానే. కార్యములు అనేక రూపాలలో కనపడినా, అనేక నామాలతో వినపడినా, ఆ నామ రూపాలలో అస్తి భాతి ప్రియంగా భాసించేది సర్వ కారణమైన పరమేశ్వరుడే. సృష్టి తానే. సృష్టికర్త కూడా తానే.

ఇదే భగవద్విషయం. ఈశ్వర సంబంధమైన జ్ఞానం. ఈ విధమైన జ్ఞానం కలవారు పరమేశ్వరుని ఏకరూపునిగా, వేరు వేరు రూపాలు గల వానినిగా, విశ్వరూపునిగా ***(ఏకత్వేన పృథక్త్వేన, బహుధా విశ్వతో ముఖమ్)*** ఉపాసిస్తారు అంటూ ప్రస్తుత అధ్యాయం - పదహైదవ శ్లోకంలో భగవానుడే చెబుతాడు.

కనుక, భగవంతుడు ఎక్కడో తెలిసేవాడు కాడు. ఎప్పుడో తెలిసేవాడు కాడు. ఇప్పుడు లేకుండా మరొకప్పుడు కలిగేవాడు కాడు. ఇక్కడ లేకుండా మరొక చోట తెలిసేవాడు కాడు. మనం ఉన్నచోటే తానున్నాడు. మనం ఉన్నప్పుడే తాను ఉన్నాడు. ఇక్కడే ఉన్నాడు. ఇప్పుడే ఉన్నాడు. ఉన్నచోట చూడకుండా, మరెక్కడో వెదకడం చేత ఉన్నవాడే అయినా లేనట్లు ఉన్నాడు. గొప్ప రహస్యంగా మిగిలి పోతున్నాడు. గుహ్యమై, రాజగుహ్యమై ఉండి పోతున్నాడు.

*కలడు కల డనెడి వారిలో కలవు నీవు*
*లేడు లేడనెడి వారిలో నిజము నీవు*
*ఉండి లేనట్లు ఉంటివి ఉర్వినాథా!*
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!*** - అని చిన్నికృష్ణ శతకంలో ఒక చేతి వెన్నముద్ద.

రహస్యము ఏదైనా అది లేనిది కాదు. ఉన్నదే. ఉండి తెలియనిది ఏదైనా రహస్యమే. ప్రపంచంలో ఎన్నో రహస్యాలు ఉన్నాయి. ఏది రహస్యము? ఎవరికి రహస్యము? అని ప్రశ్నించుకుంటే, ఎవరికి ఏది తెలియదో అది వారికి రహస్యము అనే సమాధానం వస్తుంది. తెలిసిన వారికి రహస్యం బట్టబయలు. తెలిసిన వారు చెబితే తెలియని వారికి తెలుస్తుంది. తెలిసిన క్షణాన అంతవరకు ఎవరికి రహస్యంగా ఉండిందో వారికి కూడా రహస్యం బట్టబయలు అవుతుంది.

ప్రస్తావించి నపుడు అధిదైవ, అధిభూతాదులను తెలుసుకోవాలని కుతూహల పడిన అర్జునుడు ప్రసంగం మధ్యలో దూరి ***కిం తద్బ్రహ్మ కిం అధ్యాత్మం?*** అంటూ వరుసగా ఏడు ప్రశ్నలను సంధించడంతో, వాటికి సమాధానంగా ఎనిమిదవ అధ్యాయాన్ని ప్రవచించిన పరమేశ్వరుడు, ఆ విషయం సమాప్తం కాగానే, ఏడవ అధ్యాయంలో ఆగిన జ్ఞాన విజ్ఞాన ప్రసంగాన్ని తిరిగి చేదుకొని తొమ్మిదవ అధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు.

**సంశయ బీజము**

***అష్టమే ధారణా యోగః సగుణః ఉక్తః*** - ఎనిమిదవ అధ్యాయంలో సగుణ రూపమైన ధారణాయోగం చెప్పబడింది. తత్పదము ధ్యేయ విషయంగా నిర్దిష్ట మైంది. ధారణాయోగం చేత సుషుమ్నా నాడీ ద్వారము గుండా స్వేచ్ఛగా ప్రాణాన్ని విడిచిన సగుణ బ్రహ్మోపాసకుడు దేవయాన మార్గంలో పయనించి బ్రహ్మలోకాన్ని చేరుతాడు. అక్కడ బ్రహ్మదేవుని సన్నిధిలో ఉపదేశమును పొంది, కల్పాంతమున పరబ్రహ్మ ప్రాప్తిని పొందుతాడు. దీనినే క్రమముక్తి అని తెలుసుకున్నాం. కల్పాంతమున బ్రహ్మమును పొందడము అనే ఈ మోక్షప్రాప్తి అనావృత్తి రూప ఫలం. అంటే, తిరిగి జన్మకు రాని సుగతి. క్రమముక్తిని పొందిన బ్రహ్మోపాసకుడు తిరిగి జన్మించడు. జనన మరణ వలయం నుండి విముక్తు డవుతాడు. ఇదే అనావృత్తి రూప ఫలం. ఈ విషయం ఎనిమిదవ అధ్యాయంలో స్పష్టంగా అర్థమైంది.

ధారణాయోగంతో కూడిన సగుణ బ్రహ్మోపాసన మోక్షమును ప్రసాదిస్తూ ఉంది. సగుణ బ్రహ్మోపాసన ఫలంగా బ్రహ్మలోకము ప్రాప్తిస్తూ ఉంది. అక్కడ బ్రహ్మోపదేశము జరుగుతూ ఉంది కనుక, పునరావృత్తి ఉండదు. జన్మరాహిత్యం జరుగుతుంది.

ఆత్మయే బ్రహ్మము అనే బ్రహ్మాత్మజ్ఞానము కలుగుతూ ఉంది కనుక, ఆత్మకు జనన మరణాలు లేనందున, ఆత్మయే తాను అనే జ్ఞానము కలిగిన బ్రహ్మోపాసకునికి జనన మరణాలు ఉండే అవకాశం లేదు. ఇదే అనావృత్తి రూప ఫలం. బ్రహ్మాత్మజ్ఞానం వల్ల సిద్ధించిన జనన మరణ రూప సంసార నివృత్తి ఫలం.

ఇంతవరకు బాగుంది. ముక్తి అయితే వస్తుంది. కాకపోతే, అది మరణానంతరము బ్రహ్మ లోకంలో ప్రాప్తిస్తుంది. అంటే, ఈ జన్మలో మోక్షం లేదు, రాదు అనే అర్థం కూడా ధ్వనిస్తూ ఉంది. ముక్తి అనేది మరణానంతరమే సాధ్యము అని భావించే ప్రమాదము కూడా ఉంది. కనుక ముక్తి అనేది బ్రహ్మలోకంలో సిద్ధించే క్రమముక్తి రూపం లోనే సాధ్యమా? మరొక విధంగా ప్రాప్తించే అవకాశం లేదా? అనే సందేహం కలుగుతుంది. ఈ సంశయాన్ని నివృత్తి చేస్తూ అరంభ మవుతూ ఉంది తొమ్మిదవ అధ్యాయము.

**భవద్రూపమే గాని భవిష్య ద్రూపం కాదు**

మరణించిన తరువాత బ్రహ్మలోకంలో బ్రహ్మప్రాప్తి కలిగే టట్లయితే, ప్రస్తుతం బ్రహ్మము లేకుండా మనం ఉన్నట్లే కదా! ఇది సాధ్యమేనా? భగవంతుడు లేకుండా మనం ఉండగలమా? ఉండలేము అనేదే కదా శవ సందేశం!

పరమేశ్వరుడు భవిష్యత్తుకు సంబంధించిన వాడు అయితే, మనం వర్తమానంలో ఎలా ఉండగలం? మరణానంతరము బ్రహ్మలోకంలో ఉపదేశము అందవచ్చు. అలాగని, బ్రహ్మజ్ఞానము బ్రహ్మలోకం లోనే లభ్యమా? బ్రహ్మము బ్రహ్మలోకానికే పరిమితుడా? అదే వాస్తవ మైతే, బ్రహ్మము మానవలోకంలో లేనట్లే కదా! ఒక లోకంలో ఉండి మరొక లోకంలో లేనివాడు బ్రహ్మము ఎలా అవుతాడు?

భగవంతుడు రేపటి వాడు అయితే, మనం నేడు ఎలా ఉన్నాం? భగవంతుడు అక్కడ ఉండేవాడు అయితే, మనం ఇక్కడ ఎలా ఉన్నాం? మనం ఉన్నాము అంటే, ఆయన ఉన్నాడు అని అర్థం. కాకపోతే,





రః సత్యం అర్థం కావడం లేదు. బుద్ధికి తెలిసి రావడం లేదు. తెలియక పోవడం సమస్య అయినప్పుడు పరిష్కారం తెలుసుకోవడమే గదా! అలాంటప్పుడు తెలుసుకోవడమే ప్రధానం గాని, ఎక్కడ తెలుసుకోవాలి? ఎప్పుడు తెలుసుకోవాలి? అనేది ప్రధానం కాదు గదా!

తన స్వరూపం మట్టే అని తెలుసుకోవడానికి కుండ ఎక్కడికి పోవాలి? అలా తెలుసుకోవడానికి ఒక సమయము గాని ప్రదేశము గాని అవసరమా? జ్ఞానము కలగడమే ముఖ్యం. మరి జ్ఞానం ఎలా కలుగుతుంది? జ్ఞానం కలవాడు బోధిస్తేనే కలుగుతుంది. బోధించే వాడు ఉండి, బోధను అందుకొనే అర్హత గలవాడు ఉన్నప్పుడు జ్ఞానం కలగక పోయే అవకాశం ఉందా? బోధించే వాడు చతుర్ముఖ బ్రహ్మయే అయి ఉండాలి అనే నియమ మేదైనా ఉందా? అది కూడా బ్రహ్మలోకం లోనే బోధించాలి అనే నిబంధన మాత్రం ఉందా?

జ్ఞానం అనేది ప్రదేశానికి పరిమితం కాదు. కాలానికి పరిమితం కాదు. బోధించే వాడికి జ్ఞానం విషయంలో స్పష్టత ఉండాలి. బోధను అందుకొనే వాడికి అంతఃకరణ శుద్ధి ఉండాలి. అంతే. అర్హుడైన వానికి జ్ఞానం కలిగిన వాడు బోధిస్తే, జ్ఞానం ప్రాప్తిస్తుంది. జ్ఞానమే ప్రధానం కనుక, జ్ఞానమున్న వాడు ఎవడు బోధించినా జ్ఞానం కలుగుతుంది. బ్రహ్మలోకంలో బ్రహ్మదేవుడే బోధించాలి అనేది లేదు. మానవ లోకంలో బ్రహ్మజ్ఞానం కలిగిన శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన గురువు బోధించినా సరిపోతుంది.

కుండ ఎక్కడుందో మట్టి అక్కడే ఉంది. మట్టిపాత్ర అన్నిటిలో మట్టే ఉంది. కారణానికి దూరంగా కార్యం ఉండలేదు. సృష్టిలో పరమేశ్వరుడు సర్వకారణంగా శోభిస్తున్నాడు. సృష్టి కారణము తానే. సృష్టి కార్యమూ తానే. కార్యములు అనేక రూపాలలో కనపడినా, అనేక నామాలతో పిలవబడినా, ఆ నామ రూపాలలో అస్తి భాతి ప్రియంగా భాసించేది సర్వ కారణమైన పరమేశ్వరుడే. సృష్టి తానే. సృష్టికర్త కూడా తానే.

ఇదే భగవద్విషయం. ఈశ్వర సంబంధమైన జ్ఞానం. ఈ విధమైన జ్ఞానం కలవారు పరమేశ్వరుని ఏకరూపునిగా, వేరు వేరు రూపాలు గల వానినిగా, విశ్వరూపునిగా (ఏకత్వేన పృథక్త్వేన, బహుధా విశ్వతో ముఖమ్) ఉపాసిస్తారు అంటూ ప్రస్తుత అధ్యాయం - పదహైదవ శ్లోకంలో భగవానుడే చెబుతాడు.

కనుక, భగవంతుడు ఎక్కడో తెలిసేవాడు కాదు. ఎప్పుడో తెలిసేవాడు కాదు. ఇప్పుడు లేకుండా మరొకప్పుడు కలిగేవాడు కాదు. ఇక్కడ లేకుండా మరొక చోట తెలిసేవాడు కాదు. మనం ఉన్నచోటే తానున్నాడు. మనం ఉన్నప్పుడే తాను ఉన్నాడు. ఇక్కడే ఉన్నాడు. ఇప్పుడే ఉన్నాడు. ఉన్నచోట చూడకుండా, మరెక్కడో వెదకడం చేత ఉన్నవాడే అయినా లేనట్లు ఉన్నాడు. గొప్ప రహస్యంగా మిగిలి పోతున్నాడు. గుహ్యమై, రాజగుహ్యమై ఉండి పోతున్నాడు.

*కలడు కల డనెడి వారిలో కలవు నీవు*
*లేడు లేడనెడి వారిలో నిజము నీవు*
*ఉండి లేనట్లు ఉంటివి ఉర్వినాథా!*
*నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!* - అని చిన్నికృష్ణ శతకంలో ఒక చోట చెప్పినట్లు.

రహస్యము ఏదైనా అది లేనిది కాదు. ఉన్నదే. ఉండి తెలియనిది ఏదైనా రహస్యమే. ప్రపంచంలో ఎన్నో రహస్యాలు ఉన్నాయి. ఏది రహస్యము? ఎవరికి రహస్యము? అని ప్రశ్నించుకుంటే, ఎవరికి ఏది తెలియదో అది వారికి రహస్యము అనే సమాధానం వస్తుంది. తెలిసిన వారికి రహస్యం బట్టబయలు. తెలిసిన వారు చెబితే తెలియని వారికి తెలుస్తుంది. తెలిసిన క్షణాన అంతవరకు ఎవరికి రహస్యంగా ఉండిందో వారికి కూడా రహస్యం బట్టబయలు అవుతుంది.

ఏదైనా, ఏ విద్య అయినా, ఉండి తెలియ నపుడు రహస్య మవుతుంది. గుహ్య మవుతుంది. కాని, బ్రహ్మవిద్య రహస్యాలలో రహస్యము. ఎందుకని? అది తెలుసుకొనే వానికి అన్యంగా, భిన్నంగా ఉండే రహస్యం కాదు. ఆ రహస్య మేదో అది తెలుసుకొనే వాడి స్వరూపమే. అదే విచిత్రం.

బ్రహ్మము రహస్యము. బ్రహ్మమును తెలిపే బ్రహ్మవిద్య కూడా రహస్యమే. ఆత్మయే బ్రహ్మము. కనుక, ఆత్మే రహస్యము. ఆత్మవిద్య కూడా రహస్యమే. అందుచేతనే ఆత్మవిద్య అనేది విద్యలలో రాజు వంటిది. కనుకనే అది రాజవిద్య ***(విద్యానాం రాజా).*** అంతేకాదు. రహస్యాలలో కెల్ల రహస్యం. రహస్యాలలో కూడా రాజు లాంటిది ***(గుహ్యానాం రాజా).*** ఇటు విద్యలలో వరిష్ఠమై ఉండటం చేత ఆత్మవిద్య రాజవిద్య అయింది. అలాగే రహస్యాలలో రహస్యం కావడం చేత రాజగుహ్య మైంది. ఇదే రాజవిద్యా రాజగుహ్య యోగము. స్వరూపం గానే ఉండి అర్థం గాకుండా ఉన్న దానిని అర్థమయ్యేలా చేసే యోగము. మార్గము. విధానము. ఉపాయము.

**ఆఖ్యాయిక**

ఒక వజ్రాల వ్యాపారి విలువైన వజ్రాలను ఒక విదేశీయుడికి విక్రయించడానికి చెన్నై నుండి రైలులో ఢిల్లీ వెళ్తున్నట్లు ఒక గజదొంగ తెలుసు కున్నాడు. ఎలాగైనా ఆ వజ్రాలను కాజేయాలని నిశ్చయించుకొని, వర్తకుడు పయనించే బోగీ లోనే తనకు కూడా ఢిల్లీకి రిజర్వేషన్ చేయించు కున్నాడు.

వజ్రాల వ్యాపారి రైలు ఎక్కి, తన సీటులో తాను కూర్చున్నాడు. దొంగ కూడా వర్తకుని వేషాన్ని ధరించి, అదే పెట్టెలో ఎక్కాడు. అదృష్టవశాత్తు వజ్రాల వ్యాపారి ప్రక్కనే తనకు సీటు ఏర్పాటైంది. దొంగ ఎంతగానో సంతసించాడు.

ప్రయాణంలో ఉభయులూ సంభాషించు కున్నారు. జాతీయ వ్యాపారాలే గాక, అంతర్జాతీయ వ్యాపార వ్యవహారాలు కూడా చర్చించు కున్నారు. తాను కూడా ప్రముఖ వ్యాపారి అని వజ్రాల వ్యాపారి విశ్వసించేటట్లు భాషిస్తూ ప్రవర్తించాడు గజదొంగ.

సాయంత్రం ఐదు గంటలకు చెన్నై నుండి రైలు బయలు దేరింది. రాత్రి పది గంటల వరకు ఇరువురు ముచ్చటించుకొని పడుకున్నారు. వజ్రాల వ్యాపారి గుర్రు పెట్టి నిద్ర పోయాడు. రాత్రి రెండు గంటల సమయంలో, అందరూ నిద్ర పోతూ ఉండటం చూసి గజదొంగ కార్యోన్ముఖు డయ్యాడు. వజ్రాల వర్తకుని వద్ద ఉన్న చాళ్ళీ లన్నిటినీ వెదకి చూశాడు. వజ్రాలు ఎక్కడా కనిపించ లేదు. నిరాశతో ఆలోచిస్తూ పడుకున్నాడు.

ఉదయాన్నే ఉభయులూ నిద్ర లేచారు. వజ్రాల వర్తకుడు వెళ్ళి స్నానం చేసి వచ్చాడు. ఆ తరువాత దొంగ వెళ్ళి స్నానం చేసి వచ్చే సరికి, తన వజ్రాలను లెక్క పెట్టుకొని, వాటిని ఒక గులాబీరంగు పట్టు వస్త్ర ఖండంలో మడత పెట్టి, తన సూట్‌కేసులో వ్యాపారి పెట్టుకుంటూ ఉండటం దొంగ చూశాడు.

వజ్రాలు ఉన్నాయి. ఈ రాత్రికి ఎలాగైనా దోచేయాలి అనుకున్నాడు దొంగ. ఆ రోజంతా సాయంత్రం వరకు ఇద్దరూ ఆనందంగా ముచ్చటించుకుంటూ కాలక్షేపం చేశారు. రాత్రి అయింది. నిన్నటి లాగే అందరూ నిద్రించారు. వర్తకుడు గాఢనిద్ర లోకి జారుకో గానే, దొంగ లేచి వెదకడం ఆరంభించాడు. వర్తకునికి సంబంధించిన ప్రతి వస్తువును గాలించి మరీ చూశాడు. ఎక్కడా వజ్రాలు కనిపించ లేదు.

తెల్లవారింది. స్నానాలు చేశారు. దొంగ ఒక స్టేషనులో దిగి ఫలహారశాల నుండి ఉభయులకూ అల్పాహారం పొట్లాలు తీసుకొని వచ్చాడు. ఆ సమయానికి వజ్రాలను లెక్కించి, సూట్‌కేసులో పెట్టుకుంటూ కనిపించాడు వజ్రాల వర్తకుడు.





అది చూచి ఆశ్చర్యపోయాడు గజదొంగ. ఈ విధమైన అపజయాన్ని తన అనుభవంలో ఇంతవరకు తాను చూడలేదు. ఇక ఒక్క రాత్రి మాత్రమే మిగిలి ఉంది. తెల్లవారితే ఢిల్లీ వచ్చేస్తుంది. ఈ రాత్రికి ఎలాగైనా వజ్రాలను సొంతం చేసుకోవాలి అనుకున్నాడు గజదొంగ.

రాత్రి అయింది. అంతా మామూలే. మళ్ళీ అపజయమే. వజ్రాలు లభించ లేదు. తెల్లవారింది. ఢిల్లీ స్టేషన్ రాబోతూ ఉంది. ఇద్దరూ స్నానాలు ముగించు కున్నారు. ఢిల్లీ స్టేషన్ వచ్చేసింది. వజ్రాల వర్తకుని కొరకు అతడి బంధువులు వచ్చారు.

ఇక ప్లాట్‌ఫారమ్ మీద ప్రయాణీకు లిద్దరూ పరస్పరం కరచాలనం చేసుకుని ఎవరి దారిన వారు నిష్క్రమించ బోతారు. అప్పుడు వజ్రాల వ్యాపారిని ప్రక్కకు పిలిచి దొంగ అడిగాడు.

అయ్యా! మీకు నిజం చెప్పేస్తున్నాను. నేనొక గజదొంగను. మీ వజ్రాలను అపహరించా లని మీతో ప్రయాణం చేశాను. ఉదయం మీ దగ్గర కనిపించే వజ్రాలు రాత్రిపూట కనిపించేవి కావు. వాటిని మీరు ఎక్కడ దాచేవారు? అని అడిగాడు.

చూడు నాయనా! నీ అనుభవం నీ కెలా ఉందో, నలభై సంవత్సరాలుగా వజ్రాల వ్యాపారం చేస్తున్న నాకు కూడా నా అనుభవం అలాగే ఉంది. నువ్వెవరో చెన్నై సెంట్రల్ స్టేషన్ లోనే నేను కనిపెట్టేశాను. ఎక్కడ వజ్రాలను దాచినా, నువ్వు దోచేస్తావని నాకు తెలుసు. అందుకనే రాత్రి అయ్యేసరికి, నీవు స్నానాల గదికి వెళ్ళగానే వజ్రాలను నీ దిండు క్రింద పెట్టేవాణ్ణి. ఉదయాన నువ్వు స్నానానికి వెళ్ళి నపుడు వాటిని తీసి నువ్వు చూసే లాగ లెక్కించుకొనే వాణ్ణి. వజ్రాల కోసం నువ్వు ఎక్కడైనా శ్రమించి వెతుకుతావు కాని, నీ తలగడ క్రింద ఎట్టి పరిస్థితుల లోను వెతకవు అని నాకు బాగా తెలుసు అంటూ, నవ్వుతూ నిష్క్రమించాడు.

మనం కూడా ఆ గజదొంగ లాగే నవ్వుల పాలవు తున్నాము. ఎన్ని రాత్రులు వెదికినా దొంగకు వజ్రాలు లభించ లేదు. ఎన్ని జన్మ లెత్తి అన్వేషించినా మనకూ ఆత్మానందము ప్రాప్తించడము లేదు. తనను విడిచిపెట్టి అన్యమైన ప్రదేశాలలో వెదికిన దొంగకు నిరాశ ఎదురైనట్లే, మనల్ని విడిచి, ఎక్కడ మనం ఎంతగా అన్వేషించినా ఆనందం ప్రాప్తించక పోగా, నిరాశా నిస్పృహలే ఎదురౌ తున్నాయి. దొంగకు వజ్రాల విషయం రహస్యంగా మిగిలి పోయినట్లు, మనకు ఆత్మ విషయం రహస్యమైంది. అది కూడా మామూలు రహస్యం కాదు. రాజ రహస్యమైంది. రాజగుహ్య మైంది.

**ధ్యేయ బ్రహ్మ - జ్ఞేయ బ్రహ్మ**

**పరోక్షం - అపరోక్షం**

బ్రహ్మోపాసకులు, వారి ఉపాసనా విధానాలు, తద్వారా వారు పొందే గతులు - ఇవన్నీ ఎనిమిదవ అధ్యాయములో విస్పష్ట మయ్యాయి. అక్కడ సాధన ధ్యానం కావడం చేత సాధ్యము ధ్యేయమైంది. ధ్యేయము బ్రహ్మమే కనుక అది ధ్యేయబ్రహ్మ విషయం.

ప్రస్తుతం మనం అధ్యయనం చేయబోతున్న తొమ్మిదవ అధ్యాయము ధ్యేయబ్రహ్మ విషయం కాదు. జ్ఞేయబ్రహ్మ విషయం. ఇక్కడ సాధన జ్ఞానం కావడం చేత సాధ్యము జ్ఞేయమైంది. జ్ఞేయము బ్రహ్మమే కనుక ఇది జ్ఞేయబ్రహ్మ విషయం.

ధ్యేయబ్రహ్మ విషయంలో బ్రహ్మము ఉంది అని తెలుస్తుంది. బ్రహ్మానుభూతి మరణానంతరము బ్రహ్మలోకంలో కలుగుతుంది అని కూడా అర్థ మవుతుంది. కనుక, ధ్యేయబ్రహ్మ విషయాన్ని ప్రవచించిన

ఎనిమిదవ అధ్యాయము సాధకుడు ఎలా మరణించాలో, మరణించిన తరువాత బ్రహ్మానుభూతిని ఎలా పొందాలో తెలుపుతుంది. ఇదే క్రమముక్తి.

జ్ఞేయబ్రహ్మ విషయంలో బ్రహ్మము ఉంది అని కాకుండా తానే బ్రహ్మముగా తెలియడం జరుగుతుంది. మరణానంతరము కాకుండా, ఇక్కడే, ఇప్పుడే బ్రహ్మానుభూతి కలుగుతుంది. కనుక, జ్ఞేయబ్రహ్మ విషయాన్ని ప్రవచించిన తొమ్మిదవ అధ్యాయం ఎలా మరణించాలి అని కాకుండా, ఎలా జీవించాలో తెలుపుతుంది. జీవించి ఉన్నప్పుడే ముక్తిని ఎలా పొందాలో ఎరుక పరుస్తుంది. ఇదే జీవన్ముక్తి.

***అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షం జ్ఞాన మేవ తత్,***
***అస్మి బ్రహ్మేతి చేద్వేద అపరోక్షం తదుచ్యతే॥***

ధ్యేయ బ్రహ్మోపాసకులు బ్రహ్మము ఉంది ***(అస్తి)*** అనే జ్ఞానం తోనే ఉంటారు. కాకపోతే, వారి జ్ఞానము పరోక్షంగా ఉంటుంది. బ్రహ్మము వారి కన్నా వేరుగా ఉన్నట్లు భావిస్తారు. ఇదే పరోక్ష జ్ఞానము. ఇక్కడ అజ్ఞానము నివృత్తి కావడం లేదు కనుక, ఇది సాక్షాత్తు మోక్ష సాధనం కాదు. అందుచేతనే పరోక్ష మైంది.

కాని, జ్ఞేయబ్రహ్మ విషయానికి సంబంధించిన జ్ఞానులు మాత్రం బ్రహ్మమును తమ స్వరూపం గానే తెలుసు కుంటారు. బ్రహ్మము ఉంది ***(అస్తి)*** అని కాకుండా, బ్రహ్మమై ఉన్నాను ***(అస్మి)*** అనే జ్ఞానంతో ఉంటారు. వీరి జ్ఞానము అపరోక్షంగా ఉంటుంది. వీరు బ్రహ్మము తమ కన్నా అన్యం కాదనే నిశ్చయజ్ఞానంతో ఉంటారు. ఇదే అపరోక్ష జ్ఞానము. ఇదే విజ్ఞానము ***(విశేషేణ జ్ఞాయతే ఇతి విజ్ఞానః).*** విజ్ఞాన సహితమైన జ్ఞానము. ధ్యేయబ్రహ్మ విలక్షణమైన జ్ఞేయబ్రహ్మ స్వరూపము. విజ్ఞాన సహితమైన ఈ జ్ఞానము ***(జ్ఞానం విజ్ఞాన సహితం)*** విద్య లన్నిటిలో శ్రేష్ఠ మైనది. కనుకనే ఇది రాజవిద్య. అలాగే రాజగుహ్యం.

**విద్యారహస్యం - రహస్యమైన విద్య**

బ్రహ్మమునకు సంబంధించిన విద్య బ్రహ్మవిద్య. అందుచేత ఇది విద్యలలో శ్రేష్ఠమై రాజవిద్య అయింది. ఉపనిషత్తులలో నిక్షిప్తమై ఉన్న బ్రహ్మవిద్య సర్వులూ అధ్యయనం చేసి అర్థం చేసుకొనేది కాదు. అది చాలా రహస్య మైంది. గుహ్యమైంది. బ్రహ్మవిద్య ఎప్పుడైతే గుహ్యమైందో, అది బ్రహ్మకు సంబంధించిన విద్య కావడం చేత బ్రహ్మము కూడా గుహ్య డయ్యాడు. రహస్యంగా మిగిలి పోయాడు.

***రహస్యోపనిషత్ వేద్యత్వాత్ గుహాయాం హృదయాకాశే నిహిత ఇతి వా గుహ్యః -*** హృదయాకాశంలో దాగి ఉండి, రహస్యమైన ఉపనిషత్తుల ద్వారా తెలియబడే వాడు కావడం చేత బ్రహ్మము కూడా గుహ్యము. రహస్యము. అతడే నీవు అనేదే అసలు రహస్యము. అదే గుహ్యము. ఇది మామూలు రహస్యం కాదు. రహస్యాలలో రహస్యము.

అంతేకాదు. ఉపనిష ద్విద్యను గ్రహించిన వారికి కూడా ఇది రహస్యం గానే మిగిలిపోతూ ఉంది. గుప్తం గానే ఉండి పోతూ ఉంది. ***వాఙ్మనసయోః అగోచరత్వాత్ గుప్తః -*** మనోవాక్కులకు అందక గుప్త మవుతూ ఉంది. ప్రమాణ గోచరమే గాని ఇంద్రియ గోచరం కాకుండా ఉంది. స్పష్టంగా అర్థం కాకపోతే మాత్రం అది రహస్యం గానే మిగిలి పోతుంది. అందుచేతనే గుహ్యమైన బ్రహ్మవిద్య రాజగుహ్య మైంది.

రాజగుహ్య మైన బ్రహ్మవిద్య రాజవిద్య కావడం చేత దానిని పొందే మార్గము కూడా రాజమార్గమే అయి ఉంది. అదే జ్ఞానమార్గము. విజ్ఞాన సహితమైన జ్ఞానమార్గము. అన్య మార్గాల వలె సందులు గొందులలో ప్రయాణం కాకుండా, సాక్షాత్ మోక్షైక సాధనమైన జ్ఞానమార్గము రాజమార్గమై ఉంది. చక్కని రాజమార్గమై ఉంది. ఈ చక్కని రాజమార్గాన్ని రసరమ్యంగా కీర్తించారు త్యాగరాజస్వామి.





**రాజమార్గము**

**చక్కని రాజమార్గమే యుండగ - సందుల దూర నేల? ఓ మనసా!**
**చిక్కని పాలు మీగడ యుండగ - ఛీ యను గంగా సాగర మేలే?**

అని ఖరహర ప్రియ రాగంలో హరిహర ప్రియంగా, సురనర ప్రమోదంగా గానం చేశారు త్యాగరాజస్వామి.

అందమైన, అద్భుతమైన, అసమానమైన రాజమార్గమును (రాజవిద్యను) విడిచి, ఇరుకైన, మురికైన మార్గాలలో ఎందుకు పయనిస్తావు? అని మనస్సును హెచ్చరించారు.

శుచికి, రుచికి, ఆరోగ్యానికి, ఆనందానికి అనువుగా చిక్కని మీగడ పాలు ఉండగా, దాని విడిచిపెట్టి, ఛీ! ఛీ! గంగా సాగర పాన మెందుకు? అని వ్యంగ్య బాణాన్ని సంధించారు.

గంగా సాగర మంటే, గంగ సాగరములో కలిసే చోటు అని కాదు. గంగాసాగర మందే మత్తెక్కించే కల్లు, మత్తులో ముంచే నాటు సారా అని అర్థము.

పూర్వపు రోజుల్లో సదాచార కుటుంబాలలో పుట్టి, అనాచారానికి అలవాటు పడ్డ కొందరు దురాచారులు నికృష్ట వస్తువులకు ఉత్కృష్ట నామాలను తగిలించి, పిల్లి పాలు త్రాగినట్లు అపమార్గంలో చరిస్తూ దురలవాట్లను కొనసాగించే వారు. అలాంటి వారు ఇతరులకు అర్థం కాకుండా, కేవలం వారిలో వారికే అర్థమయ్యే లాగా, కల్లు సారాను గంగాసాగర మని, కోడిగ్రుడ్లను విబూదిపండ్లు అని, చేపలను జలపుష్పాలు అని చెప్పుకుంటూ వ్యవహారాన్ని కొనసాగించే వారు. త్యాగరాజస్వామి వారి భాషనే కృతిలో ఉపయోగించి, చేతులతో పని లేకుండానే చెంపలు వాయించారు.

పయనించడానికి సూటియైన చక్కని రాజమార్గం లాగా, పానం చేయడానికి చిక్కని మీగడ పాల లాగా, పరమేశ్వరుని పొంది తరించడానికి రాజగుహ్య మైన జ్ఞానమార్గము రాజమార్గమై రాజిల్లుతోంది. ఇదే రాజవిద్యా రాజగుహ్య యోగము లోని కేంద్ర విషయము. ఇది గీతలో తొమ్మిదవ అధ్యాయము.

**తొమ్మిది - అక్షయ నిధి**

రాజవిద్యా రాజగుహ్య యోగము గీతలో తొమ్మిదవ అధ్యాయము. తొమ్మిది ఒక విచిత్రమైన అంకె. జ్ఞానములో జ్ఞానం విషయంలో సాంఖ్యము ఎలాంటిదో గణితంలో సంఖ్యా పరంగా తొమ్మిది అంకె అలాంటిది. ఆత్మవిద్య ఎలా పరిపూర్ణమో, బ్రహ్మవిద్య ఎలా రహస్యమో, గణితంలో తొమ్మిది అంకె కూడా ఒక రహస్యమే. ఈ తొమ్మిది అనే అంకె కూడా సదా పూర్ణమై భాసిస్తూ, పరిపూర్ణతకు ప్రతిరూపంలా ప్రతిఫలిస్తూ ఉంటుంది.

**(1) అద్వయం**

బ్రహ్మము అద్వయము. అఖండము. బ్రహ్మము సృష్టిలో సర్వ వ్యాపకమై ఉన్నా, తన అఖండత్వానికి భంగం వాటిల్లదు. అనేక రూపాలుగా రూపాంతరం చెందినా పరమేశ్వరుడు ఏకమై, అద్వయమై ఉన్నాడు.

తొమ్మిది అంకె కూడా అలాగే అద్వయంగా ఉంటుంది. తొమ్మిదిని ఎన్ని అంకెలతో పెంచుకున్నా, మార్పు లేని బ్రహ్మపదార్థం లాగా తొమ్మిది చలించకుండా ఉంటుంది. తొమ్మిది ఆర్ల యాభై నాలుగు. ఐదు నాలుగు కలిసి తిరిగి తొమ్మిది అవుతుంది. తొమ్మిది ఎనిమిదుల డెబ్బై రెండు. ఏడు రెండు కలిపితే తొమ్మిది అవుతుంది. ఇలా ఎంతైనా పెంచుకుంటూ పోండి, తొమ్మిది మాత్రం అచలంగా ఉంటుంది.

స్వామీజీ! నాలుగు వందల డెబ్బై రెండును తొమ్మిదితో పెంచితే? ఏమైంది? పెంచండి. నాలుగు వేం

రెండు వందల నలభై ఎనిమిది అవుతుంది. మళ్ళీ ఆ నాలుగు అంకెలను కూడండి. తొమ్మిది ఒక్కటే అక్షయంగా మిగులుతుంది.

పరమేశ్వరుడు సృష్టి లోని నామరూపా లన్నిటిలో ఉన్నా, వాటికి విలక్షణంగా అద్వయమై భాసించినట్లు, ఎన్ని అంకెలలో వ్యాపించినా తొమ్మిది ఏకమై, అద్వయమై ఉంటుంది. ఇదే భిన్నత్వంలో ఏకత్వం. సృష్టి దేని చేత వ్యాప్తమై ప్రకాశిస్తూ ఉందో, తిరిగి దాని యందే లయిస్తూ ఉంది అనే ఏ అద్వయ స్థితిని ఉపనిషత్తు ప్రవచిస్తూ ఉందో అదే తొమ్మిదిని సంఖ్యాపరంగా పెంచడములో మనకు ఋజువైంది.

**యేన ప్రకాశతే విశ్వం యత్రైవ ప్రవిలీయతే**

విశ్వము దేని చేత ప్రకాశిస్తూ ఉందో, తిరిగి దాని యందే లయిస్తూ ఉంది. అదే బ్రహ్మము అని పంచబ్రహ్మోపనిషత్.

**(2) ఆధారం**

విశ్వమైనా - వ్యక్తి అయినా, ఏది ఉన్నా - ఎవరు ఉన్నా, ఆధారము బ్రహ్మమే. పరమేశ్వరుడే. పరమేశ్వరుడు అనుకూలంగా ఉన్నంత వరకే మన మనుగడ ఉంటుంది. ఆధారంతో విభేదించి నపుడు దేనికీ అస్తిత్వం ఉండదు. కేవలం ఆధారమే అస్తిత్వముతో భాసిస్తుంది.

మనం ఉన్నాం. అలా ఉండటానికి పరమేశ్వరుడే ఆధారము. విశ్వము ఉంది. విశ్వాధారంగా భగవానుడు ఉన్నాడు. రేపు వ్యక్తులు, విశ్వము లేకపోయినా భగవానుడు దివ్యంగా శోభిస్తూ ఉంటాడు. సంఖ్యాపరంగా చూస్తే ఈ విధమైన అస్తిత్వము తొమ్మిది అంకెలో కూడా కనిపిస్తుంది.

ఐదు అంకెతో తొమ్మిది కలిస్తే, ఐదు శోభిస్తుందే గాని క్షోభించదు. జీవిస్తుందే గాని నశించదు. ఎలా గంటారా? ఐదు తొమ్మిదితో కలిస్తే పద్నాలుగు అవుతుంది. నాలుగు ఒకటి కలిసి ఐదుగా ఉంటుంది. ఇలా తొమ్మిదితో ఏ అంకె కలిసినా, పరమేశ్వరుని వల్ల విశ్వం శోభించినట్లు, ఆ అంకె మనుగడను సాగిస్తుంది. మీరు ఏ అంకెను కలిపినా ఇలాగే ఉంటుంది. ఏడు తొమ్మిదితో కలిస్తే పదహారు అవుతుంది. ఆరు ఒకటి కలిసి మళ్ళీ ఏడు గానే ఉంటుంది.

అలా కాకుండా విభేదిస్తే, లేదా ప్రతికూలిస్తే, పరమేశ్వరునికి దూరమైనది ఏదైనా మనుగడను కోల్పోయినట్లు, ఆ తరువాత పరమేశ్వరుడే మిగిలినట్లు, తొమ్మిది కూడా తనతో విభేదించిన అంకెను తనలో కలుపుకొని అంకెకు అస్తిత్వాన్ని పోగొట్టి, అస్తి రూపంలో తానే భాసిస్తుంది.

తొమ్మిదితో కలిసి నపుడు కలిసిన అంకె శోభించింది. తొమ్మిదితో ఐదు కలిస్తే, ఐదే మిగిలి ఉండటం మనం చూశాము. ఇప్పుడు విభేదించి చూడండి. అంటే తొమ్మిదిని ఐదుతో పెంచండి. నలభై ఐదు వస్తుంది. నాలుగు ఐదు కలిస్తే తొమ్మిది అవుతుంది. ఐదు అదృశ్య మవుతుంది. తొమ్మిదితో ఏ అంకె విభేదించినా ఇదే గతి. తొమ్మిదిని ఏడుతో పెంచితే అరవై మూడు అవుతుంది. ఆరు మూడు కలిస్తే తొమ్మిది అవుతుందే గాని ఏడు కాదు. ఈ విధంగా తొమ్మిది అనే అంకె బ్రహ్మపదార్థం లాగా అస్తిత్వ ఆధారాలతో రహస్యంగా శోభిస్తూ ఉంటుంది.

***ఆధార మానన్ద మఖండ బోధం***
***యస్మిన్ లయం యాతి పురత్రయం చ ॥***

సమస్తమునకు ఆధారము, ఆనంద స్వరూపము, అఖండ జ్ఞానరూపము అయిన పరబ్రహ్మము నందు





పురత్రయము లయిస్తూ ఉంది అని కైవల్యోపనిషత్. ఇదే త్రిపురా రహస్యము. రాజగుహ్య మైన రాజవిద్యా వైభవము. భగవద్గీత తొమ్మిదవ అధ్యాయంలో తొంగి చూచే ప్రాభవము.

**(3) అనంతం**

బ్రహ్మము అద్వయం కనుక అనంతము. చైతన్య స్వరూపము. అనంతమైన చైతన్యానికి ఏదీ దూరం కాలేదు. అన్నీ చైతన్య స్వరూపాలే. అన్నిటిలో శ్రేష్ఠ మైనది చైతన్యమే. ఎన్నో భిన్నంగా తెలుస్తూ ఉండినా, అన్నీ ఏకమైనా, అవన్నీ ఒక్క చైతన్యం లోనే ఉంటాయి. తొమ్మిది అంకెలో కూడా అన్ని అంకెలూ విలీనమై తొమ్మిది ఒక్కటే బ్రహ్మములా భాసిస్తూ ఉంటుంది.

ఒకటి నుండి తొమ్మిది వరకు అంకెలను వేసుకొని కూడండి. మొత్తం నలభై ఐదు అవుతుంది. నాలుగు అయిదు కలిసి మళ్ళీ తొమ్మిది అంకే ఉంటుంది. ఇదే తొమ్మిది అంకె లోని అనంత వైభవము. అద్వైతము లోని అఖండ ప్రాభవము.

**పంచరూప పరిత్యాగాత్ అస్వరూప ప్రహాణతః ।**
**అధిష్ఠానం పరం తత్త్వం ఏకం స చ్ఛిష్యతే మహత్ ॥**

పాంచభౌతిక మైన జగత్తు దూరమై నపుడు, జడమైన వస్తు రూపము లన్నీ అదృశ్యమై, అధిష్ఠానము, అద్వయము, సద్రూపము, మహత్తరము అయిన పరంబ్రహ్మ మొక్కడే భాసిస్తూ ఉంటుంది అని బహ్వృచోపనిషత్తు. అలాగే ఒకటి నుండి తొమ్మిది వరకు గల అంకెల నన్నిటినీ కలిపితే, అంకెలన్నీ అదృశ్యమై, తొమ్మిది ఒక్కటే బ్రహ్మము లాగా శేషించి ఉంటుంది.

**మధ్య లోనే మహిమ**

రాజగుహ్య మైన రాజవిద్యను దివ్యంగా ప్రవచించిన తొమ్మిదవ అధ్యాయము భగవద్గీత మధ్యలో నిలిచి మరొక విధంగా తన మహిమను చాటుకున్నది.

సమస్త వేదార్థ సార సంగ్రహ భూతమైన భగవద్గీత మహాభారతం మధ్యలో ఉంది **(మధ్యే మహాభారతమ్)**. ఉపనిషత్సార మైన గీతామృతాన్ని వితరణ చేసిన శ్రీకృష్ణ భగవానుడు కురుక్షేత్రంలో ఉభయసేనల మధ్య నిలబడి ఉన్నాడు. గీతను శ్రవణం చేసిన అర్జునుడు పాండవ మధ్యముడు. సర్వభూతాల మనుగడకు కారణ మైన పరమేశ్వరుడు హృదయ పుండరీకం మధ్య శోభిస్తున్నాడు **(హృత్పుండరీకం విరజం విశుద్ధం)**. మహిమాన్విత మైన రాజవిద్యా రాజగుహ్య యోగమైన తొమ్మిదవ అధ్యాయం కూడా భగవద్గీత మధ్యలో ఒదిగి తన మహిమను చాటుకుంది. గీత మధ్యలో ఉండటమే గాక, తత్పద రూపమైన ద్వితీయ షట్కంలో కూడా మధ్య లోనే చేరి సంధ్యలో నిలబడి పోయింది. కనుక మనం కూడా బంధాల నుండి విడివడి, ఆనంద విహారం చేయడానికి వందనం అంటూ ముందుకు సాగుదాము.

విశిష్టము, వరిష్ఠము అయిన రాజవిద్యా రాజగుహ్య యోగానికి ఉపోద్ఘాతాన్ని విస్తారంగా చెప్పుకున్నాం. ఇక అధ్యాయం లోకి ప్రవేశించి అధ్యయనం చేద్దాం!

**శ్రీ భగవానువాచ :**

**ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే ।**
**జ్ఞానం విజ్ఞాన సహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్ ॥** 1

**ఇదం-తు-తే-గుహ్యతమం-ప్రవక్ష్యామి-అనసూయవే**
**జ్ఞానం-విజ్ఞానసహితం-యత్-జ్ఞాత్వా-మోక్ష్యసే-అశుభాత్**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = | దేనిని | ఇదం | = | ఈ |
| జ్ఞాత్వా | = | తెలిసికొని | జ్ఞానం తు | = | జ్ఞానమును |
| అశుభాత్ | = | అశుభము నుండి | అనసూయవే | = | అసూయ లేని |
| మోక్ష్యసే | = | విడి పడతావో | తే | = | నీ కొరకు |
| గుహ్యతమం | = | అతి రహస్యమైన | ప్రవక్ష్యామి | = | చెబుతున్నాను |
| విజ్ఞానసహితం | = | అనుభవ జ్ఞానముతో కూడుకున్న | | | |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! నువ్వు అసూయ లేని వాడివి. అందుకనే, అతి రహస్యము, అనుభవ సహితము అయిన జ్ఞానాన్ని నీకు చెబుతున్నా! ఇది అర్థమైతే, సంసార బంధము నుండి బయట పడతావు.**

**వ్యాఖ్య**

**విషయ ప్రస్తావన**

***ఇదం*** అంటూ భగవంతుడు తొమ్మిదవ అధ్యాయాన్ని ప్రారంభించాడు. ***ఇదం*** అంటే 'ఇది' అని అర్థము. 'ఇది' అనే పదాన్ని ఎప్పుడు ఉపయోగించినా, ఎక్కడ ఉపయోగించినా, ఎవరు ఉపయోగించినా, అది సామీప్యాన్ని సూచిస్తుంది. ఏది దగ్గరగా ఉందో, కళ్ళ ముందు ప్రత్యక్షంగా ఉందో దానిని 'ఇది' అని ప్రస్తావిస్తాము.

ప్రస్తుతం ఏ విషయాన్నైతే భగవంతుడు ప్రవచిస్తున్నాడో దానిని ***ఇదం*** అని ఆరంభించాడు. ఇది విషయ ప్రస్తావన. ప్రవచించబోయే విషయం బ్రహ్మజ్ఞానం కనుక, ఇక్కడ ***ఇదం*** అంటే బ్రహ్మజ్ఞానము అని అర్థము ***(ఇదం బ్రహ్మజ్ఞానం).***

మరి, ఎదురుగా ఉండే దానిని ***ఇదం*** అనేటప్పుడు, బ్రహ్మ విషయం ఎదురుగా, ప్రత్యక్షంగా తెలిసేది కాదు కదా! అలాంటప్పుడు ***ఇదం*** అనేది విషయ ప్రస్తావనకు సముచిత మేనా? అనే సందేహము కలుగుతుంది.

నిజమే. బ్రహ్మజ్ఞానం కళ్ళ ముందు లేదు. ఇంద్రియ ప్రత్యక్షం కాదు. కాని, ముందుగానే అధ్యాయ పీఠికలో మనం చూచినట్లు, సప్తమాధ్యాయంలో ఆగిన విషయాన్ని గీతాచార్యుడు ఇక్కడ తిరిగి అందుకొని ప్రవచిస్తున్నాడు. కనుక ఏ బ్రహ్మజ్ఞానమును ***ఇదం*** అంటూ ప్రారంభించాడో, అది కళ్ళ ముందు లేకపోయినా, వక్త మనస్సులో ప్రత్యక్షంగా ఉంది. కంటికి కనిపించే దాని కన్నా మనస్సుకు తెలిసేది వ్యక్తికి మరీ సమీపంలో ఉన్నది అవుతుంది కాబట్టి, బ్రహ్మజ్ఞానమును ***ఇదం*** అంటూ ప్రస్తావించడం జరిగింది.

ప్రస్తుత అధ్యాయము మనం అర్థం చేసుకున్నట్లు ఏడవ అధ్యాయానికి కొనసాగింపు కావచ్చు. కాని, భగవంతుడు బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన విషయాన్ని అంతకు పూర్వం అధ్యాయాలలో కూడా ఎంతగానో విస్తరించి వివరించి ఉన్నాడు. అదంతా వక్త మనస్సులో ఉంది. అంతేకాదు, ముమ్మందు ఏది ప్రవచించ బోతున్నాడో అది కూడా మనస్సులో ప్రత్యక్షంగా ఉంది. ఇంతవరకు చెప్పినది, ఇక మీదట చెప్పబోయేది అంతా గీతాచార్యుని మనస్సులో ప్రత్యక్షంగా ఉన్నందున, దానిని, అంటే బ్రహ్మజ్ఞానమును ***ఇదం*** అని ప్రస్తావించడం జరిగింది ***(ఇదం, బ్రహ్మజ్ఞానం, వక్ష్యమాణమ్ ఉక్తం చ పూర్వేషు అధ్యాయేషు తత్ బుద్ధౌ సంనిధీ కృత్య 'ఇదమ్' ఇతి ఆహ).*** కనుక, బ్రహ్మజ్ఞానము అనేది ఎక్కడో పరోక్షంగా లేదు, ***ఇదం*** - ప్రత్యక్షం గానే ఉంది అని అర్థము. బ్రహ్మకు సంబంధించిన జ్ఞానమే బ్రహ్మజ్ఞానము కనుక, బ్రహ్మజ్ఞానము పరోక్షం కాదు అంటే





బ్రహ్మము కూడా పరోక్షం కాదు అని అర్థము. బ్రహ్మము అపరోక్షము అని భావము. బ్రహ్మము ఎప్పుడైతే అపరోక్షము అని తేలిందో, బ్రహ్మజ్ఞానము కాలాంతర ఫలం కాదని స్పష్ట మవుతూ ఉంది. ఇప్పుడు కాకుండా, కాలంలో ప్రాప్తించేది కాలాంతర ఫలం. అంటే, ఎనిమిదవ అధ్యాయంలో మనం చర్చించుకున్న క్రమముక్తి విషయం. బ్రహ్మలోకంలో ప్రాప్తించే బ్రహ్మజ్ఞాన విషయం. సగుణ బ్రహ్మోపాసకుడు బ్రహ్మలోకంలో బ్రహ్మజ్ఞానోపదేశం వల్ల క్రమముక్తి కలుగవచ్చు. దాని అర్థం ముక్తి అక్కడే గాని ఇక్కడ ప్రాప్తించదు అని మాత్రం కానే కాదు. కనుక, బ్రహ్మజ్ఞానం **ఇదం** పద ప్రయోగం చేత అపరోక్షం అని ఎప్పుడైతే నిర్ధారింప బడిందో, అది సద్యః ఫలమే గాని కాలాంతర ఫలం కాదు అని సుస్పష్ట మవుతూ ఉంది. ఈ విషయాన్ని, విశేషాన్ని నిర్ధారించడం కొరకు **తు** శబ్దం వాడ బడింది. **ఇదం తు** - అపరోక్షమైన ఈ బ్రహ్మజ్ఞానము అని స్పష్టం చేయడం జరిగింది.

**విశేష నిర్ధారణ**

**తు** శబ్దము విశేష వాచకము. వైశిష్ట్యార్థకం ప్రయోగింప బడింది. ధ్యానము కంటే జ్ఞానము ఎలా విలక్షణమో స్పష్టం చేయడం కోసం వాడ బడింది. ధ్యాన విషయమైన ధ్యేయ బ్రహ్మము, జ్ఞాన విషయమైన జ్ఞేయబ్రహ్మకు మధ్య అంతరాన్ని అర్థమయ్యే లాగా చేయడం కోసం చెప్ప బడింది. క్రమముక్తికి, జీవన్ముక్తికి అంతరాళమును నిర్ధారించడం కోసం **తు** శబ్ద ప్రయోగం జరిగింది **('తు' శబ్దః విశేష నిర్ధారణార్థః).** అంటే, శ్రుతి స్మృతి పురాణాలను ఆధారం చేసుకొని చూచినా, మోక్షానికి సాక్షాత్తు ఏకైక సాధనం సమ్యక్ జ్ఞానమే గాని మరొకటి కాదు అనే విశేషాన్ని వ్యక్తం చేస్తున్న విషయాన్ని నిర్ధారణ చేయడం కోసమే **తు** శబ్ద ప్రయోగము.

***వాసుదేవః సర్వమితి*** - ఈ సమస్తమూ వాసుదేవుడే *(7 - 19)* అని సప్తమాధ్యాయంలో చెప్పబడింది. ***సర్వం ఖలు ఇదం బ్రహ్మ*** - ఈ సమస్తమూ బ్రహ్మమే, దానికి అన్యంగా రెండవ వస్తువు లేదు అన్నది ఉపనిషత్తు. కనుక, ***ఇదం*** అని చెప్పబడుతున్న బ్రహ్మజ్ఞానము ఏదో కాదు, సర్వము తానైన వాసుదేవ పరబ్రహ్మమే. బాగుంది. మరి ఆత్మ ఎవరు? ***అయమాత్మా బ్రహ్మ*** - ఈ ఆత్మయే బ్రహ్మము. మరి ఈ సమస్తము వాసుదేవ పరబ్రహ్మమైనపుడు ఆత్మ ఏమిటి? ఆత్మ కూడా వాసుదేవ పరబ్రహ్మమే. మరి **ఇదం** - ఈ సమస్తము ఏమిటి? ఆత్మయే. ***ఆత్మై వేదం సర్వమితి*** (ఆత్మ ఏవ **'ఇదం'** సర్వం ఇతి). ఈ సమస్తము ఆత్మయే. ఇక పరోక్ష మెక్కడుంది? అంతా అపరోక్షమే. ***ఇదం*** - ఈ బ్రహ్మజ్ఞానము, ***అయం*** - ఈ ఆత్మ, రెండూ ఒక్కటే. అదే **ఇదం** పద ప్రస్తావన. **తు** శబ్ద నిర్ధారణ.

**ఉంది - తెలియవలసి ఉంది**

బ్రహ్మము పరోక్షం కాదు, అపరోక్షం అని అర్థమైంది. ఈ ఆత్మయే బ్రహ్మము అని కూడా తెలిసింది కనుక ఆత్మ కూడా అపరోక్షమే. నువ్వు ఉన్నావు. ఆత్మ ఉంది. నువ్వే ఆత్మ. ఇది ఇంద్రియాలకు ప్రత్యక్షం కాదు. అలాగని, పరోక్షమూ కాదు. ప్రత్యక్షము, పరోక్షము రెండూ కానిది అపరోక్షము. కనుక అది ఉన్నదే. కాకపోతే తెలియకుండా ఉంది. తెలియవలసి ఉంది. తెలియని వాడు తెలుసుకోవాలి. అంతే. జ్ఞానం ఏదైనా తెలిసిన వాడు ఇస్తేనే తెలియని వానికి అందుతుంది. చెబితేనే తెలుస్తుంది. అందుచేత శాస్త్రం శబ్ద ప్రమాణ మైంది.

మోక్షం జ్ఞానరూపంలో ఉంది. జ్ఞానం శాస్త్రంలో ఉంది. శాస్త్రం జ్ఞాని చెబితేనే అర్థ మవుతుంది. అంటే, శాస్త్రం మోక్షాన్ని ఇస్తుందా? అలాగని శాస్త్రం ఎప్పుడూ చెప్పలేదు. ఎందుకని? శాస్త్రం దృష్టిలో నువ్వు ముక్తుడవే గాని బద్ధుడివి కావు. నీవు ఆత్మవు. ఆత్మ నిత్యముక్తం. అలాంటి ఆత్మవైన నీవు బద్ధుడివి ఎలా అవుతావు?

బద్ధుడు కాని వాడు ముక్తుడు ఎలా అవుతాడు? ముక్తి అనేది ముక్తుడు కాని వానికి క్రొత్తగా ప్రాప్తించేది అయితే, అట్టి ముక్తి లేకుండా వచ్చింది అని అర్థము. ఇప్పుడు లేకుండా వచ్చింది రేపు లేకుండా పోదా? కాలంలో కలిగింది కాలంలో నశించదా? నశించేది మోక్ష మెలా అవుతుంది?

***మోక్షము కూడా క్షరమైతే***
***దానిని పొంది ఫల మేమి?***
***అక్షరమై అది స్థిరమైతే***
***పొందే యత్నం ఎందుకని?***
**పోయేది లేదు - వచ్చేది కాదు**
**ఉన్నది ఉన్నట్లు తెలియాలి**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

శాస్త్రం ఉన్నది ఆత్మ యొక్క అస్తిత్వాన్ని నిరూపించడానికి కాదు. నీవే ఆత్మ అనే జ్ఞానాన్ని ఇవ్వడానికి. నువ్వు ఉన్నావా, లేదా? ఉన్నావు. నువ్వు ఉన్నావు అంటే, నీవే ఆత్మ కనుక ఆత్మ ఉంది. మరి లేనిది ఏమిటి? లేనిది ఆత్మ కాదు. నేనే ఆత్మ అనే జ్ఞానం. జ్ఞానం లేదు కనుక జ్ఞానాన్ని పొందాలి. శాస్త్రం జ్ఞానాన్ని ఇస్తుంది. ఆత్మజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. అంతేగాని, ఆత్మను కాదు. ఆత్మ సిద్ధంగా ఉంది. స్వతఃసిద్ధంగా ఉంది. అది నీవే.

ఆత్మ నేనే అయినపుడు, నేను ఆత్మ అని నాకు ఎందుకు తెలియడం లేదు? నీవు కాని దానిని నీవు అని భావించడం చేత, నీవు ఏమిటో నీకు అర్థం కావడం లేదు. ఉన్న త్రాడులో లేని పామును చూచిన వానికి లేని సర్పమే ఉన్నట్లు గోచరిస్తుంది గాని, ఉన్న రజ్జువు తెలిసి రాదు. ఉన్నది సర్పమే అని నిర్ణయించింది తానే కనుక, అది సర్పము కాదు - త్రాడే అనే జ్ఞానాన్ని తనకు తానుగా పొందే అవకాశం లేదు. సహజంగా తనకు తానుగా తెలుసుకోలేని దానిని మరొకరు చెప్పినపుడే తెలుసుకోగలడు. అలా చెప్పేవాడు జ్ఞాని. చెప్పబడేది జ్ఞానం. చెప్పేవాడు గురువు. చెప్పబడేది శాస్త్రం. ఇక్కడే శాస్త్రం ప్రమాణమై శోభిస్తోంది. ప్రమాణాపేక్ష లేని వారికి జ్ఞానం ప్రాప్తించదు.

**యత్తు స్వతః అప్రాప్తం తత్ శాస్త్రేణ బోధితవ్యం**

నీకు నీవుగా అర్థం చేసుకోలేని దానిని శాస్త్రం ద్వారానే అర్థం చేసుకోవాలి అని ఆచార్యులు ఐతరేయోపనిషత్ భాష్యంలో చెబుతారు.

ఏదైతే ఉండి కూడా అర్థం కాకుండా ఉందో, దానిని గూర్చే భగవంతుడు ఇక్కడ బోధిస్తున్నాడు. ఉన్నదే అర్థం కాకుండా ఉండటం చేత అది గుహ్యమైంది. రహస్యమైంది. మామూలు రహస్యం కాదు. రహస్యాలలో రహస్య మైంది. గుహ్యతమ మైంది.

## గుహ్యతమం

గుహ్యం అంటే రహస్యము. తెలియనిది ఏదైనా రహస్యమే. గుహ్యమే. తరతమ భేదాన్ని బట్టి అతి రహస్యము గుహ్యతరము. కాని, రహస్యాలలో రహస్యమైన ఆత్మజ్ఞానము గుహ్యతమము ***(గుహ్యతమం గోప్యతమం).***





బ్రహ్మజ్ఞానమును గుహ్యతమం అని ఎందుకు చెప్పవలసి వచ్చింది అంటే, ప్రత్యక్షాది ప్రమాణాలకు అందనిది కావడం చేత. అంతేకాదు, ప్రశస్త మైనది, పరిరక్షించ వలసింది కావడం చేత గుహ్యతమం అని వ్యాఖ్యానించారు శ్రీ మధుసూదన సరస్వతి.

విలువైన రత్నమాణిక్యాలను, వజ్ర ఖచిత సువర్ణాభరణాలను ఎవరైనా రహస్యం గానే దాచుకుంటారు కదా! అవి అమూల్య మైనవి కనుకనే వాటిని రహస్యంగా దాచుకుంటారు. అలాంటప్పుడు మోక్ష ప్రదాయక మైన బ్రహ్మజ్ఞానము ఎంత అమూల్య మైనదో అంచనా వేసి చెప్పగలమా? అందుకే బ్రహ్మజ్ఞానము గుహ్యతమం.

రహస్యంగా దాచుకో వలసిన రత్న మాణిక్యాలను పిల్లలకు ఆట వస్తువులుగా ఎవరైనా ఇస్తారా? విలువైన వస్తువుల్ని ఎవరైనా, విలువ తెలిసిన వారికే ఇస్తారు. బ్రహ్మజ్ఞానము కూడా ప్రశస్తమై, పవిత్రమై, గుహ్యతమం కావడం చేత, దానిని విలువ తెలిసిన అర్జునునికే అచ్యుతుడు అనుగ్రహిస్తున్నాడు **(ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామి).**

అతి రహస్యమైన ఈ బ్రహ్మజ్ఞానమును **(ఇదం తు)** చెబుతున్నాను **(ప్రవక్ష్యామి)** అంటున్నాడు భగవంతుడు. **వక్ష్యామి** అంటే సరిపోతుంది. దానికి **ప్ర** అనే ఉపసర్గను చేర్చి **ప్రవక్ష్యామి** అనడం వల్ల ప్రబోధములో ఉండే ప్రభావము ద్యోతక మవుతూ ఉంది. నిస్సందేహంగా, నిర్ధారణ పూర్వకంగా చెప్పబడుతూ ఉంది అని అర్థము. ఎవరికి చెప్పబడుతూ ఉంది? ***(తే ప్రవక్ష్యామి).*** అర్జునా! నీ కోసం చెబుతున్నాను అంటున్నాడు భగవంతుడు. ఈ ఒక్క మాట అర్జునుని అర్హతకు అద్దం పడుతూ ఉంది. శిక్షణ యోగ్యుడైన శిష్యునికే ఏ గురువైనా బోధిస్తాడు. అర్జునుడు అర్హుడు కనుకనే పరమేశ్వరుడు బోధిస్తున్నాడు. బ్రహ్మజ్ఞానమును అందుకోవడానికి అర్జునుడు అధికారి కావడం చేతనే గుహ్యతమ మైన గీతాజ్ఞానాన్ని అనంతుడు అనుగ్రహిస్తున్నాడు.

ఏమిటి అర్జునుని అర్హత? ప్రత్యేకంగా పార్థునిలో కనిపిస్తున్న అధికారి లక్షణం ఏమిటి? అసూయ లేకపోవడమే. అర్జునుడు అనసూయువు కావడమే. ఈ విషయాన్ని భగవంతుడే స్వయంగా చెబుతున్నాడు. అర్జునా! నీవు అనసూయువు, అనగా అసూయ లేని వాడవు కనుక నీకు విస్పష్టంగా చెబుతున్నాను అంటున్నాడు ***(తే ప్రవక్ష్యామి కథయిష్యామి! అనసూయ వే అసూయా రహితాయ).***

## అసూయా రహితుడు

ఎంతగా వింటూ వున్నా అర్థం గాకుండా మిగిలి పోతున్న గుహ్యతమ మైన విషయాన్ని అర్థం చేసుకోవాలి అంటే, శ్రవణం చేసే ముముక్షువు అధికారియై ఉండాలి. చిత్తశుద్ధి కలవాడై ఉండాలి. శిక్షణ యోగ్యుడై ఉండాలి. అసూయ లేనివాడే అధికారి అంటున్నాడు భగవంతుడు.

***గుణేష్వపి పరేషు దోషారోపః అసూయా*** - మంచి గుణములు కలిగియున్న వారిలో చెడు గుణములను ఆరోపించుటయే అసూయ. అట్టి అసూయ ఎవరిలో అగుపించదో వాడు అనసూయువు. అసూయా రహితుడైన గుణవంతుడు. బ్రహ్మజ్ఞానమును పొందుటకు అర్హుడు.

పరుల గుణముల యందు దోష దర్శనము చేయుట అసూయ అని స్థూలంగా చెప్పుకున్నా, వాస్తవానికి అసూయ అనేది అరిషడ్వర్గాలకు ఉపలక్షణము. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలకు అసూయను ఉపలక్షణంగా చెప్పడం జరిగింది. ఈ అరిషడ్వర్గాల దుర్గుణాల నుండి విడిపడిన వాడు అనసూయువు. బ్రహ్మజ్ఞాన సముపార్జనకు యోగ్యత కలవాడు.

***గుణేషు అర్థదానాది ష్వపి డాంబికత్వాది దోషారోపః అసూయే త్యుచ్యతే*** - పేదలకు, సాధువులకు, స్వచ్ఛంద సంస్థలకు, లేదా ఆశ్రమాలకు ధన సహాయం చేసే ఉదారు లైన పుణ్యాత్ములను చూచి ఓర్వలేక, వారేదో పేరు ప్రఖ్యాతుల కోసం ఫోటోలను ముద్రించుకొని, దంభమును ప్రదర్శించుట కోసం దానధర్మాలను బహిరంగంగా చేస్తూ ఉంటారని దాతలకు దోషాలను అంటగట్టడం కూడా అసూయ క్రిందికే వస్తుంది. ఇలాంటి అసూయాపరులకు జడిసి ఉదారులు సైతం భీతి చెంది గుప్త దానాలు చేస్తూ ఉంటారు.

మరి, ఈ విధమైన అసూయ జ్ఞాన సముపార్జనకు ఎలా ప్రతిబంధకము? అనే సందేహము రావచ్చు. ఇంతకు మించిన ప్రతిబంధకము మరొకటి ఉంటుందా? ఉన్న గుణాలలో లేని దోషాలను వీక్షించే మనస్సే కదా రజ్జువులో సర్ప దర్శనం చేసినట్లు, ఆత్మను అనాత్మగా, అనాత్మను ఆత్మగా దర్శించేది! అనాత్మ యందు ఆత్మదర్శనం చేయడమే బంధము. అదే అజ్ఞానము ***(అనాత్మని అహ మితి మతిః బంధః, అజ్ఞానాత్ ప్రాప్తః).*** అజ్ఞాన జనితమై, బంధానికి కారణమైన అధ్యాసకు ప్రతిరూపమైన అసూయ జ్ఞానానికి ప్రతిబంధకం కాదా? కనుక గురువు జ్ఞానమును అనుగ్రహించినా అసూయాపరుడు అందుకోలేడు. అందుకున్నా నిలుపుకోలేడు. అసూయ లేనివాడు కనుక అర్జునుడు జ్ఞాన సముపార్జనకు అర్హు డయ్యాడు. కనుకనే అసూయా రహితుడైన అర్జునునకు విజ్ఞాన సహితమైన జ్ఞానాన్ని పరమేశ్వరుడు బోధిస్తున్నాడు. పార్థుడు ఎంతటి పుణ్యాత్ముడో! సాక్షాత్తు భగవంతుని నుండే అసూయా రహితుడు అనే యోగ్యతా పత్రాన్ని అందుకున్నాడు. అంతేకాదు, అర్జునుని నిర్మల హృదయాన్ని చూచి తృప్తి చెందిన భగవంతుడు అర్జునుని ప్రశ్నకు కూడా ఎదురు చూడకుండా తనకు తానుగా అధ్యాయాన్ని ప్రారంభించి ప్రవచిస్తున్నాడు.

కేవలం అర్జునుని సంస్కార వైభవాన్ని చూచి సంతసించడం కాకుండా, ముముక్షువుల మైన మనం స్వయంగా అసూయా రహితులమై ఉన్నామో, లేదో ఎవరికి వారుగా పరీక్షించి చూసుకోవాలి. అసూయ అనేది మనస్సును చెద లాగా తొలిచేస్తుంది. మనస్సులో అసూయ ప్రవేశించకుండా అనుక్షణం జాగ్రత్త పడుతూ ఉండాలి. అసూయా రహితుడు కావడం చేత అర్జునునికి విజ్ఞాన సహితమైన జ్ఞానాన్ని ఉపదేశిస్తున్నాడు అచ్యుతుడు.

### జ్ఞానము - విజ్ఞానము

అసూయా రహితుడు, అధికారి అయిన అర్జునునికి విజ్ఞాన సహితమైన జ్ఞానాన్ని బోధిస్తున్నాడు. విజ్ఞానముతో అంటే, అనుభవముతో కూడిన జ్ఞానం అని అర్థం ***(విజ్ఞాన సహితం అనుభవ యుక్తం).***

అనుభవ సహిత జ్ఞానాన్ని భగవంతుడు ఉపదేశిస్తున్నాడు. పరమేశ్వరుడు బ్రహ్మజ్ఞానమును ***(ఇదం బ్రహ్మజ్ఞానం)*** ఉపదేశిస్తున్నాడు అంటే, బ్రహ్మమును గూర్చి చెబుతున్నాడు అని కాదు. నీవే బ్రహ్మము అనే జ్ఞానాన్ని ఉపదేశిస్తున్నాడు అని అర్థం. ఇదే బ్రహ్మాత్మజ్ఞానము. అనుభవ యుక్తమైన జ్ఞానము. విజ్ఞాన సహితమైన జ్ఞానము ***(జ్ఞానం విజ్ఞాన సహితం).*** మరి, ఈ జ్ఞానాన్ని తెలుసుకోవడం వల్ల ప్రయోజన మేమిటి?

### బ్రహ్మజ్ఞాన ఫలం

ప్రత్యగాత్మయే పరమాత్మ అనే జ్ఞానాన్ని పొందినవాడు అశుభము నుండి విడిపడు తున్నాడు. విముక్తు డవుతున్నాడు. అశుభము అంటే బంధము. సంసార బంధము. అజ్ఞానము వలన ప్రాప్తించిన భవబంధము. వెలుగు చీకటిని పోగొట్టినట్లు జ్ఞానము అజ్ఞానమును నిర్మూలిస్తుంది. అజ్ఞానము ఎప్పుడైతే నశించిందో, అజ్ఞాన కార్యమైన సంసార బంధము కూడా తొలగి పోతుంది ***(యత్ జ్ఞానం, జ్ఞాత్వాప్రాప్య, మోక్ష్యసే అశుభాత్ సంసార బంధనాత్).*** ఇదే జ్ఞానఫలం. విజ్ఞాన సహిత బ్రహ్మజ్ఞాన ఫలం.





గుహ్యతమమై, అనుభవ సహితమైన ఏ బ్రహ్మజ్ఞానాన్ని భగవంతుడు బోధిస్తున్నాడో, దాని యందు అర్జునునికి ఆసక్తిని కలిగించి, అవధానంతో ఆలకించేటట్లు చేయడానికి, ఆ జ్ఞాన వైభవాన్ని ఎనిమిది విశేషణాలతో వర్ణిస్తున్నాడు.

**రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥** **2**

రాజవిద్యా-రాజగుహ్యం-పవిత్రం-ఇదం-ఉత్తమం
ప్రత్యక్షావగమం-ధర్మ్యం-సుసుఖం-కర్తుం-అవ్యయం

ఇదం = ఈ జ్ఞానము
రాజవిద్యా = విద్యలలో రాజైనది
రాజగుహ్యం = రహస్యములలో అతి రహస్య మైనది
ఉత్తమం = ఉత్తమ మైనది
పవిత్రం = పవిత్ర మైనది
ప్రత్యక్షావగమం = ప్రత్యక్షానుభవముచే గ్రహించ దగినది
ధర్మ్యం = ధర్మము తప్పనిది
కర్తుం = చేయుటకు
సుసుఖం = మిక్కిలి సులభ మైనది
అవ్యయం = నాశరహిత మైనది

**అర్జునా! ఇది రాజవిద్య. రాజగుహ్యం. ఇది పవిత్రము. ఉత్తమము. ప్రత్యక్షంగా అనుభవించ దగింది. ధర్మరూప మైంది. సులభసాధ్య మైంది. నశించనిది.**

**వ్యాఖ్య**

'ఇదం' అనే సర్వనామమును బ్రహ్మజ్ఞానం అని, అది గుహ్యతమ మని మొదటి శ్లోకంలో చెప్పు కున్నాం. రెండవ శ్లోకంలో గుహ్యతమ మైన ఆ బ్రహ్మజ్ఞానమునే 'రాజవిద్య' అని, 'రాజగుహ్య' మని, 'పవిత్ర' మని, 'ఉత్తమ' మని, 'ప్రత్యక్షావగమ' మని, 'ధర్మ్య' మని, 'సుసుఖం కర్తుం' అని, 'అవ్యయ' మని వర్ణిస్తున్నాడు. మొదటి శ్లోకంలో జ్ఞానం అని చెప్పబడిందే, రెండవ శ్లోకంలో విద్య అని చెప్పబడుతోంది. అక్కడ 'ఇదం' అంటే బ్రహ్మజ్ఞానము అని తెలుసుకున్నాము. దానినే ఇక్కడ బ్రహ్మవిద్యగా తెలుసుకోబోతాము. అదే రాజవిద్య. ప్రథమ శ్లోకంలో గుహ్యతమ మని చెప్పబడిందే, ఇక్కడ రాజగుహ్యంగా చెప్పబడుతూ ఉంది. కనుక ప్రస్తుతం ఎనిమిది విశేషణాలతో చెప్పబడుతున్న రాజవిద్య బ్రహ్మజ్ఞానమే.

### రాజవిద్య

విద్యలలో రాజు లాంటిది కావడం చేత బ్రహ్మవిద్య రాజవిద్య అయింది **(విద్యానాం రాజా).** విద్య లన్నిటిలో బ్రహ్మవిద్య మిక్కిలి ప్రకాశవంత మైనది కావడం చేత అది రాజవిద్య. మరొక దాని అవసరం లేకుండా స్వయంగా ప్రకాశిస్తూ ఉంది **(స్వయం రాజతే).** అసమానమై రాజిల్లుతోంది. అంతేకాదు, సమస్తాన్ని ప్రకాశింప చేస్తూ ఉంది **(రాజయతి).** అందువల్ల రాజవిద్య అతి శ్రేష్ఠమైంది.

రాజు ఎలాగైతే అసమానంగా శోభిస్తాడో, అలాగే బ్రహ్మవిద్య కూడా అసమానంగా శోభించడము చేత రాజవిద్య అయింది. విద్యలలో ఏ విద్యను ఎంతగా తెలుసుకున్నా ఇంకా తెలుసుకో వలసింది ఎంతో ఉంటుంది. కాని బ్రహ్మవిద్య అలాంటిది కాదు. ఇతర విద్యల లాగా పరిమితంగా ఉండి, అపరిపూర్ణంగా అర్థమయ్యేది కాదు. బ్రహ్మవిద్య పూర్ణవిద్య. అంతేకాదు. ఆ ఒక్కదానికి సంబంధించిన జ్ఞానము కలిగితే, మరొక జ్ఞానమును ప్రత్యేకంగా పొందవలసిన అవసరం ఉండదు. అన్ని జ్ఞానములు దాని లోనే ఇమిడి ఉన్నాయి **(యత్ జ్ఞాత్వా సర్వమిదం విజ్ఞాతం భవతి).** అందుచేత అది రాజవిద్య అయింది.

బ్రహ్మవిద్యను విడిచి పెడితే, మిగిలిన విద్య లన్నీ, కళ లన్నీ బంధహేతువులే. సంసారాన్ని పెంచే విద్యలే. అహంకారాన్ని పోషించే విద్యలే. బ్రహ్మజ్ఞాన మొక్కటే సంసారాన్ని నశింప చేస్తుంది. అహంకారాన్ని అంతం చేస్తుంది. అందుకే బ్రహ్మవిద్య రాజవిద్య అయింది.

బాలవ్యాకరణము అంటే కేవలం బాలురకు సంబంధించినది అని కాదు కదా! వ్యాకరణం అభ్యసించాలని భావించే వారందరికీ ఉపయోగ పడుతుంది. కాకపోతే బాలలుగా ఉన్నప్పుడు నేర్చుకుంటే తొందరగా అబ్బుతుంది. అంతేగాని, పెద్దలైన తరువాత మరచి పొమ్మని కాదు.

బ్రహ్మవిద్య అంటే బ్రాహ్మణులది కాదు. రాజవిద్య అంటే రాజులదీ కాదు. అజ్ఞానం పోగొట్టుకోవాలి అని ఆశించేవా రందరికీ ఉపయోగ పడేదే రాజవిద్య. కాకపోతే బోధించే శ్రీకృష్ణుడు రాజు. ఆలకించే అర్జునుడూ రాజే. అంతే కాదు. బోధింప బడుతున్న విద్య కూడా రాజవిద్య అయింది. కొన్ని అలాగే కలిసి వస్తాయి. కలిసి ఉంటాయి.

## రాజగుహ్యం

అతిశయ ప్రకాశం చేత రాజవిద్యగా శోభిస్తున్న బ్రహ్మవిద్య అతి రహస్యమై, రహస్యాలలో రహస్యమై రాజగుహ్య మైంది ***(గుహ్యానాం రాజా).*** రహస్యము లైనవి విలువైనవి కావచ్చు. కాని, సులువైనవి కావు కనుక అవి రక్షితాలు కావు. సురక్షితాలు కావు.

అమూల్యమైన మణి ఉంటే, ఆ మణి గలవాడు దానిని రహస్యంగా దాచుకుంటాడు. అంతేకాదు. అది ఎక్కడ పోతుందో అని నిరంతరం భీతి చెందుతూ ఉంటాడు. విలువైన వన్నీ ఈ ప్రపంచంలో రహస్యాలుగా ఉంటూ ఇలా భయ హేతువులుగా ఉంటాయి. కాని, రహస్యాలలో రహస్యమై, గుహ్యతమ మైన బ్రహ్మజ్ఞానము భయ కారణాన్ని తొలగించి అభయ రూపంగా శోభిస్తూ ఉంది. అందుచేత ఇది రహస్యాలలో రాజై రాజ గుహ్యమైంది.

మంత్ర, తంత్ర, యంత్ర, మణిమయ, ఓషధులకు సంబంధించిన విద్య లన్నీ రహస్యాలే. కాని, అవేవీ మృత్యువును నిర్మూలించ లేవు. మృత్యువును నిర్మూలించడమే గాక అమృతత్వమును ప్రసాదించేది కావడం చేత రాజవిద్య అయిన బ్రహ్మవిద్య రాజగుహ్య మైంది.

## పవిత్రం

శుద్ధి చేసేది ఏదైనా పవిత్ర మైనదే. పావన మైనదే ***(పునాతీతి పవిత్రం).*** పావనం చేసేవి ప్రపంచంలో చాలా ఉన్నాయి. జలం శుద్ధి చేస్తుంది. మృత్తిక, అగ్ని, గాలి, సూర్యుడు, నదులు - ఇలా పవిత్రం చేసేవి ఎన్నో ఉన్నాయి. అపవిత్రాలను ఇవన్నీ పవిత్రం చెయ్యొచ్చు. కాని, అలా పవిత్రమైన వాటిని తిరిగి అపవిత్రం కాకుండా నివారించ లేవు. గంగలో స్నానం చేస్తే పాపం పోవచ్చు. కాని, తిరిగి ఆ వ్యక్తి పాపం చెయ్యడు అని చెప్పలేము. పవిత్రమైన గంగ పాపం పోగొట్ట గలదే గాని, బుద్ధి లోని పాప భావనను పోగొట్ట లేదు. మనస్సు లోని పాప సంస్కారాన్ని తుడిచి పెట్టలేదు.

అలాగే కొన్ని యజ్ఞ యాగాది క్రతువులు కూడా పాపాన్ని క్షాళనం చేస్తాయి. కాని, పాప కార్యము నుండి మనిషిని నివారించ లేవు. ఈ కారణం గానే పుణ్య క్రతువులను మనిషి పదే పదే చేస్తూ ఉంటాడు.

పుణ్యకర్మలు అనేకం ఉంటాయి. ఒక్కొక్క పుణ్య కార్యము ఒక్కొక్క విధమైన పాపమునే పోగొడుతుంది. ఇలా పవిత్రం చేసే వాటన్నిటిలో పవిత్ర మైనది బ్రహ్మజ్ఞానము ***(పవిత్రం పావనం ఇదం ఉత్తమం సర్వేషాం పావనానామ్ శుద్ధి కారణం).***





మరొక ముఖ్య విషయాన్ని ఇక్కడ మనం అర్థం చేసుకోవాలి. ప్రపంచంలో పాపాలను పోగొట్టేవి, శుద్ధి చేసేవి ఉన్నాయే గాని, పుణ్యాన్ని పోగొట్టేవి ఉన్నాయా? మోక్షానికి పుణ్యం కూడా ప్రతిబంధకమే అని తెలుసుకున్నాం కదా! కనుక పుణ్యపాపాలను రెండిటిని కరిగించి, అజ్ఞానాన్ని అంతమొందించే శక్తి ఒక్క బ్రహ్మజ్ఞానానికే ఉంది కనుక, రాజగుహ్య మైన ఈ రాజవిద్య పవిత్రాలలో పవిత్రమై **(పవిత్రాణాం పవిత్రం),** పరమ పవిత్రమై రాజిల్లుతోంది. ఈ విధంగా ఆత్మవిద్యను పొందిన విద్వాంసుడు పుణ్యపాపాలను రెండిటిని వదిలించుకొని **(తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ)** ముక్తు డవుతున్నాడు అన్నది ఉపనిషత్తు.

## ఉత్తమమ్

బ్రహ్మవిద్య ఉత్తమ మైనది **(ఉత్కృష్టతమమ్).** పరమేశ్వరుడు మహోత్కృష్టమైన వాడు. కనుక, పరమేశ్వరుని తెలిపే పరావిద్య లేదా బ్రహ్మవిద్య ఉత్కృష్టతమము. ప్రపంచంలో ఎన్నో జ్ఞానా లున్నాయి. ప్రపంచమే మిథ్య కనుక అవన్నీ మిథ్యా జ్ఞానాలు. బ్రహ్మజ్ఞాన మొక్కటే ఉత్తమ ఫలమైన మోక్షాన్ని ప్రసాదించే సత్య జ్ఞానమై ఉన్నందున అది అన్ని జ్ఞానాల లోకి ఉత్తమమైన జ్ఞానము **(సర్వేషాం జ్ఞానానామ్ ఉత్తమమ్, ఉత్తమ ఫలత్వాత్).**

## ప్రత్యక్షావ గమం

ఆత్మ స్వతః సిద్ధము, స్వప్రకాశము అయినందున ప్రత్యక్షానుభవమై ఉంది. **అనుభవ రూఢం తు జ్ఞాన ఫలమ్, ప్రత్యక్ష ఫలత్వాత్ -** ప్రత్యక్ష ఫలమై ఉన్నందున జ్ఞానఫలము అనుభవరూపమై ఉంది అన్నారు బ్రహ్మసూత్ర భాష్యంలో ఆచార్యులు.

కర్మఫల రూపంలో ప్రాప్తించే స్వర్గసుఖాలు కాలాంతరంలో, దేశాంతరంలో ప్రాప్తించేవి కనుక వాటి విషయంలో మనిషికి సందేహము ఉండవచ్చు. కాని, బ్రహ్మజ్ఞానము ప్రత్యక్షానుభవంగా అందుతూ ఉన్నందున జ్ఞానఫలం విషయంలో సంశయాలకు అవకాశం లేదు. సుఖదుఃఖాలు ఎలాగైతే ప్రత్యక్షంగా అనుభవింప బడుతున్నాయో, అలాగే బ్రహ్మజ్ఞాన ఫలం కూడా ప్రత్యక్షంగా అనుభవింప బడుతూ ఉన్నందున, అది ప్రత్యక్షావగమ మైంది **(ప్రత్యక్షేణ సుఖదుఃఖాదేః ఇవ అవగమః యస్య తత్ ప్రత్యక్షావ గమమ్).**

'అవగమము' అనే పదానికి రెండు అర్థాలను గ్రహించ వచ్చు. దేని చేత తెలియబడుతూ ఉందో అది అవగమము అని ఒక అర్థము **(అవగమ్యతే అనేన ఇతి అవగమః).** దీనిని బట్టి 'అవగమము' అంటే ప్రమాణము అని అర్థము. 'ప్రత్యక్షము' అంటే, ప్రత్యక్షమైన ఆత్మ వస్తువు అని అర్థము. ఆత్మ విషయము నందు జ్ఞానము ప్రమాణమై ఉన్నందున ఆత్మవిద్య ప్రత్యక్షావగమము.

రెండవ అర్థమును బట్టి చూస్తే 'అవగమము' అంటే అనుభవింప బడుతోంది **(అవగమ్యతే)** అని అర్థము. అంటే ఫలరూపము. దృష్ట ఫలరూపము. అంటే కాలాంతరములో ప్రాప్తించేది కాకుండా, సద్యః ఫలదాయకము అని అర్థము. ప్రమాణ ఫలానుభవము ప్రత్యక్షం కావడం చేత కూడా ఆత్మవిద్య ప్రత్యక్షావ గమము.

## ధర్మ్యం

ఏది ధర్మానికి విరుద్ధం కాదో, ఏది ధర్మం నుండి దూరంగా తొలగదో అది 'ధర్మ్యం' **(ధర్మాత్ అనపేతం ధర్మ్యం).** భగవంతుడు ధర్మరూపుడు **(ధర్మః).** ధర్మరూపంలో ఉండి సమస్తమును ధరించు వాడు కనుక భగవంతుడు 'ధర్మ' నామధేయుడు **(ధారయతి సర్వభూతాని ఇతి ధర్మః).** సమస్త భూతములకు ఆధారమైన వాడు, స్థితి కారకుడు కావడం చేత ఆయన ధర్మస్వరూపుడు.

ధర్మరూపంలో ఉన్నవాడు తానే. ధర్మమూ తానే. అన్ని ధర్మాలు ఆయనకు సంబంధించినవే కనుక ఆయన 'ధర్మీ'. అంటే, ధర్మమును ధరించు వాడు ***(ధర్మాన్ ధారయతీతి ధర్మీ).*** నియతియే ధర్మము. నియంతయే ధర్మి. నియతి, నియంత వేరు కాదు. జ్ఞానము జ్ఞాని వేరు కాదు. ధర్మము ధర్మి వేరు కాదు. కనుక, ధర్మి నుండి దూరం కాని దేదో అదే 'ధర్మ్యం'. అదే బ్రహ్మజ్ఞానం.

పరమేశ్వరుడు ధర్మాధర్మాలకు అతీతు డైనప్పటికీ ధర్మమర్యాదను స్థిరీకరింప చేయడానికి ధర్మమును తాను ఆచరిస్తాడు. శ్రీరాముడుగా అవతరించి ధర్మమును ఆచరించి చూపాడు. అంతేకాదు. శ్రీకృష్ణుడుగా అవతరించి ఇతరులు కూడా ధర్మాన్ని అనుసరించే విధంగా ధర్మమార్గ నిర్దేశం చేశాడు.

అర్జునా! ముల్లోకాలలో నేను చేయవలసిన కార్యము ఏదీ లేదు. నేను పొందనిది లేదు. పొందవలసిందీ లేదు. అయినా కర్మలను ఆచరిస్తూనే ఉన్నాను. నేను ఇతరులకు ఆదర్శం కావాలి. నేను దారి తప్పితే ప్రజలు కూడా దారి తప్పి పోతారు అని భగవంతుడు చెప్పే ఉన్నాడు కదా! *(3 - 22, 23).* కనుక 'ధర్మ్యం', లేక బ్రహ్మజ్ఞానమును పొందడం కష్టమని భావిస్తారేమో నని ఆ శంకను కూడా నివారిస్తున్నాడు.

**సుసుఖం కర్తుమ్**

బ్రహ్మజ్ఞానము అనేది స్వరూప జ్ఞానమే కనుక అది కష్టం కాదు. పొందడం చాలా సులభం, సుఖం అంటున్నాడు ***(సుసుఖం కర్తుమ్).*** ఎక్కడికో వెళ్ళి సాధించ నవసరం లేదు. కాలం కోసం నిరీక్షించ నవసరం లేదు. శ్రమించ నవసరం లేదు. ఏమీ చేయ నవసరం లేదు. కేవలం గ్రహించడమే. వీక్షించడమే.

ఇక్కడ చిన్న సంశయం ఒకటి కలిగే అవకాశ ముంది. అల్ప శ్రమతో ఆచరించే కర్మలకు అల్పఫలాలు, అధిక శ్రమతో చేసే కర్మలకు గొప్ప ఫలాలు ప్రపంచంలో లభించడం మనం చూస్తూ ఉన్నాము కదా!

కుడ్య నిర్మాణానికి, కటి కండూయనానికి ఫలభేదం లేదా? గోడ కట్టడానికి, మొల గోకడానికి ***(కటి కండూయనము)*** ఫలభేదం లేదా? శ్రమించి నిర్మిస్తేనే గోడ తయారవుతుంది. గోకుడు క్రియకు శ్రమ అవసరమా? గోకుడు క్రియకు గోడ కట్టిన ఫలం వస్తుందా? స్వల్ప ప్రయాస కర్మలు అల్ప ఫలాలనే ఇస్తాయి. అల్పఫలాలు స్వల్ప కాలంలో నశించి పోతాయి. అలాగే బ్రహ్మజ్ఞానము గనుక సుఖ సంపాద్య మైతే, స్వల్ప కాలంలో ఫలం క్షయ మౌతుంది కదా! అనేది సంశయము.

బ్రహ్మజ్ఞానము అలా కాదు. మొల గోకడం లాంటి కర్మ కాదు. మొల గోకడానికి కూడా కొంత శ్రమించాలి. పైగా గోకడానికి గోళ్ళు ఉండాలి. ఇది అంతకన్నా సులభ సాధ్యము. చంద్రదర్శన క్రియ లాంటిది అని వాక్యతాత్పర్య బోధినీ వ్యాఖ్యానము. చంద్రుని దర్శించడ మనే కార్యంలో శ్రమ ఉందా? ఎంత ఆహ్లాదకర మైన మహాఫలమో అది! ఇదీ అంతే. అల్ప ప్రయాసం వల్ల కలిగింది కనుక నశిస్తుంది అనే సందేహము అవసరము లేదు అని చెప్పడానికే చివరగా, బ్రహ్మజ్ఞానమును 'అవ్యయం' అంటున్నాడు.

**అవ్యయమ్**

కర్మఫలాలు నశించినట్లు ఆత్మజ్ఞానం నశించదు. బ్రహ్మజ్ఞానము అవ్యయము. కనుక ముముక్షువులు దీని యందు శ్రద్ధావంతులై ఉండాలి అనేది తాత్పర్యము ***(అతః శ్రద్ధేయమ్ ఆత్మజ్ఞానమ్).***

*మరి, ఈ విషయంలో శ్రద్ధ లేని వాళ్ల గతి ఏమిటి? వినండి.*

**అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।**
**అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥** 3





**అశ్రద్దధానాః-పురుషాః-ధర్మస్య-అస్య-పరంతప**
**అప్రాప్య-మాం-నివర్తంతే-మృత్యుసంసారవర్త్మని**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప | = అర్జునా! | | మాం | = నన్ను |
| అస్య | = ఈ | | అప్రాప్య | = పొందక |
| ధర్మస్య | = ధర్మము యొక్క | | మృత్యుసంసారవర్త్మని | = మృత్యురూప మైన సంసార మార్గములో |
| అశ్రద్ధధానాః | = శ్రద్ధ లేని | | నివర్తంతే | = ఉంటారు |
| పురుషాః | = పురుషులు | | | |

**పరంతపా! అర్జునా! ఈ ధర్మం విషయంలో శ్రద్ధ లేని వాళ్ళు నన్ను పొందలేరు. జననమరణాలలో పడి తిరుగుతూ ఉంటారు.**

**వ్యాఖ్య**

**సందర్భ ఔచిత్యము**

'ఇదం' పద ప్రయోగముతో బ్రహ్మజ్ఞానమును ప్రస్తావిస్తూ తొమ్మిదవ అధ్యాయాన్ని ప్రారంభించిన వాసుదేవుడు, మొదటి రెండు శ్లోకాలలో బ్రహ్మవిద్య యొక్క మాహాత్మ్యాన్ని దివ్యంగా స్తుతించాడు. ఇక విజ్ఞాన సహితమైన బ్రహ్మజ్ఞానమును నాల్గవ శ్లోకము నుండి అద్భుతంగా ప్రవచించ బోతాడు. మధ్యలో ఈ మూడవ శ్లోకం విలక్షణమైన రీతిలో ఒక అందమైన లంకె అయింది.

ఈ సందర్భములో అర్జునుడు వింటూ ఉన్నాడే గాని తిరిగి ఆచార్యుని ఎక్కడా ప్రశ్నించడం లేదు. అయినా, శ్రీకృష్ణుడే తనకు తానుగా 'అశ్రద్ధ' అనే అసుర లక్షణాన్ని ప్రవేశపెట్టి ప్రవచిస్తున్నాడు. దీనికి ప్రధానంగా రెండు కారణాలు కనబడు తున్నాయి. (1) అర్జునుని మనస్సు లోని సందేహాన్ని పరమేశ్వరుడు దర్శించి ఉండాలి. లేదా, (2) దాని అవసరాన్ని గుర్తించి అనివార్యంగా ప్రవేశపెట్టి ఉండాలి. లేకపోతే, అసందర్భంగా 'అశ్రద్ధ' ప్రస్తావన తెచ్చే అవకాశమే లేదు.

బ్రహ్మవిద్యను గూర్చి రెండవ శ్లోకంలో సలక్షణంగా వివరిస్తూ, రాజగుహ్య మైన రాజవిద్య పవిత్ర మని, మహోత్కృష్ట మని చెప్పడంతో పాటు, అది అనాయాసంగా ప్రాప్తిస్తుందని కూడా ప్రవచించడం జరిగింది **(సుసుఖం కర్తుమ్).** సుకరము, సర్వోత్తమ మైన మోక్షము సులభంగా ప్రాప్తించే టప్పుడు, ఎవరైనా దానిని వదులు కుంటారా? అందరూ దానినే సాధించు కుంటారు కదా! అదే జరిగితే, జరిగి ఉంటే, లేక జరిగే అవకాశమే ఉంటే, సంసారిగా ఎవడు మిగుల్తాడు? మరి, ప్రపంచంలో సంసారాలు గణనీయంగా పెరుగుతున్నాయే గాని తరగడం లేదు కదా! అనే సందేహానికి ఈ సందర్భంలో అవకాశం లేక పోలేదు. సాధకులలో ఈ విధమైన సందేహము సందర్భ ఔచితి గానే ఉందని భావించి భగవంతుడు 'అశ్రద్ధ'ను ప్రవేశపెట్టి ప్రవచించి ఉండవచ్చు.

ద్వితీయ పక్షం కోణం నుండి దృష్టి సారిస్తే, ఈ విధమైన ప్రస్తావన ఈ సందర్భములో రాకపోతే, ముముక్షువులు దారి తప్పే ప్రమాదం ఉందని ఆశంకించి పరమేశ్వరుడు ప్రసంగించి ఉండవచ్చు. ఎలాగైనా, దీనికి సందర్భ ఔచితి ఉంది. అంతే కాదు. ఒకవేళ ఈ విషయ ప్రస్తావన ఇక్కడ జరగక పోయి ఉన్నట్లైతే, ప్రమాదం జరిగితే మాత్రం అది మహాదారుణంగా ఉంటుందని ప్రత్యేకించి చెప్ప నవసరం లేదు.

**అందలము - అర్హత**

ఆశలు అందరికీ ఉంటాయి. ఎవరి ఊహలు వారికి ఉంటాయి. ఎవరి ఊహలలో వారు ఊరేగుతుంటారు.

ధర్మరూపంలో ఉన్నవాడు తానే. ధర్మమూ తానే. అన్ని ధర్మాలు ఆయనకు సంబంధించినవే కనుక ఆయన 'ధర్మి'. అంటే, ధర్మమును ధరించు వాడు ***(ధర్మాన్‌ధారయతీతి ధర్మీ)***. నియతియే ధర్మము. నియంతయే ధర్మి. నియతి, నియంత వేరు కాదు. జ్ఞానము జ్ఞాని వేరు కాదు. ధర్మము ధర్మి వేరు కాదు. కనుక, ధర్మి నుండి దూరం కాని దేదో అదే 'ధర్మ్యం'. అదే బ్రహ్మజ్ఞానం.

పరమేశ్వరుడు ధర్మాధర్మాలకు అతీతు డైనప్పటికీ ధర్మమర్యాదను స్థిరీకరింప చేయడానికి ధర్మమును తాను ఆచరిస్తాడు. శ్రీరాముడుగా అవతరించి ధర్మమును ఆచరించి చూపాడు. అంతేకాదు. శ్రీకృష్ణుడుగా అవతరించి ఇతరులు కూడా ధర్మాన్ని అనుసరించే విధంగా ధర్మమార్గ నిర్దేశం చేశాడు.

అర్జునా! ముల్లోకాలలో నేను చేయవలసిన కార్యము ఏదీ లేదు. నేను పొందనిది లేదు. పొందవలసిందీ లేదు. అయినా కర్మలను ఆచరిస్తూనే ఉన్నాను. నేను ఇతరులకు ఆదర్శం కావాలి. నేను దారి తప్పితే ప్రజలు కూడా దారి తప్పి పోతారు అని భగవంతుడు చెప్పే ఉన్నాడు కదా! *(3 - 22, 23)*. కనుక 'ధర్మ్యం', లేక బ్రహ్మజ్ఞానమును పొందడం కష్టమని భావిస్తారేమో నని ఆ శంకను కూడా నివారిస్తున్నాడు.

### సుసుఖం కర్తుమ్

బ్రహ్మజ్ఞానము అనేది స్వరూప జ్ఞానమే కనుక అది కష్టం కాదు. పొందడం చాలా సులభం, సుఖం అంటున్నాడు ***(సుసుఖం కర్తుమ్)***. ఎక్కడికో వెళ్ళి సాధించ నవసరం లేదు. కాలం కోసం నిరీక్షించ నవసరం లేదు. శ్రమించ నవసరం లేదు. ఏమీ చేయ నవసరం లేదు. కేవలం గ్రహించడమే. వీక్షించడమే.

ఇక్కడ చిన్న సంశయం ఒకటి కలిగే అవకాశ ముంది. అల్ప శ్రమతో ఆచరించే కర్మలకు అల్పఫలాలు, అధిక శ్రమతో చేసే కర్మలకు గొప్ప ఫలాలు ప్రపంచంలో లభించడం మనం చూస్తూ ఉన్నాము కదా!

కుడ్య నిర్మాణానికి, కటి కండూయనానికి ఫలభేదం లేదా? గోడ కట్టడానికి, మొల గోకడానికి ***(కటి కండూయనము)*** ఫలభేదం లేదా? శ్రమించి నిర్మిస్తేనే గోడ తయారవుతుంది. గోకుడు క్రియకు శ్రమ అవసరమా? గోకుడు క్రియకు గోడ కట్టిన ఫలం వస్తుందా? స్వల్ప ప్రయాస కర్మలు అల్ప ఫలాలనే ఇస్తాయి. అల్పఫలాలు స్వల్ప కాలంలో నశించి పోతాయి. అలాగే బ్రహ్మజ్ఞానము గనుక సుఖ సంపాద్య మైతే, స్వల్ప కాలంలో ఫలం క్షయ మౌతుంది కదా! అనేది సంశయము.

బ్రహ్మజ్ఞానము అలా కాదు. మొల గోకడం లాంటి కర్మ కాదు. మొల గోకడానికి కూడా కొంత శ్రమించాలి. పైగా గోకడానికి గోళ్ళు ఉండాలి. ఇది అంతకన్నా సులభ సాధ్యము. చంద్రదర్శన క్రియ లాంటిది అని వాక్యతాత్పర్య బోధినీ వ్యాఖ్యానము. చంద్రుని దర్శించడ మనే కార్యంలో శ్రమ ఉందా? ఎంత ఆహ్లాదకర మైన మహాఫలమో అది! ఇదీ అంతే. అల్ప ప్రయాసం వల్ల కలిగింది కనుక నశిస్తుంది అనే సందేహము అవసరము లేదు అని చెప్పడానికే చివరగా, బ్రహ్మజ్ఞానమును 'అవ్యయం' అంటున్నాడు.

### అవ్యయమ్

కర్మఫలాలు నశించినట్లు ఆత్మజ్ఞానం నశించదు. బ్రహ్మజ్ఞానము అవ్యయము. కనుక ముముక్షువులు దీని యందు శ్రద్ధావంతులై ఉండాలి అనేది తాత్పర్యము ***(అతః శ్రద్ధేయమ్ ఆత్మజ్ఞానమ్)***.

*మరి, ఈ విషయంలో శ్రద్ధ లేని వాళ్ల గతి ఏమిటి? వినండి.*

**అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।**
**అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥** 3





అశ్రద్దధానాః-పురుషాః-ధర్మస్య-అస్య-పరంతప
అప్రాప్య-మాం-నివర్తంతే-మృత్యుసంసారవర్త్మని

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప | = | అర్జునా! | మాం | = | నన్ను |
| అస్య | = | ఈ | అప్రాప్య | = | పొందక |
| ధర్మస్య | = | ధర్మము యొక్క | మృత్యుసంసారవర్త్మని | = | మృత్యురూప మైన సంసార మార్గములో |
| అశ్రద్దధానాః | = | శ్రద్ధ లేని | | | |
| పురుషాః | = | పురుషులు | నివర్తంతే | = | ఉంటారు |

**పరంతపా! అర్జునా! ఈ ధర్మం విషయంలో శ్రద్ధ లేని వాళ్ళు నన్ను పొందలేరు. జననమరణాలలో పడి తిరుగుతూ ఉంటారు.**

**వ్యాఖ్య**

### సందర్భ ఔచిత్యము

'ఇదం' పద ప్రయోగముతో బ్రహ్మజ్ఞానమును ప్రస్తావిస్తూ తొమ్మిదవ అధ్యాయాన్ని ప్రారంభించిన వాసుదేవుడు, మొదటి రెండు శ్లోకాలలో బ్రహ్మవిద్య యొక్క మాహాత్మ్యాన్ని దివ్యంగా స్తుతించాడు. ఇక విజ్ఞాన సహితమైన బ్రహ్మజ్ఞానమును నాల్గవ శ్లోకము నుండి అద్భుతంగా ప్రవచించ బోతాడు. మధ్యలో ఈ మూడవ శ్లోకం విలక్షణమైన రీతిలో ఒక అందమైన లంకె అయింది.

ఈ సందర్భములో అర్జునుడు వింటూ ఉన్నాడే గాని తిరిగి ఆచార్యుని ఎక్కడా ప్రశ్నించడం లేదు. అయినా, శ్రీకృష్ణుడే తనకు తానుగా 'అశ్రద్ధ' అనే అసుర లక్షణాన్ని ప్రవేశపెట్టి ప్రవచిస్తున్నాడు. దీనికి ప్రధానంగా రెండు కారణాలు కనబడు తున్నాయి. (1) అర్జునుని మనస్సు లోని సందేహాన్ని పరమేశ్వరుడు దర్శించి ఉండాలి. లేదా, (2) దాని అవసరాన్ని గుర్తించి అనివార్యంగా ప్రవేశపెట్టి ఉండాలి. లేకపోతే, అసందర్భంగా 'అశ్రద్ధ' ప్రస్తావన తెచ్చే అవకాశమే లేదు.

బ్రహ్మవిద్యను గూర్చి రెండవ శ్లోకంలో సలక్షణంగా వివరిస్తూ, రాజగుహ్య మైన రాజవిద్య పవిత్ర మని, మహోత్కృష్ట మని చెప్పడంతో పాటు, అది అనాయాసంగా ప్రాప్తిస్తుందని కూడా ప్రవచించడం జరిగింది ***(సుసుఖం కర్తుమ్)***. సుకరము, సర్వోత్తమ మైన మోక్షము సులభంగా ప్రాప్తించే టప్పుడు, ఎవరైనా దానిని వదులు కుంటారా? అందరూ దానినే సాధించు కుంటారు కదా! అదే జరిగితే, జరిగి ఉంటే, లేక జరిగే అవకాశమే ఉంటే, సంసారిగా ఎవడు మిగుల్తాడు? మరి, ప్రపంచంలో సంసారాలు గణనీయంగా పెరుగుతున్నాయే గాని తరగడం లేదు కదా! అనే సందేహానికి ఈ సందర్భంలో అవకాశం లేక పోలేదు. సాధకులలో ఈ విధమైన సందేహము సందర్భ ఔచితి గానే ఉందని భావించి భగవంతుడు 'అశ్రద్ధ'ను ప్రవేశపెట్టి ప్రవచించి ఉండవచ్చు.

ద్వితీయ పక్షం కోణం నుండి దృష్టి సారిస్తే, ఈ విధమైన ప్రస్తావన ఈ సందర్భములో రాకపోతే, ముముక్షువులు దారి తప్పే ప్రమాదం ఉందని ఆశంకించి పరమేశ్వరుడు ప్రసంగించి ఉండవచ్చు. ఎలాగైనా, దీనికి సందర్భ ఔచితి ఉంది. అంతే కాదు. ఒకవేళ ఈ విషయ ప్రస్తావన ఇక్కడ జరగక పోయి ఉన్నట్లైతే, ప్రమాదం జరిగితే మాత్రం అది మహాదారుణంగా ఉంటుందని ప్రత్యేకించి చెప్ప నవసరం లేదు.

### అందలము - అర్హత

ఆశలు అందరికీ ఉంటాయి. ఎవరి ఊహలు వారికి ఉంటాయి. ఎవరి ఊహలలో వారు ఊరేగుతుంటారు.

అందరివీ ఊరేగింపులే. కొన్ని ఊరేగింపులు ఉత్సాహంతో, ఉత్సవ స్ఫూర్తితో ఉంటాయి. కొన్ని ఊరేగింపులు విషాదంతో, ఉద్విగ్న భరితంగా సాగుతూ ఉంటాయి.

శివుని తిరువాళ్ళలో రథయాత్ర ఆనందయాత్రగా సాగుతూ ఉంటుంది. అంతిమ సంస్కారానికి జీవుని కొనిపోయే శవయాత్ర ఆవేదనా పూరితంగా కొనసాగుతూ ఉంటుంది. శివయాత్రను అనుసరించే వారు తిరిగి తిరిగి శివాలయానికి చేరుతారు. శవయాత్రలో నడిచే వారు శంకరాలయం (శ్మశానం) చేరుతారు. మార్గాలే గమ్యాలను నిర్ణయిస్తాయి.

ఆకాశంలో సూర్యుడు దివ్యంగా ప్రకాశిస్తున్నాడు. విశ్వం వెలుగులతో విరాజిల్లుతూ ఉంది. అన్నీ సుస్పష్టంగా కనిపిస్తున్నాయి. అలాంటి చోట మార్గంలో పయనించడం కష్టమా? ఎవరి మార్గాన వారు హాయిగా ప్రయాణం చెయ్యవచ్చు. ఇదేమీ కష్టం కాదు. చాలా సుఖకరము. సుకరము.

బాహ్య ప్రపంచంలో వెలుగులు ఉండొచ్చు. ప్రయాణం చేసే వ్యక్తి గ్రుడ్డి వాడైతే? ప్రయాణం సాగినా, ఆతడు గమ్యం చేరక పోవచ్చు. దారి తప్పే అవకాశం ఉండటమే ఇందుకు ప్రధాన కారణము. ఏమో! కళ్ళు లేనివాడైనా గమ్యం చేరవచ్చు నేమో గాని శ్రద్ధ లేని వాడు మాత్రం బ్రహ్మమును చేరలేడు. భగవంతుడు అదే చెబు తున్నాడు. అర్జునా! శ్రద్ధ లేని వాళ్ళు నన్ను ఎన్నడూ పొందలేరు అంటున్నాడు.

**శ్రద్ధ - అశ్రద్ధ**

శ్రద్ధ కలవాడు జ్ఞానాన్ని పొందుతాడు ***(శ్రద్ధావాన్ లభతే జ్ఞానం; 4 - 39)*** అని నాల్గవ అధ్యాయం లోనే భగవంతుడు ఉపదేశించాడు. జ్ఞానమును పొందిన వాడు శాంతిని పొందుతాడు ***(జ్ఞానం లబ్ధ్వా శాంతిం అధిగచ్ఛతి).*** ఇక్కడ జ్ఞానము అంటే బ్రహ్మజ్ఞానము లేదా ఆత్మజ్ఞానము.

'ఇదం' అంటూ బ్రహ్మజ్ఞానాన్ని ప్రస్తుతం మొదటి శ్లోకంలో ప్రస్తావించిన భగవంతుడు, ఆ జ్ఞానమునే విద్య అంటూ రెండవ శ్లోకంలో బ్రహ్మవిద్యగా ప్రవచించాడు. దానినే ధర్మ్యం అని కూడా పేర్కొన్నాడు. ధర్మం అనే పదము జ్ఞానానికి పర్యాయంగా వాడ బడింది.

అర్జునా! బ్రహ్మజ్ఞానము అనే ఈ ధర్మం విషయంలో ***(అస్య ధర్మస్య)*** శ్రద్ధ లేని వాళ్ళు ***(అశ్రద్ధ ధానాః)*** నన్ను పొందలేక ***(మాం అప్రాప్య),*** మృత్యువుతో కూడిన సంసారంలో ***(మృత్యు సంసార వర్త్మని),*** అంటే సంసార మార్గంలో తిరుగుతూ ఉంటారు ***(నివర్తన్తే).***

శ్రద్ధకు ఫలం జ్ఞానం. జ్ఞానఫలం మోక్షం. అశ్రద్ధకు ఫలం అజ్ఞానం. అజ్ఞాన ఫలం సంసారం. చావు పుట్టుకల సంసార చక్రంలో పరిభ్రమణం.

ఈత తెలిసిన వాడు నదీ ప్రవాహంలో పడితే, ఎలాగో ఈదుకుంటూ గట్టున పడతాడు. ఈత రాని వాడు గట్టున పడే అవకాశమే లేదు కనుక, ప్రవాహంలో కొట్టుకొని పోయి సముద్రంలో పడతాడు.

జీవన నదీ ప్రవాహంలో శ్రద్ధ కలిగిన వాడు విశ్వాసంతో శాస్త్రాన్ని అధ్యయనం చేసి, జ్ఞానాన్ని పొంది తరిస్తాడు. శ్రద్ధ లేనివాడు, అవిశ్వాసంతో శాస్త్రాన్ని సందేహించి, నిరసించి, జ్ఞానాన్ని పొందలేక, అజ్ఞాన దారుల్లో పయనించి మృత్యురూప సంసారాన్ని చేరుతాడు. అంటే మృత్యు సంసార సాగరంలో పడతాడు. అర్జునా! జ్ఞానం లేనివాడు, శ్రద్ధ లేనివాడు, సంశయించే స్వభావం కలవాడు నశించి పోతాడు ***(అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి; 4 - 40)*** అని నాల్గవ అధ్యాయం లోనే భగవంతుడు హెచ్చరించాడు. శ్రద్ధ గలవారు వికాసాన్ని పొందుతూ ఉంటే, శ్రద్ధ లేని వాళ్ళు వినాశాన్ని పొందుతున్నారు.





**అశ్రద్ధావంతులు**

శ్రద్ధ లేని వారు బ్రహ్మజ్ఞానానికి అనర్హులు కనుక వారు భగవంతుని పొందలేరు. ఆత్మ ఒకటి ఉందని, ఆత్మజ్ఞానము ఒకటి ఉందని, ఆత్మజ్ఞానానికి ఫలం మోక్షమని, ఈ విషయాల యందు ఎవరికి నమ్మకం ఉందో వారు శ్రద్ధావంతులు. నమ్మకం లేని వాళ్ళు అశ్రద్ధావంతులు ***(శ్రద్ధా విరహితాః ఆత్మజ్ఞానస్య ధర్మస్య అస్య స్వరూపే తత్ఫలే చ).*** వీరిని నాస్తికులుగా అభివర్ణించింది శంకర భాష్యము ***(నాస్తికాః).***

శ్రద్ధ లేని వారు నాస్తికులు. ఇలాంటి వారు పాపాచరణమునకు వెనుకాడరు. శాస్త్రం మీద విశ్వాసం లేని వారు శాస్త్ర ప్రతిపాదిత మైన కర్మ సిద్ధాంతాన్ని విశ్వసిస్తారా? కర్మ సిద్ధాంతము మీద నమ్మకం లేని వారు కర్మఫలాలకు భయపడతారా? కర్మఫలాలకు భీతి చెందరు కనుక, ఎట్టి పాపాని కైనా సిద్ధ పడతారు.

ఒక వాస్తవాన్ని ఈ సందర్భములో అర్థం చేసుకోవాలి. నాస్తికుడికి, పాపకారికి శాస్త్ర విషయంలో, గురువు విషయంలో, భగవంతుని విషయంలో శ్రద్ధ లేక పోవచ్చు. అలాగని అసలే శ్రద్ధ లేదు అనడానికి లేదు. పాపికి కూడా శ్రద్ధ ఉంటుంది. శాస్త్ర విహిత కర్మల యందు శ్రద్ధ లేక పోవచ్చు నేమో గాని, తాను ఆచరించే పాపకార్యాల యందు శ్రద్ధ ఉంటుంది. లేకపోతే పాపాచరణమునకు ఉత్సాహం, ఆసక్తి ఎక్కడ నుండి వస్తాయి? పాపికి కూడా ఒక సిద్ధాంతము ఉంటుంది. నాస్తికుడికి కూడా ఒక తత్త్వం ఉంటుంది. రాక్షసులకు కూడా గ్రంథాలు ఉంటాయి. వాటిని విశ్వసిస్తూ, అవి చెప్పినట్లు వారు ఆచరిస్తారు. శ్రీ శంకరాచార్య స్వామి అసురులకు కూడా ఉపనిషత్తు ఉందని చమత్కరించారు.

**ఆసురోపనిషత్**

అసురులకు సంబంధించిన ఉపనిషత్ ఆసురోపనిషత్ ***(అసురాణాం ఉపనిషత్ ఆసురోపనిషత్).*** ఇది వేదం నుండి వచ్చింది కాదు. అసురుల వేదనల నుండి పుట్టింది. వీరిది దేహాత్మ దర్శనము. అంటే దేహమే ఆత్మ అనే సిద్ధాంతము. వీరు అసుతృపులు. అంటే ప్రాణాలను తృప్తి పరచడమే ఏకైక లక్ష్యంగా జీవించే వారు. ఇంద్రియ విషయాల యందే సదా రమించే భోగాసక్తులు ***(దేహ మాత్ర ఆత్మ దర్శన మేవ ప్రతిపన్నాః అసుతృపః పురుషాః).*** కర్మ విషయము నందు, జన్మ విషయము నందు నమ్మకం లేని వీరికి, మరణమే మహాసమాధి. ఎలాగూ మళ్ళీ జన్మించేది లేదు కనుక, ప్రాణాలను తృప్తి పరచుకొంటూ బ్రతికేయడమే వీరి జీవన విధానము. న్యాయాలు, ధర్మాలు వీరి దృష్టిలో అర్థరహితాలు.

**యావ జ్జీవేత్ సుఖం జీవేత్ ఋణం కృత్వా ఘృతం పిబేత్**

బ్రతికి నంత కాలం భోగిస్తూ బ్రతికేయ్! అప్పు చేసైనా సరే, నెయ్యి కలుపుకొని పప్పుకూడు తినేయ్! తీర్చ గలిగితే అప్పు తీర్చు. తీర్చలేక పోతే మానేయ్! మనం త్రాగిన నెయ్యి మన దేహం లోనే క్రొవ్వుగా ఉంటుంది. చచ్చిన తరువాత దేహము ఇక్కడే కాలి పోతుంది. కాలి పోయిన దేహం తిరిగి లేచి వస్తుందా అప్పు తీర్చడానికి? ***(భస్మీ భూతస్య దేహస్య పునరాగమం కుతః ?).*** బూడిదై పోయిన దేహం తిరిగి ఎలా వస్తుంది? అది వస్తే కదా అప్పుల వాళ్ళు అడిగేది? అడిగేది లేదు - చెప్పేది లేదు. దొరికినంత వరకు హాయిగా చప్పరించేయ్! ఇది ఆసురోపనిషత్. దేహమే ఆత్మ. భోగమే జ్ఞానము. మరణమే మోక్షము.

**తే॥ గీ॥** **అప్పు గొని యైన దొంగలి యైన లెస్స**
**జిహ్వ కింపైన దాని భుజింప వలయు**
**కంటి కింపైన కాంతను గవయ వలయు**
**బ్రతుక దినముల మోక్షంబు వెతుక నేల ॥**

అని ఆబోతులా బ్రతక మని  తేట తెలుగులో ఆసురోపనిషత్సారాన్ని తేటగీతిలో అందించారు. ఇది ఆసురోపనిషత్ సారంగా వాళ్ళు ప్రతి నిత్యం పారాయణం చేసే, క్రమం తప్పక ఆచరించే బండగీత.

**లోకాయత దర్శనం**

ఏ జ్ఞానము లేని లౌకికులు సాధారణంగా మాట్లాడుకొనే వ్యవహారము, జీవించే విధానమునకు **లోకాయతము** అని పేరు (***లోకేషు ఆయతః లోకాయతః***). ఇది సామాన్యులలో విస్తృత ప్రచారము గల విషయము. **లోకము** లోని విషయాలను మాత్రమే ఆయతనంగా చేసికొనిన సిద్ధాంతము కనుక, వీరి సిద్ధాంతానికి లోకాయత దర్శనం అని పేరు. నాస్తికులు, చార్వాకులు, లోకాయతులు ఒక గూటి లోని పక్షులే. అన్నీ ఒకే విధంగా పలుకుతాయి. వీరందరూ అశ్రద్ధావంతులే. మరి, వీరందరూ ఏమౌతారు? ఎక్కడ చేరుతారు?

ఏదైనా అవుతారు, ఎక్కడి కైనా చేరుతారు, పరమేశ్వరుని సన్నిధికి తప్ప. దారి తప్పిన వారు కనుక దరి చేరలేరు. తిరిగి మృత్యు యుక్త సంసార మార్గంలో (***వర్త్మని***) పడి పోతారు. ఆ మార్గం ముక్తి మార్గము కాదు. జనన మరణ రూప సంసార మార్గము.

***నివర్తన్తే*** అనే పదానికి రెండు అర్థాలను గ్రహించ వచ్చు. ***నిశ్చయేన ఆవర్తన్తే*** - అశ్రద్ధావంతులు తిరుగుతూ ఉంటారు అని ఒక అర్థము. ***క్వ?*** ఎక్కడ తిరుగుతూ ఉంటారు? ***మృత్యు సంసార వర్త్మని*** - మృత్యువుతో కూడిన సంసార మనే మార్గంలో పడి తిరుగుతూ ఉంటారు. అంటే, పుడుతూ చస్తూ, చస్తూ పుడుతూ ఉంటారని అర్థము.

***నితరాం వర్తన్తే (నివర్తన్తే)*** - అని గ్రహిస్తే వీరు శాశ్వతంగా మృత్యురూప సంసారము లోనే ఉంటారు అని మరొక అర్థం. అశ్రద్ధావంతులుగా ఉన్నంత కాలం ఈ సుడిలో, ఆవర్తములో పడి పరిభ్రమించడం తప్పదు.

జ్ఞానమును పొందితే సంసార బంధము తొలగి పోతుంది అని మొదటి శ్లోకం లోనే బోధించాడు (***యత్ జ్ఞాత్వా మోక్ష్యసే౽ శుభాత్***). జ్ఞానం కలగాలి అంటే శాస్త్రాధ్యయనం అనివార్యం. శాస్త్రాధ్యయనం జరగాలి అంటే శ్రద్ధ అవశ్యం. కనుక శ్రద్ధ కల వారు జనన మరణ రూప సంసారం నుండి విముక్తు లవుతున్నారు.

శ్రద్ధ లేని వారు పరమేశ్వరుని పొందలేక తిరిగి మృత్యురూప సంసారంలో పడి పోతున్నారు. శ్రద్ధ గల వారు జ్ఞానాన్ని పొంది తరిస్తారు. అశ్రద్ధావంతులు పరమాత్మను పొంద లేక అంతరిస్తూ ఉంటారు.

*ఇక రాజవిద్య అయిన శాస్త్రాన్ని బోధిస్తాడు కనుక అర్జునునిలో పూర్ణ శ్రద్ధను నింపే ప్రయత్నం చేశాడు. బోధ ప్రారంభిస్తున్నాడు.*

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥ 4

***మయా-తతం-ఇదం-సర్వం-జగత్-అవ్యక్తమూర్తినా***
***మత్‌స్థాని-సర్వభూతాని-న-చ-అహం-తేషు-అవస్థితః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అవ్యక్తమూర్తినా | = | ఇంద్రియ గోచరము గాని | సర్వభూతాని | = | సర్వభూతములు |
| మయా | = | నా చేతను | మత్స్థాని | = | నా యందున్నవి |
| ఇదం | = | ఈ | తేషు | = | వాని యందు |
| సర్వం | = | సమస్తమైన | అహం | = | నేను |
| జగత్ | = | ప్రపంచము | న చ అవస్థితః | = | లేను |
| తతం | = | వ్యాప్తము | | | |





**అర్జునా! నేను అవ్యక్తంగా ఉన్నాను. ఈ ప్రపంచ మంతా నేనే వ్యాపించి ఉన్నాను. సమస్త భూతాలు నా లోనే ఉన్నాయి. నేను వాటిలో లేను.**

**వ్యాఖ్య**

మొదటి రెండు శ్లోకాలలో బ్రహ్మజ్ఞానము దివ్యంగా స్తుతించిన భగవానుడు, అర్జునునికి అందులో ఆసక్తిని కలిగించాడు (**అర్జునమ్ అభిముఖీ కృత్య**). శ్రద్ధ లేని వారికి బ్రహ్మజ్ఞానము, దాని ఫలము ఎలా ప్రాప్తించవో మూడవ శ్లోకంలో వివరించాడు. శ్రద్ధతో, ఆసక్తితో శ్రవణం చేసే విధంగా అర్జునుని సిద్ధపరచి, ప్రస్తుత శ్లోకం నుండి తాను ప్రతిజ్ఞ చేసిన విజ్ఞాన సహిత జ్ఞానమును విశేషంగా ప్రపంచించడానికి ప్రారంభిస్తున్నాడు. ఈ సమస్తమైన జగత్తు అవ్యక్తమూర్తి అయిన తన చేత వ్యాపించబడి ఉంది అంటూ శ్రీకారం చుడుతున్నాడు.

**వ్యాప్యము - వ్యాపకము**

తన అవ్యక్త స్వరూపము చేత ఈ ప్రపంచ మంతా వ్యాప్తమై ఉంది అంటున్నాడు. ఏ కార్యరూప జగత్తు మనకు కనిపిస్తూ ఉందో అది వ్యాప్యము. కారణ రూపుడైన పరమేశ్వరుడు వ్యాపకము. అంటే జగత్తుకు జగదీశ్వరునకు వ్యాప్య వ్యాపక సంబంధం ఉన్నట్లు అనిపిస్తూ ఉంది. ఇది వ్యావహారిక దృష్టితో చెప్పబడిందే గాని పారమార్థికంగా చూచి నపుడు ఈశ్వర జగత్తులకు ఆధార ఆధేయ సంబంధం గాని, వ్యాప్య వ్యాపక సంబంధం గాని ఉండేందుకు అవకాశం లేదు. సంబంధం లేకపోయినా ఉన్నట్లు అనిపించే ఈ సంక్లిష్ట సంశ్లేషాన్ని (సంబంధాన్ని) జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ముఖ్యంగా నాలుగు, అయిదు శ్లోకాలను అవధానంతో అధ్యయనం చేయాలి.

ఈ సమస్త ప్రపంచము (**ఇదం సర్వం జగత్**) నా చేత (**మయా**) వ్యాపించబడి ఉంది (**తతం**). అంటే అర్జునుని ముందు నిలబడి బోధిస్తున్న శ్రీకృష్ణుని పరిచ్ఛిన్నమైన శరీరము ఈ విశ్వమంతా వ్యాపించి ఉందా? అలా ఉండేందుకు అవకాశం లేదు. అది సాధ్యం కాదు. కనుక, వ్యక్తమైన రూపం కాకుండా, వ్యక్తం కాని తన అవ్యక్త స్వరూపం చేత జగత్తు వ్యాప్తమై ఉంది అంటున్నాడు (**అవ్యక్త మూర్తినా - న వ్యక్తా మూర్తిః స్వరూపం యస్య మమ సః అహమ్ అవ్యక్తా మూర్తిః**).

కనిపిస్తున్న శ్రీ వాసుదేవుని రూపము వ్యక్త మూర్తి. కనిపించని రూపము అవ్యక్త మూర్తి. ఇక్కడ జగత్తు వ్యక్త మూర్తి చేత కాకుండా అవ్యక్త మూర్తి చేత వ్యాప్తమై ఉంది అని అంటే, కనిపించనిది కనుక అది లేనిదే నేమో అనే సందేహం కలిగే అవకాశం లేక పోలేదు.

వ్యక్తము అంటే ఇంద్రియ గోచరము అని అర్థము. అవ్యక్త మూర్తి అంటే ఇంద్రియాలకు వ్యక్తం కాని వాడు అని అర్థము (**కరణ అగోచర స్వరూపేణ ఇత్యర్థః**). కనుక అవ్యక్త మూర్తి నైన నా చేత వ్యాప్తమైంది అంటే, నా పరమైన స్వరూపం చేత వ్యాప్తమైంది అని అర్థము. పరమైన అంటే అలౌకిక మైన, నిరతిశయ మైన స్వరూపము అని భావం (**మయా, మమ పరోభావః తేన, తతం వ్యాప్తం సర్వం ఇదం జగత్**).

**సత్తా మాత్రం**

'భావః' అంటే సత్పదార్థము. సద్వస్తువు. **భూ సత్తాయామ్** అనే ధాత్వర్థము ననుసరించి, 'భావః' అంటే సత్తా స్వరూపుడు అని అర్థము. పరమేశ్వరుడు కేవలం తన స్వరూపంలో అవ్యక్తంగా ఉండేవాడు (**కేవలం భవతీతి ఏవ భావః**). అలాగే ప్రపంచ రూపంలో శోభించే వాడు అని కూడా అర్థము (**ప్రపంచ రూపేణ భవతీతి భావః**). అంటే సత్తాత్మకుడైన పరమేశ్వరుడే ప్రపంచములో వ్యాపించి ఉన్నాడు అని అర్థం.

కార్య రూపంలో ఏది కనిపించినా, దానికి ఆధార మైనది ఏదో ఉండాలి. ఉంటుంది. అదే సత్తాత్మకం. ఉపాదాన కారణం. కారణం ఏదో అది కార్యానికి ముందే ఉండాలి. కుండ ఉంది అంటే, అంతకు ముందే మట్టి ఉండాలి. కనుక, కుండ యొక్క అర్థం కుండలో లేదు. మట్టిలో ఉంది. కుండ ఉంది. దాని నెవ్వరూ నిరాకరించడం లేదు. కాని, ఉన్న కుండ మట్టి కన్నా అన్యంగా మాత్రం లేదు. ఇదే సత్తా. కుండకు ఆధారము. ఆధారమైన మట్టియే కుండలో ఉంది. కార్య రూపంలో గోచరిస్తున్న కుండ కారణమైన మట్టి చేత పరివ్యాప్తమై ఉంది. అలాగే, ఈ విశ్వమంతా సద్రూప చైతన్య మైన పరమాత్మ చేత వ్యాప్తమై ఉంది.

ప్రపంచం కార్య రూపంలో తెలుస్తూ ఉంది. ప్రపంచం పంచభూతాల సమ్మేళనంగా అర్థమౌతూ ఉంది. అందుకే ఇది ప్రపంచము. ఏ పంచమహా భూతాల కారణంగా ప్రపంచం తెలుస్తూ ఉందో, అట్టి ఆకాశాది పంచభూతాలు పరమేశ్వరుని నుండే జనించాయి ***(ప్రకర్షేణ మహాభూతాని అస్మాత్ ప్రభవన్తి).*** అందుచేత పరమేశ్వరుడు భూతాలకు ఉత్పత్తి స్థాన మయ్యాడు ***(ప్రభవః).*** అంటే, భూత ఆవిర్భావానికి ముందు తానొక్కడే ఉన్నాడు. భూతాదిగా శోభిస్తున్నాడు. సద్రూపంగా స్వరూప వైభవంతో ఉన్నాడు ***(సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్ ఏక మేవ అద్వితీయం బ్రహ్మ).*** ఇదే పరోభావము. సదాత్మకం.

ప్రపంచం అంటే పాంచభౌతిక మైన స్థూల ప్రపంచమే గాక, సూక్ష్మభూతాలు, జీవులు అని కూడా అర్థము. భూతజన్య మైన ఈ విశ్వమంతా పరమేశ్వరుని అవ్యక్త చైతన్యం చేత వ్యాప్తమై ఉంది. కార్య రూపంలో భూతాలు గోచర మవుతూ ఉన్నాయి కనుక వాటికి ఆధారమైన సత్తా ఉండాలి. ఆచార్యుల వారు భాష్యంలో ఒక అందమైన వాక్యాన్ని అందించారు.

**న హి నిరాత్మకం కించిత్ భూతం వ్యవహారాయ అవకల్పతే।**

'ఆత్మ లేనిదే ఏ భూతము కూడా వ్యవహార యోగ్యం కాదు' అని శ్రీ శంకర భాష్యము. అంటే భూతాలకు సత్తా స్ఫురణలు ఆత్మ వల్లనే కలుగు తున్నాయి. ఆత్మయే భూతాలకు ఆత్మ కావడం చేత వాటికి మనుగడ (సత్తా) సిద్ధిస్తూ ఉంది అని అర్థము. అందుచేతనే భూతాలు నా యందే ఉన్నాయి అంటున్నాడు గీతాచార్యుడు ***(మత్స్థాని సర్వభూతాని, మయి స్థితాని మత్స్థాని).***

## సర్వ భూతాలు నా యందే ఉన్నాయి

ప్రపంచం ఉంది. ప్రపంచంలో భూతాలు ఉన్నాయి. వీటన్నిటికీ చైతన్యమే సత్తా మాత్రంగా ఉంది. సదాత్మకం గాను, స్ఫురణాత్మకం గానూ ఉంది. ప్రపంచం సత్తా మాత్రమైన చైతన్యానికి దూరంగా ఉండలేదు. కనుక, ప్రపంచము, ప్రపంచం లోని భూతాలు చైతన్యం లోనే ఉన్నాయి. ఈశ్వర చైతన్యం లోనే ఉన్నాయి. అందుచేత, ***మత్ స్థాని సర్వభూతాని*** - సర్వభూతములు నా యందే ఉన్నాయి అంటున్నాడు.

నామరూపాలతో ఏది కనిపించినా, అలా కనిపించే దానికి ఉపాదాన కారణంగా ఏదైతే ఆధారమై ఉందో అది, ఆ కనిపించే దానికి సత్తాను కలిగిస్తూ ఉంది కనుక దానికి ఆత్మవంతంగా ఉంది. అదే సత్యము. సత్యముపై ఆధారపడి కనిపించే నామరూపాలు సత్యం కావు కనుక, అవి మిథ్య.

ప్రపంచం నామరూపాత్మకంగా ఉంది. పరిణామశీలంగా ఉంది. ఆద్యంతాలతో తెలుస్తూ ఉంది. సదాత్మక మైన చైతన్యముపై ఆధారపడి ఉంది. అందుచేత ప్రపంచం మిథ్య. ప్రపంచానికి సత్తాను సిద్ధింప చేసిన పరమేశ్వరుడు సత్యము.

బంగారు నగకు బంగారు వల్లనే మనుగడ ఏర్పడుతూ ఉంది. నగ నామరూపాలతో ఉంది. బంగారుపై ఆధారపడి ఉంది. బంగారు లేకుండా నగ ఉండ లేదు. కనుక నగ మిథ్య. బంగారు సత్యము.





మట్టి కుండలకు మట్టే ఆధారము. మట్టి లేకుండా కుండ ఉండలేదు. కుండ మట్టిపై ఆధారపడి ఉంది. నామరూపాలతో ఉంది. అందుచేత కుండ మిథ్య. మట్టి సత్యము **(మృత్తి కేత్యేవ సత్యమ్).**

## స్వప్న సృష్టి

సృష్టి కార్య రూపంలో ఉంది. సృష్టికి పరమేశ్వరుడు కారణంగా ఉన్నాడు. కార్యానికి ముందు కారణమే ఉంటుంది. కుండకు ముందు మట్టే ఉంది. చెట్టుకు ముందు బీజమే ఉంది. బీజంలో అవ్యక్తంగా ఉన్న అంకురమే కార్య రూపాన్ని పొంది నపుడు శాఖోపశాఖలు గల వృక్షంగా వ్యక్త మైంది.

సృష్టికి ముందు అవ్యక్తంగా ఉన్న పరమేశ్వరుడే సృష్టిగా వ్యక్త మయ్యాడు. కుండలో మట్టి లాగా, నగలో బంగారు లాగా వ్యక్తమయ్యే నామరూపాలలో కారణమే వ్యాపించి ఉంటుంది కనుక, పాంచభౌతిక మైన దృశ్యమాన జగత్తులో పరమేశ్వరుని అవ్యక్త చైతన్యమే వ్యాపించి ఉంది. ఈ విధంగా విశ్వమంతా అవ్యక్త మూర్తి యైన పరమేశ్వర చైతన్యము చేత వ్యాప్తమై ఉంది **(ఇదం జగత్ సర్వం మయా తతం... ఈశావాస్యం ఇదం సర్వం).**

స్వప్న దృష్టాంతముతో విషయాన్ని సులభతరం చేసుకుందాం. నిద్రించి నపుడు మనం కలలు కంటున్నాం. ఎవరి కల వారిదే. ఎవరి కలకు వారే కర్త. నీ స్వప్నాన్ని తయారు చేసిం దెవరు? మరొకరు తయారు చేసే అవకాశం లేదు కనుక నువ్వే సృష్టించావు. స్వప్నం దేనితో తయారైంది? కుండకు మట్టి ఉపాదానం. మరి నీ స్వప్నానికి ఉపాదానం ఎవరు? నువ్వే.

స్వప్నంలో నువ్వు చూచే వన్నీ నీకు తెలిసిన వేనా? లేక తెలియనివా? తెలియని వాటిని ఎలా సృష్టించ గలవు? ఏవేవి స్వప్నంలో నీకు కనిపిస్తున్నాయో వాటన్నిటిని గతంలో నువ్వు చూచే ఉన్నావు. అవన్నీ నీకు తెలిసినవే. నీలో ఉన్నవే. నీలో అవ్యక్తంగా ఉన్నవే కలలో వ్యక్త మవుతున్నాయి.

కలలో కనిపించిన వన్నీ నీకు తెలిసినవే కనుక, వాటన్నిటికి సంబంధించిన జ్ఞానం నీకు ఉంది. ఆ విధంగా స్వప్న విషయంలో నీవు సర్వజ్ఞుడివి. అంతే కాదు. కలలో ప్రతి వస్తువు నీవే. నీ కన్నా అన్యంగా ఏదీ లేదు. కనుక, కలలో నువ్వు సర్వవ్యాపివి. స్వప్నంలో నువ్వు లేని చోటు లేదు. స్వప్నంలో ఉన్నదంతా నీవే. నీవు మాత్రమే.

నీ స్వప్నంలో చెట్లు ఉన్నాయి. నదులు ఉన్నాయి. సముద్రం ఉంది. ఆకాశం ఉంది. మృగా లున్నాయి. మనుషు లున్నారు. ఇవన్నీ సృష్టింప బడ్డవే. సృష్టించింది నువ్వే. ఈ విషయంలో సందేహం లేదు. కాని, ఎందుకనో, ఇక్కడ నాకొక సందేహం కలుగుతూ ఉంది.

కలను నువ్వు సృష్టించావా? కల లన్నీ మనం సృష్టించు కుంటున్న వేనా? ఇదే వాస్తవ మైతే, మన స్వప్నాలను మనమే తయారు చేసుకునే టట్లయితే, కల లన్నీ మనకు అనుకూలంగా ఉంటాయే గాని ప్రతికూలంగా ఎందు కుంటాయి? భయ పెట్టేవి ఎందు కుంటాయి? పులులు ఉండవు. పాములు ఉండవు. అప్పుల వాళ్ళు ఉండరు. అత్తమ్మలు అసలే ఉండరు. కాని, వీళ్ళందరూ కలలలో కనిపిస్తున్నారా, లేదా? అలాంటి స్వప్నాలను మన మెందుకు సృష్టించు కుంటాము? ఇంకా లోతుగా ఆలోచిస్తే, కలకు కర్తవు నువ్వయితే, మరి కారయిత్ర మెవరిది? కనుక, వాస్తవానికి నువ్వు కలను సృష్టించవు. కల నీ నుండి వ్యక్త మవుతుంది. అంతే.

అవ్యక్తంగా ఉన్న నీ కల నీ నుండే ఎలా వ్యక్త మవుతూ ఉందో, అలాగే ఈ ప్రపంచం పరమేశ్వరుని నుండే వ్యక్తమైంది. నీలో వ్యక్తమైన కలలో నీవే ఎలా వ్యాపకమై ఉన్నావో, అలాగే పరమేశ్వరుని నుండి వ్యక్త మైన సృష్టిలో పరమేశ్వరుని అవ్యక్త చైతన్యమే వ్యాపించి ఉంది **(మయా తత మిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా).**

కల నీలో ఉంది కనుక, కలలో ఉన్న వన్నీ నీ లోనే ఉన్నాయి. ప్రపంచం కూడా పరమేశ్వరుని కన్నా భిన్నంగా ఉండే అవకాశం లేనందున, పరమేశ్వరుని లోనే ఉంది. ప్రపంచం పరమేశ్వరునిలో ఉంది కనుక ప్రపంచంలో ఉన్న వన్నీ పరమేశ్వరుని లోనే ఉన్నాయి ***(మత్ స్థాని సర్వభూతాని).***

ఇంతవరకు మనం అర్థం చేసుకున్న దానిని సారభూతంగా చెప్పుకుంటే : అవ్యక్తమూర్తి యైన పరమేశ్వరుని చేత సమస్త జగత్తు వ్యాప్తమై ఉంది కనుక, పరమేశ్వరుని చైతన్యము వల్లనే జగత్తు మనుగడను కలిగి యున్నది (సత్తా). అందుచేత భూతము లన్నీ పరమేశ్వరుని యందే ఉన్నాయి అని శ్లోకం లోని మూడు పాదాలను అర్థం చేసుకున్నాం.

నీటి యందు తరంగములు, బుడగలు మొదలైనవి జలము యొక్క సత్తా చేతనే సత్తావంతమై, ఎలా జలము నందే ఉన్నవో, అలాగే పరమేశ్వరుని చైతన్యము చేత సత్తావంత మైన జగత్తు, జగత్తు లోని భూతములు పరమేశ్వరుని యందే ఉన్నాయి.

***సదాయతనాః సత్ప్రతిష్ఠాః*** - దేని సత్తా చేత ఏవి సత్తావంత మైనవో అవి దాని యందే ఉంటాయి అని వేదం కూడా ధృవపరచింది. దీనిని బట్టి సర్వభూతములకు, సమస్త జగత్తునకు బ్రహ్మము ఆధారమని ధృవ పడింది. బ్రహ్మము ఆధారమైంది కనుక, జగత్తు ఆధేయ మవుతుంది. దీనిని నిర్ధారణ చేసుకుంటే, జగద్బ్రహ్మలకు ఆధేయ ఆధార సంబంధం ఖాయ మవుతుంది. ఈ విధమైన సంబంధము ఉందా? ఉండే అవకాశ ముందా? అనేది మీమాంస.

**ఆధార ఆధేయ సంబంధము**

ఒక వేదిక మీద వ్యాసపీఠంపై ఒక గ్రంథము ఉంది. గ్రంథము అలా ఉండటానికి ఆధారంగా వ్యాసపీఠం ఉంది. వ్యాసపీఠము ఆధారము. గ్రంథము ఆధేయము. అంటే, గ్రంథము వ్యాసపీఠంపై ఆధారపడి ఉంది అని అర్థం.

అలాగే వ్యాసపీఠమునకు వేదిక ఆధారము. వేదికను ఆధారముగా కలిగి యున్న వ్యాసపీఠము ఆధేయము. వేదికకు భూమి ఆధారము. అపుడు వేదిక ఆధేయ మైంది. ఇదీ ఆధార ఆధేయ సంబంధ మంటే.

మరి, మన ప్రస్తుత చర్చనీయాంశ మైన జగద్బ్రహ్మలకు ఆధేయ ఆధార సంబంధం ఉందా? ఉంటే, అది ఎలాంటి సంబంధము?

సంబంధము అన్నప్పుడు అది సజాతీయంగా ఉండాలి. జలక్షీర సంబంధమును సజాతీయంగా అర్థం చేసుకోవచ్చు. రెండూ ద్రవ పదార్థములే కనుక. స్థాణుక్షీర సంబంధము సాధ్యమా? పాలలో నీళ్ళు కలుస్తాయి గాని రాళ్ళు కరగవు, కలవవు. అది విజాతీయం కనుక, వాటి మధ్య సంబంధం కుదరదు. మరి, చైతన్య రూపుడైన అవ్యక్త పరమాత్మకు జడ రూపమైన వ్యక్త ప్రపంచానికి సంబంధం ఎలా కుదురుతుంది? సంబంధమే లేనపుడు ఇక ఆధార ఆధేయము లెక్కడ ఉంటాయి?

ఒక వస్త్ర ముంది. వస్త్రానికి సత్తా నూలు మాత్రమే. నూలుతో వస్త్రాన్ని నేశారు. ఇప్పుడు వస్త్ర మంతా నూలు వ్యాపించి ఉంది. వస్త్రము ఏదో కాదు; నూలే. వస్త్రానికి నూలు ఆధార మైతే, వస్త్రం ఆధేయ మవుతుంది. దీనినే సమవాయ సంబంధం అంటారు. వస్త్రం తగలబడి పోతే, నూలు మిగిలి ఉంటుందా? సమవాయ సంబంధంలో ఒకటి నశిస్తే రెండవది కూడా నశించాలి. గుడ్డ నశిస్తే దారము నశించినట్లే. దారము నశిస్తే గుడ్డ నశించినట్లే.

మరి, జగత్తు బ్రహ్మలకు సమవాయ సంబంధం ఉండే అవకాశం ఉందా? జగత్తు నశిస్తే బ్రహ్మము





నశిస్తుందా? ప్రళయంలో జగత్తు లేకుండా పోతుంది కదా! అప్పుడు బ్రహ్మము కూడా లేనట్లేనా? అలాగే, జగత్తు పరిణామం చెందుతూ ఉంది కదా! అలాగని బ్రహ్మము కూడా పరిణామశీల మేనా? ఇలా ఎంతైనా చెప్పుకుంటూ పోవచ్చు. ఇంతకీ సారాంశ మేమిటంటే, బ్రహ్మము అద్వితీయం కనుక, బ్రహ్మమునకు దేని తోను సంబంధము ఉండే అవకాశమే లేదు. బ్రహ్మము కన్నా అన్యంగా రెండవ వస్తువు ఉంటే కదా బ్రహ్మమునకు సంబంధము ప్రాప్తం? సంబంధము ఉంటే బ్రహ్మము సంగి అవుతాడు. ఈ విషయం శృతి స్మృతి అనుభవ విరుద్ధము.

**నిష్కలం నిష్క్రియం అసంగో న హి సజ్జతే, ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః**

బ్రహ్మము అవయవ రహితము. క్రియా రహితము. సంగరహితము. ఆకాశము లాగా నిర్మలము. నిత్యము. సర్వగతము.

కనుక పరమేశ్వర చైతన్యము భూతములలో ప్రవేశించటము గాని, వ్యాపించి ఉండటము గాని, మరో విధమైన ఆధార ఆధేయాది సంబంధాలు కలిగి ఉండటము గాని సాధ్యం కాదు. ఆధార ఆధేయ సంబంధం వ్యావహారికమే గాని పారమార్థికం కాదు. అద్వయము, అసంగము అయిన అవ్యక్త చైతన్యానికి సంబంధము అనేది అనూహ్యము.

**ఆరోపమే గాని స్వరూపము కాదు**

మసక చీకటిలో త్రాడును పాముగా భ్రమించాము. రజ్జు సర్ప భ్రాంతి ఏర్పడింది. వాస్తవానికి అక్కడ ఉన్నది త్రాడే గాని సర్పం కాదు. ఇక ఆలోచించండి.

సర్పము కనిపిస్తూ ఉంది కదా! సర్పముగా తెలిసే దెవరు? త్రాడే. త్రాడు ఎక్కడుంది? సర్పములో వ్యాపించి ఉంది. సర్పముగా కనిపించేదంతా త్రాడే. సర్పము పాడవు త్రాడు పాడవే. ఈ విధంగా త్రాడు సర్పమంతా వ్యాపించి ఉంది ***(మయా తతం ఇదం సర్వం).***

సరే. అదలా ఉంచండి. ఇంతకీ సర్ప మెక్కడుంది? త్రాడు లోనే ఉంది ***(మత్‌స్థాని మయి స్థితాని).*** మరి, త్రాడు సర్పంలో ఉందా? లేనే లేదు. అదే శ్లోకంలో ఇక మనం చెప్పుకోవలసిన నాల్గవ పాదము ***(అహం తేషు న అవస్థితః).*** ఇదీ గమ్మత్తు.

స్వప్నంలో అంతటా నీవే వ్యాపించి ఉన్నావు. స్వప్నం నీ లోనే ఉంది. కానీ నువ్వు స్వప్నంలో లేవు. స్వప్నంలో నీవు లేనపుడు స్వప్నంతో నీకు సంగత్య మెలా ఉంటుంది? సంగత్యము లేనపుడు సంబంధ మెలా ఉంటుంది? ఏది ఆధారము? ఎక్కడ ఆధేయము? అంతా ఆరోపమే. కల్పితమే. అధ్యస్త సంబంధమే. మిథ్యా సంబంధమే.

కుండలో మట్టి వ్యాపించి ఉంది అని మనం చెప్పుకోవచ్చు. మట్టి కన్నా వేరుగా కుండ ఉంటే కదా మట్టి కుండలో వ్యాపించేది! కుండ స్థాయి నుండి చూస్తే మట్టి ఆధారం గాను, కారణం గాను తెలుస్తూ ఉంది. మట్టి స్థాయి నుండి చూస్తే కుండ ఎక్కడుంది? ఉన్నదంతా మట్టే. వ్యాప్య వ్యాపకా లెక్కడున్నాయి? ఆధార ఆధేయా లెప్పుడొచ్చాయి?

పారమార్థిక దృష్టిలో పరమాత్మ అసంగుడై, అద్వయుడై శోభిస్తూ ఉన్నందున సర్పములో రజ్జువు లేనట్లు, స్వప్నంలో పురుషుడు లేనట్లు, జగత్తులో, భూతాలలో తాను లేడు. అదే శ్లోకం లోని నాల్గవ పాదం ***(న చాహం తేషు అవస్థితః).*** బ్రహ్మము భూతములలో ఉంటే, బ్రహ్మము ఆధేయమై భూతాలు ఆధార మవుతాయి.

సంబంధమే లేని వస్తువు ఆధేయ మెలా అవుతుంది? *(న హి అసంసర్గి వస్తు క్వచిత్ ఆధేయ భావేన అవస్థితం భవతి).*

*మరి, ఏ సంబంధము లేక, ఏ సంసర్గమూ లేక జగత్తు యొక్క సృష్ట్యాది కార్యాలు ఎలా సాగుతున్నాయి? అదే ఆశ్చర్యకర మైన ఈశ్వర వైభవము. చదవండి.*

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్ ।
భూతభృ న్నచ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ 5

***న-చ-మత్స్థాని-భూతాని-పశ్య-మే-యోగం-ఐశ్వరం***
***భూతభృత్-న-చ-భూతస్థః-మమ-ఆత్మా-భూతభావనః***

| | | | | |
|---|---|---|---|---|
| భూతాని | = ప్రాణులు | | మమ | = నా యొక్క |
| న మత్స్థాని | = నా యందు లేవు | | ఆత్మా | = ఆత్మ |
| మే | = నా యొక్క | | భూతభృత్ | = భూతములను భరించునట్టిది |
| ఐశ్వరం | = ఈశ్వరసంబంధ మైన | | భూతభావనః | = భూతములను రక్షించునది |
| యోగం చ | = యోగమును | | భూతస్థః న చ | = భూతములలో ఉండేది కాదు |
| పశ్య | = చూడు | | | |

**అర్జునా! భూతములు కూడా నాలో లేవు. నా యోగ మహిమను దర్శించు. భూతాలను పుట్టించి, భూతాలను పోషించే నా ఆత్మ భూతాలలో లేదు.**

**వ్యాఖ్య**

సర్వ భూతములు నా యందు ఉన్నవి ***(మత్స్థాని సర్వ భూతాని).*** నేను భూతముల యందు లేను ***(న చాహం తేష్వవస్థితః)*** అని నాల్గవ శ్లోకంలో భగవంతుడు ప్రసంగించాడు. అంటే, తాను భూతాలలో లేకున్నా, భూతాలు తన యందు ఉన్నాయని అంగీకరించడం జరిగింది. అలాంటప్పుడు భగవంతుడు అసంగుడు ఎలా అవుతాడు? అనేది ఒక శంక.

భూతములు పరమేశ్వరుని యందు ఉంటే, భూతాలకు పరమేశ్వరునికి ఆధేయ ఆధార భావము ఏర్పడినట్లే కదా! ఈ ఆధార ఆధేయాలు ద్వైతాన్ని ప్రవేశ పెడుతున్నాయి కదా! బ్రహ్మము ఏకము, అద్వయము అనే ప్రతిజ్ఞకు భంగం వాటిల్లుతూ ఉంది కదా!

నిద్రలో స్వప్నానికి పురుషుని వల్లనే వస్తు సత్తా కలుగుతూ ఉంది కనుక, స్వప్నము తనలో ఉంది అంటున్నామే గాని వాస్తవానికి స్వప్నముతో తనకు ఏ విధమైన సంబంధము లేదు కదా! అలాగే ఆత్మ చేత సత్తావంతములై ఉండటం చేత భూతములు ఆత్మ యందు ఉన్నవని చెప్పడం జరిగిందే గాని, బ్రహ్మకు భూతములతో సంగత్వము ఉందని కాదు.

శుక్తి యందు రజతము ఉన్నట్లు చూస్తున్నాము కదా! మరి ముత్తెపు చిప్ప యందు వెండి ఉన్నట్లేనా? ముత్తెపు చిప్ప లోని వెండికి, ముత్తెపు చిప్పకు సంబంధం ఉందా? లేదు కదా! అలాగే సర్పము రజ్జువులో కనిపిస్తూ ఉంది. అలాగని సర్పానికి రజ్జువుకు సంబంధం లేదు కదా! అలాగే భూతాలకు, బ్రహ్మమునకు కూడా సంబంధం లేదు.

భూతాలకు సత్తా బ్రహ్మము వల్లనే కలుగుతూ ఉన్నందున, భూతాలు పరమేశ్వరునిలో ఉన్నవి ***(మత్స్థాని***





***సర్వభూతాని)*** అని చెప్పడం జరిగింది. బ్రహ్మము అద్వయమైన అవ్యక్త చైతన్యము కావడం చేత, జగత్తులో ఏ విధమైన సంబంధము ఉండేందుకు అవకాశము లేనందున, పరమేశ్వరుడు భూతాలలో లేడు ***(న చాహం తేషు అవస్థితః)*** అని చెప్పడం జరిగింది. ఇంతకీ, బ్రహ్మము నందు జగత్తు ఉన్నదా? ఉన్నది అంటే ఉన్నది, లేదంటే లేదు అని చెప్పినట్లైంది. ఇదేమిటి? అని ప్రశ్నిస్తే, అదే నా యోగ వైభవము, తిలకించు అంటున్నాడు ***(పశ్యమే యోగ మైశ్వరమ్).***

***సౌమ్యా౽ ప్సుసి యథా వీచి ర్నచాస్తి న చ నాస్తి చ,***
***తథా జగద్బ్రహ్మణీదం శూన్యాశూన్య పదం గతమ్ ॥***

'నాయనా! సౌమ్యుడా! జలము నందు ఎలా తరంగములు ఉన్నవీ కావో, లేనివీ కావో, అలాగే, బ్రహ్మము నందు ఈ ప్రపంచము ఉన్నదీ కాదు, అలాగని లేకుండా పోయిందీ కాదు' అని ఉపనిషత్తు.

భూతాలకు ఆత్మ వలననే సత్తా కలుగుతూ ఉంది కనుక, అవి ఆత్మవంతము లయ్యా యని చెప్పడం చేత, బ్రహ్మము భూతాలలో ఉంది అని అజ్ఞానులు భావించే అవకాశం ఉంది. దానిని నిరాకరిస్తూ, నేను వాటి యందు లేను అని చెప్పడం జరిగింది **(అహం తేషు స్థితః ఇతి మూఢ బుద్ధీనామ్ అవభాసతే).**

**భూతములు బ్రహ్మము నందు లేవు**

భూతముల యందు బ్రహ్మము ఉంటే, భూతములు ఆధారమై బ్రహ్మము ఆధేయ మవుతాడు. అందుచేత నేను భూతముల యందు లేను అని చెప్పడం జరిగింది. భూతములు బ్రహ్మము నందు ఉంటే, బ్రహ్మము ఆధారమై భూతములు ఆధేయ మవుతాయి. బ్రహ్మము అద్వయము, అసంగము కావడం చేత బ్రహ్మము దేనికిని ఆధారము కాడు. అలాగే ఆధేయమూ కాడు. కనుక నేను భూతముల యందు లేను అని గడచిన శ్లోకంలో చెప్పిన పరమేశ్వరుడు ప్రస్తుత శ్లోకములో భూతములు నా యందు లేవు అంటున్నాడు ***(న చ మత్స్థాని భూతాని).***

భూతములు తన యందు లేవు అంటే జగత్తు తనలో లేదు అని అర్థము. కుండలో మట్టి ఉంది. కాని, మట్టిలో కుండ ఉందా? లేదు. జడమైన జగత్తుకు, చైతన్య స్వరూపమైన బ్రహ్మమునకు ఏ విధమైన సంబంధమూ పొసగదు. ఒకవేళ ఏదైనా సంబంధమును ఊహిస్తే, అది కారణ కార్య సంబంధం కాదు. కుండకు మట్టి కారణ మని చెప్పినా, ఉన్నది కారణమైన మట్టే గాని, కార్యం ప్రత్యేకంగా ఎక్కడుంది? కుండ కార్యము. అంటే, కుండ ఏమిటి? నామరూపాలే కదా! నామరూపాలు సత్య మెలా అవుతాయి? సత్యమైన మట్టిపై ఆధారపడి ఉన్నందున కుండ అనే నామరూపాలు మిథ్య. సత్యమిథ్యలకు సంబంధము కార్యకారణం కాదు. మిథ్యా సంబంధము. అదే అధ్యస్త సంబంధము.

రజతము శుక్తి యందు అధ్యస్తము. రజతము నామ మాత్రమే గాని సత్యము కాదు. శుక్తి యందు రజతము అనేది లేనే లేదు. అలాగే బ్రహ్మము నందు జగత్తు అధ్యస్తమే కనుక, జగత్తు అనేది కేవలం నామ మాత్రమే గాని, జగత్తు అనేది వాస్తవంగా బ్రహ్మము నందు లేదు. కనుకనే భూతములు నాలో లేవు అంటున్నాడు. భూతములు బ్రహ్మములో లేనందున, భూతములతో బ్రహ్మమునకు ఏ విధమైన సంసర్గము లేదు ***(అసంసర్గిత్వాత్, న చ మత్స్థాని భూతాని).*** బ్రహ్మమునకు ఏ విధమైన సంబంధము లేనందున, జగత్తు యొక్క గుణదోషాలు బ్రహ్మమునకు అంటవు. అధ్యస్త సంబంధము కావడమే అసంగ స్థితికి కారణము.

***యత్ర యదధ్యస్తం తత్కృతేన గుణేన దోషేణ వా అణుమాత్రేణాపి స న సంబధ్యతే*** - దేని యందు ఏది అధ్యసింప బడిందో, అట్టి అధ్యస్తమైన దాని గుణముతో గాని, దోషముతో గాని అధిష్ఠానమైన దానికి సంబంధము

ఉండదు అని ఆచార్యుల వారు బ్రహ్మసూత్ర భాష్యంలో స్పష్టం చేశారు.

పరమేశ్వరుడు జగత్తుకు ఆధారము కాడు. కాని, భూతములు నా యందు ఉన్నవి అంటాడు. పరమేశ్వరుడు ఆధేయము అసలే కాడు. కాని, నేను భూతములలో ఉన్నాను అంటాడు. అదేమిటి? అంటే, అదే ఈశ్వర సంబంధమైన మాయ. 'నా ఈశ్వర సంబంధమును తిలకించు' ***(పశ్య మే యోగ మైశ్వరమ్)*** అంటాడు.

భూతముల ఉత్పత్తికి, పెరుగుదలకు, మనుగడకు సత్తా మాత్రమై ***(భూత భావనః, భూతాని భావయతి వర్ధయతి ఇతి)***, భూతములకు ఉపాదానం కావడం చేత వాటిని పోషించునది అయినప్పటికి ***(భూతభృత్, భూతాని బిభర్తి)***. నా ఈశ్వర చైతన్యము ***(మమ ఆత్మా)*** భూతముల యందు లేదు ***(న చ భూతస్థః)***. ఇదే ఈశ్వర వైభవము, తిలకించు అంటున్నాడు. ఇదే శ్లోకము యొక్క ఉత్తర పాదము.

**ఈశ్వర వైభవము**

ఇక్కడ ***యోగం*** అంటే సంబంధము. ***ఐశ్వరమ్*** అనేది విశేషణంగా వాడ బడింది. ఈశ్వరునితో కూడిన ఈ సంబంధాన్ని, ఈశ్వర యోగాన్ని ***(యోగ మైశ్వరమ్)*** దర్శించ మంటున్నాడు ***(పశ్య)***. ఇదే ఈశ్వర మాయ. ఈశ్వర వైభవము.

తాను తానుగా ఉంటూ, తనలో ఏ మార్పు లేకుండానే జగత్తుగా భాసించడం ఈశ్వర వైభవము కాదా? సర్వ కారణమై కనిపిస్తూ, కారణ కార్యాలకు అతీతంగా శోభించడం ఈశ్వరీయ మాయ కాదా? అవ్యక్తమూర్తియై ఉండి వ్యక్తాలలో ప్రాకి ఉండటం ఈశ్వర యోగం కాదా? స్వరూపంలో ఏకమై భాసిస్తూ, వ్యవహారంలో అనేకంగా గోచరించడం ***యోగ మైశ్వరమ్*** కాదా? అన్నీ తానే నంటూ, ఏదీ తాను కాదంటూ, అంటీ అంటని ఈ విలక్షణ స్థితిని ఏమనాలి?

మట్టిలో తానే. మనిషిలో తానే. మాటలో తానే. మనస్సులో తానే. మాయలో తానే. మహిమలో తానే. అన్నీ తానే. తానే అన్నీ. అన్నీ ఎన్నని? ఎన్నో కావని. అన్నీ ఒక్కటే నని. ఆ ఒక్కటే తానని. అదే వైభవము! ఈశ్వర వైభవము. సర్వేశ్వర వైభవము. నిరుపాధిక ఐశ్వర్యము. ఏది ఉన్నా తన వల్లనే ఉంటుంది. తన పైనే ఆధారపడి ఉంటుంది. కాని, తాను దేని పైన ఆధార పడడు. తనలో దేనిని ఉంచుకోదు. తాను దేని లోను ఉండదు. అదే ఈశ్వర వైభవము.

భూతములకు ఈశ్వర చైతన్యము చేతనే ఆవిర్భావము సంభవిస్తూ ఉంది. అలా చూచి నపుడు, పరమేశ్వరుడు భూతభావనుడు ***(భూత భావనః)***. భూతభావనుడు అంటే భూతముల ఉత్పత్తికి, వృద్ధికి కారణ మైన వాడు అని అర్థము ***(భూతాని భావయతి, వర్ధయతీతి వా భూతభావనః)***. అంటే, సృష్టి కార్యము అతనిదే. మరొకరిది కాదు. నిర్మాణకర్త తానే. కర్త తాను అయితే, 'కారయితా', అంటే కర్త చేత కర్మ చేయించే వాడు మరొకడు ఉన్నాడా? అలా పరమేశ్వరుని చేత సృష్టి చేయించే వాడు మరొకడు ఉంటే, అతడే సృష్టికర్త అవుతాడు. కనుక కర్త తానే. కారయితా కూడా తానే. ఈ విధంగా భూతభావనుడైన వాడు భూతముల వృద్ధికి కారణమై ***భూతభృత్*** అయ్యాడు. భూతాలను ధరించే వాడు, భరించే వాడు, పోషించే వాడు భూతభృత్ ***(భూతాని బిభర్తి ధారయతి పోషయతి ఇతి వా భూతభృత్)***. యావత్ప్రపంచానికి తానే ఉపాదాన కారణం కావడం చేత, జగద్రూపంలో తానే ఉండి, జగత్తును తానే పోషిస్తూ ఉన్నాడు అని అర్థము.

కుండ యొక్క ఉత్పత్తికి కారణమైన మట్టి కుండకు సత్తాత్మకం గాను ఉంటూ కుండను భరిస్తూ, ధరిస్తూ ఉంది ***(బిభర్తి ధారయతి)***. అలాగని ఉపాదాన మైన మట్టిలో ఏ పరిణామము లేదు. ఇదే వివర్త అధిష్ఠానము. కాని, ఈ విధమైన వివర్త అధిష్ఠానత్వము కూడా అవ్యక్త చైతన్యమైన తన పరోభావమునకు లేదు





అనేదే ఈశ్వర వైభవము. కనుక, పరమేశ్వర వైభవములో ద్వైత భావన అంగీకారమే కాదు. కనుక, ఈశ్వర చైతన్యము జగత్కారణము కాబోదు.

***అస్య ద్వైత ఇంద్రజాలస్య యదుపాదాన కారణమ్, అజ్ఞానం తదుపాశ్రిత్య బ్రహ్మకారణ ముచ్యతే,***

ఈ ద్వైతరూప ప్రపంచ ఇంద్రజాలానికి ఏ అజ్ఞానము లేదా మాయ ఉపాదాన కారణముగా చెప్పబడుతూ ఉందో, దాని నాశ్రయించుకొనే బ్రహ్మమును కారణంగా చెప్పడం జరుగుతూ ఉంది అని భారత భావ దీప వ్యాఖ్యలో నీలకంఠాచార్యులు ఉదహరించిన వార్తిక వాక్యము.

కనుక మాయా కార్యమైన భూత ప్రపంచముతో అసంగ చైతన్య రూపుడైన పరమేశ్వరునకు ఆధార ఆధేయ సంబంధము ఉండేందుకు అవకాశము లేనందున, భూత భావనుడుగా, భూతభృత్‌గా తెలుస్తూ ఉండినా, వాస్తవానికి ఈశ్వర చైతన్యము ***(మమ ఆత్మా)*** భూతముల యందు లేదు ***(న చ భూతస్థః)*** అంటున్నాడు.

ఆకాశములో గంధర్వ నగరము, గగన కుసుమము ఇత్యాదులు గోచరిస్తాయి. వాటిని ధరించేది ఆకాశమే అయినా, ఆయా రూపాలుగా ఆకాశము పరిణమించదు కనుక, ఆకాశము వాటి యందు ఉండదు. అలాగే 'భూత భావనః', 'భూతభృత్' అని ఈశ్వర చైతన్యము స్తుతింప బడుతూ ఉండినా, అన్నిటిలో ఉన్నట్లు తెలుస్తూ ఉండినా ***(సర్వభూత నివాసోఽపి)***, వాటితో ఏ సంబంధము లేకపోవుట చేత, అసంగమైన ఈశ్వర చైతన్యము భూతముల యందు ఉండునది కాదు ***(న చ భూతస్థః)***. అలా ఉండేట ట్లయితే, ***విశేషణ నాశాత్ విశిష్టస్యాపి నాశః*** అనే న్యాయానుసారము విశేషణము లైన భూతములు నశిస్తే, వాటికి విశిష్టంగా తెలుస్తున్న ఆత్మకు కూడా వినాశము కలుగుతుంది. ఆత్మ అవినాశి కనుక ఆత్మ భూతములలో ఉండ లేదు.

అలా అయితే, ఆత్మకు భూతస్థత్వము లేదు అనుకుంటే, భూతముల చేత ఆత్మ పరిచ్ఛిన్నం కావడం లేదా? అనే సందేహం కలగవచ్చు. అలాంటి సందేహానికి అవకాశం లేదు. ఇది అధ్యస్త సంబంధము కావడం చేత, ఆకాశము నందు నీలి వర్ణము లాగా, పరమేశ్వరుని చైతన్యము నందు సర్వమూ కల్పితమే అని భావము. పైగా, అధిష్ఠానానికి భిన్నమైన ఆరోపితాలకు అస్తిత్వము ఉండదు కనుక, అట్టి సందేహానికి అవకాశం లేదు.

చివరగా **మమ ఆత్మా** అనడం కూడా అర్థం కావాలి. **మమ గృహం** అంటే నా ఇల్లు అని అర్థము. అంటే, నేను వేరు, నా ఇల్లు వేరు అని తెలుస్తూనే ఉంది. అలాగే **మమ ఆత్మా** అంటే, ఈశ్వరుడు వేరు, ఈశ్వరాత్మ వేరు అని అర్థమా? కానే కాదు.

ఇక్కడ అధ్యాస కోణం నుండి **మమ ఆత్మా** అని ప్రవచిస్తున్నాడు. ఉపాధి స్థాయి నుండి **మమ ఆత్మా** అంటున్నాడే గాని, ఆత్మ నుండి ఆత్మను వేరు చేసి కాదు. సోపాధిక ఐశ్వర్యాన్ని దృష్టిలో ఉంచుకొని, సర్వులకు అవగతం కావడానికి **మమ ఆత్మా** అంటున్నాడు. వాస్తవానికి నా ఆత్మ అనేది లేనే లేదు. ఆత్మే ఉంది. అద్వయంగా ఉంది. అదే నిరుపాధిక ఐశ్వర్యము. సత్య జ్ఞానానంద స్వరూపము. కనుకనే **ఏష సర్వేశ్వరః**- ఇతడే సర్వేశ్వరుడు అన్నది బృహదారణ్యకోపనిషత్.

మనం అధ్యయనం చేసిన ఈ నాలుగు - ఐదు శ్లోకాలు చక్కగా బుద్ధికి పడితే, నిద్ర నుండి మేల్కొనిన వానికి స్వప్నం అదృశ్య మైనట్లు, ద్వైత ప్రపంచం అదృశ్య మవుతుంది.

*ఇంతవరకు రెండు శ్లోకాలలో (4, 5) మనం తెలుసుకున్న విషయాన్నే సోదాహరణంగా వివరిస్తున్నాడు.*

**యథాకాశ స్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్ ।** **6**
**తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ ॥**

***యథా-ఆకాశస్థితః-నిత్యం-వాయుః-సర్వత్రగః-మహాన్***
***తథా-సర్వాణి-భూతాని-మత్‌స్థాని-ఇతి-ఉపధారయ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వత్రగః | = | సర్వవ్యాపి | తథా | = | ఆ విధంగా |
| మహాన్ | = | గొప్పది | సర్వాణి | = | సమస్తములైన |
| వాయుః | = | వాయువు | భూతాని | = | భూతములు |
| నిత్యం | = | నిత్యము | మత్థ్సాని ఇతి | = | నాలో ఉన్నవని |
| యథా | = | ఏ విధంగా | ఉపధారయ | = | గ్రహించు |
| ఆకాశస్థితః | = | ఆకాశము నందున్నదో | | | |

**అర్జునా! శ్రేష్ఠ మైనది, సర్వ సంచారి అయిన గాలి ఎలా ఆకాశంలో ఉంటుందో, అలాగే సమస్త భూతాలు నా లోనే ఉంటాయి అని తెలుసుకో!**

**వ్యాఖ్య**

రెండిటి మధ్య సంశ్లేషము, అంటే సంబంధము ఉన్నప్పుడే ఆధార ఆధేయ భావము సంభవము అని ఇంతవరకు అర్థం చేసుకున్నాం. జగద్బ్రహ్మలకు సంశ్లేషము కుదర నందున ఆధేయ ఆధార సంబంధము లేదని భావించాము. కాని, అసంశ్లిష్ట మైన వాటి మధ్య కూడా ఆధార ఆధేయ భావమును చూపే దృష్టాంత మును తీసికొని, ***మయాతత మిదం సర్వం*** శ్లోకము నుండి మనం చెప్పుకొనిన పై రెండు *(4, 5)* శ్లోకాల లోని అర్థాన్ని ***(యథోక్తేన శ్లోక ద్వయేన ఉక్తం అర్థం)*** దృష్టాంతం చేత సమర్థిస్తూ ప్రవచిస్తున్నాడు ***(దృష్టాన్తేన ఉపపాదయన్ ఆహ)*.**

**అవకాశము - అవస్థానము**

అవకాశము ఉన్నప్పుడే దేని కైనా అవస్థానము ఉంటుంది. 'అవస్థానము' అంటే ఉనికి అని అర్థము. ***అవకాశ ప్రదాతృ ఆకాశః*** - అవకాశాన్ని ఇస్తుంది కనుక ఆకాశము అని పేరు వచ్చింది. ఏ చలనాని కైనా చోటు ఉన్నప్పుడే అవకాశం. ఆ చోటే ఆకాశము. పంచభూతాలలో ఆకాశం ఒకటి. అన్ని భూతాల లోకి సూక్ష్మ మైనది ఆకాశము. కనుక అన్నిటి కన్నా విశాల మైనది. అందుచేత ఆకాశము మిగిలిన నాలుగు భూతాలకు, అనగా పృథివప్తేజో వాయువులకు తనలో అవస్థానమును కల్పిస్తుంది.

వాయువు ఉంది. వాయువు యొక్క ఉనికి ఆకాశంలో ఉంది. అంటే వాయువు తనలో ఉంటూ చలించడానికి ఆకాశము అవకాశమును కల్పిస్తూ ఉంది. ఆకాశము అవకాశము నిచ్చింది కనుక వాయువుకు అవస్థానము ఏర్పడింది.

వాయువు సదా ఆకాశం లోనే ఉంటుంది ***(నిత్యం ఆకాశే స్థితః)***. ఆకాశ వాయువులకు ఆధార ఆధేయ సంబంధం తెలుస్తూ ఉంది. ఆకాశము ఆధారము కాగా, వాయువు ఆధేయంగా ఉంది. ఆధారం లేకుండా ఆధేయం ఉండ లేదు. ఆకాశం లేకుండా వాయువు ఉండ లేదు. చలించనూ లేదు.

వాయువు గొప్పది ***(మహాన్ పరిమాణతః)***. ఆకాశం వాయువు కన్నా గొప్పది. కనుకనే వాయువు యొక్క ఉత్పత్తి స్థితి లయాలు ఆకాశం లోనే జరుగు తున్నాయి. వాయువు చలిస్తూ ఉంది. ఆకాశం అచలంగా ఉంది. ఆకాశంలో చలించే వాయువు గొప్పది అన్నాడు గీతాచార్యుడు ***(మహాన్)***. గొప్పది అంటే గొప్ప పరిమాణము కలది అని వ్యాఖ్యానించారు శ్రీ శంకరాచార్య స్వామి ***(పరిమాణతః)***.

పరిమాణము అంటే వాయువు యొక్క సంచార పరిధి అని అర్థము. నాలుగు భూతాలలో ఎక్కువ





దూరం పయనించేది వాయువే. వేగంలో కూడా తనదే ముందంజ. పృథివి ఎలాగూ చలించదు. చలించే మూడు భూతాలలో జలం అధోముఖంగా పయనిస్తుంది. ఊర్ధ్వంగా పయనించే అగ్ని వాయువులలో వాయువు ఎగిరి నంత ఎత్తుకు అగ్ని ఎగబ్రాక లేదు. అందుచేత, ఏ విధంగా చూచినా నాలుగు భూతాలలో గొప్పతనము వాయువు నందే గోచరించడం చేత వాయువును గొప్పది అన్నారు.

గొప్పది యైన వాయువును ***సర్వత్రగ*** మంటున్నారు. అంతటా పయనించేది కనుక సర్వత్రగం అయింది ***(సర్వత్ర గచ్ఛతి ఇతి సర్వత్రగః)***. అన్ని వైపుల ప్రసరిస్తుంది. అన్ని చోట్ల తిరుగుతుంది. ఒక చోట నుండి మరొక చోటికి వాయువు పయనించ గలదేమో గాని, ఒక ఆకాశం నుండి మరొక ఆకాశం లోకి పయనించ లేదు. కారణం, ఆకాశం ఒక్కటే కనుక. అందుచేత వాయువు ఎంత దూరం వెళ్ళినా ఆకాశాన్ని విడిచి వెళ్ళలేదు. ఆకాశం లోనే ఉండాలి. ఆకాశం లోనే తిరగాలి.

వాయువు ఆకాశం లోనే ఉండినా, వాయు గుణ దోషాలు ఆకాశంలో ఉండవు. వాయువు ఎంత గొప్ప దైనా, దానికీ ఒక పరిధి ఉంది. అంతరిక్షంలో వాయువు లేదు. వాయువు యొక్క ఈ పరిచ్ఛిన్నత్వము వలన ఆకాశము యొక్క అనంతత్వానికి భంగం వాటిల్లదు. అనంతమైన ఆకాశము పూర్ణ రూపంతో భాసిస్తూ ఉంది. తనలో ఎన్ని ఉన్నా, ఆకాశము దేనిని అంటకుండా నిర్లేపత్వమును ప్రదర్శిస్తూ ఉంది. ఈ విధంగా వాయు రాకాశాలకు సంశ్లేషము లేకపోయినా అసంశ్లిష్ట మైన ఈ రెండిటికి ఆధేయ ఆధార సంబంధం ప్రాప్తించినట్లు, జగద్బ్రహ్మ లకు సంశ్లేషము లేకపోయినా, ఆధార ఆధేయ భావం గోచరించడం సమర్థనీయమే.

ఈ వాయు రాకాశముల దృష్టాంతమును ఆధారం చేసుకొని జగద్బ్రహ్మల ఆధేయ ఆధార భావమును చెప్పుకుందాం.

**పరమాత్మ - ప్రపంచము**

గొప్పది అయిన వాయువు మహా గొప్పది అయిన ఆకాశంలో ఉన్నట్లు, గొప్పది అయిన ప్రపంచము ఆకాశము కంటే సూక్ష్మమైన ***(ఆకాశాదే రపి సూక్ష్మ తరమ్)*** పరమాత్మ యందు అవస్థానమును కలిగి ఉంది. వాయువుకు ఆకాశము ఎలా ఆధారమో, జగత్తుకు పరమాత్మ అలా ఆధారము.

వాయువు ఆకాశానికి ఎలా దూరంగా పోలేదో, భూతములు ఏవి ఎక్కడ తిరిగినా, ఏ లోకాల కేగినా, అనంతుడైన పరమాత్మకు మాత్రం దూరంగా పోలేవు. గొప్పదైన వాయువు విశాలాకాశంలో ఒక మూల ఒదిగి ఉన్నట్లు, సమస్త మైన ఈ జగత్తు పరమాత్మలో అంశమాత్రంగా ఉంది. ఈ విశ్వమంతా పరమేశ్వరుని ఒక్క పాదం కాగా, మిగిలిన మూడు పాదాలు విశ్వాతీతంగా ఉన్నాయి అన్నది వేదం ***(పాదోఽ స్య విశ్వాభూతాని త్రిపాదస్య అమృతం దివి)***. ఈ విషయాన్ని గీత - విభూతి యోగంలో భగవంతుడే స్వయంగా చెబుతాడు. అర్జునా! ఈ విశ్వము నంతా ఒక్క అంశము చేతనే నేను వ్యాపించి యున్నాను ***(విష్టభ్యాహ మిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్)***. ఆకాశము లాగా పరమాత్మ యొక్క ఏకత్వాన్ని, అనంతత్వాన్ని అర్థం చేసుకున్నాం. పూర్ణత్వంలో పోలిక ఎలా కుదిరిందో, నిర్లేపత్వము లేదా అసంగత్వములో కూడా అలాగే పోలిక ఉంది. అది కూడా చెప్పుకుందాం.

వాయువు గంధవహుడు ***(గంధస్య వహః గంధవహః)***. గంధమును వహించే వాడు ***(గంధం వహతీతి గంధవాహః)***. వాయువు గంధమును మోసుకొని ఆకాశంలో సంచరిస్తున్నా, ఆకాశం మాత్రం నిర్లేపం గానే ఉంటుంది. అంటకనే ఉంటుంది. అలాగే, జగత్తు పరమేశ్వరుని యందే ఉన్నా, జగత్తు లోని గుణ దోషాలు పరమేశ్వరుని అంటవు. వాయువు ఎలాగైతే ఆవిర్భావ తిరోభావాలను పొందుతూ ఆకాశంలో సంచరిస్తూ

ఉంటుందో, వస్తూ పోతూ ఉండే లక్షణము గల ఈ జగత్తు *(జాయతే గచ్ఛతి ఇతి జగత్)* కూడా అచలమైన పరమాత్మ యందే సృష్టి స్థితి లయాదులను పొందుతూ ఉంటుంది.

ఆకాశం ఒక్కటే అయినా, చలించే వాటి కన్నిటికీ తనలో అవకాశం ఇస్తూ ఉంది. పరమాత్మ అద్వయమే అయినా, సమస్త భూతాలను తన లోనే ఉంచుకుంటాడు. ఆకాశంలో గాలి పుడుతూ ఉంది. పోతూ ఉంది. పరమాత్మలో కూడా లోకాలు పుడుతూ ఉన్నాయి. అలాగే పోతూ ఉన్నాయి.

*యథా విశుద్ధ ఆకాశే స్తవాఽ భ్రమండలమ్ ।*
*భూత్వా విలీయతే తద్వ దాత్మ నీహాఽ ఖిలం జగత్ ॥*

ఏ విధంగా నైతే విశుద్ధమైన ఆకాశము నందు మేఘ మండలము జనించి, తిరిగి లయమును పొందు తున్నదో, అలాగే ఆత్మ యందు ఈ సమస్త జగత్తు ఆవిర్భవించి అంతరిస్తూ ఉంది.

ఆకాశ దృష్టాంతము చేత ఆత్మను వర్ణించడములో పరమేశ్వరుని ముఖ్యోద్దేశము మనకు స్పష్ట మవుతూ ఉంది. సమస్తము తన లోనే నడుస్తూ ఉన్నా, ఆకాశము ఎలా అంటకుండా, అసంగముగా ఉందో, అలాగే సృష్టి స్థితి లయాదులు పరమాత్మ లోనే జరుగుతూ ఉన్నా, తాను మాత్రం అసంగుడు గానే ఉన్నాడు. ఇదే తాత్పర్యము.

గాలి ఉన్నప్పుడు, ఆ ఉన్న గాలి ఆకాశం లోనే ఉంది. ఇది స్థితి. గాలి రావడము, గాలి ఉండటము, గాలి పోవడము అనేవి మూడు విధాలుగా ఆకాశములో ఎలా జరుగు తున్నవో, అలాగే భూతాలు ఆవిర్భవించడము, ఉంటూ వృద్ధి చెందడము, తిరిగి లయించి పోవడము అనేవి బ్రహ్మము నందే జరుగు తున్నాయి. **మత్స్థాని సర్వ భూతాని** అని నాల్గవ శ్లోకంలో భగవంతుడు చెప్పి నపుడు అది భూతముల యొక్క స్థితి కాలాన్ని సూచిస్తూ ఉంది. మరి, లయ కాలము ఏమిటి?

*స్థితి కాలంలో అసంగుడైన బ్రహ్మమునకు లయ కాలంలో కూడా అసంగత్వం ఉంటుందా? అదే చెబుతున్నాడు.*

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్ ॥ 7

*సర్వభూతాని-కౌంతేయ-ప్రకృతిం-యాంతి-మామికాం*
*కల్పక్షయే-పునః-తాని-కల్పాదౌ-విసృజామి-అహం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! | కల్పాదౌ | = | కల్పారంభము నందు |
| కల్పక్షయే | = | కల్పాంతములో | తాని | = | ఆ సర్వభూతములను |
| సర్వభూతాని | = | సకల భూతములు | పునః | = | మరల |
| మామికాం | = | నా సంబంధమైన | అహం | = | నేను |
| ప్రకృతిం | = | మాయను | విసృజామి | = | సృష్టిస్తున్నాను |
| యాంతి | = | పొందుతాయి | | | |

**కౌన్తేయా! ఈ సమస్త భూతాలు కల్పాంతము నందు నా ప్రకృతిలో కలిసి పోతాయి. అలా విలీన మైన వాటిని కల్పము మొదలు కాగానే తిరిగి నేనే సృష్టిస్తూ ఉంటాను.**

**వ్యాఖ్య**

జగత్తు ఉంది అంటే, సత్తావంతముగా ఉంది. జగత్తు లోని సత్తా స్ఫురణలు జగత్తుకు సంబంధించినవి





కావు. పరమేశ్వరుని సత్తా చేత సత్తావంతము లైవ భూతములు పరమేశ్వరుని యందే ఉన్నాయి. **సదాయతనాః సత్ప్రతిష్ఠాః** - ఏ సత్తా ఆధారమో ఆ సత్తా యందే ఉన్నాయి. కనుకనే, **మత్స్థాని సర్వభూతాని** - భూతము లన్నీ నా యందే ఉన్నాయి అన్నాడు భగవానుడు. ఇది భూతముల స్థితి కాలము.

స్థితి కాలములో పరమేశ్వరుని యందు ఉన్న భూతజాలము ప్రళయంలో లయించి పోతున్నాయి. ఎక్కడ లయిస్తున్నాయి? నాలో లయించడం లేదు, నా ప్రకృతిలో లయిస్తున్నాయి అంటున్నాడు. ఇక్కడే మీమాంస.

మట్టి నుండి కుండ తయారై నపుడు, మట్టి వల్లనే కుండ సత్తావంత మైంది. పగిలి నపుడు తిరిగి మట్టిలో కలిసి పోతుంది. అంతేగాని, మరొక దానిలో కలిసి పోవడం లేదు. కాని, ఇక్కడ భూతములు మాత్రం స్థితిని పరమేశ్వరుని యందే పొంది, లయంలో పరమేశ్వరుని ప్రకృతిలో కలిసి పోతున్నాయి.

ప్రళయము అంటే బ్రహ్మ ప్రళయము. ప్రళయములో బ్రహ్మోపదేశము ద్వారా క్రమముక్తిని పొందిన ముక్త పురుషులు తరించి పోతున్నారు కనుక వారు తిరిగి జన్మించరు. అలా తరించని జీవులు కల్పారంభంలో తిరిగి పుడుతారు. కాకపోతే, స్థితి హేతుత్వము ఈశ్వరు డైనపుడు, లయ హేతుత్వము ప్రకృతి అని ఎందుకు చెప్పవలసి వచ్చింది? ఇదే అర్థం కావాలి.

**లయ హేతుత్వము**

జగత్తు బ్రహ్మము వల్లనే సత్తావంత మైనా, సృష్టి స్థితి లయాలలో అసంగుడైన బ్రహ్మమునకు, కల్పిత ప్రపంచముతో సంశ్లేషము లేదు అని ఇప్పటికే గ్రహించి ఉన్నాము. ప్రపంచము నామరూపాత్మకంగా ఉంది కనుక, అది మిథ్య అని తెలుసుకున్నాము. ప్రపంచము మిథ్యా రూపంగా ఉన్నప్పుడు అది ప్రళయంలో దేనితో కలవాలి? మిథ్యా కార్యమైన ప్రపంచానికి మిథ్యా కారణమే హేతువు కనుక, ప్రళయంలో మిథ్యా ప్రపంచం మిథ్య లోనే కలవాలి. అదే ప్రకృతి లేదా మాయ.

మాయ అనేది త్రిగుణాత్మిక శక్తి. అదే పరమేశ్వరుని శక్తి. కనుక, మాయకు స్వతంత్ర మనుగడ లేదు. అది బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉంది. బ్రహ్మముపై ఆధారపడి ఉంది. సత్యం, జ్ఞానం, అనంతమైన బ్రహ్మము మాయతో కూడినపుడు ఆయన ఈశ్వరుడు అవుతాడు. ఆయనే సృష్టి కారణము. అంతేగాని, సచ్చిదానంద పరబ్రహ్మము సృష్టి కారణము కాదు.

మాయను ఉపాధిగా కలిగిన ఈశ్వరుడు సృష్టికి కారణ మవుతున్నాడు. స్థితి హేతుత్వము కూడా తానే. జీవులము మాయాధీనులమై ఉన్నాము. కాని, ఈశ్వరుడు మాయను తన అధీనంలో ఉంచుకొని యున్నాడు. ఆ మాయే ప్రస్తుత శ్లోకంలో ప్రకృతి.

**మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్** (శ్వేతాశ్వతర ఉపనిషత్తు).

మాయయే ప్రకృతి. ఆ మాయను తన అధీనంలో ఉంచుకున్న మాయావి మహేశ్వరుడు. ముఖ్యంగా ఒక్క విషయాన్ని ఇక్కడ మనం స్పష్టంగా అర్థం చేసుకోవాలి. మాయకు ఒక ప్రత్యేక మనుగడ లేదు అనేది మరచి పోకూడదు. బ్రహ్మము కన్నా వేరుగా మాయ లేదు.

జగత్తుకు, భూతాలకు మాయే ఉపాదాన కారణము. బ్రహ్మము ఉపాదానం అన్నప్పుడు, ఉపాదాన కారణ మైన బ్రహ్మము జగత్తుగా పరిణామం చెందితే, ఆ తరువాత బ్రహ్మము యొక్క అస్తిత్వమే ప్రశ్నార్థక మవుతుంది.

కనుక ఉపాదానం అన్నప్పుడు, ఎటువంటి ఉపాదానము? అనే ప్రశ్న పుడుతుంది. సృష్టికి బ్రహ్మము 'వివర్త ఉపాదాన'మే గాని 'పరిణామీ ఉపాదానం' కాదు. తన స్వరూపాన్ని విడిచి పెట్టకుండా సర్పమునకు రజ్జువు

ఉపాదానం కావడం వివర్త ఉపాదానము. తన స్వరూపాన్ని పరిత్యజించి, పాలు పెరుగు అయినట్లు ఉపాదానం కావడం పరిణామీ ఉపాదానము.

సర్వజ్ఞుడైన ఈశ్వరుడు నిమిత్త కారణంగా శోభిస్తూ మాయోపాధి ద్వారా సృష్టికి కారణ మవుతున్నాడు. మాయ నుండి ఉత్పన్నం కావడం చేత భూతములు కల్పక్షయంలో మాయనే పొందు తున్నాయి. అదే ప్రకృతిలో విలీనం కావడ మంటే ***(సర్వ భూతాని ప్రకృతిం త్రిగుణాత్మికామ్ యాన్తి మామికాం మదీయాం కల్పక్షయే ప్రళయ కాలే).***

**సృష్టి హేతుత్వము**

కల్పక్షయంలో లయించిన భూతములు తిరిగి కల్పాదిలో మాయ నుండే పుడితే, సృష్టి స్థితి లయాదులు ఈశ్వరాధీనం తప్పినట్లే కదా? సృష్టి కార్యానికి మాయ ఎలా నిమిత్త కారణ మవుతుంది? అంటే, జడమైన మాయకు సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్వ, సర్వవ్యాపకత్వాలు ఉన్నాయా?

పోనీ సర్వజ్ఞుడైన ఈశ్వరుడే నిమిత్త కారణంగా ఉండి, మాయను ఉపాధిగా గ్రహించి, తన అధీనంలో ఉన్న మాయాశక్తి చేత సృష్టి కార్యాన్ని కల్పాదిలో నిర్వహిస్తాడు అని అంటే, పరమేశ్వరునికి కర్తృత్వము ఉన్నట్లే కదా? అనే సందేహము కలుగుతుంది.

సృష్టి మాయా కార్యమే. మాయ త్రిగుణాత్మికము, జడమే అయినా, ఈశ్వర సన్నిధాన బలం చేత, అయస్కాంత సన్నిధిలో ఇనుపముక్క కదిలినట్లు, మాయ కార్యోన్ముఖ మవుతుంది. మాయ అనినా మిథ్య అనినా ఒక్కటే. మాయకు ఎలా స్వతంత్ర మనుగడ లేదో, మిథ్యా జగత్తుకు కూడా స్వతంత్ర మనుగడ లేదు.

మాయ చాలా విచిత్ర మైంది. అదొక గారడి. అందుచేతనే, మాయను తన అధీనంలో ఉంచుకున్న ఈశ్వరుణ్ణి మాయావి అన్నారు. మాయావి అనే పేరు గల మహేశ్వరుడు, మాయా కార్యాన్ని (సృష్టి కార్యాన్ని) నిర్వహిస్తూ ఉంటాడు ***(మాయావి నామపి మాయా కారిత్వాత్ మాయావీ).*** కనుకనే, నా మాయ దాటశక్యం కానిది అని చెప్పే ఉన్నాడు *(7 - 14).*

మాయను సంస్కృతంలో ***యా మా సా మాయా*** అని నిర్వచిస్తూ ఉంటారు. అంటే, ఏదైతే లేదో అదే మాయ అని అర్థము. జగత్తు సృష్టి. సృష్టి మాయా కార్యము. సృష్టిలో దేనిని విచారించి చూచినా, అది లేనిదే అవుతుంది. అదే మాయ. అదే గారడి. దేశకాలాదులు సృష్టిలో ఉన్నాయి. అవి ఏమిటి అని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తే, అవి కనిపించవు. అదే మాయ.

ఏ వస్తువైనా అంతే. కుండ ఏమిటి? మట్టే కదా! కుండలో మట్టి కన్నా అన్యంగా ఏమీ లేదు కదా! ఇప్పుడు కుండ ఎక్కడుంది? మట్టి పైన ఉందా? మట్టి క్రింద ఉందా? మట్టి లోపల ఉందా? మట్టి బయట ఉందా? మట్టి ప్రక్కన ఉందా? అక్కడ కుండ ఏది? మట్టే ఉంది. మట్టి ఎలాగూ కుండ కాదు. మరి మట్టి ఏమిటి? అని ఆలోచిస్తే, అణువులు అని తేలుతుంది. ఇలాగే శోధిస్తూ పోతే ఏదీ మిగలదు. ఏదీ ఉండదు. ఏదీ లేకపోయినా, అన్నీ ఉన్నట్లు చూపేదే మాయ. ఈ మాయనే ఉపాధిగా గ్రహించి, కల్పారంభమున పరమేశ్వరుడు సృష్టిని చేస్తున్నాడు.

*సృష్టి హేతుత్వము మాయోపాధికము. కనుక, బ్రహ్మ యొక్క అసంగత్వానికి భంగం రాదు. చదవండి.*

**ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః ।**
**భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్ ॥** 8





***ప్రకృతిం-స్వాం-అవష్టభ్య-విసృజామి-పునః-పునః***
***భూతగ్రామం-ఇమం-కృత్స్నం-అవశం-ప్రకృతేః-వశాత్***

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్వాం | = స్వకీయమైన | | భూతగ్రామం | = భూత సమూహమును |
| ప్రకృతిం | = ప్రకృతిని | | పునః పునః | = మరల మరల |
| అవష్టభ్య | = వశపరచుకొని | | ప్రకృతేః | = ప్రకృతి యొక్క |
| అవశం | = పరతంత్ర మైన | | వశాత్ | = వశముచే |
| ఇమం | = ఈ | | విసృజామి | = పుట్టిస్తున్నాను |
| కృత్స్నం | = సమస్తమైన | | | |

**అర్జునా! ఈ సమస్త భూతజాలము ప్రకృతి అధీనము కనుక అస్వతంత్రము. నేను నా ప్రకృతిని వశ పరచుకొని ఈ భూతజాలాన్ని మళ్ళీ మళ్ళీ పుట్టిస్తూ ఉంటాను.**

**వ్యాఖ్య**

ఆకాశములో చరించు వాయువు లాగా స్థితి కాలంలో భూతము లన్నీ పరమేశ్వరుని యందే ఉండినా ***(మత్‌స్థాని సర్వభూతాని).*** ప్రళయ కాలములో అవి ఈశ్వరుని యందు కాకుండా ఈశ్వర మాయలో లయిస్తున్నా యని గ్రహించాము. అలా మాయలో లయించి బీజ రూపమున ఉన్న ఆ సూక్ష్మ భూతములను మళ్ళీ సృష్ట్యాదిలో పరమేశ్వరుడు సృష్టిస్తూ ఉన్నాడు. ఈ విధమైన సృష్టి కార్యము మళ్ళీ మళ్ళీ జరుగుతూనే ఉంటుంది ***(పునః పునః).***

మరి, అసంగుడైన పరమేశ్వరునకు సృష్టి కార్యము ఎలా పొసగుతుంది? నిష్క్రియుడైన వాడు సృష్టి కార్యాన్ని ఎలా నిర్వర్తిస్తాడు? తన ప్రకృతిని ***(స్వాం ప్రకృతిం)*** వశ పరచుకొని ***(అవష్టభ్య)*** మళ్ళీ మళ్ళీ సృష్టిస్తూ ఉంటాడు ***(పునః పునః విసృజామి).*** తన ప్రకృతిని వశపరచు కోవడము అంటే తన మాయను అధీనంలో ఉంచుకోవడము అని అర్థము. అదే మాయోపాధి.

**దేనిని సృష్టిస్తాడు?**

మాయోపాధి గల ఈశ్వరుడు దేనిని సృష్టిస్తాడు? ఈ కనిపిస్తున్న ***(ఇమం)*** చరాచర భూత ప్రపంచము ***(భూతగ్రామం)*** సమస్తమును ***(కృత్స్నం)*** సృష్టిస్తాడు. అవ్యక్త మైన పరమేశ్వర చైతన్యము అవ్యక్త మైన మాయను ఉద్దీపింప చేసినపుడు ఈ దృశ్యమాన జగత్తు వ్యక్తమవుతూ ఉంది. భూతములు పుడుతున్నాయి.

పుట్టుక భూతముల కేనా? భగవంతునికి లేదా? జీవులు ఆవిర్భవించినట్లే ఈశ్వరుడు కూడా అవతరిస్తున్నాడు కదా! మరి ఇద్దరి పుట్టుకకు మాయే కారణమా?

పరమేశ్వరుడు పుట్టుక లేనివాడు. నాశము తెలియని వాడు. ప్రాణులకు ప్రభువు. అయినా, తన ప్రకృతిని ***(స్వాం ప్రకృతిం)*** ఆశ్రయించుకొని ***(అధిష్ఠాయ)*** పుడుతూ ఉంటాడు ***(సంభవామి)*** అని నాల్గవ అధ్యాయం ఆరవ శ్లోకంలో చూశాము. తన మాయను అదుపులో ఉంచుకొని మనల్ని సృష్టిస్తూ ఉన్న పరమేశ్వరుడు, తన మాయ చేతనే తాను కూడా పుడుతూ ఉన్నాడు ***(ఆత్మ మాయయా).***

తన యోగమాయను లేదా ఆత్మమాయను తన వశంలో ఉంచుకొని పరమేశ్వరుడు అవతరిస్తున్నాడు. జీవులు అలా కాదు. పరవశులై, అస్వతంత్రులై పుడుతున్నారు. కనుక జీవులది అవిద్యా మాయ. భగవంతునిది ఆత్మ మాయ. అసంగ పరబ్రహ్మ కర్మ సంబంధం లేకుండా స్వేచ్ఛగా అవతరిస్తే, జీవులు కర్మానుభవానికి, అస్వతంత్రులై, ప్రారబ్ధానికి తల వంచి పుడతారు. జీవేశ్వరుల ఆవిర్భావంలో ఇదే ప్రధానమైన తేడా.

## దేని కొరకు సృష్టి ?

పరమేశ్వరుడు సృష్టి ఎందుకు చేసినట్లు? అసలు సృష్టే లేకుండా ఉంటే, జీవులకు ఈ తాపత్రయాలు ఉండేవి కావు కదా! అని ఈ సందర్భములో శ్రీ మధుసూదన సరస్వతి తమ గూఢార్థ దీపిక వ్యాఖ్యలో ఒక ప్రశ్న లేవనెత్తారు. తన భోగార్థం ప్రపంచాన్ని సృష్టించు కున్నాడు అనుకుందా మంటే, పూర్ణ రూపుడైన తనకు ఏమి లోపించిందని భోగార్థం సృష్టించు కుంటాడు? అదే వాస్తవ మైతే, పరమేశ్వరుడికి సంసారిత్వము ప్రాప్తించినట్లే కదా! పరమేశ్వరునిలో సంసారిత్వాన్ని ఊహించ గలమా? ఈశ్వరునిలో సంసారిత్వమును దర్శిస్తే, ఈశ్వరత్వ మునకు భంగము వాటిల్లినట్లే కదా! ఇంతకీ ఈ సృష్టి ఎవరి కొరకు?

బంధము ఉన్న వారికి మోక్షార్థము సృష్టి కార్యము జరిగింది అంటారు కొందరు. ఇది వాస్తవమా? బంధము సత్యమా? బంధము సత్యమైతే, దానికి విరోధి యైన మోక్షము అసత్య మవుతుంది కదా? అలాంటి మోక్షాన్ని పొంది ఏమి సాధించాలి? ఒకవేళ బంధము అసత్యము అనుకుందాం. అసత్యము అంటే లేనిదే కదా! మరి లేని బంధానికి మోక్ష మెందుకు?

కనుక, సృష్టి కార్యము భోగార్థము అని గాని, మోక్షార్థము అని గాని చెప్పేందుకు వీలు లేనందున, సృష్టికి మాయామయత్వము సిద్ధించింది. కనుక విషయం అవగత మైతే, మాయ ప్రతికూలము కాదు, కనుక పరిహరింప దగినది కాదు. అది కేవలం మిథ్య అని తెలియ జేయడానికే, నా ప్రకృతి *(ప్రకృతిం స్వాం)* అని చెప్పడం జరిగింది.

## అవ్యక్తం వ్యక్తం కావడమే సృష్టి

ప్రళయ కాలంలో ప్రకృతిలో లయించిన జీవులు తమలో బీజరూపంగా ఉన్న వాసనలకు అనుగుణంగా తిరిగి జన్మిస్తూ ఉంటారు. ఇక్కడ గత జన్మలలో ఆచరించిన కర్మల లోని పుణ్యపాపాల ప్రభావం కూడా ఉంటుంది. వాటిని అనుసరించి తదనుగుణ మైన ప్రదేశాలలో జీవులు కర్మానుభవం కోసం పుడుతూ ఉంటారు.

మరి, ఈ విధమైన పుట్టుకలో కర్తృత్వం ఎవరిది? అనే ప్రశ్న పుడుతుంది. పరమేశ్వరుడు అకర్త కనుక ఆయనకు కర్తృత్వమును ఆపాదించడం కుదరదు. అలాంటప్పుడు కర్తృత్వం ఎవరిది? ప్రకృతిదే. ప్రకృతి జడం కదా? జడమైన ప్రకృతి సృష్టి కార్యాన్ని ఎలా నిర్వహించ గలుగుతుంది?

ప్రకృతి జడమే అయినా, పరమేశ్వరుని సన్నిధాన బలం చేత సృష్టిని చేయ గలుగుతుంది. అలాగే ప్రళయాన్ని కూడా సృష్టిస్తుంది. కార్యం ప్రకృతిదే అయినా శక్తి పరమేశ్వరునిది. అదే మాయాశక్తి.

*అలాంటప్పుడు ఈ విధమైన కర్మలు ఈశ్వరుని బంధించవా? చెబుతున్నాడు.*

**న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ।**
**ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు ॥** 9

*న-చ-మాం-తాని-కర్మాణి-నిబధ్నంతి-ధనంజయ*
*ఉదాసీనవత్-ఆసీనం-అసక్తం-తేషు-కర్మసు*

| | | | |
|---|---|---|---|
| ధనంజయ | = అర్జునా! | ఆసీనం చ | = ఉన్న వాడనైన |
| తేషు | = ఆ | మాం | = నన్ను |
| కర్మసు | = కర్మల యందు | తాని | = ఆ |
| అసక్తం | = సంగము లేని వాడను | కర్మాణి | = కర్మలు |
| ఉదాసీనవత్ | = ఉదాసీనుడను | న నిబధ్నంతి | = బంధించవు |





**ధనంజయా! నేను ఆ కర్మల యందు ఆసక్తి లేనివాణ్ణి. తటస్థంగా ఉండే వాణ్ణి. అందుచేత, కర్మలు నన్ను బంధించవు.**

**వ్యాఖ్య**

ఏ కర్మ జరిగినా, దాని వెనుక కర్త ఉంటాడు. కర్మ చేసే కర్తకు ఆ కర్మకు సంబంధించిన జ్ఞానం ఉంటుంది. ఆ జ్ఞానమే కర్త చేత కర్మ చేయిస్తుంది.

'కర్మ చేయాలి' అని అనుకొనే కర్మ చేస్తాడు కనుక కర్మ యందు కర్తకు ఆసక్తి ఉంటుంది. ఆసక్తి లేనివాడు కర్మను చేయడు కదా! కర్మను ఆసక్తితో చేయడమే కర్తృత్వము. 'నేను చేయాలి అనుకున్న కర్మను చేశాను' అన్న భావన మనస్సును దృఢంగా పెనవేసుకో గానే అది అభిమానంగా మారుతుంది. అదే కర్తృత్వ అభిమానము.

కర్మను ఆసక్తితో ఎందుకు చేస్తాడు? తాను ఆ విధమైన కర్మను నిర్వహిస్తే, తద్వారా తాను ఆశించే ఫలం లభిస్తుంది అనే ఆశ ఉండటం చేత. అదే ఫలాశ. ఫలాసక్తి. కర్మ ఫలాసక్తి.

ఫలాసక్తి తోనే ఎవ్వరైనా కర్మ ఆచరిస్తారు. కర్మ చేస్తే ఫలం రాక తప్పదు. ఆ వచ్చిన ఫలం కర్త ఆసక్తిని తృప్తిపరచే దైతే ఫరవాలేదు. ఆశించింది కానపుడు నైరాశ్యం ఏర్పడుతుంది. ఫలాసక్తితో కర్మ నాచరించే కర్త పూర్ణజ్ఞానం కలవాడు కాకపోవడం చేత, ఆశించినవి ప్రాప్తించక పోవడమే ఎక్కువగా జరుగుతూ ఉంటుంది.

కర్మ ఏదైనా దేశ కాల ప్రయత్నాల చట్రము లోనే బిగించబడి ఉంటుంది కనుక పరిమితంగా ఉంటుంది. పరిమిత మైన కర్మ పరిమిత ఫలాన్ని ఇస్తుందే గాని జీవులు ఆశించే పూర్ణ ఫలాన్ని అందించ లేదు. ఇలా ఫలించిన కర్మలు ఒక విధంగా, ఫలించని కర్మలు మరో విధంగా జీవుల్ని దుఃఖానికి గురి చేస్తూ ఉంటాయి.

ఈ విధంగా సామాన్య కర్మలే జీవుల్ని బంధిస్తూ ఉంటాయి. మరి, పరమేశ్వరుడు సృష్టి స్థితి లయాది కర్మలకు కారణమై నపుడు అవి అతనిని బంధించవా? సర్వ భూతాలను వారి వారి కర్మలను దృష్టిలో ఉంచుకొని, పుణ్యకర్మలు చేసిన వారిని పుణ్య లోకాలకు, పాపకర్మలు చేసిన వారిని నరక లోకాలకు చేర్చుట అనే ఈ పుణ్యపాప కర్మ సంబంధాలు బంధహేతువులు కావా? అనే సందేహాన్ని నివారిస్తూ సమాధానం చెబుతున్నాడు.

ఈ సృష్టి స్థితి లయాదులు, సుఖదుఃఖాది ఫల ప్రదానములు ప్రకృతి వలన సంభవిస్తున్నాయే గాని, తన వలన కాదు అంటున్నాడు. తాను పనులలో ఆసక్తి లేని వాడుగా, ఫలాల యందు అభిరుచి లేని వాడుగా తనను తాను అభివర్ణించు కుంటున్నాడు. అందుచేత సర్గ స్థితి లయాది అద్భుత కర్మలు కూడా తనను బంధించవు అంటున్నాడు **(న చ మాం ఈశ్వరం తాని కర్మాణి నిబధ్నన్తి)**. కారణం కూడా చెబుతున్నాడు. సృష్ట్యాది కర్మలలో సంబంధము లేక పోవడమే కారణము అంటున్నాడు **(తత్ర కర్మాణామ్ అసంబద్ధత్వే కారణమ్)**. సంబంధము లేకపోవడానికి, ఉదాసీనుడుగా ఉండటము **(ఉదాసీనవత్ ఆసీనమ్)**, నిరాసక్తుడుగా మిగలడం - ఈ రెండే కారణాలు.

## ఉదాసీనుడు

ఒక దానిని చూచి నపుడు అది మనకు ఇష్టమైన దైతే, మన మనస్సులో రాగ వృత్తి ఏర్పడి దానిని కాంక్షించడం జరుగుతుంది. ఒకవేళ అది మనకు అయిష్టమైన దైతే, మనస్సులో ద్వేష వృత్తి ఏర్పడి దానిని గర్హించడం జరుగుతుంది. కాని, అటు రాగము లేక, ఇటు ద్వేషము రాక, వస్తువును చూడగానే కేవలం వస్తు సంబంధమైన వృత్తి మాత్రమే మనస్సులో ఏర్పడింది అనుకోండి, ఆ పరిస్థితిలో మనస్సు లోని వృత్తిని తటస్థంగా చూడటం జరుగుతుందే గాని, రాగద్వేషాలు ఏర్పడవు. అలా తటస్థంగా చూస్తూ ఉండటమే ఉదాసీనత్వం. ఏ సంబంధం లేకుండా చూచే ఉపేక్షకుడే ఉదాసీనుడు **(ఉదాసీనః ఉపేక్షకః కశ్చిత్ తద్వత్ ఆసీనమ్)**. కర్మఫలము

నందు ఈ విధమైన ఉదాసీన వైఖరి ఉన్నట్లైతే, కర్మఫలము బంధించదు. పరమేశ్వరుడు సాక్షీ చైతన్యరూపుడు కనుక సదా ఉదాసీనుడై ఉంటాడు.

**నిరాసక్తుడు**

కర్మఫలము నందు ఉదాసీనంగా ఎలా ఉండగలడు అంటే, కర్మల యందు నిరాసక్తుడై ఉన్నాడు కనుక. తానే ఆత్మ అనే జ్ఞానం ఉన్నప్పుడు, సచ్చిదానంద స్వరూపమైన ఆత్మ అకర్తయే గాని కర్త కాలేదు. ఈ విధమైన ఆత్మజ్ఞానము కర్తృత్వాభిమానాన్ని నిర్మూలిస్తుంది. ఆత్మ పూర్ణం కనుక, తాను ఆత్మ యనే జ్ఞానం కల ఆత్మవిదునికి, ఆప్తకామునికి ఫలాసక్తి ఉండదు. కర్మల యందు కూడా ఆసక్తి ఉండదు ***(ఆత్మనః అవిక్రియత్వాత్, అసక్తం ఫలాసంగ రహితమ్, అభిమాన వర్జితమ్).*** కనుక, సృష్టి స్థితి లయాది కర్మల యందు ***(తేషు కర్మసు)*** పరమేశ్వరుడు అనాసక్తుడై, ఉదాసీనంగా ఉండటం చేత ఆ కర్మలు ఆయనను బంధించవు ***(న నిబధ్నన్తి).***

ఈ శ్లోకంలో అర్జునుణ్ణి, ధనంజయా! అని పిలిచాడు పరమేశ్వరుడు. ధర్మరాజు నిర్వహించిన రాజసూయ యాగానికి ధన సేకరణకు వెళ్ళి అక్షయ ధనాన్ని సేకరించినా, దాని మీద దృష్టి లేని నిరాసక్తుడు అర్జునుడు. అమూల్య ధనరాశులను ఉదాసీనంగా వీక్షించిన త్యాగమూర్తి. ***ధనం జయతీతి ధనంజయః*** - ధనమును జయించు వాడు ధనంజయుడు. ధనమును ఆర్జిస్తారు గాని జయించరు. కనుక, ఇక్కడ ధనమును జయించడము అంటే, ధనాశను జయించడము అని అర్థము. ధనాసక్తి లేనివాడు అని భావము. కనుక, ధనంజయా! అని సంబోధించి తద్వారా, కర్మలు బంధించని స్థాయికి నువ్వు కూడా చేరగలవు అని అర్జునుని ఉత్సాహ పరచాడు. అదే కదా జ్ఞాని వైభవము!

సంబోధన ద్వారా అచ్యుతుడు అర్జునునిలో ఉత్సాహాన్ని దించితే, ఈ శ్లోకంపై తమ వ్యాఖ్యానంతో ఆచార్యుల వారు మనందరిలో దివ్యంగా ప్రగతి పుష్పాలను పూయిస్తారు.

***అతః అన్యస్యాపి కర్తృత్వ అభిమాన అభావః ఫల అసంగ అభావశ్చ అబన్ధ కారణమ్*** - సృష్టి స్థితి లయాది కార్యాలలో పరమేశ్వరుడు ఎలా బంధానికి గురి కాలేదో, అలాగే ఏ వ్యక్తి అయినా కర్తృత్వాభిమానం లేకుండా, ఫలాసక్తి లేకుండా ఉండ గలిగితే, అతడు కూడా బంధానికి గురి కాడు అని శ్రీ శంకర భాష్యము.

*మరి ఈ భూతజాలాన్ని నేనే సృష్టిస్తున్నాను అని ఒక వైపు చెబుతూ, మరో వైపు నేను ఉదాసీనంగా ఉన్నాను అని చెప్పడంలో వైరుధ్యము లేదా? లేనే లేదు. ఎలాగో చదవండి.*

**మయాऽధ్యక్షేణ ప్రకృతిః సూయతే స చరాచరమ్ ।**
**హేతునాऽనేన కౌన్తేయ జగ ద్విపరివర్తతే ॥** 10

***మయా-అధ్యక్షేణ-ప్రకృతిః-సూయతే-సచరాచరం***
***హేతునా-అనేన-కౌంతేయ-జగత్-విపరివర్తతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! | సూయతే | = | ప్రసవిస్తూ ఉంది |
| అధ్యక్షేణ | = | అధ్యక్షుడ నైన | అనేన | = | ఈ |
| మయా | = | నా చేత | హేతునా | = | కారణము చేత |
| ప్రకృతిః | = | ప్రకృతి | జగత్ | = | జగత్తు |
| స చరాచరం | = | చరాచరములును | విపరివర్తతే | = | ప్రవర్తిస్తూ ఉంది |

**కౌన్తేయా! నన్ను అధ్యక్షునిగా పెట్టుకొని ఈ చరాచర జగత్తును ప్రకృతి సృష్టిస్తూ ఉంది. ప్రపంచం నడవడానికి ఇదే కారణం.**





**వ్యాఖ్య**

**ఆశంక**

భూత సముదాయముతో నిండిన ఈ సమస్త ప్రపంచాన్ని నేనే మళ్ళీ మళ్ళీ సృష్టిస్తున్నాను ***(భూత గ్రామం ఇమం కృత్స్నం విసృజామి పునః పునః)*** అని ఎనిమిదవ శ్లోకంలో చెప్పి, సృష్టి విషయంలో నేను ఉదాసీనంగా ఉన్నాను ***(ఉదాసీనవ దాసీనం)*** అని వెంటనే తొమ్మిదవ శ్లోకంలో చెప్పడంలో విషయ వైరుధ్యం లేదా? నేను సృష్టి చేస్తున్నాను అని ఒక వైపు, నేను సృష్టిని చేయడం లేదు, తటస్థంగా ఉన్నాను అని మరొక వైపు ప్రకటించడం పరస్పర విరుద్ధం కాదా? అనేది సందేహము. ఈ సంశయాన్ని పరిహరించడం కోసమే ప్రస్తుతం, ***మయాऽధ్యక్షేణ*** శ్లోకం.

**చూచేది - చేసేది**

అర్జునా! అధ్యక్షుణ్ణి అయిన నా జ్ఞాన వెలుగును ఆశ్రయించుకొని **(మయా అధ్యక్షేణ)**, ప్రకృతి లేదా మాయ **(మమ మాయా త్రిగుణాత్మికా)** చరాచరమైన ఈ జగత్తును **(స చరాచరం జగత్)** పుట్టిస్తూ ఉంది ***(సూయతే ఉత్పాదయతి).*** కౌంతేయా! నిమిత్తమాత్ర మైన ఈ అధ్యక్షత్వం అనే కారణం చేత ***(హేతునా నిమిత్తేన అనేన అధ్యక్షత్వేన)*** ఈ ప్రపంచ సృష్టి **(జగత్)** నడుస్తూ ఉంటుంది **(విపరివర్తతే).** ఇదీ స్థూలంగా శ్లోకార్థం.

పరమాత్మ చేత ఉపహిత మైన ప్రకృతి, లేదా మాయ స్థావర జంగమాత్మక మైన ఈ సృష్టిని పుట్టిస్తూ ఉంది. పుట్టిన దానిని నిలుపుతూ ఉంది. అలాగే సంహరిస్తూ ఉంది అని శ్లోకం లోని పూర్వపాదం.

ఈ సృష్టి చరాచరాత్మకము. చరము అంటే జంగమము. అచరము అంటే స్థావరము. కదిలే ప్రాణులు చరములు. కదలని పర్వత, వృక్ష, లతా గుల్మాదులు అచరములు. సృష్టిలో ఇవన్నీ పుడుతున్నాయి. ఈ విధంగా ఆవిర్భవించిన ప్రపంచము పుట్టింది మొదలు లయించు వరకు నిరంతరము మార్పు చెందుతూ నడుస్తూ ఉంది. విపరిణామం చెందుతూ ఉంది ***(జగత్ విపరివర్తతే).***

సృష్టికి పరమాత్మ అధ్యక్షుడు. ప్రకృతి కర్త్రి. చేసేది ప్రకృతి. చూచేది పరమాత్మ.

మాయ త్రిగుణాత్మకము, అజ్ఞాన యుతము **(మాయా త్రిగుణాత్మికా అవిద్యా లక్షణా ప్రకృతిః).** ఈ మాయే ప్రకృతి. పరమాత్మ సన్నిధానంలో ప్రకృతి ఈ సృష్టి కార్యాన్ని సాగిస్తూ ఉంది.

పరమేశ్వరుడు అంతటా వ్యాపించిన చైతన్య స్వరూపము **(సర్వతః దృశిమాత్ర స్వరూపః).** వికార రహితమైన ఆత్మ స్వరూపము **(అవిక్రియాత్మ స్వరూపః).** అట్టి పరమేశ్వరుని అధ్యక్షతన **(అధ్యక్షేణ)** సృష్టి సాగుతూ ఉంది.

ప్రకృతి సృష్టిస్తుంది. పరమాత్మ అధ్యక్షత వహిస్తాడు. అంతేగాని చేయడు. కేవలం ప్రకాశిస్తూ ఉంటాడు. ఏ కార్య భారం లేకుండా, కర్తృత్వము తెలియకుండా, దీపం లాగా పవిత్రంగా చూస్తూ ఉంటాడు. పరమాత్మ కేవలం భాసకత్వ వ్యాపారాన్ని విలక్షణంగా సాగించే వాడు. కార్య సహిత ప్రకృతిని, లేదా మాయను ప్రకాశింప చేయడం తప్ప అన్య వ్యాపారాలు లేనివాడు. సాక్షీమాత్రుడు.

సృష్టిని పరమాత్మ చేయడు. ఆయన క్రియాశూన్యుడు. పూర్ణ పురుషుడు. ప్రకృతి సృష్టిని చేస్తూ ఉంది. ఇలా సృష్టి కార్యాన్ని నిర్వహించే ప్రకృతి జడమా? చైతన్యమా?

ప్రకృతి జడము. ప్రకాశము లేనిది. పరమాత్మ ప్రకాశంతో ప్రవర్తించేది. మరి, జ్ఞాన రహితమైన జడ ప్రకృతి వివిధ ప్రత్యయ గమ్యమైన విశ్వాన్ని ఎలా సృష్టిస్తుంది?

పోనీ ప్రకృతి జడం కాదు చైతన్యమే, అందుచేత సృష్టి కార్యాన్ని సాగిస్తూ ఉంది అంటారా? అలా అనుకున్నా, ప్రకృతి చైతన్య మైతే మరి పరమాత్మ ఎవరు? జడమా? పరమాత్మ స్వప్రకాశ స్వరూపుడు అయివుండువ, తాను చైతన్యమే గాని జడం కాదు.

మరి ప్రకృతి పరమాత్మలు ఇరువురూ చైతన్య స్వరూపులే అయితే, చైతన్యము అనేది ఏకమా? అనేకమా? రెండు చైతన్యాలు ఉన్నాయా? లేవు. మరి చైతన్యము ఒక్కటే అయితే, ప్రకృతి పరమాత్మలలో ఎవరు చైతన్యము? ఒకవేళ ఇరువురూ చైతన్యాలే అని చెబితే, ఎవరూ చైతన్యం కానట్లే కదా? నశించేది చైతన్యము ఎలా అవుతుంది? చైతన్యము అనంతం కదా! రెండు అనంతాలు ఉంటాయా? రెండు అనంతాలు ఉండే అవకాశం లేదు కనుక, రెండూ పరిమితాలై ఉండాలి. పరిమితాలు ఎప్పుడైనా, ఎక్కడైనా నశించేవే గాని, అనంతాలు కాలేవు.

కనుక, జ్ఞాన శూన్యమైన జడ ప్రకృతి సృష్టి కార్యాన్ని నిర్వర్తించ లేదు. అంతే కాదు. సృష్టిలో ***ఇదం ఉత్పన్నం - ఇదం నష్టం*** అనే ఉత్పత్తి నాశాలు, ప్రవృత్తి నివృత్తులు, ఇష్టానిష్ట సుఖదుఃఖాదులకు సంబంధించిన జ్ఞానము తెలుస్తూ ఉండేటప్పుడు, అలాంటి జ్ఞానపూరితమైన సృష్టిని జడ ప్రకృతి చేయగలదా? చేయలేదు. కనుక, నియమించ లేదు. అయితే, జ్ఞానరూపుడైన పరమాత్మే ఈ సృష్టిని చేసి ఉండాలి. ఇందులో ఇక సంశయ మెందుకు? ఆయనే స్వయంగా ఒప్పుకున్నాడు కదా! నేనే సృష్టిస్తున్నాను అని తెగేసి మరీ చెప్పు కున్నాడు కదా! *(9 - 8).*

ఆ మాట మీదే ఆయన నిలబడి ఉంటే, చేసిన ప్రతిజ్ఞకు తాను కట్టుబడి ఉంటే, మనలో ఈ మీమాంస తలెత్తేదే కాదు. నేను సృష్టిస్తున్నాను అని చెప్పిన నోటి తోనే నేను సృష్టి చేయడం లేదు, సృష్టి విషయంలో నాకు ఆసక్తి లేదు, నేను కేవలం తటస్థంగా ఉన్నాను అని ఔదాసీన్యాన్ని ప్రదర్శించడం వల్లనే విషయం తారుమారైంది. గొంతులో పచ్చి వెలగకాయ పడింది.

పరమేశ్వరుడు చైతన్యరూపుడు కనుక ఏదీ చేయడు. చైతన్యం లేకుండా ప్రకృతి ఏదీ చేయలేదు. పరమాత్మ చలించడు. ప్రకృతి చలించ లేదు. కాని, తనకు తానుగా చలించ లేని ప్రకృతి, సూదంటు రాయి సన్నిధిలో, కదల లేని ఇనుప సూది కదిలినట్లు కదుల్తూ ఉంది. ఆ కదలికే సృష్టి కార్యాన్ని నిర్వహించి, సృష్టికి కారణ మవుతూ ఉంది. ఈ విధంగా పరమేశ్వరుని అధ్యక్షతన ప్రకృతి స్థావర జంగమాత్మక మైన ఈ జగత్తును సృష్టించి, స్థితి స్థాపనం చేసి, లయింప చేస్తూ ఉంది.

మరి, ఈ విధంగా ప్రకృతి, లేదా మాయ సృష్టి కార్యాన్ని నిర్వహించే టప్పుడు, నేను సృష్టిస్తూ ఉన్నాను ***(విసృజామి)*** అని పరమేశ్వరుడు ఎలా చెబుతాడు? ఇదే ఇక్కడ వైరుధ్యం ***(విరుద్ధం ఉచ్యతే).***

సృష్టి ప్రకృతి కార్యం అని అర్థం చేసుకున్నాం కదా! ప్రకృతి అంటే మాయ. మాయా కార్యమైన సృష్టి మాయ కన్నా అన్యం కాదు. మరి, జడరూపమై, త్రిగుణాత్మక మైన మాయకు స్వతంత్ర మనుగడ ఉందా? లేదు. మాయ యొక్క ఉనికే బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉంది ***బ్రహ్మాశ్రయా సత్త్వరజస్తమో గుణాత్మికా మాయా అస్తి.*** సృష్టి మాయా కార్యము. మాయ బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉంది. మాయే కాదు, బ్రహ్మము అద్వయ సత్తా స్వరూపము కనుక, ఏదీ బ్రహ్మమునకు దూరం కాదు. ఇక మాయ ఎలా దూర మవుతుంది? మాయ బ్రహ్మమునకు దూరం కానపుడు, మాయను కారణంగా కలిగిన సృష్టి కార్యము తాను కూడా మాయకు దూరం కాలేదు కనుక, కారణమైన మాయ ఎప్పుడైతే పరమేశ్వరుని అధీనంలో ఉందో,





కార్యరూపమైన జగత్తు కూడా పరమేశ్వరునికి దూరం కాలేదు. ఈ కారణంగా, నేనే సృష్టి చేశాను అంటున్నాడు పరమేశ్వరుడు.

మాయ పరమేశ్వరునికి ఉపాధి కావడం చేత, మాయోపాధి స్థాయి నుండి 'నేను సృష్టికి కర్తను' అని పరమేశ్వరుడు చెబుతున్నాడు. అదే సమయంలో బ్రహ్మము స్థాయి నుండి, అంటే కేవలం శుద్ధ చైతన్య స్థాయి నుండి తన ఉదాసీనతను ప్రకటిస్తూ **అహం అకర్తా** - 'నేను సృష్టికి కర్తను కాను' అంటూ కర్మ యందు అకర్మను దర్శింప చేస్తున్నాడు *(5 - 18).*

**భాస్య భాసక సంబంధము**

మాయ అవిద్యా రూపము. తిమిర స్వరూపము. ప్రకాశము లేనిది. అంటే, జ్ఞాన రహిత మైనది అని అర్థము. చీకటిలో ఉన్న వస్తువు దీప సన్నిధిలో ప్రకాశించినట్లు, పరమాత్మ సన్నిధిలో సృష్టి, సృష్టి కారణమైన మాయ ప్రకాశిస్తున్నాయి. పరమాత్మలో ప్రకాశకత్వమే గాని ప్రవర్తకత్వము లేదు. కనుక, సృష్టిలో జరిగే కార్యాలకు పరమేశ్వరుడు విలక్షణుడు. నిర్లేపంగా ఉండేవాడు.

సూర్యుడు ప్రకాశిస్తూ ఉండటం వల్ల సర్వ ప్రాణులకు ప్రవృత్తి నివృత్తులు సిద్ధిస్తున్నాయి. అలాగే పరమేశ్వరుడు అధ్యక్షుడుగా ఉండటం చేత, ఆయన సన్నిధి బలం చేత భూతాలకు సృష్టి లయాదులు జరుగుతూ ఉన్నాయి.

సూర్యుని ప్రకాశంలో సమస్త కార్యాలు సాగుతూ ఉండినా, తన ప్రకాశంలో జరిగే ఉచితానుచిత కార్యాలతో సూర్యునికి ఎలా సంబంధం లేదో, అలాగే పరమేశ్వరుని సన్నిధిలో, ఆయన అధ్యక్షతలో సాగి పోయే ప్రకృతి కార్యాలలో కేవలం దృశిమాత్ర స్వరూపుడు (చైతన్య రూపుడు) అయిన భగవంతుడు సూర్యుని లాగా భాసకత్వ వ్యాపారమును మాత్రమే సాగిస్తూ, తటస్థంగా శోభిస్తూ ఉన్నాడు కనుక, ఆయన ఉదాసీనుడు. ఇక, **విసృజామి** (సృష్టిస్తున్నాను), **ఉదాసీనవ దాసీనం** (ఉదాసీనంగా ఉన్నాను) అనే ఈ రెండు విషయాలలో వైరుధ్యం ఎక్కడుంది? అందుచేతనే **మయా, అధ్యక్షేణ** అనే రెండు పదాలకు తృతీయాలు వాడటం జరిగింది.

**మయా -** నా చేత, **అధ్యక్షేణ -** అధ్యక్షుడ నైన నా చేత **(మయాऽ ధ్యక్షేణ; మయా, అధ్యక్షేణ)** అని రెండు తృతీయాలను ప్రయోగించాడు. మాయను అధీనంలో ఉంచుకొని, మాయోపాధిని కలిగి ఉన్నందున పరమాత్మ తన చేతనే సృష్టి జరిగిందని బోధించాడు **(విసృజామి).** మరొక వైపు, అవిక్రియాత్మ, దృశిమాత్ర స్వరూపమైన తన అధ్యక్షతన మాయ సృష్టిస్తూ ఉంది అనే భావంతో, క్రియాశూన్యమై, కేవలం ప్రకాశ స్వరూపంగా ఉన్న తనను ఉదాసీనునిగా ***(ఉదాసీన వత్ ఆసీనం)*** అభివర్ణించుకుంటూ జ్ఞానమయంగా శోభిస్తున్నాడు. ప్రకృతిలో ప్రవృత్తి అంతా జ్ఞాన ప్రధానమే! జ్ఞాన మూలకమే! జ్ఞాన పర్యవసానమే కదా!

**జ్ఞాన పర్యవసాయి**

సృష్టిలో ఏ కార్యము సాగినా, అది అలా సాగడానికి ముందు దానికి సంబంధించిన జ్ఞానం ఉంది. జ్ఞానము ననుసరించే కదా కర్మ సాగుతుంది! కనుక కర్మకు ముందే కర్మకు సంబంధించిన జ్ఞానం ఉంటుంది. జ్ఞానమునకు విషయం కావడం చేతనే సర్వ ప్రవృత్తులు సాధ్య మవుతున్నాయి. ఈ విషయాన్ని శ్రీశంకరభాష్యం, **సర్వావస్థాసు దృశి కర్మత్వాపత్తి నిమిత్తా హి జగతః సర్వాప్రవృత్తిః** అని అందంగా, అద్భుతంగా తన దైన శైలిలో వ్యాఖ్యానించింది.

అంటే, అన్ని అవస్థల లోను, అన్ని స్థాయిల లోను, అన్ని విషయాల లోను, సమస్త ప్రవృత్తులకు, దృక్కు కర్మగా అవడమే నిమిత్తంగా కలది, **దృశి కర్మత్వాపత్తి నిమిత్తా.** 'దృక్కు కర్మగా అవడమే నిమిత్తంగా కలది'

అంటే, జ్ఞానానికి విషయ మగుట అనే దానిని పొందుటను నిమిత్తంగా కలది అని భావము.

దీనినే కాస్త సులభంగా చెప్పుకుందాం. జ్ఞానరూపు డైన పరమాత్మ సన్నిధి బలం చేతనే జడమైన ప్రకృతి సృష్టి కార్యాన్ని నిర్వర్తిస్తూ ఉంది. మరి, మాయా కార్యమైన సృష్టిలో జరిగే కార్యాలన్నీ జ్ఞానమూలకాలే కదా! అదే అసలు విషయం.

నేను దీనిని తింటాను *(అహ మిదం భోక్ష్యే)*. దీనిని చూస్తున్నాను *(పశ్యామి ఇదమ్)*. ఇది వింటున్నాను *(శృణోమి ఇదమ్)*. ఈ సుఖాన్ని అనుభవిస్తున్నాను *(సుఖమ్ అనుభవామి)*. ఈ దుఃఖాన్ని అనుభవిస్తున్నాను *(దుఃఖమ్ అనుభవామి)*. దాని కోసం ఇది చేస్తాను *(తదర్థం ఇదం కరిష్యామి)*. దీని కోసం ఇది చేస్తాను *(ఏత దర్థం ఇదం కరిష్యే)*. ఇది తెలుసుకుంటాను *(ఇదం జ్ఞాస్యామి)*. ఈ వాక్యాలన్నీ ఏమిటి? జ్ఞానరూపాలు కావా? జ్ఞాననిష్ఠలు కావా? జ్ఞానము నందే ఉనికి గలవి కావా? జ్ఞానము నందే లయించేవి కావా? అంతా అవగతియే. 'అవగతి' అంటే జ్ఞానము. పైన చూచిన వాక్యాలన్నీ జగత్తులో ప్రవృత్తికి సంబంధించినవి. అన్నీ జ్ఞాన మూలకం గానే ఉన్నాయి. జ్ఞాన పర్యవసానం గానే ఉన్నాయి *(ఇత్యాద్యా అవగతి నిష్ఠా, అవగత్యవసానైవ)*.

జ్ఞానమునకు విషయం అగుటను పొందడమే నిమిత్తముగా గలది 'దృశికర్మత్వాపత్తి నిమిత్తము' అని గ్రహించాము. 'దృక్' అంటే వీక్షించుట, తెలియుట అని అర్థము. ప్రపంచం లోని విషయాలు దృక్‌కు కర్మలు అయినప్పుడే ప్రపంచ వ్యవహారం నడుస్తుంది. దృక్‌కు కర్మలు కావడము అంటే తెలియడం అనే క్రియకు విషయం కావడము. కాబట్టి దృక్ శక్తి, లేదా దృక్చైతన్యమే జగద్వ్యాపారా లన్నిటినీ నడిపిస్తూ ఉంది. ఈ దృక్చైతన్యమే బుద్ధిని ప్రభావితం చేసి, జ్ఞాన మూలకమై, కర్మాచరణకు కారణ మౌతూ ఉంది. అదే లేకపోతే ద్రష్ట ఉండడు. దృశ్యం మిగలదు.

*చిచ్ఛాయావేశతః బుద్ధౌ భానం* - ఈ చిచ్ఛక్తి, లేదా దృక్ శక్తి బుద్ధిని ఆవేశించడం చేతనే బుద్ధి చేతనమై ఆలోచించ గలుగుతూ ఉంది అని దృగ్దృశ్య వివేకము. బుద్ధి లోని భావాలే కర్మబీజా లవుతాయి. అంటే, సర్వ జగద్వ్యాపారాలకు బుద్ధి లోని జ్ఞానము కారణ మైతే, అట్టి బుద్ధికి చేతనత్వం దృక్చైతన్యం వల్ల కలుగుతూ ఉంది. బుద్ధిపై ఆధారపడి సమస్త కర్మలు నడుస్తున్నాయి. బుద్ధికి దృక్చైతన్యము వల్ల చేతనత్వము కలుగుతూ ఉంది. కనుక, సమస్తము లైన ప్రవృత్తులకు జ్ఞానమే మూలమై ఉంది. అదే పరమాత్మ చైతన్యం కనుక, ప్రకృతి సృష్టి కార్యాన్ని నిర్వహించినా, దానికి సత్తా స్ఫురణలు జ్ఞాన స్వరూపుడైన పరమాత్మ నుండే అందుతున్నాయి. ఆయన వెలుగు లోనే సర్వమూ వెలుగుతూ ఉంది.

*తమేవ భాన్తం అనుభాతి సర్వం ।*
*తస్య భాసా సర్వ మిదం విభాతి ॥*

'అది వెలుగుతూ ఉంది. సమస్తము దాని కారణంగా భాసిస్తూ ఉంది. ఈ సమస్తమూ దాని వెలుగు లోనే వెలుగుతూ ఉంది' అని కఠోపనిషత్తు. కనుక ప్రకృతి విషయంలో సూర్యుని లాగా, సత్తాస్ఫూర్తుల ప్రదానం వల్ల పరమేశ్వరునికి కర్తృత్వమును ఆపాదించినా, వాస్తవానికి ఆయన ఉదాసీనత్వానికి ఏ మాత్రము భంగం వాటిల్లడం లేదు. ఈ విషయాన్ని ప్రామాణికంగా ధృవ పరచేందుకు శ్రీ శంకరాచార్య స్వామి తమ భాష్యంలో శ్వేతాశ్వతర ఉపనిషత్తు లోని మంత్రాన్ని ఉటంకించారు. పరమాత్మ అధ్యక్షత్వాన్ని ఈ మంత్రం అద్భుతంగా ఆవిష్కరిస్తుంది.

*ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా ।*
*కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ॥*





పరమేశ్వరుడు ఏకము. ప్రకాశైక రూపము **(ఏకో దేవః)**. అవంతుడైన తనలో భేదానికి, ద్వైతానికి అవకాశం లేనందున ఆయన ఏకము. మాయ లేదా ప్రకృతి ఉండినా, పరమాత్మను ఆశ్రయించుకొని ఉన్నదే గాని స్వతంత్రంగా లేదు కనుక, జడమైన మాయకు ఆశ్రయమైన తనలో జడత్వానికి అవకాశం లేదని చెప్పడానికి **దేవః** అనడం జరిగింది. **దీవ్యతీతి దేవః - దివు క్రీడాయామ్.** ప్రకాశించే వాడే గాని ప్రవర్తించే వాడు కావందున ఆయన దేవుడు. అన్యంగా రెండవది లేనందున అద్వితీయుడు **(ఏకో దేవః)**.

అద్వితీయుడైన పరమాత్మ ఎక్కడున్నాడు? అద్వితీయుడు ఎక్కడ ఉంటాడు? ఎక్కడా ఉండలేడు. అద్వయుడు కనుక అంతటా ఉంటాడు. అందరిలో ఉంటాడు **(సర్వభూతేషు)**. మరి, అందరిలో ఉంటే ఎందుకని కనిపించడు? ఎందుకని తెలిసి రాడు? అందరిలో ఉన్నాడు. కాని విగూఢంగా ఉన్నాడు. గుహ్యంగా ఉన్నాడు. రాజగుహ్యంగా ఉన్నాడు. కేవలం జ్ఞానరూపంలో ఉన్నాడు కనుక, జ్ఞానం కల వారికి ప్రత్యక్షంగా ఉన్నాడు. అలాగని జ్ఞానం లోపించిన వారికి లేనివాడు కాడు. ఉన్నవాడే. కాని విగూఢంగా ఉన్నవాడు *(సర్వ భూతేషు గూఢః)*.

సమస్త భూతముల యందు ఉన్నా, బుద్ధి లోనే ఉన్నట్లు తెలుస్తాడు. అద్వయుడైన పరమాత్మ ఎక్కడ లేకుండా ఉంటాడు? ప్రకృతి కార్యమైన జగత్తులో సర్వత్ర వ్యాపించి ఉన్నా, సర్వత్ర దర్శనీయం కాడు. బుద్ధి యందే తెలుస్తాడు.

*సదా సర్వగతోఽ ప్యాత్మా న సర్వత్ర అవభాసతే,*
*బుద్ధౌ ఏవావ భాసతే స్వచ్ఛేషు ప్రతిబింబవత్ ॥*

పరమాత్మ సర్వత్ర వ్యాపించి ఉన్నా, అన్ని చోట్ల వ్యక్తం కావడం లేదు. స్వచ్ఛమైన అద్దం లాంటి వస్తువు నందే ప్రతిబింబము గోచరించునట్లు, శుద్ధ బుద్ధి యందు మాత్రమే వ్యక్త మౌతున్నాడు అని ఆదిశంకరుల ఆత్మబోధ.

కనుక, బుద్ధ్యాదుల యందే పరమాత్మ ప్రతిఫలిస్తూ ఉండటం వల్ల, బుద్ధ్యాదులు పరిచ్ఛిన్నం కావడం చేత, ఆ పరిచ్ఛిన్నత్వ దోషం పరమాత్మకు లేదని చెప్పడానికే **సర్వవ్యాపీ** అనడం జరిగింది.

పరమేశ్వరుడు సర్వవ్యాపి. సర్వ కారణమైన సర్వేశ్వరుడు సర్వత్ర ఉండక తప్పదు కనుక ఆయన సర్వవ్యాపి **(కారణత్వేన వ్యాప్తత్వాత్ సర్వత్ర)**. సృష్టికి అభిన్న నిమిత్త ఉపాదాన కారణం కావడం చేత ఆయన సర్వవ్యాపి.

మరి ఆకాశము కూడా సర్వత్ర ఉంది కదా అనే అతివ్యాప్తి దోషాన్ని నివారించడం కోసం **సర్వ భూతాంతరాత్మా** అనడం జరిగింది. ఆకాశం లాగా జడం కాకుండా సర్వ భూతాంతరాత్మగా పరమాత్మ చైతన్య రూపుడు. అలాగే కర్మల విషయంలో జీవుల లాగా కర్మ పరాధీనత్వము లేదు అనడానికి **కర్మాధ్యక్షః** - కర్మాధ్యక్షునిగా, సృష్టి కార్యాధ్యక్షునిగా పేర్కొనడం జరిగింది.

కర్మాధ్యక్షు డైన తానే కర్మసాక్షిగా ఉన్నాడు. భావ సాక్షిగా ఉన్నాడు. సత్తాస్ఫూర్తి ప్రదాత కనుక భూతము లన్నీ తన లోనే ఉన్నాయి **(మత్‌స్థాని సర్వభూతాని)**. ఎవరిలో సర్వభూతాలు ఉన్నవో, సర్వభూతాలలో ఎవరు స్థిరంగా భాసిస్తున్నారో ఆయనే సర్వభూతాధి వాసుడు **(సర్వభూతాధి వాసః)**.

చైతన్య స్వరూపుడు **(దృశిమాత్ర స్వరూపః)** కావడం చేత పరమాత్మ దర్శన కర్త **(సాక్షీ)**. జ్ఞానరూపుడై నందున చేతనము **(చేతా)**.

అలాంటి వాని కన్నా అన్యు లెలా ఉంటారు? తానే విజాతీయ భేద రహితంగా ఉంటాడు **(కేవలః)**.

సజాతీయ, స్వగత భేదాలు కూడా లేనివాడు కావడం చేత పరమాత్మ నిర్గుణుడు ***(నిర్గుణః).*** చివరగా సర్వ విశేష శూన్యుడుగా అభివర్ణించ వచ్చు. అదే చ కారార్థము.

**వ్యష్టి చైతన్యమే సమిష్టి చైతన్యము**

స్థావర జంగమాత్మక మగు ఈ సృష్టి సర్వాధ్యక్షుడు, చైతన్య రూపుడు అయిన అద్వయ పరబ్రహ్మము యొక్క అధ్యక్షతన విపరిణామం చెందుతూ ఉంది ***(తతః ఏకస్య దేవస్య సర్వాధ్యక్ష భూత చైతన్య మాత్రస్య).***

**సాక్షీభూత** చైతన్య రూపుడైన పరమాత్మ అధ్యక్షతన సమిష్టి సృష్టి కార్యము జరిగినట్లు, జగద్వ్యాపారములు జరుగుతువున్నట్లు, వ్యష్టిలో ఆత్మ చైతన్యము యొక్క అధ్యక్షత లోనే దేహేంద్రియ మనోబుద్ధుల లోని సమస్త కార్యాలు జరిగి పోతున్నాయి. ***అస్య అధ్యక్షః పరమే వ్యోమన్ -*** సృష్టికి అధ్యక్షతను వహించిన పరబ్రహ్మ చైతన్యమే వ్యష్టి హృదయంలో ఆత్మ చైతన్యంగా అధ్యక్ష స్థానంలో ఉంది.

ఆత్మ చేసేది కాదు. చేయించేది కాదు. ఆత్మ సన్నిధిలో దేహేంద్రియ మనోబుద్ధుల లోని సమస్త కార్యాలు సాగి పోతున్నాయి. ఇష్టానిష్ట సుఖదుఃఖాది జ్ఞానము సిద్ధిస్తూ ఉంది. చేసేది మనస్సు. చూచేది ఆత్మ. ఆత్మకు కర్తృత్వము లేదు; కారయితృత్వము లేదు. భోక్తృత్వము లేదు; భోజయితృత్వము లేదు. దాతృత్వము లేదు; దాపయితృత్వము లేదు.

సర్వ కారణమై ఉండి కూడా కార్యానికి అంటకుండా ఉదాసీనంగా ఉండటము పరమాత్మ వైభవ మైతే, సర్వ కార్యాలకు ఆధారమై ఉండి కూడా, దేనికీ అంటకుండా అకర్తగా శోభించడము ఆత్మ వైభవము.

మనిషి తింటూ ఉంటాడు. తిరుగుతూ ఉంటాడు. తినడం, తిరగడం దేహ ధర్మాలు. మనిషి చూస్తూ ఉంటాడు. వింటూ ఉంటాడు. చూడటము, వినడము ఇంద్రియ ధర్మాలు. మనిషి శ్వాసిస్తూ ఉంటాడు. శ్వాసించడం ప్రాణధర్మము. మనిషి ఆలోచిస్తూ ఉంటాడు. ఆలోచించడము మనోధర్మము.

దేహ ధర్మమైన గమనాన్ని ఆత్మ యందు ఆరోపించి నేను నడుస్తున్నాను అంటాడు. ఇంద్రియ ధర్మమైన వీక్షణాన్ని ఆత్మ యందు ఆరోపించి నేను చూస్తున్నాను అంటాడు. శ్వాసించడము అనే ప్రాణ ధర్మాన్ని ఆత్మ యందు ఆరోపించి నేను శ్వాసిస్తున్నాను అంటాడు. చింతించడ మనే మనోధర్మాన్ని ఆత్మ యందు ఆరోపించి నేను ఆలోచిస్తున్నాను అంటాడు.

ఆత్మ దేహం కాదు. కాని, ఆత్మ సన్నిధి బలం చేత దేహం నడుస్తుంది. ఆత్మ సన్నిధి ప్రాప్తించ నపుడు దేహం శవ మవుతుంది. ప్రాణేంద్రియ మనస్సులు కూడా అంతే. ఈ సత్యం అర్థమైన జ్ఞాని, ఉపాధి ద్వారా చూడటం, వినడం, తాకడం, వాసన చూడటం, తినడం, తిరగడం, నిద్రించడం, శ్వాసించడం, భాషించడం, విసర్జించడం, గ్రహించడం, కళ్ళు మూయడం - తెరవడం, ఇలా సర్వ కార్యాలు జరిగి పోతున్నా, ఇంద్రియాలు ఇంద్రియ విషయాల యందు వర్తిస్తున్నాయే గాని నేను ఏమీ చేయడం లేదు అని భావిస్తాడు ***(ఇంద్రియాణి ఇంద్రియార్థేషు వర్తన్తే ఇతి ధారయన్, కించిత్ న ఏవ కరోమి ఇతి మన్యేత; 5 - 8).*** అలాగే సమిష్టిలో జరిగే సృష్టి కార్యాన్ని, నా అధ్యక్షతలో ప్రకృతి, లేదా మాయ నడిపిస్తుందే గాని నేను కర్తను కాను అని పరమాత్మ ఉదాసీనంగా ఉంటాడు.

వ్యష్టిలో దేహేంద్రియ మనస్సులలో జరిగే సమస్త కార్యాలను ఆత్మ యందు ఆరోపించినట్లు, సమిష్టిలో ప్రకృతి సాగించే సృష్టి కార్యాన్ని పరమాత్మ యందు ఆరోపించడం జరుగుతూ ఉంది. క్రియా రూప వికారములు మాయకు సంబంధించినవే గాని మహిమకు సంబంధించినవి కావు. ఆత్మ ఎలా అకర్తయో, పరమాత్మ అలా ఉదాసీనుడు. ఆత్మ ఏదో కాదు. ఆత్మే పరమాత్మ. ఈ ఆత్మే బ్రహ్మము ***(అయమాత్మా బ్రహ్మ).***





అవిద్యోపాధితో ఆత్మ కర్తగా తెలుస్తూ ఉండినా, చైతన్య స్థాయిలో అకర్తయే. మాయోపాధితో పరమేశ్వరుడు సృష్టికర్తగా తెలుస్తూ ఉండినా, చైతన్య స్థాయిలో అకర్తయే.

ఆరోపం అంతరిస్తే అంతా స్వరూపమే. ఆత్మ స్వరూపమే. భ్రమలు తొలగితే బ్రహ్మము బట్టబయలు. ఇదంతా ప్రమాణం ద్వారానే ప్రాప్తిస్తుంది. ప్రమాణ వైభవంతో శోభిస్తుంది. అదే శాస్త్ర ప్రమాణ వైభవము.

*చరణము :* **భ్రమలు లేవని నిరూపిస్తా - బ్రహ్మమే ఉందని వినిపిస్తా!**
**ఉన్నది చైతన్యం అనిపిస్తా - ప్రమాణమై నీకు కనిపిస్తా!**
*పల్లవి :* **హైలెస్సా . . . హైలెస్సా - వేదము నేనని తెలుసా!**
**ఎన్నో ఎన్నో చెప్పి ఊరిస్తా - మరుక్షణమే బ్రతుకంతా మారుస్తా !**

అని ప్రమాణ వైభవాన్ని కీర్తించింది చైతన్య గీతిక.

**సృష్టి దేనికి?**

అద్వయుడు అసంగుడు అయిన బ్రహ్మమునకు కర్తృత్వము లేనపుడు, భోక్తృత్వము, భోగ సంపర్కము లేనపుడు, అతని కన్నా వేరొకడు భోక్తగా ప్రత్యేకించి కనిపించ నపుడు ఈ సృష్టి ఎందుకు జరిగినట్లు? ఎవరి కోసం జరిగినట్లు? మాయామయ మైన ప్రపంచంలో **ఇదం ఉత్పన్నం - ఇదం నష్టం** అనేది లేదు కదా! ఇది పుట్టింది - ఇది పోయింది అనే దాని వల్ల ఒరిగిం దేమిటి? తరిగిం దేమిటి? ఎండమావులు ఎవరి దాహాన్ని తీర్చాయి? శుక్తి లోని రజతం ఎవరి దారిద్ర్యాన్ని హరించింది? ఇవన్నీ ప్రశ్నలు. సృష్టి స్వరూపము తెలిస్తే వీటన్నిటికీ ప్రతివచనాలు లభిస్తాయి. ఇంతకీ, ప్రశ్నే కాస్త తికమకగా ఉంది. అది కూడా చెప్పుకుందాం. పరిష్కారాన్ని, ప్రతివచనాన్ని అందుకుందాం.

సృష్టి ఎవరు చేశారు? ఎలా చేశారు? ఎవరు చేయకనే చేశారు? ఎవరు చేసినా చేయని వారయ్యారు? ఎవరు చేయలేక పోయినా చేశారు? చేసి చూడని వారెవరు? చూసి చేయని వారెవరు? - ఈ ప్రశ్నలన్నీ మిమ్మల్ని సమాధానాలతో కొంతవరకు తృప్తిపరచే ఉంటాయని భావిస్తున్నాను. కాకపోతే, ఈ సృష్టి ఎవరు చేసినట్లు? ఎలా చేసినట్లు? ఇత్యాది. విషయాలను ప్రక్కన పెడితే, ఈ సృష్టికి నిమిత్తం ఏమిటి? ***(కిం నిమిత్తా ఇయం సృష్టిః ఇతి)*** అనేదే ప్రధానమైన విషయం.

**స్వభోగార్థమా?**

పరమేశ్వరుని అధ్యక్షతన జరిగిన ఈ సృష్టి దేని కోసం జరిగింది? ఎవరి కోసం జరిగింది? ఉన్నది అద్వయుడైన పరమేశ్వరుడే అంటున్నారు కనుక ***(ఏకం ఏవ అద్వితీయం బ్రహ్మ).*** బహుశ సృష్టి అంటూ జరిగి ఉంటే ఆయన కొరకే జరిగి ఉండాలి. ఆయన భోగార్థమే జరిగి ఉండాలి.

కర్తృత్వమే లేని వాడికి భోక్తృత్వము ఎలా ప్రాప్తిస్తుంది? ఉద్యోగమే లేని వాడికి సంపాదనా ఫలాలు ఎలా అందుతాయి? పైగా, పరమార్థ రూపుడు, ప్రకాశైక స్వరూపుడు, పూర్ణ పురుషుడు, ఆప్తకాముడు అయిన పరమేశ్వరుడికి భోగార్థమే ముంటుంది? సర్వ భోగ స్పర్శ శూన్యుడే కదా ఆప్తకాముడు! కాబట్టి, ఈ సృష్టి పరమేశ్వరుని స్వభోగార్థము ఆవిర్భవించింది అని చెప్పడము నిర్హేతుకము. అనర్థ దాయకము. కనుక, 'స్వభోగార్థమే సృష్టి' అనే వాదము నిరస్తము.

**చేతనాంతర భోగార్థమా?**

చేతనమే భోక్త కాగలదు గాని అచేతనం భోక్త కాలేదు. సృష్టి స్వభోగార్థము కానపుడు, అది పర భోగార్థమై

ఉండాలి. ఆ పరుడెవ్వడో అతడు చేతనుడై ఉండాలి. పరమేశ్వరుని చైతన్యము కన్నా అన్యంగా మరొక చైతన్యము అశాస్త్రీయం కనుక, 'చేతనాంతర భోగార్థం' అనేది అసంభవము.

**అచేతన భోగార్థమా?**

చేతనానికి భోగము సాధ్యం కావడం లేదు కనుక, ఇక మిగిలింది అచేతనమే కాబట్టి, అచేతన భోగార్థమే సృష్టి జరిగిందా? అచేతనానికి భోగ మేముంది? బంధ మెక్కడుంది? ఇంతకీ అచేతనం ఎక్కడుంది? అచేతన మును నిరూపించడం సాధ్య పడుతుందా? ***నేహ నానా౭స్తి కించన*** ప్రమాణంతో అచేతనము అదృశ్య మవుతుంది కనుక 'అచేతన భోగార్థము' అనే ప్రతిపాదన పామరత్వానికి నిదర్శనం.

**లీలార్థమా?**

ఎక్కడ విషయం జటిల మైతే అక్కడ లీలను ప్రవేశ పెట్టడం పరిపాటి అయింది. అంతా లీల! పరమేశ్వరుని లీల! అంటూ ఆకాశాన్ని చూడటం అలవాటుగా మారింది. వాస్తవానికి ఇది లీల కాదు, పెద్దగోల.

***లీలనం లీలా*** - లీల అంటే సంశ్లేషము ***(లీఙ్ శ్లేషణే).*** ఇది సంబంధ సూచిత పదము. ***లయనం లీలా*** - కలయికను సూచించేది లీల. సంశ్లేషము అనగానే అద్వైతము ఆవిరై పోయింది కదా! ఎవరికి ఎవరితో సంశ్లేషము? రెండు ఉంటే కదా సంశ్లేషము!

లీలార్థము, క్రీడార్థము అనే పదాలు పలకడానికి లలితం గానే ఉంటాయి. వినడానికి సొంపు గానే ఉంటాయి. ఇంతకీ ఎవరి లీలార్థం? ఇంకెవరు? ఉన్న దొక్కడే కదా! భగవంతునికి లీలలు, విలాసాలు, విహారాలు, వినోదాలు అవసరమా? సృష్టిలో ఆయన లీలా విలాసాలు సాగించేది ఎవరితో? జీవుల తోనా! అంటే మన తోనా! మరి, ప్రపంచంలో జీవులు దుర్భర దుఃఖాలను అనుభవిస్తున్నారు కదా? అవన్నీ ఆయన లీలా ప్రసాదా లేనా? ఆయన వినోదంలో మనకు ప్రాప్తించేవి విషాదాలేనా? ఏమిటో! పిలకను ఎంతగా లాక్కున్నా, పీక్కున్నా, దోమ ఏనుగును అమాంతం మ్రింగినట్లే ఉంది. కనుక ఈ నాల్గవ పక్షము కూడా నిరర్థకమే. ఇక మిగిలింది ఒక్కటే. అదే మోక్షార్థం.

**మోక్షార్థమా?**

'అపవర్గము' అంటే మోక్షము. అపవర్గార్థము సృష్టి అనుకుందా మంటే, సృష్టి అపవర్గ విరోధి కనుక మోక్షార్థము అని చెప్పడానికి కూడా వీలు లేదు. పైగా మోక్షము నిమిత్తము అనగానే ఎవరి మోక్షము? అనే ప్రశ్న పడుతుంది. మోక్షము బ్రహ్మమునకా? బ్రహ్మము నిత్యముక్తుడు కావడం చేత మోక్షము బ్రహ్మమునకు కాదు. బ్రహ్మము కన్నా అన్యమైన వాడు లేనందున అన్యుని మోక్షార్థము అనేందుకు అసలే వీలు లేదు.

ఇంతవరకు మనం చూచిన దానిని బట్టి రెండు విషయాలు అర్థ మవుతూ ఉన్నాయి. (1) సర్వాధ్యక్షుడు, చైతన్య స్వరూపు డైన పరమాత్మ అద్వయుడు కావడం చేత ఏ భోగాల తోను సంబంధం లేనివాడై ఉన్నాడు. (2) తన కన్నా అన్యంగా మరొక చేతన పదార్థం లేనందున, వేరొక భోక్త ఉండే అవకాశమే లేదు కాబట్టి, ఈ సృష్టికి నిమిత్తం ఏమిటి? అనే ప్రశ్నే అర్థ రహితంగా ఉంది. కనుక, ప్రతివచనం కూడా నిరర్థకమే ***(ఏకస్య దేవస్య పరమార్థతః సర్వభోగా నభి సంబంధినః అన్యస్య చేతనాంతరస్య అభావే భోక్తుః అన్యస్య అభావాత్ కిం నిమిత్తా ఇయం సృష్టిః ఇతి అత్ర ప్రశ్న ప్రతివచనే అనుపపన్నే).***

మాయా కార్యమైన ఈ సృష్టి యొక్క స్వరూపాన్ని గాని, దాని ప్రయోజనాన్ని గాని, నిశ్చయించి చెప్పడానికి వీలు లేదు. మాయ అనిర్వచనీయం కావడమే దీనికి కారణం. ఇదే ఉపనిషత్ హృదయం.





**శ్రుతి ప్రమాణము**

సృష్టి మాయా కార్యము అని నిర్ధారణ చేయడం వల్లను, పరమాత్మ యందు నానాత్వము సంభవించదు అనే కారణం చేతను సృష్టి ఎందుకు? అనే ప్రశ్న గాని, అట్టి ప్రశ్నకు ప్రతివచనం గాని ఉపపన్నం కావు అనే విషయాన్ని నిర్ధారించే ప్రమాణవాక్యాలు ఋగ్వేద సంహిత లోను, తైత్తిరీయ బ్రాహ్మణము నందును విస్పష్టంగా ఉన్నాయి.

**కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః**

పరమాత్మ స్వరూపమును ఇచ్చితంగా తెలుసుకున్న వాడెవడు ***(కో అద్ధా వేద)?*** పరమాత్మ స్వరూపమును గూర్చి స్పష్టంగా చెప్పే వాడెవడు ***(క ఇహ ప్రవోచత్)?*** ఈ సృష్టి ఎక్కడ నుండి వచ్చింది ***(కుత ఆజాతా)?*** ఈ సృష్టి ఎందుకు వచ్చింది ***(కుత అయం విసృష్టిః)?*** అంటూ పరమాత్మ దుర్విజ్ఞేయత్వమును, అనిర్వచనీయ మైన మాయా స్వరూపమును వేదము లోని మంత్ర వర్ణాలు వివరిస్తున్నాయి. 'సృష్టి మాయా కల్పితము కనుక అనిర్వచనీయము, మిగిలిన ఏకైక సత్యం శుద్ధ చైతన్య స్వరూపమే' అనేది శ్రుతి నిర్ణయము.

**అప్రామాణ్యము ప్రాప్తించదా?**

అయితే, 'ఎవరి నుండి ఈ భూతములు ఆవిర్భవించాయో' **(యతో వా ఇమాని భూతాని జాయన్తే)** అనే తైత్తిరీయోపనిషత్తు ప్రవచనము, 'ఎవని నుండి సృష్ట్యాదులు కలిగినవో' **(జన్మాద్యస్య యతః)** అనే బ్రహ్మసూత్ర ప్రబోధము, 'నేనే సమస్త జగత్తునకు పుట్టుక స్థానమును' **(అహం సర్వస్య ప్రభవః)** అనే గీతా ప్రసంగము, ఇవన్నీ ఏమై పోవాలి? పై సిద్ధాంతం వల్ల శ్రుతి సూత్ర స్మృతులకు, అంటే ప్రస్థానత్రయానికి అప్రామాణ్యం ప్రాప్తించి నట్లే కదా? అనేది ఆక్షేపము. వాస్తవానికి ఈ ఆక్షేపము నిరాధారము.

ఇటువంటి సందర్భాల లోనే శాస్త్ర హృదయాన్ని, ముఖ్యంగా ప్రమాణ ప్రాశస్త్యాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలి. బ్రహ్మ జగత్తుకు సృష్టికర్త అని నిర్ధారణ చేయడం శాస్త్ర తాత్పర్యం కాదు. ఉన్నది బ్రహ్మమే కనుక, బ్రహ్మము అద్వయము కనుక, అది నిష్ప్రపంచము అనే విషయాన్ని నిరూపించడమే శాస్త్రం యొక్క పరమార్థము.

అధ్యారోప అపవాద న్యాయ రీత్యా, ముందు బ్రహ్మము నందు జగత్తును అధ్యారోపం చేసి, ఆ తరువాత అపవాద యుక్తి చేత బ్రహ్మము నిష్ప్రపంచము అని నిర్ధారించడమే జగత్సృష్టి ప్రసంగానికి ప్రయోజనము. 'బ్రహ్మనాస్తి' అనే దోష ప్రస్తావనను నిరాకరించడానికే **యతో వా ఇమాని భూతాని జాయన్తే** ఇత్యాది వాక్య ప్రయోగము.

కనుక, ***అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః*** - జ్ఞానం అజ్ఞానం చేత ఆవరించబడి ఉంది. ఈ కారణం చేత జీవులు మోహంలో కూరుకు పోతున్నారు అని ఐదవ అధ్యాయంలో ప్రవచించడం లోనే ఈ జగత్సృష్టి కేవలం మాయా కల్పిత మని సూచించడం జరిగింది. ఈ విషయాన్ని భాష్యంలో ఆచార్యుల వారు కూడా అంగీకరించారు.

**ప్రమాణ ఫలం**

అజ్ఞాన నివారణార్థం వృత్తి వ్యాప్తిని స్వీకరిస్తూనే, ఫలవ్యాప్తిని నిషేధించడం ద్వారా ప్రమాణము ఫలించి, బ్రహ్మాత్మజ్ఞానము సిద్ధిస్తుంది. శబ్దము సాక్షాత్తు బ్రహ్మమును బోధించదు. అజ్ఞానమును నివారించుట యందే

శబ్ద శక్తి ప్రబలంగా ఉంది. నిద్రించే వ్యక్తిని ఓ దేవదత్తా! అని పిలవగానే వాడు మేల్కొనినట్లు, 'తత్త్వమసి' వాక్యము జీవుణ్ణి అజ్ఞాన నిద్ర నుండి మేల్కొలుపుతుంది. అవిద్యను అంతం చేసే శబ్దం వల్ల 'నేనే బ్రహ్మమును' అనే జ్ఞానం కలుగుతుంది ***(అవిద్యా ఘాతి న శబ్దాత్ అహం బ్రహ్మేతి ధీ ర్భవేత్*** - సురేశ్వరాచార్యుల వార్తికము). కనుక మాయా కార్యమైన జగత్తు లోని అధ్యాసను తొలగించడం శాస్త్ర తాత్పర్యం కాదు. ఏది సత్యమో, అట్టి బ్రహ్మమును నిర్ధారణ చేయడమే శాస్త్ర ప్రయోజనము ***(అధ్యాస నివారణార్థం న శాస్త్ర పరనం, వస్తు నిర్ధారణార్థం శాస్త్ర పరనమ్*** - బ్రహ్మసూత్ర భాష్యము). ఈ విధంగా జిజ్ఞాసు వైన ముముక్షువునకు ప్రమాణ ఫలం అందుతుంది.

## మాయ మాయమైంది

బృందావన సీమలో ఒక నాటి వెన్నెల రాత్రి గోపికలు శ్రీకృష్ణుని వెతుకు తున్నారు. ఎంతకీ శ్రీకృష్ణుడు కనిపించ లేదు. అంతలోనే గాలికి వృక్ష శాఖలు సవ్వడి చేశాయి. ఆ వైపు చూస్తే నల్లని నీడల జాడలు కనిపించాయి. కన్నయ్య అక్కడే దాగి ఉన్నాడని భావించి, పట్టుకొనేందుకు పరుగు లెత్తే సమయంలో, ఆకాశంలో మబ్బులు ఉరిమాయి. మెరుపులు మెరిశాయి. ఆ దివ్యమైన కాంతిలో చెట్ల మాటున కన్నయ్య లేడు అనేది స్పష్టమైంది. అంతే కాదు. కన్నయ్య తమ ప్రక్కనే ఉన్నాడని కూడా తెలిసి పోయింది.

ఉన్నచోట చూడాలి గాని, లేనిచోట అన్వేషిస్తే ప్రయోజనం ఏముంటుంది? చీకటిలో, అంటే విషయం అర్థం గాని సమయంలో, కృష్ణుడు లేని చోట ఉన్నట్లు భావించారు గోపికలు. ఉరుముల శబ్దంలో, మెరుపుల వెలుగులో లేనిచోట లేడని తెలియడమే గాక, అతడు ఉన్నచోటేదో స్పష్టంగా తెలిసింది.

మాయా కార్యమైన ప్రపంచంలో పరమాత్మను అన్వేషిస్తున్నా రందరు. ప్రయత్నాలు పెరుగు తున్నాయే గాని ఫలితం సిద్ధించడం లేదు. వేద ప్రమాణం, అంటే ఉపనిషత్ శబ్దంలో జ్ఞాన ప్రకాశం విరజిమ్మ బడగానే, బ్రహ్మము మాయా జగత్తులో ఎలా అలభ్యమో, తమ హృదయం లోనే ఎలా ప్రసిద్ధమో తెలిసి వస్తుంది. ఉన్నచోట చూస్తే సత్యం గోచరిస్తుంది గాని, లేనిచోట దేవులాడితే దేవుడు దొరుకుతాడా? కాంతి లోనే గోపకాంతలు రమాకాంతుని దర్శించారు. జ్ఞానం లోనే మనం సత్యదర్శనం చేయాలి.

*చరణము:* **మాకుల మాటున మాపటి వేళ - నల్లని నీడలు ప్రాకుతూ ఉంటే**
**నల్లనయ్య యని పరుగిడు వేళ - ఆకసమున మెరుపులు ఏల?**

*పల్లవి:* **వెన్నెల నవ్వుల గోపాల - వెన్నలు తినను రావేల!**
**పువ్వుల సొగసు గాలికి తెలుసు - విరిసిన నా మనసు నీకే తెలుసు** ॥ వెన్నెల ॥

అని కన్నయ్యను కాంతల కళ్ళ ముందు ప్రత్యక్షంగా నిలిపింది చైతన్య గీతం.

## సంబోధనా రహస్యము

ఈ శ్లోకంలో అర్జునుని ***కౌన్తేయా!*** అని సంబోధించి ప్రసంగించాడు పరమేశ్వరుడు. 'కౌంతేయా! కుంతీకుమారా! విషయం కాస్త జటిలం. జాగ్రత్తగా అర్థం చేసుకో! నీకే అర్థం కాకపోతే, మరెవరికి అర్థ మవుతుంది? నాయనా! పాండు మామ అధ్యక్షతన మా అత్తమ్మ కుంతి నిన్ను ప్రసవించ లేదా? అలాగే నా అధ్యక్షతన ప్రకృతి ఈ చరాచర ప్రపంచాన్ని ప్రసవిస్తూ ఉంది' అనేదే ఇందులోని సూక్ష్మార్థం.

'ఇక నా విషయం అంటావా! చెప్పే దేముంది? నేను నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వరూపుణ్ణి. అదంతా నా వైభవము ***(యోగమ్ ఐశ్వరమ్).*** ఇది అర్థం గాని మూఢులు నన్ను మరోలా ఊహించు కుంటారు. అదీ చెబుతాను. విను!' అంటూ ప్రవహిస్తూ పోతోంది భగవానుని ప్రవచనామృతం.





**అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।**
**పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥** **11**

**అవజానంతి-మాం-మూఢాః-మానుషీం-తనుం-ఆశ్రితం**
**పరం-భావం-అజానంతః-మమ-భూతమహేశ్వరం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మమ | = | నా యొక్క | మానుషీం | = | మానవ సంబంధమైన |
| పరం | = | ఉత్తమమైన | తనుం | = | దేహమును |
| భావం | = | భావమును | ఆశ్రితం | = | ఆశ్రయించిన |
| భూతమహేశ్వరం | = | భూతముల నియంతను | మాం | = | నన్ను |
| అజానంతః | = | తెలియని | అవజానంతి | = | అవమానిస్తున్నారు |
| మూఢాః | = | మూఢులు | | | |

**అర్జునా! నేను మానవ దేహంలో కనిపిస్తున్నా, వాస్తవానికి సర్వలోక మహేశ్వరుణ్ణి. నా ఉత్కృష్ట స్వరూపాన్ని తెలియని మూఢులు, నన్ను అలక్ష్యం చేస్తూ ఉంటారు.**

### వ్యాఖ్య

తినడానికి నోరుంటే చాలు. తిరగడానికి కాళ్ళుంటే చాలు. కానీ మనిషి దేనిని అర్థం చేసుకోవాలన్నా వివేకం ఉండాలి. అవివేకులు దేనినీ సరిగా అర్థం చేసుకోలేరు. ఎవరినీ సరిగా అర్థం చేసుకోలేరు. అటువంటి వారినే మూఢులు అంటారు. మూఢులు అంటే అవివేకులు అని అర్థం **(మూఢాః అవివేకినః).**

మూఢులు లేదా అవివేకులు సామాన్య మానవుల్నే సరిగా అర్థం చేసుకోలేరు. ఇక అవాఙ్మానస గోచరుడైన పరమేశ్వరుణ్ణి ఎలా అర్థం చేసుకోగలరు? అర్థం కాని చోట మిగిలేవి అనర్థాలే. ఫలితాలు అపార్థాలే.

భగవంతుడు శుద్ధ చైతన్యం అని అర్థం చేసుకున్నాం. మాయాతీత మైన మహిమ గల పరమాత్మ, సర్వభూతాలలో చైతన్య రూపమై శోభిస్తున్నా **(సర్వ జంతూనాం ఆత్మాన మపి).** సర్వ భూతాలకు మహాప్రభువై అలరారుతున్నా **(భూత మహేశ్వరమ్).** పరమోత్కృష్ట మైన ఆయన తత్త్వమును **(పరం భావమ్)** తెలుసుకోలేక ***(అజానన్తః)*** అవివేకులు **(మూఢాః)** ఆ మహాత్ముని అలక్ష్యం చేస్తూ ఉంటారు **(ఈశ్వరం అవజానన్తి).**

## దురవగాహనలు - దుష్ఫలితాలు

మనస్సులో ఉన్న దానినే ఎవరైనా బయట చూస్తారు. మనస్సులో లేని దానిని బాహ్యంలో దర్శించడం అసాధ్య మని మనస్తత్త్వ శాస్త్రం. అందుచేతనే, ఒకొక్క సన్నివేశం ఒకొక్కరికి ఒకొక్క విధంగా అర్థమవుతూ ఉంటుంది. సన్నివేశం ఒక్కటే అయినా, దానిని పలువురు పలు విధాలుగా అర్థం చేసుకోవడానికి కూడా కారణం ఇదే.

సర్వాత్మ స్వరూపంగా సర్వేశ్వరుడు శోభిస్తున్నాడు. అది ఆయన సత్య స్వరూపం. సత్య స్వరూపాన్ని అర్థం చేసుకోవాలి అంటే, సత్యానికి సంబంధించిన అవగాహన అవసరం. అదే వివేకము. **ఇదం నిత్యం - ఇదం అనిత్యం -** ఇది నిత్యము, ఇది అనిత్యము అనే విచక్షణే వివేకము. సత్య స్వరూపుడైన పరమాత్మను అర్థం చేసుకోవాలి అంటే సత్యజ్ఞానం కలిగి ఉండాలి. మిథ్యా జ్ఞానంలో మునిగిన వాళ్ళు సత్యరూపుణ్ణి అర్థం చేసుకో లేరు.

ఆత్మ సత్యము. దేహాదులు మిథ్య. దేహమే సత్యమని భావించే వారు ఆత్మను ఎలా అర్థం చేసుకోగలరు?

ఆత్మ అకర్త, అభోక్త. కర్తృత్వ భోక్తృత్వాదులు అంతఃకరణ ధర్మాలే గాని, ఆత్మధర్మాలు కావు. ఆత్మజ్ఞానము కలవాడు తనను తాను అకర్తగా, అభోక్తగా దర్శించు కోవడమే గాక, కర్మల యందు అకర్మను దర్శిస్తూ ఉంటాడు. ఆత్మజ్ఞానము లేనివాడు దేహేంద్రియ మనోబుద్ధుల సంఘాతమే తాను అని భ్రమిస్తూ ఉంటాడు. అంతే కాదు. కర్తృత్వ భోక్తృత్వాలను ఆత్మ యందు ఆరోపిస్తాడు కూడా. దీనికి కారణము తానెవరో, ఏమిటో స్పష్టంగా తెలియక పోవడమే. తాను కర్త అనుకుంటున్నాడు కనుక ఆత్మను కర్తగా భావిస్తాడు.

తనకు దేహముంది అనుకుంటున్నాడు కనుక భగవంతునికి కూడా దేహముంది అనుకుంటాడు. పరమాత్మ దేహము కూడా తన దేహము లాంటిదే అనుకుంటాడు. దేహం సత్యం అని భావించే వాడు దేహంలో దైవాన్ని దర్శించ గలడా? శరీరమే నిత్యమని సంభావించే వాడు శరీరంలో శివుణ్ణి భావించ గలడా?

మనం దేహాలను చూస్తామే గాని దేహాలలో ఉండే దైవాన్ని చూడలేము *(సర్వభూత మహేశ్వరమ్).* మతాబుల కాంతి లాగా క్షణం వెలిగి ఆరిపోయే దేహాల బాహ్య రూపాలను చూస్తామే గాని, నిత్యమై, అఖండమై, దేహాలలో ప్రకాశించే ఆంతరంగిక పరంజ్యోతి యొక్క దివ్య స్వరూపాన్ని చూడలేము. అందుచేత ఆత్మ వైభవాన్ని అర్థం చేసుకోలేక ఆత్మను అనాదరం చేస్తూ ఉంటాము. రూపదృష్టిలో ఉంటామే గాని స్వరూప దృష్టిని సారించ లేము.

*అహం సర్వేషు భూతేషు భూతాత్మా అవస్థితః సదా ।*
*తం అవజ్ఞాయ మాం మర్త్యః కురుతే అర్చావిడంబనమ్ ॥*

'నేను సర్వభూతాలలో భూతాత్మగా ఉన్నాను. అది తెలియని మానవుడు నన్ను ఒక రూపంగా ఆరాధిస్తూ అలక్ష్యం చేస్తున్నాడు' అని భాగవతము -తృతీయ స్కంధము.

ఏదో కొంత భక్తి పూర్వకమైన అవగాహనతో ఆరాధించే వారినే అలక్ష్యం చేస్తున్నారు అంటూ ఉంటే, అవివేకంలో కూరుకు పోయి దురవగాహనలో చరించే వారు అనాదరం చేస్తున్నారని చెప్పడంలో అతిశయోక్తి ఏముంది? దుర్యోధన, శిశుపాలాదులు ఆ కోవకు చెందిన వారే కదా!

**రూపము - స్వరూపము**

రూప ఔన్నత్యము ఉత్కృష్ట మైనది. అదేమీ చిన్న విషయం కాదు. పరమేశ్వ రారాధనలో రూపానికి ఒక ప్రత్యేక స్థానముంది. ప్రారంభంలో రూపం ఎంతగానో సహకరిస్తుంది.

విదేశాలలో ఉన్న ప్రాణ స్నేహితుడు ఉత్తరం వ్రాస్తే, అది చదివి ఎంతగానో సంతసిస్తాము. అదే వ్యక్తి ఫోన్‌లో సంభాషించి నపుడు ఆనందంతో ఊగి పోతాము. కాని, అతడే బయలుదేరి వచ్చి మన ముందు ప్రత్యక్ష మైతే మాటలు మూగబోయి, మనస్సు పరవశించి తన్మయత్వం చెందుతాము. రూపార్చనకు, స్వరూపానుభూతికి మధ్య అంత తేడా ఉంటుంది. కాని, రూపం లేకుండా స్వరూపాన్ని చేరడం కష్టతర మవుతుంది.

స్వరూపానుభూతిని పొందేందుకు రూపాశ్రయం ఉచితమే గాని, రూపానికే పరిమితమై, స్వరూపాన్ని అలక్ష్యం చేయడం సముచితం కాదు. స్వరూపాన్ని అలక్ష్యం చేయడము అంటే, దేనిని ఆశించి మనం రూపాన్ని ఆశ్రయించామో, దానినే నిర్లక్ష్యం చేస్తున్నామని భావము.

స్వరూపాన్ని అర్థం చేసుకున్న వారు ధన్యు లౌతారు. రూపం ద్వారా స్వరూపాన్ని చేరుతాము అనే భక్తి శ్రద్ధలతో ఆరాధించే వారు క్రమంగా ప్రగతిని సాధిస్తారు.





స్వరూపానికి సంబంధించిన అవగాహనే లేక దేహాత్మ భావంతో, భేద జ్ఞానంతో పరమేశ్వరుని అవలోకించే వారు పరమేశ్వరుని అర్థం చేసుకోక పోగా, అట్టి మూఢులు భగవంతుని అలక్ష్యం చేస్తారు. అవంతరరూపు డైన, భూత మహేశ్వరుడైన వానిని పరిమితుడని భావించి అనాదరంతో చూస్తారు **(మానుషీమ్ తనుమ్ ఆశ్రితమ్ మామ్ అవజానన్తి).** ఇలాంటి మూఢులు చాలా నష్టపోతారు అంటూ, ఈ అవివేకుల్ని వరాకులు **(వరాకాః)** అన్నారు భాష్యంలో ఆచార్యులు. వరాకులు అంటే, జాలి పడటానికి అర్హులు అని అర్థము. పరమేశ్వరుడు అందరిలో ఆత్మరూపంగా ఉన్నవాడే కనుక, నేడు అర్థం గాక పోయినా, భక్తిశ్రద్ధలతో ప్రయత్నిస్తే తప్పక అర్థ మవుతాడు. అట్టి ప్రయత్నాన్ని విస్మరించి, వివేకం లేకుండా జీవించే వరాకులు హంతు లౌతారు, సుగతికి దూర మవుతారు.

*అదెలాగో చెబుతున్నాడు.*

**మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।**
**రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥** **12**

**మోఘాశాః-మోఘకర్మాణః-మోఘజ్ఞానాః-విచేతసః**
**రాక్షసీం-ఆసురీం-చ-ఏవ-ప్రకృతిం-మోహినీం-శ్రితాః**

| | | | |
|---|---|---|---|
| మోఘాశాః | = వ్యర్థములైన ఆశలు కల వారు | రాక్షసీం | = రాక్షస సంబంధమైన |
| మోఘకర్మాణః | = వ్యర్థములైన కర్మలు గల వారు | ఆసురీం చ | = అసుర సంబంధమైన |
| మోఘజ్ఞానాః | = వ్యర్థములైన జ్ఞానము గల వారు | ప్రకృతిం ఏవ | = స్వభావమునే |
| విచేతసః | = అజ్ఞానులు | శ్రితాః | = ఆశ్రయించిన వారు అవుతున్నారు |
| మోహినీం | = మోహ జనితమైన | | |

**అర్జునా! ఈ అవివేకులు వ్యర్థమైన ఆశలతో, వ్యర్థమైన కర్మలతో, వ్యర్థమైన జ్ఞానంతో బుద్ధిహీను లవుతారు. రాక్షస స్వభావంతో, అసుర ప్రకృతితో మోహంలో కూరుకు పోతారు.**

**వ్యాఖ్య**

భగవంతుని మహిమను గాంచలేక, భగవంతుని తిరస్కరించే అవివేకులు శోచనీయులు. నష్టజాతకులు. వారు అలా కావడానికి కారణ మేమిటో, వారి స్వభావ లక్షణా లేమిటో ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు.

**వ్యర్థమైన ఆశలు**

ప్రతి మనిషికి ఆశలు ఉంటాయి. ఆశలు అభివృద్ధికి అవరోధాలు కావు. ప్రగతికి ప్రతిబంధకాలు కావు. ఆశించే శక్తిని పరమేశ్వరుడు మనిషికే ఇచ్చాడు. ఎత్తైన పర్వతానికి ఇవ్వలేదు. లోతైన సముద్రానికి ఇవ్వలేదు. మనిషికే ఇచ్చాడు. అదే ఇచ్ఛాశక్తి.

ఆశలు దారి తప్పి నపుడు మనిషి దగా పడతాడు. ఆశలు సన్మార్గంలో సాగితే ఫలితాలు మహోన్నతంగా ఉంటాయి. ఆశలు విచిత్ర మైనవి. ఆశల్ని తయారు చేసుకోవడం సులభం. వాటిని తీర్చుకోవడం అనుకున్నంత సులభం కాదు. తీరని ఆశలు బ్రతుకును ఉరి తీస్తాయి. బాగా ఆలోచిస్తే, మన జీవితాలలో కూడా తీరిన ఆశల కన్నా తీరనివే ఎక్కువగా అగుపిస్తాయి. కొన్ని ఆశల్ని తీర్చుకోలేక వదిలేస్తాము. కొన్ని తీరవు అని భావించి మనమే వాటిని విడిచి పెట్టేస్తాము.

ఆశల వెనుక రాగద్వేషాలే ప్రధాన పాత్రను పోషిస్తూ ఉంటాయి. ధర్మాధర్మాలను అర్థం చేసుకొని,

సత్యావగాహనతో చరించే వ్యక్తులు పరమార్థాన్ని పొందుతూ ఉంటే, క్షణికమైన ప్రాపంచిక విషయ వాసనల వెంబడి ఆశాజీవులై పరుగు లెత్తే వారు బ్రతుకులను వృథా చేసుకుంటారు. వారి ఆశలు వృథా అవుతాయి. వారి బ్రతుకే అనర్థ మవుతుంది. వారినే వ్యర్థమైన ఆశాజీవులుగా పరమేశ్వరుడు పేర్కొంటున్నాడు *(మోఘాశాః మోఘాః వృథా ఆశాః ఆశిషః యేషాంతే మోఘాశాః).*

మనస్సులో ఏది ఉంటుందో, ఆచరణలో అదే తొంగి చూస్తుంది. అనిత్యమైన ఫలాలను ఆశించే వారు వాటిని పొందటానికి వ్యర్థమైన కర్మలనే ఆచరిస్తారు *(మోఘ కర్మాణః).*

**వ్యర్థమైన కర్మలు**

పరమేశ్వర జ్ఞానము లేని వారి జీవితాలలో సత్యజ్ఞానము ఉండదు. సత్యజ్ఞానము లేని వారు సత్య మార్గంలో పయనించ లేరు. ఆశల పల్లకీలో ఊరేగుతూ ఇహపరాలలో భోగాలు ప్రాప్తించాలని యజ్ఞయాగాది కర్మలలో మునిగి పోతారు. కామ్యకర్మలే ఆశయంగా పెట్టుకొని జీవిస్తారు. పరమేశ్వరుని అలక్ష్యం చేయడమే దీని కంతటికి కారణము. వీరే మోఘ కర్మలు. వ్యర్థమైన కర్మలు గల వారు అని అర్థము *(స్వాత్మభూతస్య అజ్ఞానాత్, మోఘాని ఏవ నిష్ఫలాని కర్మాణి భవన్తి ఇతి మోఘ కర్మాణః).*

ఇతిహాస పురాణాలలో చాలా మంది రాక్షసులు తారస పడతారు. గొప్ప శక్తిమంతులుగా ఉంటారు. యజ్ఞయాగాదులను కఠోర నియమంతో ఆచరిస్తారు. కాని వారి శ్రమలన్నీ వృథా కావడం మనం చూస్తాము.

రావణాసురుడు ఎంత ఘోర తపస్సు చేశాడు! హిరణ్యకశిపుని తపస్సును వర్ణించ నెవరి తరము? కాని, పరమేశ్వరుని తిరస్కరించిన కారణంగా వారి ఆశలు తీరలేదు. వారి కోరికలు ఫలించ లేదు. రావణాసురుని లంకా పట్టణంలో ప్రతి ఇంటిలో వేదఘోషలు వినిపించేవి. కాని, వారి కర్మలు పతన హేతువులే అయ్యాయి.

*అగ్ని హోత్రం చ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే ।*
*నయా సత్యం చ శౌచం చ రాక్షసానాం న విద్యతే ॥*

రాక్షసుల ఇండ్లలో ప్రతిచోట అగ్నిహోత్రాలు కనిపించేవి. వేదనాదాలు వినిపించేవి. కాని, వారిలో దయ, సత్యము, శౌచము మొదలైన దైవగుణాలు నిలిచేవి కావు. పాదరసంలా జారి పోయేవి. అందుకే వారి కర్మలన్నీ వృథా అయ్యాయి. బ్రతుకులే నాశన మయ్యాయి. వ్యర్థమయ్యే కర్మలే గాని ఏనాడు అవి జ్ఞానప్రదంగా ఉండేవి కావు. అందుచేత వారు మోఘజ్ఞానులు.

**వ్యర్థమైన జ్ఞానం**

ఆశల వెనుక, కర్మల వెనుక అవగాహనే ప్రధానంగా ఉంటుంది కనుక, వ్యర్థమైన జ్ఞానం కలవారు వ్యర్థమైన ఆశల మధ్య, వ్యర్థమైన కోరికల మధ్య బ్రతుకును అన్యాయం చేసుకుంటారు. అందుచేత వారి జ్ఞానం వ్యర్థం. అనర్థం. వారే మోఘజ్ఞానులు. వారిది వ్యర్థమైన జ్ఞానం కనుక, వారి జ్ఞానఫలం కూడా నిష్ఫలమే *(జ్ఞాన మపి తేషాం నిష్ఫల మేవస్యాత్).* సత్యజ్ఞానం లేని వారు కనుక విచేతసులు. 'విచేతసులు' అంటే బుద్ధి లేని వారు, వివేకం లేని వారు అని అర్థము *(విచేతసః విగత వివేకాః చ తే భవన్తి ఇత్యభిప్రాయః).*

బ్రహ్మమునకు సంబంధించిన జ్ఞానము లేకుండా మోక్షము ప్రాప్తించదు. మోఘజ్ఞానులు బ్రహ్మ జ్ఞానమును పొందలేరు. అందుచేత ఉత్తమ మైన మానవ జన్మ నెత్తి కూడా వీరు పరమార్థాన్ని పొందలేక నశించి పోతారు. ఇంతకు మించిన వినాశము ఏముంది? దీనినే గొప్ప నష్టంగా కేనోపనిషత్ అభివర్ణించింది *(న చే దిహా అవేదీత్ మహతీ వినష్టిః).*





**దారుణ ఫలితం**

ఇలా బ్రతుకును వ్యర్థం చేసుకున్న వాళ్ళు కామ, క్రోధ దర్ప ప్రధానమైన రాక్షస స్వభావమును పొందుతారు. అసురుల వలె ప్రవర్తిస్తారు. దేహమే ఆత్మ అనే మోహానికి గురై, దుష్ట ప్రవర్తనకు పూనుకుంటారు. ఆ తరువాత వారి ప్రగల్భాలు, ప్రవర్తనలు సమాజాన్ని ఛిద్రం చేసి, రుద్రభూమిగా మార్చేస్తాయి. అవే నేటి సమాజంలో హింసలు. అవే పడగ విప్పి నాట్యం చేస్తూ కాటేస్తున్న ఉగ్రవాద పర్వాలు. ఈ విషయాన్ని ఆనాడే దర్శించి, ప్రస్తుత శ్లోకంపై అందించిన భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి ముందుచూపుగా మనలను హెచ్చరించారు కూడా.

నరికేయ్! పగలగొట్టేయ్! త్రాగేయ్! అందినంత వరకు తినేయ్! ముందు వెనుక చూడకుండా పరుల ధనాన్ని దోచేయ్! **(ఛిన్ధి, భిన్ధి, పిబ, ఖాద, పరస్వమ్ అపహర ఇత్యేవం వదనశీలాః క్రూర కర్మాణః భవన్తి ఇత్యర్థః)** - ఇలా అర్థరహిత మైన ప్రలాపాలు పలుకుతూ ఘోరమైన కర్మలు చేస్తారు. అసుర జన్మలలో ప్రవేశిస్తారు.

*అసుర స్వభావులై బ్రతుకును అన్యాయం చేసుకునే వ్యర్థ జీవుల్ని గూర్చి చెప్పిన భగవంతుడు, పరమాత్మనే అంటిపెట్టుకొని జీవించే దైవ స్వభావం గల వారిని గూర్చి చెబుతున్నాడు.*

**మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః ।**
**భజ న్త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥** 13

*మహాత్మానః-తు-మాం-పార్థ-దైవీం-ప్రకృతిం-ఆశ్రితాః*
*భజంతి-అనన్యమనసః-జ్ఞాత్వా-భూతాదిం-అవ్యయం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | మాం | = | నన్ను |
| మహాత్మానః తు | = | మహాత్ములైతే | అవ్యయం | = | నాశము లేని వానినిగ |
| దైవీం | = | సాత్త్వికమైన | జ్ఞాత్వా | = | తెలిసికొని |
| ప్రకృతిం | = | స్వభావమును | అనన్యమనసః | = | ఏకాగ్రచిత్తులై |
| ఆశ్రితాః | = | ఆశ్రయించిన వారై | భజంతి | = | భజిస్తున్నారు |
| భూతాదిం | = | జగత్తునకు కారణమైన | | | |

**అర్జునా! దైవ స్వభావము గల వారు మహాత్ములు. సర్వ భూతాలకు నేనే ఆదికారణ మని, నశించనని వారికి తెలుసు. కనుకనే, మరో భావం లేకుండా వాళ్ళు నన్నే భక్తి చేస్తారు.**

**వ్యాఖ్య**

ఇతరులను గాయ పరచడం, మనం గాయ పడటం అనేది అందరికీ తెలిసిన సులువైన విద్య. సులభ సాధ్యమైన విద్య. అలాగే అన్యులను దుఃఖ పెట్టడం, మనం దుఃఖ పడటము కూడా.

ఇతరుల్ని సుఖ పెట్టడం, మనం సుఖంగా ఉండటం అనేది కొందరికే తెలిసిన విలువైన విద్య. దుర్లభ మైన విద్య. అలాగే అన్యులను తృప్తి పరచడము, మనం తృప్తిపడి ఉండటము కూడాను.

ఇతరుల సంతోషాన్ని పాడు చేస్తూ, తమ సంతోషాన్ని కూడా పోగొట్టుకొనే వారు అవివేకులు. విచేతస్కులు. భగవ ద్విముఖులు. అసుర స్వభావం గల వారు. మోహంలో కూరుకు పోయిన వారు. రాక్షస ప్రవృత్తి కలవారు. రజోగుణ తమోగుణ ప్రేరితులు. తిమిరంలో తారాడేవారు. ఇహపరాలను పోగొట్టుకున్న వారు. ఇరుసును ఆధారం చేసుకొని బండి చక్రము తిరిగినట్లు, స్వార్థాన్ని కేంద్ర బిందువుగా చేసుకొని సర్వ వ్యాపారాలను

సాగిస్తూ ఉంటారు. ఇలాంటి వారు జీవితాన్నే నష్ట పోతారు. ఈ విషయాన్ని గడచిన రెండు శ్లోకాలలో చూశాం. వీరికి భిన్నమైన మరొక మార్గం వారిని ఈ శ్లోకం నుండి చూడ బోతున్నాం. వారే మహాత్ములు.

**మహాత్** అంటే ఉన్నతమైన, ఉత్కృష్టమైన, పవిత్రమైన అని అర్థము. **ఆత్మా** అంటే హృదయము, అంతఃకరణము అని అర్థము. గొప్ప హృదయం కలవారు, పవిత్రమైన బుద్ధి గల వారు మహాత్ములు. అక్షుద్ర చేతస్కులు. దైవ స్వభావం గల వారు. సత్వగుణ ప్రధానులు. మోక్షమే ప్రధాన ఆశయంగా, లక్ష్యంగా కలిగిన వారు. వివేకవంతులు. తేజంలో చరించే వారు. ఇరుసును ఆధారం చేసుకొని బండి చక్రము తిరిగినట్లు, పరమార్థ తత్వాన్ని కేంద్ర బిందువుగా చేసుకొని సమస్త కార్యాలను పవిత్రంగా నిర్వహించే వారు. దైవీ సంపద గల అట్టి మహాత్ములను గూర్చి ప్రస్తుత శ్లోకం నుండి చెబుతున్నాడు. **మహాత్మానస్తు** అంటూ శ్లోకాన్ని ప్రారంభించాడు.

**తు** శబ్దం అవధారణార్థకం. వైలక్షణ్య ద్యోతకము. మూఢులకు భిన్నంగా, అన్యంగా మహాత్ములు విలక్షణమైన వారు అని నిర్ధారించడానికే **తు** శబ్ద ప్రయోగము.

**మహాత్ములు**

ఎవరి మనస్సు నికృష్ట మైన ఆలోచనలు చేయదో, ఎవరి బుద్ధి మలిన పడదో, ఎవరి చిత్తము ప్రపంచంలో చిందులు వేయదో, ఎవరిలో అహంకారము కాగడా పెట్టి వెతికినా కనిపించదో, వారే మహాత్ములు. బుద్ధి పాడు గాని వారు ***(అక్షుద్ర చిత్తాః).***

బుద్ధిని పాడు చేసే అసుర గుణాలు లేకుండా ఉండటమే గాక, సుందర సుమాలతో పుష్పవనం శోభించినట్లు, దివ్యమైన గుణాలతో వారి అంతఃకరణము గుబాళిస్తూ ఉంటుంది. శమము, దమము, దయ, శ్రద్ధ మొదలైన దైవ లక్షణ సౌరభాలను విరజిమ్ముతూ ఉంటుంది ***(శమ దమ దయా శ్రద్ధాది లక్షణానామ్, దేవానాం ప్రకృతిం ఆశ్రితాః).*** ఇలాంటి దైవ లక్షణాలతో శోభిస్తూ ఉంటారు కనుక, మహాత్ములు భువిపై తిరిగే దేవతలు.

మహాత్ములు నిరంతరము పరమాత్మ సేవ లోనే ఉంటారు. వారు ముముక్షువులు కావడమే దీనికి కారణము. ధర్మార్థ కామాల యందు వారికి ఆసక్తి ఉండదు. పురుషార్థ నిశ్చయం వల్ల వారికి గమ్యము సుస్పష్టంగా ఉంటుంది.

ఇల్లు చిమ్మే వారిని చూచి నపుడు లక్ష్యము విషయంలో స్పష్టత ఎలా ఉండాలో అర్థ మవుతుంది. చీపురు చేత పట్టుకొని ఒక వైపు నుండి చిమ్మడం ప్రారంభిస్తారు. మనం చూస్తూ ఉండగానే కసువును తోసుకుంటూ పశ్చిమంగా పోతూ ఉంటారు. అంతలోనే తూర్పు తిరుగుతారు. ఇదేమిటి? ఏ వైపుకు పోతున్నారు? అని మనం ఆలోచించే లోగా, తూర్పు నుండి మరలి దక్షిణము వైపు సాగుతూ కసువు నంతా తీసుకెళ్ళి ఒక మూలకు చేరుస్తారు.

కసువును ఆ వైపుకు తీసుకెళ్ళాలి అనే ఆలోచన చిమ్మడం ప్రారంభించి నపుడే వారి మనస్సులో ఉంటుంది. తత్ఫలితంగా వారు ఎటు తిరుగుతూ ఉండినా, ఏ వైపుకు చిమ్ముకుంటూ పోయినా, లక్ష్యం బుద్ధిలో నిశ్చయమై ఉంది కనుక, కార్యమంతా దానిని అనుసరించే సాగుతూ ఉంటుంది.

మహాత్ముల హృదయాలలో పురుషార్థ నిశ్చయం దృఢంగా ఉంటుంది కనుక, వారు ఏది ఆలోచించినా, ఏ కర్మను ఆచరించినా అది పరమార్థం వైపే అనన్యంగా సాగుతూ ఉంటుంది. వాళ్ళు పొంద వలసింది, పొంద దగినది పరమేశ్వరునే గాని అన్యం కాదు అనే జ్ఞానం వారి మనస్సులో స్పష్టంగా ఉంటుంది. పరమాత్మకు సంబంధించిన అవగాహన వారిలో స్థిరంగా, పూర్ణంగా ఉండటమే దానికి కారణము.





**ఆది దేవుడు - అనంతుడు**

భగవంతునికి సంబంధించిన జ్ఞానము మహాత్ములలో పూర్ణంగా ఉంటుంది. సర్వ భూతములు ఆవిర్భవించడానికి కారణమైన వాడు పరమేశ్వరుడు అని వారికి తెలుసు. అంతేకాదు. సమస్తానికి ఆది యైన ఆదినారాయణుడు సర్వమూ నశించినా, తాను నశించడు అనే జ్ఞానం కూడా వారికి ఉంది ***(జ్ఞాత్వా భూతాదిమ్ - భూతానాం వియ దాదీనం ప్రాణినాం చ ఆదిం కారణమ్, అవ్యయమ్).***

కార్యము ఉంది అంటే కారణం ఉంటుంది. ప్రపంచంలో ఏది కారణమో, ఏది కార్యమో నిశ్చయించి చెప్పడం చాలా కష్టం. ఒక కార్యానికి కారణ మైనది, మరొక కారణానికి కార్యమై ఉంటుంది. కార్యాలన్నీ క్షయమై నశించేవే కనుక, మనం కారణాలు అని భావించే వన్నీ కూడా కార్యాల లాగే నశించి పోతూ ఉంటాయి. అరటి చెట్టు ఒక్క అరటి గెల మాత్రమే వేస్తుంది. ఆ తరువాత, అరటి గెలకు కారణమైన అరటి చెట్టు కూడా నశించి పోతుంది. భగవంతుడు అలా నశించే కారణం కాదు. ఆది ఉన్న వన్నీ అంతాన్ని పొందుతాయి. పరమేశ్వరుడు ఆది లేనివాడు కనుక అంతం తెలియని వాడు. అందుచేతనే ఆయన అవ్యయ కారణంగా శోభిస్తున్నాడు.

***తదనన్యత్వం ఆరంభణ శబ్దాదిభ్యః*** - కార్యమైన భూతజాలము కారణమైన బ్రహ్మమే కావడం చేత భూతములకు ప్రత్యేకమైన అస్తిత్వం లేదు. అందుచేత బ్రహ్మము అద్వితీయమై అవ్యయ మవుతూ ఉంది.

అరటి గెలకు కారణమైన అరటి చెట్టు, గెల వేసిన తరువాత నశించినట్లు, అనేక ఫలాలను, బీజాలను అందించిన వృక్షములు తదుపరి నశించినట్లు, కుండకు కారణమైన మట్టి, కుండ నశించ గానే నశిస్తుందా? మట్టిపాత్ర లన్నిటికీ మట్టే కారణము. మట్టిపాత్రలు నశిస్తాయి. కార్యము లైన మట్టిపాత్రలు నశించాయని కారణమైన మట్టి నశిస్తుందా? కుండలో ఉన్నదంతా మట్టే. కుండ ఆవిర్భావానికి ముందు మట్టి ఉంది. కుండ పుట్టిన తరువాత కుండలో మట్టే ఉంది. కుండ పగిలిన తరువాత కూడా మట్టి అలాగే ఉంది. కనుక, కారణంగా ఉన్న మట్టే కార్య రూపమైన కుండలో ఉన్నందున, కుండకు ప్రత్యేకమైన అస్తిత్వము లేదు. మట్టిపాత్రలు నశించడం వల్ల మిథ్యా రూపాలైన నామరూపాలు నశించాయే గాని, మట్టి అనే వాస్తవ స్వరూపానికి హాని లేనందున, కార్య నాశము వల్ల కారణం నశించడం లేదు. అలాగే మిథ్యా రూపాలైన భూతముల వినాశము యొక్క ప్రభావము బ్రహ్మము మీద ఉండదు, ఉండలేదు. కనుకనే, బ్రహ్మము అద్వయము. అద్వయము కనుకనే అవ్యయము ***(నవ్యేతి).***

భూతములకు ఆదిగా ఉన్నా అంత మెరుగని లక్షణము **(భూతాదిం)** పరమేశ్వరుని స్వరూపము. ఈ విధమైన స్వరూప లక్షణమును బ్రహ్మము కన్నా అన్యంగా మరొక చోట, మరొక వస్తువు నందు చూడలేము. ఈ సత్యమును గ్రహించిన పవిత్ర హృదయులు **(జ్ఞాత్వా భూతాదిం అవ్యయమ్)** అనన్య చిత్తముతో పరమాత్మనే సేవిస్తూ ఉంటారు.

**ఏకాంత సేవ**

ఆదిదేవుడు, అనంత నారాయణుడు అయిన పరమేశ్వరుని స్వరూపమును అర్థం చేసుకున్న పుణ్యాత్ములు, **అనన్య** మనస్సుతో భగవంతుణ్ణి సేవిస్తారు. **అనన్య** మనస్సు అంటే, ఈశ్వరుని కన్నా అన్యమైన విషయాల యందు ఆసక్తి లేని మనస్సు అని అర్థము. అనన్య మనస్సు కల వారు ఈశ్వరుని విడిచి అన్యమైన ఆశ్రయాలను వెంబడించరు. ఇదే అనన్య చిత్తముతో భక్తులు ఆచరించే ఏకాంత సేవనము.

***అన్యాశ్రయాణాం త్యాగః అనన్యతా*** - పరమేశ్వరుని విడిచి అన్యములను ఆశ్రయించడము అనే ప్రవృత్తిని త్యాగం చేయడము అనన్య భక్తి అని నారద మహర్షి తమ భక్తి సూత్రాలలో ప్రబోధించారు.

'అనన్య' శబ్దానికి మరొక అర్థమును కూడా గ్రహించ వచ్చు. చిత్తమును ఈశ్వరుని యందే అనన్యంగా ఉంచుకోవడమే గాక, ఈశ్వరుని కన్నా అన్యంగా రెండవ వస్తువు లేదు అనే జ్ఞానము కలిగిన చిత్తము అనన్య చిత్తము. అట్టి చిత్తముతో అద్వయ స్వరూపుడైన పరమేశ్వరుని సేవించడం అనన్య భక్తి అనే ఏకాంత సేవనము. ఈ విధమైన అవగాహనలో ఈశ్వరుడు తప్ప అన్య విషయాలు మనస్సుకు రుచించవు. కనుక అనన్య భక్తి కలిగిన మహాత్ముడు అన్య విషయాల యందు తటస్థంగా ఉంటాడు.

***తస్మిన్ అనన్యతా తద్విరోధిషు ఉదాసీనతా*** - పరమేశ్వరుని యందు ఏకాంత భక్తి, పరమేశ్వరుని కన్నా అన్యమైన విషయాల యందు ఉదాసీనతను కలిగి ఉండటమే అన్యాశ్రయ త్యాగము అని కూడా నిర్వచించాడు నారదమహర్షి. అట్టి వారే మహాత్ములు.

మహాత్ముల మనస్సు భగవంతుని యందే పరవశించి ఉంటుంది. అన్ని ప్రదేశాలలో, అన్ని కాలాలలో వారి మనస్సు పరమేశ్వర భావనలో తన్మయమై ఉంటుంది. వారిలో అనన్య భక్తి అప్రయత్నంగా సాగుతూ ఉంటుంది. నదీ ప్రవాహం లాగా వారిలో ప్రేమ ప్రవాహం నిరాటంకంగా సాగుతూ ఉంటుంది.

మహాత్ముల నేత్రాలలో నందగోపాలుడు కాపుర ముంటాడు. ఆ కళ్ళ లోకి మరొకరు ప్రవేశించ లేరు. నిద్ర కూడా చేరలేని చోటుగా ఉంటుంది. ఏకాంత భక్తిలో మరొకరికి స్థానం ఉండదు. భక్తుడు భగవంతుని అనుభూతిని పొందే విలక్షణ మైన స్థితి అది. అదే మహాత్ముల ఏకాంత సేవ.

ఈ విధమైన అనన్య భక్తి అందమైన వస్తువుల లోని అందాన్ని పరమేశ్వరుని సౌందర్యంగా దర్శిస్తుంది. రుచికరమైన వాటి లోని రుచిని భగవంతుని ప్రసాదంగా అనుభవిస్తుంది. జగత్తు అంతా భక్తికి జగదీశ్వర స్వరూపంగా గోచరిస్తుంది.

ఏకాంత భక్తి నిర్మల మైంది. అదే నిష్కామ భక్తి. వ్రత, దాన, తపో యజ్ఞాల కన్నా ఏకాంత భక్తి చేతనే పరమేశ్వరుడు సంతసిస్తాడు అని శ్రీమద్భాగవతము - సప్తమ స్కంధము, సప్తమాధ్యాయం యాభై నాల్గవ శ్లోకంలో ప్రహ్లాద కుమారుడు గురుకులంలో తోటి బాలకులకు బోధిస్తాడు.

***న దానం న తపో నేజ్యా న శౌచం న వ్రతాని చ।***
***ప్రీయతేஉ మలయా భక్త్యా హరి రన్య ద్విడంబనమ్ ॥***

'నాయనా! దానము, తపస్సు, యాగము, ఆచారము, వ్రతములను ఆచరించలేక పోతున్నా మనే బాధ అవసరం లేదు. నిర్మలమైన ఏకాంత భక్తితో పరమేశ్వరుడు సంతసిస్తాడు. ఏకాంత భక్తి లేని అన్య సాధన లన్నీ నటనలే **(విడంబనమ్)** అన్నాడు ప్రహ్లాదుడు.

*మహాత్ములు ఎలాంటి లక్షణాలు కలిగి సేవిస్తూ ఉంటారో, తరువాత శ్లోకంలో కూడా వివరిస్తున్నాడు.*

## సతతం కీర్తయన్తో మాం యతన్త శ్చ దృఢవ్రతాః।
## నమస్యన్త శ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14

***సతతం-కీర్తయంతః-మాం-యతంతః-చ-దృఢవ్రతాః***
***నమస్యంతః-చ-మాం-భక్త్యా-నిత్యయుక్తాః-ఉపాసతే***





| | | |
|---|---|---|
| సతతం | = | ఎల్లప్పుడును |
| మాం | = | నన్ను |
| కీర్తయంతః చ | = | సంకీర్తనము చేయువారు |
| యతంతః | = | ప్రయత్నించువారు |
| దృఢవ్రతాః | = | దృఢవ్రతులు |
| భక్త్యా | = | భక్తి చేత |
| నమస్యంతః చ | = | నమస్క రించెడి వారు |
| నిత్యయుక్తాః | = | నిత్యయోగులు |
| మాం | = | నన్ను |
| ఉపాసతే | = | సేవిస్తున్నారు |

**అర్జునా! ఏకాంత భక్తులు సదా నన్నే కీర్తిస్తూ ఉంటారు. నియమాలను పాటిస్తూ, నా కోసం ప్రయత్నిస్తూ ఉంటారు. భక్తితో నాకు నమస్కరిస్తూ ఉంటారు. నా యందే మనస్సు నిలిపి నన్నే సేవిస్తూ ఉంటారు.**

**వ్యాఖ్య**

### నిత్య కీర్తనము

పరమేశ్వరుని ఆశ్రయించుకొని దైవీ సంపదతో సేవించే వారు భగవంతుని ఎలా ఆరాధిస్తారో రెండు శ్లోకాలలో చెబుతున్నాడు.

పరబ్రహ్మ స్వరూపమైన భగవంతుని నిరంతరము కీర్తిస్తూ మహాత్ములు జీవిస్తారు ***(సతతం సర్వదా భగవన్తం బ్రహ్మ స్వరూపం మాం కీర్తయన్తః)***. ఉపక్రమ, ప్రకరణ విషయాలను దృష్టిలో ఉంచుకొని అర్థం చేసుకుంటే, ప్రస్తుతం కీర్తనము అంటే వేదాంత శ్రవణము అని అర్థము. భక్తుడైన వాడే భగవంతుని కీర్తిస్తాడు. భగవంతునికి సంబంధించిన వాడు కావడం చేత భక్తుడు సర్వదా భక్తుడు గానే ఉంటాడు. ప్రత్యేక వ్యక్తిత్వంతో జీవిస్తూ అప్పుడప్పుడు పరమేశ్వరుని ఆరాధించడం కాకుండా, సదా పరమేశ్వరునితో జీవిస్తూ, భక్తుడుగా నిరంతరము కొనసాగుతూ, అవసరాలను గుర్తించి భక్తుడుగా తన ధర్మమును నిర్వర్తిస్తూ ఉంటాడు. అతడే ఇక్కడ కీర్తనా భక్తుడు.

**అసుప్తేః ఆమృతేః కాలం నయేత్ వేదాన్త చిన్తయాః।**

నిద్ర లేచింది మొదలు మరల నిద్ర వచ్చే వరకు **(అసుప్తేః)**, అలాగే తన జీవిత కాలము ముగిసే వరకు **(అమృతేః)** కేవలం వేదాంత చింతన యందే కాలక్షేపం చెయ్యాలి అనే స్మృతి వాక్యాన్ని మనస్సులో ఉంచుకొని, తదనుగుణంగా జీవించే వాడు కీర్తనా భక్తుడు.

భగవంతుడు ఏమిటో తెలియకుండా భగవంతుణ్ణి ఎలా కీర్తించగలం? ఎలా స్తుతించగలం? భగవంతుడు అర్థమై నపుడే కీర్తించగలం. అర్థం కానపుడు ఎంత కీర్తించినా అది కీర్తన అనిపించుకోదు. అర్థమైతే కీర్తించడ మనేది జ్ఞానమే అవుతుంది. జ్ఞానం ఉంటేనే భక్తి నిలుస్తుంది.

**తస్యాః జ్ఞాన మేవ సాధన మిత్యేకే।**

ఈశ్వర జ్ఞానమే భక్తికి సాధన మని కొందరు ఆచార్యులు అభిప్రాయ పడ్డారు అంటాడు భక్తి సూత్రాలలో నారద మహర్షి.

భక్తి అనేది ప్రేమే గనుక **(సా త్వస్మిన్ పరమ ప్రేమ రూపా)** అవగాహన లేకుండా ప్రేమించడం సాధ్య పడదు. అవగాహన, లేదా జ్ఞానము ఉన్నచోటే ప్రేమ చిగురిస్తుంది. పుష్పిస్తుంది. ఫలిస్తుంది.

పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వశక్తిమంతుడు. సర్వవ్యాపి. సృష్టి కార్యానికి తానే అధిష్ఠానము. ఆయన అధ్యక్షతన సమస్తమూ నడుస్తూ ఉండినా, తాను సర్వమునకు విలక్షణంగా, సాక్షీమాత్రంగా ఉంటాడు. ఇదంతా ఆయన వైభవము. కర్మలన్నీ ఆయన ప్రభావం తోనే జరుగుతూ ఉండినా తాను మాత్రం అకర్త, అభోక్త,

ఇదంతా ఈశ్వర జ్ఞానము. ఈ జ్ఞానము లేనిదే విశ్వాసము ఏర్పడదు. శ్రద్ధ నిలవదు. శ్రద్ధ లేకుండా ఈశ్వర సంబంధము కుదరదు. ఈశ్వర సంబంధము లేకుండా భక్తి ఉండలేదు. అందుచేత కీర్తనము అంటే వేదాంత శ్రవణము అని అర్థము. శ్రవణ సాధనే కీర్తనము. సాధనలను కీర్తించడము అనే ప్రయోగము శాస్త్ర సమ్మతమే. అనన్య భక్తికి సాధనలు ఏమిటో ఆచార్యులు గానం చేశారు అన్నాడు నారదమహర్షి ***(తస్యాః సాధనాని గాయన్తి ఆచార్యాః).*** భగవంతుని కీర్తించడము అంటే భగవంతుని అర్థం చేసుకోవడం. సత్యమునకు సంబంధించిన జ్ఞానమును పొందడము. అదే కీర్తనా వైభవము. పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానము కలిగిన వారు, పరమేశ్వరుని పొందే ప్రయత్నము చేయకుండా ఉండలేరు.

**దృఢ ప్రయత్నము**

వేదాంత శ్రవణ సాధన నాచరిస్తూ, ఇంద్రియాలను నియమించి, శమ, దమ, దయ, అహింసాది ధర్మాలను ఆచరిస్తూ ***(యతన్తః ఇంద్రియ ఉపసంహార శమ దమ దయ అహింసాది లక్షణాదిభిః ధర్మైః ప్రయతన్తః).*** దృఢమైన బ్రహ్మచర్యాది వ్రత పరాయణులై ఉంటారు. చలించని వ్రత నియమంతో ఉంటారని భావము.

కీర్తనా భక్తి వలన ఏర్పడిన జ్ఞానము నిత్య విషయానికి సంబంధించింది కనుక మనస్సును అనిత్యాల వైపు పోనివ్వదు. ప్రారంభంలో అందరూ దృఢతర మైన భక్తి వైరాగ్యాలను కలిగే ఉంటారు. కానీ కాలంలో క్రమేపి ఆ దృఢత్వము ద్రవీభవిస్తూ ఉంటుంది. అలా జరగకుండా ఉంచేదే శ్రవణ సాధన. జ్ఞానం దృఢంగా ఉన్నప్పుడే సాధనలు దృఢంగా సాగుతాయి. ఈశ్వర జ్ఞానము స్థిరంగా ఉండి, సాధనలు దృఢతర మైనపుడు నేను పరమేశ్వరుని కన్నా అన్యంగా ఉన్నాను అనే భావన క్షీణిస్తుంది. అదే నమస్కారము.

**వందన వైశిష్ట్యము**

ఈశ్వరుడు సర్వుడు. సర్వజ్ఞుడు. ఆయన జ్ఞానానికి ఏదీ దూరంగా లేదు, పోలేదు. సమస్తము సర్వదా ఆయన చూపుల్లో సాగుతోంది ***(సర్వస్య సర్వదా జ్ఞానాత్).*** ఆయన పూర్ణుడు. ఆయన శక్తి పూర్ణము. ఆయన జ్ఞానము పూర్ణము. ఆయనిది పూర్ణ వైభవము.

ఆయన కేవలం పూర్ణుడే కాదు. తన నాశ్రయించిన భక్తులను పూర్ణ స్వరూపులుగా మార్చేవాడు. ఆయన ఐశ్వర్యంతో భక్తులను నింపేవాడు. ఆయన పూర్ణుడు కనుకనే భక్తుల్ని పూర్ణులుగా మార్చగలడు ***(న కేవలం పూర్ణ ఏవ, పూరయితా చ సర్వేషాం సంపద్భిః).***

పరమేశ్వరుడు పూర్ణుడు అనేది అర్థమైతే, ఇక నే నెక్కడున్నాను? నాదెక్కడుంది? అంతా పూర్ణం లోనే ఉంది. పూర్ణ పురుషుడైన పరమేశ్వరుని లోనే ఉంది. నాది ఏదీ లేదు ***(నమః).*** ఈ సత్యావగాహనతో హృదయంలో ఆత్మ స్వరూపంగా భాసిస్తున్న పరమేశ్వరునికి వందన మంటూ నిత్యభక్తితో మహాత్ములు సేవిస్తూ ఉంటారు ***(నమస్యన్తః చ మాం హృదయేశమ్ ఆత్మానం, భక్త్యా నిత్య యుక్తాః సన్తః ఉపాసతే సేవన్తే).***

ఇది మహాత్ములు ఆచరించే జ్ఞానసాధన. ఈ వ్యాఖ్యానము సందర్భోచితమే. కాని, కర్మయోగులు కూడా సాధకులే కనుక, ఇది వారికి కూడా అన్వయిస్తుంది అనే కొందరి ఆలోచనలో నాకు వైరుధ్యము కనిపించడం లేదు. కనుక ఈ శ్లోకాన్ని భక్తిపరంగా, ఆ కోణం నుండి కూడా వ్యాఖ్యానిస్తున్నాను.

**సదా గోవింద కీర్తనమ్**

కళ్ళు చూడ లేనివి దేహంలో ఎన్నో ఉన్నాయి. మనస్సు అర్థం చేసుకో లేనివి జీవితంలో ఎన్నో జరిగి పోతున్నాయి. నియతి రూపంలో విశ్వమంతా వ్యాపించిన పరమేశ్వరుడే నా బుద్ధిని ప్రకాశింప చేస్తున్నాడు. నా బ్రతుకును నడిపిస్తున్నాడు.





**తగ్ం హ దేవం ఆత్మ బుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే,**

నా బుద్ధిని ప్రకాశింప చేసే ఆ భగవంతుని మోక్షార్థినై నేను ఆశ్రయిస్తున్నాను అని శృతి వాక్యము. అలా పరమేశ్వరునికి శరణాగతు డైన వాడు భక్తుడు.

సాధన లన్నిటిలో భక్తి సాధన విలువైనది. సులువైనది కూడా. **అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ** అన్నాడు నారద మహర్షి. భక్తి చేయడానికి నామసాధన అద్భుతమైంది. భగవంతునికి భగవన్నామానికి తేడా లేదు. నాలుకపై నామం కదులుతూ ఉంటే హృదయంలో నారాయణుడు దర్శన మిస్తాడు. నామం మన వద్ద ఉంటే నామి మనతో ఉన్నట్లే.

**సా రసనా తే నయనే తావేవ కరౌ స ఏవ కృతకృత్యః**

భగవన్నామాన్ని పలికే నాలుకే నాలుక. భగవద్రూపాన్ని దర్శించు కన్నులే కన్నులు. పరమాత్మను అర్చించు చేతులే చేతులు. భగవంతుని సదా స్మరించే నిత్య భక్తుడే కృతకృత్యుడు అన్నారు శ్రీ శంకరాచార్య స్వామి.

మనం జపించే మంత్రం, కీర్తించే నామం ఎవరిదో కాదు. పరమాత్మది. భగవన్నామాన్ని భక్తితో పలుకుతూ ఉంటే, గాలి నిచ్చే చెట్టునే గాలి ఊపినట్లు, మన చలనానికి ఆధారమైన పరమాత్మ హృదయాన్నే మనం కదిలించిన ట్లౌతుంది. అదే నామ వైభవము. కీర్తనా వైభవము. సంకీర్తనా వైభవము. అందుచేత, భక్తులు సదా భగవంతుని కీర్తనంలో తన్మయులై ఉంటారు **(తన్మయాః).**

***స కీర్త్యమానః శీఘ్రమేవ ఆవిర్భవతి అనుభావయతి భక్తాన్*** - భక్తుల చేత ఆ విధంగా కీర్తించ బడిన పరమేశ్వరుడు భక్తులకు దర్శన మిచ్చి, వారికి దివ్యానుభూతిని ప్రసాదిస్తాడు అని నారద భక్తిసూత్ర ప్రబోధము.

ప్రహ్లాదుడు కీర్తిస్తే స్తంభం నుండి నరసింహమూర్తి వ్యక్త మయ్యాడు. మీరా కీర్తిస్తే విషయుక్త క్షీరంలో శయనించాడు. ద్రౌపది ప్రార్థిస్తే ఆదుకొని ఆపద నుండి రక్షించాడు. గజేంద్రుని మొర విని ముక్తిని ప్రసాదించాడు. భక్తవత్సలు డైన భగవంతుని అపార కృపా విశేషాన్ని ఎరిగిన భక్తులు సదా పరమేశ్వరుని కీర్తిస్తూ బ్రతుకును భగవన్మయం చేసుకుంటారు.

భగవన్నామము భవభయ భేషజము. సంసార మనే వ్యాధికి భగవన్నామమే ఔషధము **(సంసార రోగ భేషజత్వాత్ ఔషధమ్).** భవ రోగానికి భగవంతుడే వైద్యుడు. ఆయన నామామృత పానమే వైద్యము. నామ రసాయనమే దివ్యౌషధము. సంసార భయాన్ని నశింప చేసే ఏకైక ఔషధము నామము అన్నారు ముకుందమాల గ్రంథంలో శ్రీ కులశేఖర ఆళ్వారులు **(భవభయ ప్రధ్వంసన ఏకౌషధమ్).**

కర్మయోగులు ఒక వైపు ధర్మ నిర్వహణలో ఉంటూనే, లోక వ్యవహారాలను నిర్వహించుకుంటూనే భగవద్గుణ శ్రవణ కీర్తనాదుల ద్వారా భక్తిని వృద్ధి చేసుకోవచ్చు **(లోకేపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్).** భక్తిని బ్రతుకు నుండి వేరు చేయకుండా భగవత్స్మరణ కీర్తనాదుల ద్వారా పనుల నన్నిటినీ పూజలుగా మార్చుకో వచ్చు.

సూర్య తేజము తిమిరాన్ని పోగొట్టినట్లు, వాయువు శక్తివంతంగా వీచి మేఘాలను దూరంగా తరలించి నట్లు, భగవన్నామ సంకీర్తనము సమస్త దుఃఖాలను నశింప చేస్తుంది. **కలౌ కేశవ కీర్తనాత్** - కలియుగంలో నామ సంకీర్తనము ఉత్తమమైన సాధనగా చెప్పబడింది. అంతఃకరణ శుద్ధిని కలిగించి, జ్ఞాన సముపార్జనకు ముముక్షువును సిద్ధం చేయడంలో నామసాధన ఉత్కృష్ట మైనది. ఉత్తమ ఫలితాలను అందిస్తుంది.

భక్తి కూడా తపస్సు లాంటిదే. భక్తిని ఉత్తమోత్తమ మైన తపస్సుగా భాగవతం అభివర్ణించింది. జ్ఞాన మార్గాన్ని అందరూ అనుసరించ లేరు. కర్మయోగాన్ని అనుష్ఠించిన వారే జ్ఞానమార్గంలో దివ్యంగా పయనిస్తారు.

సతతం పరమేశ్వరుని కీర్తించే భక్తులు, జ్ఞాన సాధనను ఆచరించే మహాత్ముల లాగా నియమ నిష్ఠలను పాటిస్తారు. శమదమాది నిగ్రహ సాధనలను కూడా ఆచరిస్తారు. ఉత్తమ మైన శ్రద్ధను కలిగి పరమేశ్వరుని సేవిస్తూ ఉంటారు *(యతన్తః)*.

సదా భగవంతుని కీర్తించడము అనేది వాచిక తపస్సు. భగవంతుని ప్రార్థించడము, స్తుతించడము, కీర్తించడము - ఇవన్నీ వాచిక తపస్సు క్రిందికే వస్తాయి. ఈ విధమైన భక్తి సాధనలకు అదృష్ట ఫలంతో పాటు దృష్ట ఫలం కూడా ఉంటుంది.

దృఢవ్రత మనేది మానసిక తపస్సు. మనస్సులో దృఢమైన భక్తి నిర్ణయాలను కలిగి, స్తుతి కీర్తనాదులను భక్తులు నిరాటంకంగా సాగిస్తూ ఉంటారు *(దృఢవ్రతాః)*.

భగవంతునికి నమస్కరించడ మనేది శారీరక తపస్సు. భక్తుని వందనము భగవంతునికి బంధనము అని భక్తుల మాట. అహంకార మమకారాలను త్యజించి, వినమ్రుడై భగవంతుని సదా నమస్కరించే వందన భక్తుడు, నిత్యయుక్తుడై హృదయంలో పరమేశ్వరునే దర్శిస్తూ ఉంటాడు *(నమస్యన్తః చ మాం హృదయేశమ్ ఆత్మానం భక్త్యా నిత్యయుక్తాః సన్తః ఉపాసతే సేవన్తే)*.

*నదులన్నీ సముద్రము వైపే పయనించినట్లు, ముముక్షువు లందరూ భగవంతుని వైపే ప్రయాణం సాగిస్తూ ఉంటారు. కాకపోతే, వివిధము లైన రీతులలో సాధనలు ఆచరిస్తూ ఉంటారు. వాటిని కూడా చెబుతున్నాడు.*

**జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే ।**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥** 15

*జ్ఞానయజ్ఞేన-చ-అపి-అన్యే-యజంతః-మాం-ఉపాసతే*
*ఏకత్వేన-పృథక్త్వేన-బహుధా-విశ్వతోముఖం*

అన్యే చ అపి = మరి కొందరు
విశ్వతోముఖం = విశ్వరూపుడ నైన
మాం = నన్ను
జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞము చేత
ఏకత్వేన = ఏకముగా
పృథక్త్వేన = భిన్నముగా
బహుధా = అనేక విధములుగా
యజంతః = పూజిస్తూ
ఉపాసతే = ఉపాసిస్తున్నారు

**అర్జునా! కొందరు జ్ఞానయజ్ఞము చేత సేవిస్తారు. కొందరు ఏకరూపంగా, కొందరు భిన్న రూపంగా, మరి కొందరు అనేక రూపునిగా, సర్వ రూపుడ నైన నన్ను ఉపాసిస్తూ ఉంటారు.**

**వ్యాఖ్య**

పదకొండు, పన్నెండు శ్లోకాలలో ఆసురీ ప్రకృతి గల విచేతస్కులు, భగవ ద్విముఖులను గూర్చి తెలుసుకున్నాం. వారికి భిన్నంగా దైవీ ప్రకృతితో శోభించే మహాత్ములను గూర్చి పదమూడు, పద్నాలుగు శ్లోకాలలో చెప్పుకున్నాం.





మూఢులది దేహ దృష్టే గాని దైవ దృష్టి కాదు. భౌతిక విషయ చింతనమే గాని పారమార్థిక తత్త్వ విచారము వారికి పట్టదు. గిట్టదు. లౌకిక భోగాల యందే ఈ మూఢులకు ఆసక్తి. లోకమే అనిత్యము. అనిత్యమైన లోకము అందించే ఫలాలు నిత్యము లవుతాయా? పంచభూతముల చేత నిర్మితమైన ప్రపంచములో లభించే ఫలాలన్నీ నిరర్థకమే కనుక, అవి బ్రతుకును నికృష్టంగా మార్చేస్తాయి. వీరి విచిత్ర చరిత్ర చాలా అందంగా సంస్కృతములో వర్ణింపబడింది.

***కాచి ద్వ్యామోహ మూర్తిః పరపురుష రతా రాక్షసీ ప్రాదురాసీ త్సా గర్భిణ్యర్ధ కొఘం విషమ మజనయ త్పంచ భూతాభిధానమ్ । యాత్వేకం నీచమార్గైః అతిజడ మపరం ధావతీ త స్తతో౽ న్య ద్వాహ్యన్త శ్శూన్య మన్య ద్దహతి త దపరం కిం పున స్తత్సమాజే,***

ఒకచోట పర పురుషుని యందు ఆసక్తి కలిగిన ఒక మోహ రాక్షసి ఉంది. దాని మన స్సంతా వ్యామోహమే. అది గర్భవతి అయింది. ఐదుగురు బిడ్డల్ని ప్రసవించింది. ఆ ఐదుగురు బిడ్డలే పంచభూతాలు.

ఆ ఐదుగురు బిడ్డలలో ఒక దాని పేరు జలం. అదెప్పుడూ నీచం గానే పడక సాగిస్తూ ఉంటుంది. పల్లానికి ప్రవహిస్తూ ఉంటుంది. దాని గమ్యము అధోగతే.

మరొక దాని పేరు భూమి. అది మహా జడము. చలన మెరుగదు. వెలుగు తెలియదు. అంతా చీకటి బ్రతుకు.

మూడవది వాయువు. ఇది ఒక చోట స్థిరంగా ఉండదు. అటు, ఇటు పరుగులు పెడుతూ ఉంటుంది. అంతా అస్థిరతే.

నాల్గవది ఆకాశము. ఇది పేరు గొప్ప ఊరు దిబ్బ అన్నట్లు ఉంటుంది. ఇటు స్థిరమూ కాదు, అటు అస్థిరమూ కాదు. అంతా ఉన్నట్లే ఉంటుంది. అయినా ఎప్పుడూ ఖాళీయే. లోపల శూన్యమే. బయట శూన్యమే.

ఇక ఐదవది అగ్ని. దీనికి కాల్చడ మొక్కటే తెలుసు. తగలబెట్టే కార్యము లోనే సదా నిమగ్నమై ఉంటుంది. మంట పెట్టడమే గాని పంట పండించడము ఉండదు.

ఈ ఐదు భూతాలు ఒక్కొక్కటి ఒక్కో విధంగా వినాశ హేతువులుగా ఉంటాయి. ఇక ఈ ఐదు ఒకేసారి పుట్టింటికి వస్తే ఎలా ఉంటుంది? వీటి సమాగమమే సమవర్తి నిలయము. అదే యమ సదనము.

అనిత్యమైన ఈ మార్గానికి విలక్షణంగా శోభించే పరమాత్మ మార్గంలో చరించే వారు మహాత్ములు. వారిది నిత్యారాధనము. ఆరాధనా విధానాలు వేరుగా ఉన్నా, అందరూ ***అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం - తత్త్వ జ్ఞానార్థ దర్శనం*** అని పదమూడవ అధ్యాయంలో భగవంతుడు ఉపదేశించిన జ్ఞానమార్గం లోనే చరిస్తూ ఉంటారు. జ్ఞానయజ్ఞంతో పరమేశ్వరుని ఉపాసిస్తూ ఉంటారు. జ్ఞానయజ్ఞంతో ఎలా ఉపాసిస్తారు? అదే చెబుతున్నాడు.

### జ్ఞాన యజ్ఞము

ఈశ్వర విషయమైన జ్ఞానమే ఇక్కడ యజ్ఞము. అదే జ్ఞానయజ్ఞము. అంటే, జ్ఞానమే యజ్ఞము అని అర్థం. జ్ఞాన యజ్ఞమును ఆచరించే మహాత్ములకు జ్ఞాన విషయం భగవంతుడే గాని మరొకటి కాదు ***(జ్ఞాన మేవ భగవ ద్విషయం యజ్ఞః తేన జ్ఞాన యజ్ఞేన యజన్తః పూజయన్తః)***. తాము ఆరాధించే పరమేశ్వరునికి సంబంధించిన తాత్త్విక అవగాహనతో పరమేశ్వరుని ఉపాసిస్తూ ఉన్నందున, వారిది జ్ఞానయజ్ఞ మైంది.

వీరిలో మొదటి వారు అభేద జ్ఞానంతో ఆరాధించే వారు. వీరిని అహంగ్ర హోపాసకులు అని కూడా అంటారు. ***సయశ్చాయమ్, అయమాత్మా బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి*** - ఈ ఆత్మయే బ్రహ్మము, నేనే బ్రహ్మము

అనే అభేద జ్ఞానంతో వీరు భగవంతుని ఆరాధిస్తారు. *త్వం వా అహమస్మి భగవో దేవతే, అహం వై త్వమసి* - ' హే భగవాన్! పరమేశ్వరా! నీవే నేను - నేనే నీవు' అనే అభేద జ్ఞానంతో ఆరాధిస్తారు *(ఏకత్వేన ఏకమేవ పరంబ్రహ్మ ఇతి పరమార్థ దర్శనేన యజన్తః ఉపాసతే).*

మరి కొందరు పృథక్ భావంతో ఉపాసిస్తూ ఉంటారు. అంటే, సూర్యచంద్రుల రూపంలో ఆ భగవంతుడే ఉన్నాడు అనే జ్ఞానం చేత ఆదిత్య చంద్రాది భేదంతో ఉపాసిస్తారు. అంటే, ఉపాసక, ఉపాస్య భేదంతో భగవంతుని ఆరాధిస్తారు *(కేచిత్ పృథక్త్వేన ఆదిత్య చంద్రాది భేదేన, స ఏవ భగవాన్ విష్ణుః ఆదిత్యాది రూపేణ అవస్థితః).*

మరి కొందరు ఆ భగవంతుడు అనేక ముఖాలతో, అన్ని వైపుల, అనేక విధాలుగా ఉన్నాడు అనే జ్ఞానంతో భగవంతుని విశ్వరూపునిగా ఉపాసిస్తారు. ఏ వస్తువైనా, ఏ రూపమైనా వారి కది విశ్వరూపుని యొక్క ముఖమే *(కేచిత్ బహుధా అవస్థితః స ఏవ భగవాన్ సర్వతోముఖః విశ్వతోముఖః విశ్వరూపః ఇతి).*

మొదటి వారిది అభేద దృష్టి. ఆ తరువాత మనం చెప్పుకున్న వారందరిది భేద దృష్టే. అందరిలో జ్ఞానమే ఉన్నా, మొదటి వారిలో ఉన్నది ఏకత్వానికి సంబంధించిన జ్ఞానము కావడం చేత వారిది అభేద జ్ఞానము. భేద జ్ఞానంతో ఉపాసించే వారిలో భక్తి ప్రధానంగా ఉంటుంది. కానీ ఉపాసనా వైభవాన్ని తెలిసిన వారు భక్తి జ్ఞానాల మధ్య భేదాన్ని చూడరు. జ్ఞానయోగ, కర్మయోగాలను వేరు వేరుగా చూడరు అని అయిదవ అధ్యాయం నాల్గవ శ్లోకంలో చూచాము. భక్తిలో భేదం ఉండవచ్చు. కాని, భేదాన్ని భక్తి అభేదం వైపుకు నడిపిస్తుంది. ఇక జ్ఞానం అంటారా? జ్ఞానం భేదాన్ని నిరసిస్తుంది, నిరాకరిస్తుంది. అదే తేడా.

**అందరి గమ్యము ఒకటే అయినా**
**మార్గము లన్నీ ఒకటౌనా?**
**చూపు లందరివి ఒకటైనా**
**చూచే తీరు వేరు కదా!**
**జ్ఞానము కలిగి చరించే వారికి**
**సర్వము ఈశ్వరమయము కదా!**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

*భగవాన్! నీవు ఒక్కడివే. నీవు అద్వయుడవు. అలాంటి నిన్ను అనేక విధాలుగా ఉపాసిస్తున్నారు అన్నప్పుడు, వారు నిన్నే ఉపాసిస్తున్నారు అని ఎలా చెప్పగలం? అనే శంకను పరిహరిస్తున్నాడు.*

అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్ ।
మన్త్రోఽ హ మహమే వాజ్య మహమగ్ని రహం హుతమ్ ॥ 16

*అహం-క్రతుః-అహం-యజ్ఞః-స్వధా-అహం-అహం-ఔషధం*
*మంత్రః-అహం-అహం-ఏవ-ఆజ్యం-అహం-అగ్నిః-అహం-హుతం*

| అహం | = | నేను | యజ్ఞః | = | యజ్ఞమును |
|---|---|---|---|---|---|
| క్రతుః | = | క్రతువును | అహం | = | నేను |
| అహం | = | నేను | స్వధా | = | పిండమును |





| అహం | = | నేను | ఆజ్యం | = | హవిస్సును |
|---|---|---|---|---|---|
| ఔషధం | = | ఔషధమును | అహం | = | నేను |
| అహం | = | నేను | అగ్నిః | = | అగ్నిహోత్రమును |
| మంత్రః | = | మంత్రమును | అహం ఏవ | = | నేనే |
| అహం | = | నేను | హుతం | = | హోమకర్మను |

**అర్జునా! నేనే క్రతువును. యజ్ఞము నేనే. నేనే స్వధ. నేనే ఔషధము. మంత్రము నేనే. ఆజ్యం నేనే. నేనే అగ్ని, నేనే హోమము.**

**వ్యాఖ్య**

పరమేశ్వరుడు సమస్తములో నిండి నిబిడీకృతమై ఉన్నాడు. ఈ ప్రపంచం పరమాత్మచే వ్యాప్తమై ఉంది ***(మయా తత మిదం సర్వం).*** వ్యాప్యమైన ప్రపంచము నందు భగవంతుడు వ్యాపక చైతన్యంగా ఉన్నాడు. అందుచేత తాను విశ్వతోముఖుడు. వ్యాప్య వ్యాపకాలలో ఉన్నది తానే. కార్యమైన వ్యాప్యము, కారణమైన వ్యాపకము రెండూ తానే.

సర్వము నందు వ్యాపించి ఉన్నవాడు కనుక ఆయన సర్వవ్యాపి. జగత్తులో ఆకాశము ఎలా వ్యాపించి ఉందో, అలా ఆకాశముతో సహ సమస్తము నందు వ్యాపించి ఉన్నవాడు కనుక ఆయన 'వ్యాపి' ***(ఆకాశవత్ సర్వగతత్వాత్ వ్యాపీ).*** కారణరూపు డైన తాను సర్వ కార్యముల యందు, మట్టి పాత్రలలో మట్టి వలె వ్యాపించి ఉన్నాడు కనుక తాను 'వ్యాపి'. ఆయన వ్యాపకత్వము లేని ప్రదేశము లేదు. ఆయన వ్యాపించని కార్యమూ లేదు **(కారణత్వేన సర్వకార్యాణాం వ్యాపనాద్వా వ్యాపీ).** అన్ని కార్యాలలో తానే. అన్ని కర్మలలో తానే. ఈ సత్యాన్ని నిర్ధారణ చేసే క్రమంలో ప్రథమంగా యజ్ఞకర్మను తీసుకొని, దాని యందు పరమేశ్వరుడు ఎలా సమస్తమై ఉన్నాడో గ్రహిస్తే, జ్ఞానయజ్ఞము చేత పరమేశ్వరుని ఎలా ఉపాసించాలో బోధ పడుతుంది. ఈ విషయాన్ని ఇది వరకే నాల్గవ అధ్యాయం - ఇరవై నాల్గవ శ్లోకం **బ్రహ్మార్పణం బ్రహ్మహవిః** అనే చోట చెప్పుకొని ఉన్నాం. ప్రస్తుతం యజ్ఞక్రియలో సర్వమూ ఎలా భగవత్స్వరూపమో తెలుసుకుందాం. ప్రథమంగా 'క్రతువును నేనే' **(అహం క్రతుః)** అంటూ ప్రారంభిస్తున్నాడు. ప్రస్తుత శ్లోకంలో **ఏవ** కార ముంది. అంటే, నేను అనకుండా నేనే అనే ధ్వనితో ప్రవచిస్తున్నాడు. ఈ 'ఏవ' కారము అద్వితీయార్థము ప్రయోగింప బడింది. అన్నిటిలో నేనే అద్వితీయంగా ఉన్నాను అని నొక్కి చెప్పడమే 'ఏవ' కారము యొక్క ఉద్దేశము. నాకు అన్యంగా మరొకటి లేదు అని నిర్ధారణ చేయడమే ప్రధాన విషయము.

**క్రతువు**

నేనే క్రతువును ***(అహం క్రతుః).*** 'క్రతువు' అంటే శ్రౌత క్రియ. అంటే, శ్రౌతకర్మ విశేష స్వరూపము. అవే శ్రుతుల యందు, అనగా వేదముల యందు ప్రతిపాదించ బడిన కర్మలను శ్రౌత కర్మలు అంటారు. అవే అగ్నిష్టోమాది క్రతువులు. అవన్నీ తానే అంటున్నాడు. ఆయన వేద స్వరూపుడు. వేద జ్ఞానము, వేద నారాయణుడు వేరు కాదు. వేదంలో చెప్పబడిన విధి ననుసరించి శ్రౌతకర్మలు సాగుతాయి కనుక, ఆ వేద క్రతువులలో విధి రూపంలో శోభించే వాడు తానే **(క్రతుః శ్రౌతకర్మ భేదః అహమేవ).**

**యజ్ఞము**

శ్రుతి ప్రతిపాదితము లైన శ్రౌతకర్మలు ఎలా తానై ఉన్నాడో, స్మృతి ప్రతిపాదితము లైన యజ్ఞములు,

అంటే స్మార్త కర్మలు కూడా తానే ***(అహం యజ్ఞః స్మార్తః).*** శ్రౌతకర్మలు సమయాలను, సందర్భాలను అనుసరించి చేసేవి. కాని స్మార్త కర్మలు, అనగా యజ్ఞాలు నిత్యానుష్ఠానములు. కనుక, భావన తోడైతే భోజనము కూడా యజ్ఞమే. పఠనము కూడా యజ్ఞమే. పూజాదికాలన్నీ యజ్ఞాలే. పరోపకారార్థం చేసే శ్రమలు కూడా యజ్ఞాలే. ఇవన్నీ శ్రుతి ప్రతిపాదితాలు కాకపోయినా, శ్రుతులను అనుసరిస్తూనే స్మృతులు సాగుతాయి కనుక, స్మార్తము లైన యజ్ఞాలు కూడా పరమేశ్వరుని స్వరూపమే.

పరమేశ్వరుడు శుద్ధ చైతన్య స్వరూపుడు. యజ్ఞాల లోని శుద్ధి కార్యాలన్నీ ఈశ్వర స్వరూపాలే. మనకు తెలియకుండానే, నిత్యకృత్యాలలో అగ్ని, జల, వాయు, పృథివీలను ఉపయోగిస్తూ కొన్ని దోషాలను చేస్తూ ఉంటాము. ఆ పాపాలనే 'పంచసూనాలు' అంటారు. అట్టి పాప పరిహారార్థం స్మృతి ప్రతిపాదితాలైన పంచయజ్ఞాలను నిర్వహిస్తాము. అవియే దేవపూజ, ఋషిపూజ, పితృపూజ, అతిథిపూజ, భూతపూజ అనునవి. ఇవన్నీ స్మార్త కర్మలే. యజ్ఞాలే. వాటి రూపంలో ఉన్నది కూడా పరమేశ్వరుడే.

**స్వధ**

పితృ పూజాత్మక మైన యజ్ఞము 'స్వధ'. అంటే, మంత్ర పూతంగా పితృదేవతలకు అర్పణం చేసే అన్నము ***(యత్ పితృభ్యః దీయతే, స్వధా అన్నం అహమేవ)*** అని అర్థము. పక్షులకు, బ్రాహ్మణులకు పితృ దేవతలను తృప్తి పరచేందుకు సమర్పించే అన్నము కూడా తానే. దేవతల నుద్దేశించి ద్రవ్యమును సమర్పించుట కూడా యజ్ఞ రూపమే ***(ఉద్దిశ్య దేవాన్ ద్రవ్యాణాం త్యాగో యజ్ఞ ఇతీరితః).***

**ఔషధమ్**

ఇక్కడ 'ఔషధమ్' అంటే ప్రాణులు తినే అన్నము ***(అహమ్ ఔషధమ్ సర్వ ప్రాణిభిః యత్ అద్యతే తత్ ఔషధ శబ్దవాచ్యమ్).*** ఓషధుల నుండి ఉత్పన్న మయ్యేది ఔషధము. మొక్కలు, తీగలు, మూలికలు, దుంపలు, ఇంకా చెట్ల నుండి ఉద్భవించే వన్నీ ఓషధులు. వ్యాధిని పోగొట్టే మందును ఔషధము అంటాము. ఆకలి అనేది కూడా వ్యాధే కనుక ***(క్షుద్వ్యాధిః).*** ఆకలిని పోగొట్టే అన్నము కూడా ఔషధమే.

**మంత్రము**

మంత్రము కూడా మహేశ్వరుడే. రక్షించే స్వభావమే ఉభయులకూ ఉన్నందున మంత్రము, మంత్రమూర్తి ఒక్కటే. వేదాల లోని మంత్రముల రూపములో ఉన్నది భగవంతుడే. ఆయన మంత్ర బోధ్యుడు కూడా. అంటే మంత్రాల ద్వారా బోధ పడేవాడు, లేక అర్థమయ్యే వాడు అని అర్థము ***(మన్త్ర బోధ్యత్వా ద్వా మన్త్రః).***

**ఆజ్యం**

దేవతలకు సమర్పించే హవిస్సు కూడా తానే ***(అహమేవ ఆజ్యం హవిశ్చ అహమ్).*** ఆజ్యం అంటే హోమాదులలో సమర్పించే నెయ్యి మాత్రమే కాదు. ఆజ్యం అనేది సర్వ హవిస్సులకు ఉపలక్షణము.

**అగ్ని**

దేని యందు హోమం చేయ బడుతుందో అట్టి అగ్ని కూడా తానే ***(అగ్నిః యస్మిన్ హూయతే సః అగ్నిః అహమేవ).*** హోమగుండంలో అగ్ని ఉంటేనే హోమం చేస్తాము. అలాగే మానవ దేహంలో వైశ్వానరాగ్ని ఉంటేనే అన్నాదులను ఆహుతులుగా సమర్పిస్తాము. శివం పోయి శవం మిగిలితే, దానికి అన్నం పెట్టలేము కదా! అందుచేత భోజనము చేయడం కూడా యజ్ఞమే అని చెప్పుకున్నాము.





**హోమ కర్మ**

హోమం చేయడం అనే కర్మ కూడా భగవంతుడే ***(అహం హుతం హవన కర్మ చ).*** యజ్ఞంలో అనేక కర్మలు, వస్తువులు కనిపిస్తూ ఉండినా, ఈ శ్లోకంలో మనం చూచిన ఎనిమిది లక్షణాలలో పరమేశ్వరుడే ఏకరూపుడై శోభిస్తూ ఉన్నాడు. కనుకనే ప్రతి కర్మను భక్తి భావంతో చేస్తాము. మనం భక్తి పూర్వకంగా యజ్ఞాది కర్మలను అనుష్ఠించినా, విషయము జ్ఞానమే అయినందున ఇదంతా జ్ఞానయజ్ఞ మైంది. కర్త, కర్మ, క్రియ, కరణ, ఫలాదులన్నీ తానే కావడం చేత యజ్ఞము పరమేశ్వర స్వరూప మైంది. జ్ఞాన ప్రధానమై నందున జ్ఞాన యజ్ఞమైంది. పరమేశ్వరుడు యజ్ఞరూపంలో శోభిస్తున్నాడు కనుక ఆయన కూడా 'యజ్ఞ' శబ్దవాచ్య డయ్యాడు ***(యజ్ఞాత్మనా యజ్ఞః).*** అందుచేతనే, యజ్ఞము సాక్షాత్తు నారాయణ స్వరూపము అన్నది వేదము ***(యజ్ఞో వై విష్ణుః).***

*యజ్ఞ కర్మలలో సమస్తమూ తానే ఎలా ఉన్నాడో వివరించిన పరమేశ్వరుడు, ఈ దృశ్యమాన జగత్తులో కూడా తానే ఏయే రూపాలలో శోభిస్తున్నాడో వివరిస్తున్నాడు.*

**పితాహ మస్య జగతో మాతా ధాతా పితామహః ।**
**వేద్యం పవిత్ర మోంకారః ఋక్సామ యజురేవ చ ॥** 17

**పితా-అహం-అస్య-జగతః-మాతా-ధాతా-పితామహః**
**వేద్యం-పవిత్రం-ఓంకారః-ఋక్-సామ-యజుః-ఏవ-చ**

| | | | |
|---|---|---|---|
| అస్య | = ఈ | పితామహః | = తాతను |
| జగతః | = జగత్తునకు | వేద్యం | = తెలిసికో దగిన |
| అహం | = నేను | పవిత్రం | = పవిత్రమైన |
| పితా | = తండ్రిని | ఓంకారః | = ప్రణవమును |
| మాతా | = తల్లిని | ఋక్సామ యజురేవ చ | = ఋగ్వేద సామవేద, యజుర్వేదములు కూడా |
| ధాతా | = సృష్టికర్తను | | |

**ఈ జగత్తుకు తండ్రిని, తల్లిని, ధాతను, తాతను నేనే. వేద్యమును నేనే. పుణ్యమును నేనే. ఓంకారము నేనే. వేద త్రయమూ నేనే.**

**వ్యాఖ్య**

**జగత్పిత - జగన్మాత**

ఈ ప్రపంచ మంతా పరమేశ్వరుని యొక్క వ్యక్త స్వరూపమే. వైభవమే. అందుచేత **అస్య జగతః** అంటూ శ్లోకంలో విశ్వాన్ని సూచిస్తున్నాడు. ఈ జగత్తుకు తండ్రి, తల్లి, తాత, ధాత - అన్నీ తానే అంటున్నాడు.

కార్యం ఏది కనిపించినా, అది కర్తను జ్ఞాపకం చేస్తుంది. ఒక పిల్లవాడు కనిపిస్తే, అతనితో భాషించ వలసి వస్తే, నువ్వు ఎవరి కుమారుడివి? నీ తల్లిదండ్రు లెవరు అని ప్రశ్నిస్తాము. ఈ ఆలయం ఎవరు నిర్మించారండీ? ఆ తోట పెంచిం దెవరండీ? ఆ బావి ఎవరు త్రవ్వించారు? ఈ సత్రం ఎవరు కట్టించారు? ఇలా ప్రశ్నిస్తూ ఉంటాము. కుండ కంట పడగానే, కుమ్మరి మనస్సులో కదుల్తాడు. కుండ చేసే జ్ఞానం ఉండటం వల్లనే కుమ్మరి కుండను చేశాడు. కాని, కుమ్మరి కుండ చేయాలి అంటే వస్తువు కూడా ఉండాలి. అదే ఉపాదానం. కుండ విషయంలో మట్టి ఉపాదానం. కుమ్మరి నిమిత్తం. ఈ రెండు కారణాలతో కుండ తయా రవుతుంది.

ఈ ప్రపంచానికి ***(అస్య జగతః)*** భగవంతుడు నిమిత్త కారణము. ప్రకృతి ఉపాదాన కారణము అని మనం ఇప్పటికే తెలుసుకొని ఉన్నాం *(9 వ అ - 10 వ శ్లో)*. సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు నిమిత్త కారణం కావడం చేత ఈ సృష్టి తయారైంది. కనుక ఆయన ఈ ప్రపంచానికి తండ్రి. మరి, కుండకు మట్టి లాగా సృష్టికి ఉపాదాన కారణం అయిన ప్రకృతి పరమేశ్వరుని కన్నా వేరుగా లేక, పరమేశ్వరునే ఆశ్రయించుకొని ఉన్నందున, ఉపాదాన కారణం కూడా సృష్టికి పరమేశ్వరుడే. అందుచేత, ఈ ప్రపంచానికి ***(అస్య జగతః)*** తానే తండ్రి. తానే తల్లి ***(పితామాతా అహమేవ)***. రెండు కారణాలుగా తెలుస్తూ ఉన్నా, వాస్తవానికి ఈ సృష్టికి పరమేశ్వరుడే అభిన్న నిమిత్త ఉపాదాన కారణము. అదే అర్ధనారీశ్వర స్వరూపము. ఒక వైపు నుండి చూస్తే భగవతిగా ఆయన ఉపాదాన కారణము. మరొక వైపు నుండి చూస్తే భగవంతుడుగా ఆయన నిమిత్త కారణము. జగన్మాత తానే. జగత్పిత తానే.

**పితామహుడు**

ఈ జగత్తుకు పితామహుణ్ణి నేనే అంటున్నాడు ***(అస్య జగతః పితామహః అహమేవ)***. సృష్టికర్త బ్రహ్మదేవుడు కనుక, బ్రహ్మదేవుడు విష్ణుదేవుని నాభీకమలం నుండి పుట్టడం చేత ఆయన పితామహుడు. తండ్రి తానే అయినప్పుడు, తాత కూడా తానే ఎలా అవుతాడు? అనేది శంక. జన్మ నిచ్చిన వాడు తండ్రి అయితే, తండ్రికి జన్మ నిచ్చిన వాడు పితామహుడు అవుతాడు. కానీ, ఇక్కడ భగవంతుడు తండ్రి. అంటే జగత్తుకు కారణమైన వాడు. మరి, ఆ భగవంతుడికి కారణ మెవరు? అని ప్రశ్నిస్తూ ఉంటారు. ఎవరు కారణమైనా, జగత్పితకు కారణమైన ఆ తండ్రి పితామహు డవుతాడు. ఇక్కడ నేనే పితామహుణ్ణి అని చెప్పడం వల్ల, తనకు మరొక కారణం లేదు అని చెప్పిన ట్లైంది. కారణాలకు కారణమైన తనకు మరొక కారణం లేనివాడై భగవంతుడు పితామహు డయ్యాడు.

**ధాత**

ప్రాణులకు కర్మఫలాలను అనుగ్రహించే వాడు కావడం చేత ఆయన ధాత ***(కర్మఫలస్య ప్రాణిభ్యః విధాతా)***. అంటే పోషకుడు, స్థితి కారకుడు కూడా తానే అని అర్థం. మనం ఆచరించే కర్మలకు ఫలితాలు అందుతాయి. అందుకే మనం కర్మలు ఆచరిస్తాము. కర్మలకు ఫలితాలు రాకపోతే కర్మలు ఎందుకు ఆచరిస్తాము? ఫలితాలు వస్తాయి కనుకనే కర్మాచరణంలో ఉంటాము. కాకపోతే, మనం ఆశించినట్లు ఫలితాలు అందవు. కొన్ని పర్యాయాలు అందవచ్చు. కాని, ఎక్కువ శాతం నిరాశే ఫలితంగా ఉంటుంది.

కర్మఫలాలు అందడం వెనుక ధర్మం ఉంది. నియతి ఉంది. దానిని అనుసరించే మనకు ఫలాలు అందుతాయి. ఆ ధర్మం మనం చేసింది కాదు. మనం ఈ ప్రపంచానికి రాక ముందే ఈ విశ్వం ఉంది. అది ధర్మాలతో, నియతితో నడుస్తూ ఉంది. కనుక, సృష్టిలో ఈ ధర్మాలను ఎవరు రచించారో అతడే కర్మలకు ఫలితాలు అందిస్తున్నాడు. అతడెవరు? అతడు ఎవరైనా సరే, కర్మఫలాలను ఇచ్చేవాడు కనుక, సర్వజ్ఞుడయ్యే ఉండాలి. సర్వజ్ఞుడికే అది సాధ్యం. అట్టి సర్వజ్ఞుడు పరమేశ్వరుడే కాని మరొకరు కారు. కాలేరు. అందుచేత, ఎవరెవరి కర్మలకు ఏయే ఫలితాలు ఇవ్వాలో, ఎప్పుడివ్వాలో, ఎలా ఇవ్వాలో, ఎందు కివ్వాలో, అన్నీ సమగ్రంగా తెలిసిన వాడు భగవంతుడు ఒక్కడే కనుక ఆయనే కర్మఫల ప్రదాత ***(ధాతా)***. అందుచేతనే ఆయన తెలియ దగిన వాడు. వేద్యుడు.

**వేద్యం**

తెలియదగిన వాడు ఆయన ఒక్కడే కావడం చేత, ఆయన **వేద్యం** అని కీర్తింప బడ్డాడు ***(వేద్యం వేదితవ్యం)***. తెలియదగిన వాడు అంటే జ్ఞేయరూపుడు.



ప్రపంచంలో ఏది తెలుసుకున్నా, తెలియనిది మరొకటి ఉండనే ఉంటుంది. ఏ జ్ఞానమైనా పరిమితమే. మిథ్యా జ్ఞానమే. ఏది తెలుసుకుంటే మరొకటి తెలుసుకో నవసరం లేదో, ఏ ఒక్క దాని జ్ఞానం చేత సర్వమూ తెలియబడుతూ ఉందో, అదే జ్ఞేయము. అదే వేద్యము. ఏ లాభాన్ని పొందిన తరువాత దాని కంటే అధికమైన లాభం మరొకటి కావాలని, రావాలని అనిపించదో, అదే ఇక్కడ వేద్యము *(6 వ అ - 22 వ శ్లో)*. అదియే బ్రహ్మము. అది తెలియ నపుడు ఎన్ని తెలిసినా ప్రయోజనం ఉండదు. బ్రహ్మ మొక్కటే అమృతము. దాని కన్నా అన్యమైన దంతయూ మృతమే. కనుకనే, అర్జునా! దేనిని తెలుసుకొనిన తరువాత నీవు అమృతత్వాన్ని పొందుతావో అట్టి జ్ఞేయమును నీకు బోధిస్తున్నాను అన్నాడు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగంలో భగవంతుడు ***(జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వా అమృత మశ్నుతే)***. ఇదే జ్ఞానము. బ్రహ్మజ్ఞానము. పవిత్రమైన జ్ఞానము. జ్ఞానము కన్నా పవిత్రమైన వస్తువు మరొకటి లేదని గీత - నాల్గవ అధ్యాయం లోనే చూశాము *(4 వ అ - 38వ శ్లో)* కనుక, అట్టి జ్ఞాన రూపుడైన పరమేశ్వరుడు పవిత్రంగా దర్శన మిస్తున్నాడు.

**పవిత్రం**

పావన మైనది, పుణ్యప్రద మైనది తానే కనుక భగవంతుడు పవిత్రమైన వస్తువు **(పవిత్రమ్ పావనమ్)**. పావన మొనర్చేది ఏదో అది పవిత్రము **(యేన పునాతి తత్ పవిత్రం)**.

**పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళం ।**
**దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా ॥**

పవిత్రాలలో పవిత్రమైన వాడు, మంగళకరమైన వాటిలో మంగళ స్వరూపుడు, దేవతలకు దేవుడు, భూతములకు నశించని తండ్రి పరమేశ్వరుడే అని శ్లాఘించింది విష్ణుసహస్ర నామ స్తోత్ర పూర్వపీఠిక.

**ఓంకారము**

పరమేశ్వరుడు ఓంకార రూపుడు. ప్రణవ స్వరూపుడు. ప్రణవము అనేది భగవంతుని నామము **(తస్య వాచకః ప్రణవః)**. ఈ విశ్వ మంతయు పరమేశ్వరుడిచే వ్యాప్త మని అర్థం చేసుకుంటూ ఉన్నాము. ఈ విషయాన్ని మాండూక్యోపనిషత్ ధృవ పరుస్తూ, **ఓం ఇతి ఏతదక్షర మిదం సర్వం** - ఈ సమస్త ప్రపంచము ఓంకార మనే ఏకాక్షర స్వరూపమే అన్నది. ఓంకారము పరమేశ్వరుని స్వరూపము. ఓంకారము అభిధానము. కనుక, ఓంకారము కూడా సచ్చిదానంద స్వరూపమే. పరమేశ్వరునికి, పరమేశ్వరుని నామానికి తేడా లేదు. ఓంకారము ఏదో కాదు. పరమేశ్వరుని జ్ఞానమే ఓంకారంలో నిండి ఉంది.

**వేదములు కూడా తానే**

ఋక్సామ యజుర్వేదాలు కూడా భగవంతుని స్వరూపమే. 'చ'కారము అథర్వణ వేదమును సూచిస్తూ ఉంది. వేదము అనేది జ్ఞాన భాండాగారము. వేద రూపములో ఉన్నది కూడా తానే కనుక ఆయన వేద స్వరూపుడు ***(వేద రూపత్వాత్)***. వేదాలు పరమేశ్వరుని స్వరూపాన్నే వర్ణిస్తున్నాయి. కనుక వేదాల ద్వారా తెలియబడే వాడు తానే ***(వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః*** ... *15 వ అ - 15 వ శ్లో)*.

*మరి కొన్ని భగవ ద్విశేషాలను చెబుతున్నాడు.*

గతి ర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయమ్ ॥ 18

***గతిః-భర్తా-ప్రభుః-సాక్షీ-నివాసః-శరణం-సుహృత్***

***ప్రభవః-ప్రలయః-స్థానం-నిధానం-బీజం-అవ్యయం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| గతిః | = | గమ్యము | ప్రభవః | = | సృష్టికర్త |
| భర్తా | = | భరించు వాడు | ప్రలయః | = | వినాశకరుడు |
| ప్రభుః | = | ప్రభువు | స్థానం | = | స్థితికర్త |
| సాక్షీ | = | సాక్షి | నిధానం | = | నిక్షేపము |
| నివాసః | = | నివాసము | అవ్యయం | = | నాశము లేని |
| శరణం | = | ఆశ్రయము | బీజం | = | మూలకారణము |
| సుహృత్ | = | మిత్రుడు | | | |

**అర్జునా! సమస్తానికి నేను గతిని. భర్తను, ప్రభువును నేనే. నేనే సాక్షిని. నిలయం, శరణ్యం నేనే. నేనే మిత్రుణ్ణి. ఉత్పత్తి లయ స్థానాలు నేనే. నేనే నిధానము. నేనే అవ్యయ బీజము.**

**వ్యాఖ్య**

ఇదొక అందమైన, అద్భుతమైన శ్లోకము. వేదికల మీద తరచుగా ప్రబోధకులు ఉటంకించే శ్లోకం. గీతలో గొప్ప ప్రాచుర్యాన్ని పొందిన అనేక శ్లోకాలలో ఇదొకటి. విశ్వతోముఖు డైన పరమేశ్వరుని విశేష వైభవాలను పదహారవ శ్లోకం నుండి చూస్తూ వస్తున్నాం. ఇప్పటికి, గడచిన రెండు శ్లోకాలలో ఒక్కొక్క శ్లోకంలో ఎనిమిదేసి లక్షణాల చొప్పున పదహారు విశేషణాలను అర్థం చేసుకున్నాం. ప్రస్తుత శ్లోకంలో మరో పది విషయాలను చెప్పుకోబోతున్నాం.

గడచిన రెండు శ్లోకాల కన్నా ఈ శ్లోకానికి వైలక్షణ్యం ఉంది. పూర్వ శ్లోక ద్వయంలో 'అహం' పద ప్రయోగం ఉంది. అంటే, నేను, నేను, - నేనే, అంటూ భగవంతుడు తన వైభవాన్ని వర్ణించుకుంటూ వచ్చాడు. ఈ శ్లోకంలో ఆ విధంగా 'అహం' పద ప్రయోగం జరగలేదు.

వేదాంతములో ప్రశస్తమైన, ప్రముఖమైన పదాలు రెండున్నాయి. ఒకటి 'అహం', రెండవది 'ఇదం'. 'అహం' అంటే నేను అని అర్థము. 'ఇదం' అంటే ఇది అని అర్థం. 'అహం' అనేది సత్యానికి సంకేతము. 'ఇదం' అనేది మిథ్యారూపము. సత్యము అద్వయము కనుక, మిథ్య కూడా సత్యమే. కాని, సత్యం మిథ్య కాదు. పరమేశ్వరునిపై ఆధారపడి ఉండే మిథ్య పరమేశ్వరుని కన్నా వేరుగా ప్రత్యేక మనుగడను కలిగినది కాదు కనుక, 'ఇదం' కూడా 'అహం' లోనే ఇమిడి ఉంది. స్థూలంగా, వ్యావహారికంగా ఈ వైజాత్యమును ఎరుక పరుస్తూ, పూర్వ శ్లోకాలలో 'అహం' - నేను అని చెప్పడం జరిగింది. కాని, ప్రస్తుత శ్లోకంలో మనం అధ్యయనం చేయబోయే పది విశేషణాలు కేవలం పరమాత్మకు సంబంధించినవే. అందుచేత 'అహం' పద ప్రయోగం జరగలేదు. ఒకవేళ, ఈ వ్యాఖ్యానము నచ్చకపోతే పూర్వ శ్లోకాల లోని 'అహం' పదాన్ని అధ్యాహారం చేసుకోవాలి అనే భావంతో సరిపెట్టుకోవచ్చు. ఇక విషయం లోకి వెళ్దాం.

**గతి**

భగవంతుడు అందరికీ గతియై ఉన్నాడు. సాధారణంగా గమ్య స్థానమును గతి అంటారు. సర్వులు పొందాలి అనుకొనే గమ్యము పరమేశ్వరుడే కనుక ఆయన గతి అని చెప్పబడతాడు. అందరిచే పొందబడే వాడు కనుక ఆయన గమ్యము ***(గమ్యతే ఇతి గతిః).*** అంతే కాదు, అట్టి గమ్యాన్ని పొందడానికి ఉపకరించే మార్గము కూడా తానే. కనుక గతి అంటే గమ్యము అని, మార్గము అని కూడా అర్థము.





భగవంతుడు జ్ఞానమయుడు కనుక **ప్రజ్ఞానం బ్రహ్మ** అంటాము. కాని, అట్టి పరమేశ్వరుని తెలుసు కొనేందుకు మనం సిద్ధ పరచుకొనే సాధనలను కూడా జ్ఞానం అనే అంటాము. పదమూడవ అధ్యాయంలో అమానిత్వాది సాధనలను తెలిపిన తరువాత, చివరగా పదకొండవ శ్లోకంలో భగవానుడు 'ఇదే జ్ఞానం అని చెప్పబడింది' ***(ఏతత్ జ్ఞానం ఇతి ప్రోక్తం)*** అన్నాడు. జ్ఞానం ఎంత పవిత్రమో, జ్ఞాన సాధనలు కూడా అంతే పవిత్రము. కనుక గతి అంటే గమ్యము, అలాగే మార్గము అని కూడా గ్రహించ వచ్చు. గ్రహించాలి కూడా ***(గమ్యతే అనయా ఇతి గతిః).*** అవగతి అంటే జ్ఞానము. ఆత్మజ్ఞానము. ఆత్మ, ఆత్మజ్ఞానము వేరు కావు. కనుక, అవగతి స్వరూపమైన ఆత్మ గమ్యమే. అలాగే జ్ఞానస్వరూపమైన ఆత్మను పొందే మార్గము కూడా జ్ఞానమే కావడం చేత, మార్గం ప్రాప్తిస్తే గమ్యం సిద్ధించినట్లే కనుక ఇటు జ్ఞానమార్గము, అటు జ్ఞానగమ్యము రెండూ 'గతి' శబ్దంతో చెప్పబడ్డాయి.

జీవనదులకు సముద్రము ఎలా గమ్యమో, జీవులకు పరమేశ్వరుడు అలా గమ్యము. ఆయనే గతి. సామ వేదంలో వాసిష్ఠ శాఖ యందు ప్రశ్నోత్తర సహితంగా ఒక అందమైన వాక్యం ఉంది. ***అథ కస్మాదుచ్యతే గతిః ఇతి. బ్రహ్మైవ గతి రితి తద్ధి గమ్యతే పాప విముక్తైః*** - 'గతి అని ఎందుకు చెప్పవలసి వచ్చింది? బ్రహ్మమును గతి అని చెప్పుట ఎందులకు?' అనేది ప్రశ్న. 'పాపము నుండి, లేదా అజ్ఞానము నుండి విముక్తు లైన వారి చేత పొంద బడుతూ ఉన్నందున బ్రహ్మమును గతి అని చెప్పడం జరిగింది' అనేది సమాధానము.

ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న ఈ శ్లోకంలో ***గతిః*** అంటే కర్మఫలము అని అర్థము ***(గతిః కర్మఫలమ్).*** ఇక్కడ కర్మఫలము అన్నప్పుడు ఎవరి కర్మకు ఏది ఫలమో అదే వారి కర్మఫలము. పుణ్యాత్ములకు స్వర్గం ఫలం. పాపాత్ములకు నరకం ఫలం. మోక్ష సాధకులకు మోక్షమే ఫలం. సర్వ కర్మల ఫలితాలు పరమేశ్వరుని అధీనంలో ఉన్నందున ఆయన సర్వులకు గతి. ఈ సత్యం అర్థమైతే, అక్రమ మార్గాలలో చరించి బ్రతుకును అన్యాయం చేసుకోవడం కన్నా, బ్రతుకుకు భగవంతుడే గతి అని నిర్ధారణ చేసికొని, మోక్ష మార్గంలో పయనించి తరించడమే శ్రేయస్కరము అని నిశ్చయ మవుతుంది.

*చరణము:* **నను కరుణించిన భక్తివి నీవే**<br>
**నేను వరించిన ముక్తివి నీవే**<br>
**నీ వెంట పడితే మిగలదు మోహము**<br>
**నీవు వెంట రాగా వెలుగును మోక్షము**

*పల్లవి:* **రాధా రమణ - రాదేల కరుణ?**<br>
**దేవకి నందన - నాకేల వేదన?**

*అనుపల్లవి:* **జీవుల గమ్యము నీవే కావా!**<br>
**బ్రతుకు సంద్రమున నీవే నావ ॥ రాధా ॥**

అని గమ్యాన్ని ఎరుక పరుస్తూ, గతి రూపుడైన గోవిందుని కీర్తించింది చైతన్య గీతిక.

భావం లేకుండా కర్మ చేయలేము. భావన మనస్సులో కదలాలి అంటే మనస్సుకు సత్తా స్ఫురణలు ఉండాలి. అట్టి చైతన్యము పరమేశ్వరుడే గాని మరొకరు కాలేరు. అలా చూచి నపుడు ఆయన మన కర్మలకు మూలమై ఉన్నాడు ***(కర్మాణాం కర్తా).***

మనం ఆచరించే కర్మలకు ఫలాలను ప్రసాదించే వాడు కూడా తానే ***(తత్ఫలానాం చ కర్తా).*** ఒక ప్రదేశంలో, ఒక కాలంలో మనం కర్మ చేస్తే, దాని ఫలితం మరొక ప్రదేశంలో, మరొక కాలంలో అందుతుంది.

గ్వాలియర్‌లో కర్మ చేస్తాం. గోవాలో ఫలాన్ని అనుభవిస్తాం. కర్మ చేయడం లోనే మనకు అధికారం ఉంది. ఏ కర్మకు ఏ ఫలం ఇవ్వాలో, ఎప్పుడివ్వాలో, ఎంత ఇవ్వాలో, ఎక్కడ ఇవ్వాలో, ఎందుకు ఇవ్వాలో, ఎలా ఇవ్వాలో ఇవన్నీ మనకు తెలియవు. అవన్నీ పరమేశ్వరుని అధీనంలో ఉన్నాయి. అందుకే ఆయన గతి. అందరికీ ఏకైక గతి.

**భర్త**

పోషించే వాడు కనుక భగవంతుడు భర్త ***(భర్తా పోష్టా).*** సమస్తాన్ని భరించే వాడు తానే. విశ్వానికి ఆయనే భర్త. వ్యక్తికి కూడా భర్త భగవంతుడే.

కుటుంబాన్ని పోషించే వాడు భర్త అని చెప్పుకుంటూ ఉంటాము. ప్రపంచా న్నంతటినీ పోషించే వాడు పరమాత్మ. విశ్వ మంతటికి తానే ఆధారమై, అధిష్ఠానమై పోషించే వాడు పరమాత్మ ***(ప్రపంచస్య అధిష్ఠానత్వేన భరణాత్ భర్తా).*** ప్రపంచానికి అధిష్ఠానంగా ఉంటూ సత్తాస్ఫూర్తులను కలిగించే వాడు కనుక ఆయన భర్త. స్థితి కారకుడు.

అంతేకాదు. జగత్తు నడవడానికి ఏ ధర్మాలు అవసరమో, ఆ ధర్మాలను ఏర్పరచిన వాడు, అట్టి ధర్మాల రూపములో ఉండువాడు తానే ***(ధర్మస్య భర్తా).*** సూర్య చంద్ర నక్షత్రాదులను నియమించే వాడు తానే. నదీ సాగర పర్వతాలను కదిలించే వాడు, ఆపేవాడు తానే. అన్ని రూపాలలో ధర్మ వైభవంతో శోభిస్తూ విశ్వాన్ని పోషిస్తూ ఉన్నందున పరమేశ్వరుడు భర్త.

భారాన్ని మోస్తూ తిరిగే శక్తి దేహానికి ఉంది. చూచే శక్తి, వినే శక్తి ఇంద్రియాలకు ఉన్నాయి. ఆలోచించే శక్తి మనస్సుకు ఉంది. ఆ శక్తి అంతా ఒక్కటే. అదే భగవంతుని శక్తి. ఆ శక్తి ఉండటం చేతనే సంసారాలు నిలుస్తున్నాయి. అలా పోషించే శక్తి మరొకరికి లేదు. అందుకే ఆయన భర్త.

ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి అన్నీ భగవంతుడు ప్రసాదించిన శక్తులే. రాత్రి పూట ఆదమరచి నిద్ర పోతాము. నిద్రలో అన్నీ మరచి పోతాము. నిద్ర లేవగానే తిరిగి మన స్మృతిని మనకు అనుగ్రహించి మనల్ని పోషిస్తాడు. నిద్రలో లేని స్మృతి, నిద్ర లేవగానే తిరిగి రాకపోతే, జీవనము ఎలా ఉంటుందో ఊహించుకో లేము. ఆయన ఇస్తేనే ఏదైనా. ఆయన అనుగ్రహం తోనే ఏ పోషణ అయినా. సమస్తానికి ఆయనే మూలం.

ఓట్లు పడితేనే గెలిచాను అని గెలిచిన నాయకుడు అనుకోవచ్చు. అలా అయితే, ఓడిపోయే వారికి కూడా ఓట్లు పడుతున్నాయి కదా! ఓట్లు వేయించుకొని మరీ ఓడి పోతున్నారు. అందుకే గెలుపు ఓటములు దైవాధీనాలు అన్నారు. ఒకవేళ ప్రజలు ఓటు వేసి అతణ్ణి నాయకుణ్ణి చేసినా, పరమాత్మ కృప లేకపోతే సభ్యులు అవిశ్వాసం ప్రకటించి దించేస్తారు.

దేహాన్ని పోషించేది కూడా దైవమే. దైవము తప్పుకుంటే దేహం రాలి పోతుంది. చనిపోయిన వ్యక్తి ప్రక్కన కూర్చుని ఏడుస్తూ ఉంటారు. 'నన్ను విడిచి పోయావా, నా దేవుడా!' అని అర్ధాంగి రోదిస్తూ ఉంటుంది. పోయిన వాడు భర్త. అంటే పోషించే వాడు పోయాడు. కాని పోయింది దేవుడు అని ఎందుకు రోదిస్తూ ఉంది? భర్త పోషించ వచ్చు. వాస్తవానికి పోషకుడు పరమేశ్వరుడే. ఆయనే భర్త. స్త్రీల కైనా, పురుషుల కైనా, బాలల కైనా, వృద్ధుల కైనా ఆయనే భర్త.

పెళ్ళి అయిన తరువాత భార్యకు భర్త రావచ్చు. ఆమెను పోషించ వచ్చు. పెళ్ళి కాక ముందు ఆమెను పోషించింది ఎవరు? భర్త మరణించిన తరువాత పోషించే దెవరు? గత జన్మలలో పోషించిం దెవరు? అతడే పోషకుడు, పోష్టా. భర్త. అందుకనే భర్త దేహం అక్కడే పడి ఉన్నా, 'పోయావా! నా దేవుడా!' అని భార్య ఏడుస్తూ





ఉంది. దేవుడు పోలేదు. దేవు డిచ్చిన వాడు పోయాడు. దేహం అనే ఇల్లు ఉంది. ప్రాణం అనే దీపం ఆరి పోయింది. కాని, ప్రాణ దీపాన్ని వెలిగించిన దేవుడు ఎక్కడికీ పోలేదు.

**నిలవదు ప్రాణము దేహములో**
**తరగదు ప్రేమ దైవములో**
**ప్రాణము పోసేది దైవము**
**పార బోసేది దేహము**
**దేహము లోనే చిత్తము**
**చిత్తము లోనే దైవము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

**ప్రభువు**

ప్రభువు అంటే శాసించే వాడు. అధిపతి. పాలించే వాడు. స్వామి ***(ప్రభుః స్వామీ).*** ప్రపంచ మంతా ఆయన పాలన లోనే ఉంది. విశ్వాన్ని నియమించే వానికి విశ్వానికి సంబంధించిన పూర్ణజ్ఞానం ఉండాలి. అట్టి విశ్వజ్ఞుడు, సర్వజ్ఞుడు పరమేశ్వరుడే గాని మరొకడు కాడు. అందుచేత ఆయన విశ్వానికి ప్రభువు. రాజ్యాన్ని పాలించే వాడు కదా ప్రభువు? అని మీరు ప్రశ్నించ వచ్చు. భగవంతుడు అలాంటి ప్రభువు కాడు. ఆయన ప్రభువులకు ప్రభువు.

మనం ప్రభువుకు నమస్కరిస్తాము, ఆయన మనలను పాలిస్తున్నాడు కనుక. ఆ ప్రభువే పూజాగదిలో కూర్చుని పరమేశ్వరునికి నమస్కరిస్తూ ఉంటాడు. ఎందుకని? ఆయన ప్రభువులకు ప్రభువు కనుక.

ఒక కాలంలో ఒక రాజ్యాన్ని, ఒక ప్రభువు తన పరిమిత జ్ఞానంతో, పరిమిత శక్తితో పోషించ వచ్చు. కాని, ఆ ప్రభువు పుట్టక ముందు దేశంలో ప్రభుత్వమే లేదా? ఆ ప్రభువు మరణిస్తే, ప్రభుత్వం లేకుండా పోతుందా? ప్రభువులు రాక ముందు సృష్ట్యాది నుండి ఏ ప్రభువైతే పరిపాలిస్తున్నాడో, రేపు ప్రభువులు నిష్క్రమించినా, ప్రళయం వరకు ఆ ప్రభువే పరిపాలిస్తూ ఉంటాడు. ఆయనే భగవంతుడు. ఆయనే స్వామి. ఆయనే ప్రభువు. కాలానికి, దేశానికి పరిమితం కాని ప్రభువు. అందుకే ఆయనను భూత భవ్య భవత్ప్రభువుగా కీర్తించింది విష్ణుసహస్రనామము.

***భూత భవ్య భవత్ప్రభుః -*** కాలాలు మారినా, దేశాలు మారినా, మారని ప్రభువు ఒక్కడే కనుక, ఒకే సమాసంలో ప్రభువును కీర్తించింది విష్ణుసహస్రనామము. **భూతం భవ్యం భవచ్చ ఇతి భూత భవ్య భవన్తి తేషాం ప్రభుః -** భూతకాలంలో, వర్తమానంలో, భవిష్యత్తులో ఉండే వారందరికీ ఆయనే ప్రభువు కనుక ఆయన భూత భవ్య భవత్ప్రభువు.

సాధారణంగా ప్రభువు బాహ్యంలో శాసించ గలడే గాని, ఆంతర్యాన్ని శాసించ లేడు. కాని, భగవంతుడు బాహ్యాభ్యంతరాలను శాసించే సర్వ శక్తిమంతుడు. ఒక వ్యక్తి నేరం చేస్తే, ఆ వ్యక్తిని కారాగృహంలో బంధించి రాజు శిక్షించ గలడు. భౌతికంగా అతణ్ణి కారాగృహంలో బంధించ గలడే గాని, అతని మనస్సును శిక్షించ గలడా? ప్రపంచం లోకి వెళ్ళి పచార్లు చేయకుండా మనస్సును ఆప గలడా? అలా చేసే శక్తి సామర్థ్యాలు ప్రభువైన పరమేశ్వరునికే ఉన్నాయి. అందుచేతనే నేరస్థులు చట్టాన్ని తప్పించుకో గలుగుతారు కాని, దైవాన్ని

తప్పించుకో లేరు. నేను ఈ తప్పు చేయకుండా ఉంటే బాగుండేది అని నేరస్థుడు ఆంతర్యంలో కుమిలి పోతూ ఉంటాడు. ఆ బాధ భౌతిక శిక్ష కన్నా భయంకరంగా ఉంటుంది. ఆ శిక్షను విధించిన ప్రభువు ఎవరు? అతడు లోకానికి సంబంధించిన ప్రభువు కాడు. సర్వలోకాధీశుడు. సర్వేశ్వరుడు.

**సాక్షి**

ప్రాణులు చేసిన కర్మలను, చేస్తున్న కర్మలను, చేయని కర్మలను తటస్థంగా ఉండి వీక్షించే వాడు కనుక భగవంతుడు సాక్షి ***(సాక్షీ ప్రాణినాం కృతాకృతస్య).*** సమస్తాన్ని మరొక దాని సహాయం లేకుండా దర్శించే వాడు. మనం దేనిని చూడాలన్నా కళ్ళ ద్వారానే చూడాలి. చూచినా కళ్ళు అర్థం చేసుకోలేవు కనుక, కళ్ళు చూచిన దానిని మనస్సుతో అర్థం చేసుకుంటాము. చూచే కళ్ళు అర్థం చేసుకోలేవు. అర్థం చేసుకొనే మనస్సు చూడలేదు. అందుచేతనే, న్యాయ స్థానాలలో సాక్షులు ఉన్నా, సాక్ష్యాలు ఉన్నా, అన్ని వేళల అవి సత్య సాక్ష్యాలు కాలేక పోతున్నాయి.

శబ్దాలను చెవులు వింటాయి. కాని అర్థం చేసుకోలేవు. చెవులు వినిన శబ్దాలను మనస్సు అర్థం చేసుకుంటుంది. కాని, మనస్సు స్వయంగా వినలేదు. కనుక, చెవులకు వినిపించింది మనస్సుకు మరో విధంగా అనిపించ వచ్చు. అలా అనిపించడానికి అనువుగా మనస్సులో ఎన్నో పూర్వానుభవాలు ఉంటాయి. ఈ కారణం చేత చాలా సమయాలలో తీర్పులలో ఊహించని మార్పులు చోటు చేసుకుంటూ ఉంటాయి. మనం మానవులం. పరిమితులం. అంతకు మించి ఏమీ చెయ్యలేము.

కాని, భగవంతుడు సర్వసాక్షి. సాక్షాత్తు సాక్షి. సర్వధీ సాక్షి. కనుక ఏదీ ఆయన చూపును తప్పించుకొని పోలేదు ***(సాక్షాత్ ఈక్షతే).*** ఆయన చూడటానికి ఉపాధులు, ఉపకరణాలు అవసరం లేదు. ఆయనది జ్ఞానదృష్టి. కనుక ఎవరు ఏది చేసినా, ఎవరు ఏది చేయక పోయినా, అంతా ఆయనకు తెలుసు ***(సర్వేషాం ప్రాణినాం కృతాకృతం సర్వం పశ్యతి).***

జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకు సాక్షి తానే. అలాగే వ్యక్తిలో నిరంతరము సాగే అవస్థాత్రయానికి కూడా సాక్షి తానే ***(అవస్థాత్రయ సాక్షీ).*** మనం చేసే కొన్ని కర్మలకు ఇతరులు సాక్షులు కావచ్చు. కాని భగవంతుడు సర్వకర్మ సాక్షి. అంతే కాదు. బాహ్యంలో జరిగే కర్మలను కదిలించే ఆలోచనలకు, వాటి వెనుక ఉన్న ఉద్దేశ్యాలకు కూడా సాక్షి తానే ***(సర్వధీ సాక్షిభూతం).*** అందుచేతనే, ఎంతటి వారైనా, ఎవరికీ భయపడని వారైనా, సాక్షీ గోపాలు డంటే కంపించి పోతారు.

ఒకడు న్యాయస్థానంలో సాక్ష్యం చెప్పడానికి వెళ్ళి సాక్షిగా నిలబడతాడు. ఒకటి చూచి మరొకటి చెబుతాడు. కళ్ళకు కనిపించింది చెప్పకుండా మనస్సుకు అనిపించింది చెబుతాడు. కాని, అలా చెప్పేవాడి మనస్సు లోని మర్మాన్ని కూడా పరమేశ్వరుడు సాక్షిగా వీక్షిస్తాడు.

మన కృత్యాకృత్యాలను సాక్షిగా వీక్షిస్తాడు కనుకనే, మొదటి విశేషణ మైన 'గతి' రూపంలో నిలిచి కర్మఫలాలను ప్రసాదిస్తాడు. బాధలు చుట్టుముట్టి నపుడు, 'భగవంతుడు నన్నిలా ఎందుకు పుట్టించాడో!' అంటూ ఉంటారు. అలా పుట్టించింది భగవంతుడు కాదు. కర్మఫలం. ఎవరికి వారు చేసుకున్నదే. చేసుకుని తెచ్చుకున్నదే. కాని తెచ్చుకున్నదే. భగవంతుడు సదా సాక్షీమాత్రుడే.

పరిస్థితులు జీవితంలో వక్రించి నపుడు, తలపెట్టింది ఏదీ తోడు రానపుడు, 'ఏం చేద్దాం! నా తలరాత అలా తగలడింది' అంటూ ఉంటారు. తలరాత వ్రాసిం దెవరు? ఏమో! భగవంతుడు మాత్రం కానే కాదు. అంతవరకు నాకు బాగా తెలుసు.





భగవంతుడు తల మాత్రమే ఇచ్చాడు. ఆ వ్రాసుకునే దేదో మనమే వ్రాసుకున్నాం. పలక మీద చిన్న పిల్లవాడు అక్షరాలు వ్రాసుకున్నట్లు, మన తలల మీద మనమే మన కర్మల వివరాలను వ్రాసుకున్నాం. కాకపోతే, దేవుడు సాక్షి కనుక మౌనంగా చూస్తూ ఉంటాడు. ఈ కారణం గానే కొందరు నిర్దోషులు దోషులుగా నిర్ణయింపబడి నపుడు, బాధతో వారు కుంచుకు పోతూ, 'ఎవరే మనుకున్నా ఆ దేవుడి కన్నీ తెలుసు. ఆయన అన్నీ చూస్తూనే ఉన్నాడు' అంటూ ఉంటారు. ఇది అక్షర సత్యం. అక్షరాలు తెలియని నిరక్షరాస్యులు కూడా ఈ పుణ్య సంస్కృతిలో పలికే సత్యవచనం.

**నివాసము**

ప్రాణు లన్నిటికి నివాస స్థానము కావడం చేత భగవంతుడు నివాసము ***(యస్మిన్ ప్రాణి నః నివసన్తి, నివాసః).*** పరమేశ్వరుడు సర్వభూత నివాస స్థానము. అన్నిటికి, అందరికి ఉనికి ఆయనే. అందరి మనుగడకు ఆధారమైన వాడు తానే.

ఏది ఉన్నా, అది అలా ఉంది అంటే, దేని వల్ల అది అలా ఉందో, అందులోనే అది ఉంది. అదే దానికి నివాస స్థానము. ఆకాశము ఉంది. కాలము ఉంది. అన్నీ ఆకాశం లోనే ఉండవచ్చు. కాలం లోనే కనిపించ వచ్చు. కాని, 'ఆకాశము ఉంది' అన్న వాక్యములో 'ఉంది' అనేది ఏదో, అందులోనే ఆకాశం ఉంది. అదే సత్యము. ఆ సత్యరూపుడే పరమేశ్వరుడు. ఆకాశము ఎప్పుడైతే పరమేశ్వరుని యందే ఉందో, ఆకాశములో ఉన్న వన్నీ భగవంతుని యందే ఉన్నాయి అని అర్థము. కనుకనే భూతము లన్నీ నా యందే ఉన్నాయి ***(మత్‌స్థాని సర్వ భూతాని*** *9 వ అ - 4 వ శ్లో)* అన్నాడు భగవంతుడు. అంటే, సర్వభూతాలకు నివాస స్థానము తానే అని భావము.

**శరణం**

***శరణమ్*** అంటే రక్షకుడు అని అర్థము. బాధల నుండి రక్షించ మని తనను ఆశ్రయించిన భక్తులకు ఆశ్రయ మైన వాడు కనుక భగవంతుడు శరణము ***(శరణమ్ ఆర్తానాం మత్ప్రపన్నానామ్ ఆర్తిహరః).*** భక్తుల ఆర్తిని పోగొట్టే వాడు కనుక ఆయన శరణము.

ఆర్తి అంటే బాధ, లేక దుఃఖము అని అర్థము. బాధల్ని భరించడం, దుఃఖాన్ని సహించడం ఎవరి కైనా కష్టమే. ఈ దుఃఖము మళ్ళీ రెండు విధాలు. ఒకటి సంసారములో దుఃఖము. రెండవది సంసార దుఃఖము. అంటే దుఃఖరూప సంసారము. జనన మరణ రూప సంసార దుఃఖము. ఈ రెండు దుఃఖాలను పోగొట్టే సామర్థ్యము భగవంతుడి కొక్కడికే ఉన్నందున ఆయన సర్వులకు శరణమై ఉన్నాడు ***(ఆర్తానాం ఆర్తి హరణాత్ శరణమ్).***

మొసలి గజేంద్రుని మడుగు లోకి ఈడుస్తూ ఉంటే, తనకిక పరమేశ్వరుడు తప్ప మరో దిక్కు లేదు అని గ్రహించిన గజేంద్రుడు, **ఈశ్వరునే శరణంబు వేడెదన్** అని తన ఆర్తనాదాన్ని వినిపించ గానే, **గజప్రాణావ నోత్సాహి** యైన శ్రీహరి గగన మార్గాన వచ్చి, తన సుదర్శన చక్రముతో మొసలి శిరస్సును ఖండించి, గజేంద్రుని ఆర్తిని పోగొట్టి, ***శరణమ్*** అని సార్థక నామధేయు డయ్యాడు.

సంసారము లోని దుఃఖాలను పోగొట్ట మని పరమేశ్వరుని ఆశ్రయించే భక్తులకు ఆయనే శరణము. అలాగే జనన మరణ సంసార దుఃఖమును పోగొట్టి మోక్షమును ప్రసాదించ మని భగవంతుని ఆశ్రయించే ముముక్షువులకు కూడా ఆయనే శరణము. 'నాకు శ్రేయస్సును బోధించు' అని విషాద వదనుడై ప్రార్థించిన అర్జునునికి గీతను బోధించి మోక్షాన్ని ప్రసాదించి భగవానుడు ***శరణమ్*** అయ్యాడు.

**సుహృత్**

ప్రత్యుపకారాన్ని ఆశించకుండా ఉపకారం చేసేవాడు **సుహృత్.** అట్టివాడు పరమేశ్వరు డొక్కడే ***(సుహృత్ ప్రత్యుపకార అనపేక్షీ సన్ ఉపకారీ).*** ఎవరి నుండైనా మనం ఉపకారం పొందాలి అంటే, ఒకటి, మనం అతనికి తెలిసి ఉండాలి. లేదా, అతనికి సన్నిహితుడైన వాడు మనకు యోగ్యతా పత్రాన్ని ఇవ్వాలి. అప్పుడే మనకు ఉపకారం అందుతుంది. ముక్కు మొగం తెలియని వారికి ఎవ్వరూ ఉపకారం చెయ్యరు. కాని, పరమేశ్వరుడు అలా కాదు. అవసరం ఉండి, ఆర్తితో ఆయన నుండి ఉపకారాన్ని కోరిన వారందరికీ, తిరిగి ప్రత్యుపకారాన్ని ఆశించకుండా ఉపకారం చేస్తాడు. అందుకే ఆయన సుహృత్తు ***(ప్రత్యుపకార నిరపేక్షతయా ఉపకారిత్వాత్ సుహృత్).***

ఎటువంటి ప్రత్యుపకారాన్ని ఆశించకుండా, ఏ విధమైన ఉపకారాన్ని చేయడాని కైనా పరమేశ్వరుడు సిద్ధంగా ఉన్నా, జనులు బాధల్లో పడి మ్రగ్గుతుంటారే గాని పరమాత్మను ఆశ్రయించి ఫలితాన్ని పొందలేక పోతారు. ప్రారబ్ధాన్ని అనుసరించి బ్రతుకులో ప్రతికూలాలు ఏర్పడతాయి. భగవంతుని ప్రార్థించడం అనేది పురుషార్థానికి సంబంధించిన విషయం. బాధలు వచ్చినంత మాత్రాన మనుషులు భగవంతుని ప్రార్థించ లేరు? బాధలలో ఏడవ గలరే గాని పరమేశ్వరుని వేడుకో లేరు. అలా వేడుకోవాలి అంటే, సంస్కారం ఉండాలి. భక్తి సంస్కారం అలవడి ఉండాలి. అప్పుడే ప్రార్థించ గలరు.

ప్రార్థించడం అనేది కర్మ. ప్రార్థన అనే కర్మకు ఫలితం దయ. సంస్కారి భగవంతునికి నమస్కరించి ప్రార్థిస్తాడు. భగవానుడు **సుహృత్** పాత్రను పోషించి, ప్రత్యుపకారాన్ని ఆశించకుండా ఫలితాన్ని ఇచ్చి ఉపకారం చేస్తాడు.

నదిలో నీళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. ఎవరైనా వెళ్ళి కడుపు నింపుకో వచ్చు. అలాగే పరమేశ్వరుని దయామృతం సదా ప్రవహిస్తూనే ఉంటుంది. అది ఏ ఒక్కరికో పరిమితం కాదు. ఎవ్వరైనా ప్రార్థించి దానిని పొందవచ్చు. అందుకనే, సర్వభూతాలకు పరమాత్మ **సుహృత్** అని ఐదవ అధ్యాయం లోనే గీతాచార్యుడు ప్రకటించాడు ***(సుహృదం సర్వభూతానాం,*** *5 - 29*). కేవలం ఈ జన్మ లోనే కాదు. భక్తులకు ఆయన శాశ్వత మిత్రుడు.

**ప్రభవ ప్రళయ స్థానాలు**

జగత్తు దేని నుండి పుడుతుందో అది జగత్తు యొక్క ప్రభవ స్థానము. అట్టి ఉత్పత్తి స్థానము భగవంతుడే ***(ప్రభవః ఉత్పత్తిః జగతః).*** జగత్తు తిరిగి ఎక్కడ లయ మవుతూ ఉందో, అది జగత్తు యొక్క విలయ స్థానము. అది కూడా భగవంతుడే ***(ప్రలయః ప్రలీయతే యస్మిన్ ఇతి).*** అలాగే జగత్తు ఎక్కడ స్థిరంగా ఉందో అది స్థితి స్థానము. అది కూడా భగవంతుడే ***(తథా స్థానం తిష్ఠ త్యస్మిన్ ఇతి).***

అలలు సముద్రం నుండి పుడతాయి. పుట్టిన అలలు, అవి ఉన్నంత వరకు సముద్రం లోనే ఉంటాయి. ఆ తరువాత సముద్రం లోనే విలీన మవుతాయి. కనుక అలలకు ప్రభవ స్థానము, ప్రళయ స్థానము సముద్రమే. సముద్రము ఏకము. పూర్ణము.

అలాగే జగత్తు పరమాత్మ నుండే పుడుతుంది ***(ఎవ్వనిచే జనించు జగము).*** అలా పుట్టిన జగత్తు ఉన్నంత వరకు పరమాత్మ యందే మనుగడను సాగిస్తుంది ***(ఎవ్వని లోపల నుండు లీనమై).*** ఆ తరువాత పరమాత్మ యందే విలీన మవుతుంది ***(ఎవ్వని యందు డిందు).*** జగత్తుకు ప్రభవ స్థానము, ప్రళయ స్థానము, స్థితి స్థానము పరమేశ్వరుడే. ఆయనే మూల కారణము. ఆయనే అనాది మధ్య లయుడు. సర్వమూ తానైన





వాడు అతడే. అతడే ఆత్మభవుడు. అలలకు అబ్ధి ఎలా శరణమో, జగత్తుకు పరమాత్మ అలా శరణమై ఉన్నాడు.

**నిధానం**

నిధి, లేదా నిక్షేపాన్ని **నిధానం** అంటారు. కాలాంతరంలో ప్రాణులు అనుభవించే నిధిని, లేదా నిక్షేపాన్ని నిధానం అంటారు ***(నిధానం నిక్షేపః కాలాన్తరో పభోగ్యం ప్రాణినామ్).*** వస్తువులను దాచి ఉంచే, లేదా నిల్వ చేసే స్థానమును నిధి, లేదా నిధానము అంటారు. అది ఒక ట్రెజరీ లాంటిది. లేదా బ్యాంక్ లాంటిది. బ్యాంకులో ఆభరణాలు, ధనం మనం దాచుకుంటాము. అవసర మైనపుడు తీసుకుంటాము.

అలాగే మనం ఆచరించిన కర్మల యొక్క ఫలాలు భవిష్యత్తులో భోగార్థం మనకు అందుతాయి. మరి, ప్రస్తుతం అవి ఎక్కడున్నట్లు? పరమేశ్వరుని యందే గుప్తంగా ఉన్నాయి. భవిష్యత్తులో సానుకూల సమయంలో, ప్రదేశంలో అనుభవింప బడటానికి నిరీక్షిస్తున్న కర్మఫలాలు, ప్రస్తుతం పరమేశ్వరుని యందే భద్రంగా ఉన్నాయి. అందుచేత, ఆయన నిధానము. మనకు అన్నీ ఆయన నుండే అందుతున్నాయి.

నిద్రలో ఏవీ మన వద్ద ఉండవు. గొప్ప సంగీత విద్వాంసుడైనా నిద్రలో సంగీతాన్ని తన వద్ద ఉంచుకో లేడు. ఉంచుకో గలిగితే, నిద్రిస్తూ ఆయన గారు పెట్టే గురక ఎంత మోహనంగా ఉండేదో కదా! అంతేగాని, గేదె కుడితి త్రాగినట్లు, అంత దారుణంగా అపశ్రుతి ఎందు కుంటుంది?

నిద్రలో మన సంగీతం, మన వ్యాకరణం, మన జమాఖర్చులు ఏవీ మన వద్ద ఉండవు. మరి, అవన్నీ ఏమైనట్లు? ఏమీ కావు. అన్నీ భగవంతుని వద్దే ఉంటాయి. ఆయన నిధానం కదా! అన్నీ దాచి పెడతాడు. మళ్ళీ నిద్ర లేవగానే అడగకుండానే అన్నీ తగిలిస్తాడు.

అలాగే ప్రళయ కాలంలో జగత్తు లయించి పోతూ ఉంది కదా! మళ్ళీ సృష్ట్యాదిలో ఆ లయించిన వన్నీ తిరిగి పుడుతున్నాయి. అంటే, ప్రళయంలో అవన్నీ నిధానమైన భగవంతునిలో నిక్షేపంలా ఉంటాయి అని అర్థం ***(ప్రళయ కాలే అస్మిన్ సర్వం నిధీయతే ఇతి నిధిః).*** అందుకే ఆయన నిధానము.

మనకు మోక్షాన్ని ప్రసాదించే వాడు జనార్దనుడు. మోక్షము ఉన్నదే అయినా, నిత్య సిద్ధమే అయినా, అది అలా ఉన్నట్లు తెలిసి నపుడే మోక్షము కలుగుతుంది. ఆ దివ్య క్షణం భవిష్యత్తులో రానుంది. కాలాంతరంలో అంద బోతోంది. మరి, అది ఇప్పు డెక్కడుంది? నిధానంలో నిక్షేపంలా ఉంది. ఈ భావన ఎంత పారవశ్యాన్ని కలిగిస్తుంది? నిధానానికి సంబంధించిన ఆలోచనే మనకు అంతటి ఆనందాన్ని కలిగిస్తే, ఆ నిధానాన్ని కళ్ళారా చూచిన ప్రహ్లాదుడు ఎలా తన్మయు డయ్యాడో! ఎలా పొంగి పోయాడో! ఒళ్ళు మరచి ఎలా గంతు లేశాడో పోతనామాత్యుడే చెప్పాలి.

**నలినాక్షుడను నిధానము గంటి నేనని యుబ్బి గంతులు వైచు నొక్కచోట**

కమలాక్షు డనే నిధానాన్ని (మోక్షరూపుణ్ణి) కళ్ళారా చూశాను - కళ్ళారా చూశాను - కళ్ళారా చూశాను అని ఒళ్ళు మరచి గంతు లేశాడట. ఆ విధానమే మన నిధాన మగు గాక!

**అవ్యయ బీజము**

నశించని బీజము కావడం చేత పరమేశ్వరుడు అవ్యయ బీజము. సంసార మనే వృక్షానికి పరమేశ్వరుడు అవ్యయ బీజము. ఈ బీజము అంకురించే ధర్మం గలది. అంకురించే శక్తి గలది. అంకురించే ధర్మం గల ఈ బీజము అంకురించడానికి కారణమైన బీజము ***(బీజం ప్రరోహ కారణం ప్రరోహ ధర్మిణామ్).***

ఏ బీజమైనా అంకురించ గానే, అంటే మొలకెత్త గానే నశిస్తుంది. కాని, ఈ బీజము నశించదు.

అవ్యయంగా ఉంటుంది. అందుచేత నశించని స్వభావం గల ఈ బీజమును అవ్యయ బీజము అనడం జరిగింది. సంసారం ఉన్నంత వరకు ఇది ఉంటుంది. అందుచేత ఇది నశించనిది ***(యావత్ సంసార భావిత్వాత్ అవ్యయం).***

బీజం లేకుండా ఏదీ అంకురించదు ***(న హి అబీజం కించిత్ ప్రరోహతి).*** మరి సంసారము, అనగా ఈ ప్రపంచము నిత్యము అంకురిస్తూనే ఉంది కదా! అందుచేత అది నశించని బీజము ***(నిత్యం చ ప్రరోహ దర్శనాత్ బీజ సంతతిః నిత్యా ఇతి గమ్యతే).*** అనాదిగా ఉంటూ, సదా పరివర్తనం చెందుతూ ప్రవర్తమాన మైన ఈ సంసార వృక్షానికి నశించని బీజము పరమేశ్వరుడే ***(బీజ మవ్యయమ్).***

ప్రపంచంలో ఏది కార్యంగా గోచరించినా దానికి కారణం ఉంటుంది. ఆ కారణమే బీజము. ఇలా నిరంతరం సాగే ఈ కార్యకారణాలలో ఆలోచించి చూస్తే ప్రతి కారణము కార్యం గాను, ప్రతి కార్యం కారణం గాను కనిపిస్తూ ఉంటాయి.

ఒక ఆవు దూడకు జన్మ నిస్తుంది. ఆవు కారణము, దూడ కార్యము. ఆ దూడ పెరిగి పెద్దదై ఆవు అవుతుంది. తిరిగి అది మరొక దూడకు జన్మ నిస్తుంది. అంటే పూర్వం దూడగా కార్య మైనది, ఇప్పుడు ఆవుగా కారణమైంది. కాని, కాలంలో ఆవులు, దూడలు నశించి పోతూ ఉంటాయి. అంటే, ప్రపంచంలో కనిపించే కారణకార్యాలు ఒక వైపు నశించి పోతున్నా, మరో వైపు అంకురిస్తూ ఈ లోకం కొనసాగుతూనే ఉంది. బీజం లేకుండా అంకురించడం జరగదు కదా! ఈ విధంగా నిత్యము అంకురించడ మనే కార్యానికి ప్రరోహ కారణము ఉంటూనే ఉంది కనుక అది అవ్యయ బీజము. అదే భగవంతుడు.

*పదహారవ శ్లోకంలో ప్రారంభించిన ఈ విశ్వరూప ఉపాసనా ప్రకరణాన్ని ఇక్కడ సమాప్తం చేస్తున్నాడు.*

**తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ ।**
**అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున ॥** **19**

***తపామి-అహం-అహం-వర్షం-నిగృహ్ణామి-ఉత్సృజామి-చ***
***అమృతం-చ-ఏవ-మృత్యుః-చ-సత్-అసత్-చ-అహం-అర్జున***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = | అర్జునా! | ఉత్సృజామి చ | = | కురిపిస్తున్నాను |
| అహం | = | నేను | అమృతం చ | = | అమృతమును |
| తపామి | = | తపింప చేస్తున్నాను | మృత్యుః చ | = | మృత్యువును |
| అహం | = | నేను | సత్ | = | సత్తును |
| వర్షం | = | వర్షమును | అసత్ చ | = | అసత్తును |
| నిగృహ్ణామి | = | నిలుపుతున్నాను | అహం ఏవ | = | నేనే |

**అర్జునా! నేను సూర్యుణ్ణై ఉడికిస్తున్నాను. వర్షాన్ని ఆకాశంలో నిలుపుతున్నాను. మళ్ళీ కురిపిస్తున్నాను. అమృతము నేనే. మృత్యువూ నేనే. నేనే సత్తు. నేనే అసత్తు కూడా.**

**వ్యాఖ్య**

**ఆదిత్య రూపం**

యావ ద్విశ్వానికి సత్తా స్ఫూర్తి ప్రదాత అయిన పరమేశ్వరుడు సూర్యునిలో నిలిచి వెలుగును, వేడిని అనుగ్రహిస్తున్నాడు. ***ఆదిత్యాత్ జాయతే వృష్టిః*** - సూర్యుని వల్లనే వర్షము కురుస్తూ ఉంది అని స్మృతి వాక్యము.





సూర్యునిలో అలా వర్షాన్ని కురిపించే శక్తి తనదే అని చెబుతూ, **బహుధా మాం ఉపాసతే** అంటూ పదహైదవ శ్లోకంలో ప్రారంభించిన విశ్వరూపోపాసనను కొనసాగిస్తున్నాడు.

సూర్యుడు వెలుగును చిందించి విశ్వాన్ని వెలిగిస్తాడు. అలాగే వేడిని అందించి జగత్తును ఉడికిస్తాడు. వెలుగుల ద్వారా చీకట్లను తొలగించి జగత్తుకు జీవనాన్ని ప్రసాదిస్తాడు. వేడి ద్వారా మురికిని, మంచును నిర్మూలించి జీవులకు ఆరోగ్యాన్ని అనుగ్రహిస్తాడు.

సూర్యుని నుండి విరజిమ్మబడే కిరణాలు కొన్ని తీక్షణంగా ఉంటాయి. కొన్ని వెచ్చగా, మరి కొన్ని నులివెచ్చగా ఉంటాయి. నీరెండలో కిరణాలు మృదువుగా ఉండి హాయి నిస్తాయి. సూర్య ప్రకాశం ఇన్ని విధాలుగా ఉండటానికి వెనుక నియతి ఉంది. ఆ నియతి రూపంలో ఉన్నది ఎవరో కాదు, నియంత. సూర్య కిరణాలలో ఈ విధమైన వ్యత్యాసం వెనుక ధర్మం ఉంది. ఆ ధర్మరూపంలో ఉన్నది దైవమే.

అర్జునా! నేను ఆదిత్య రూపంలో ఉంటూ తీక్షణము లైన కొన్ని కిరణాల చేత భూమిని ఉడికిస్తాను ***(తపామి అహమ్ ఆదిత్యః భూత్వా కైశ్చిత్ రశ్మిభిః ఉల్బణైః).*** కొన్ని కిరణాల చేత వానలు కురిపిస్తాను ***(అహం వర్షం, కైశ్చిత్ రశ్మిభిః ఉత్సృజామి).*** అలా కురిపించి, తిరిగి కొన్ని కిరణాల చేత ఎనిమిది మాసాల పాటు వర్షాన్ని నిలిపి ఉంచుతాను ***(ఉత్సృజ్య పునః నిగృహ్ణామి కైశ్చిత్ రశ్మిభిః అష్టభిః మాసైః).*** మళ్ళీ వర్షా కాలంలో కురిపిస్తాను ***(పునః ఉత్సృజామి ప్రావృషి).***

సూర్యుడుగా ఉంటూ పరమేశ్వరుడు గ్రీష్మం నుండి ఎండ కాసి భూమండలాన్ని ఉడికిస్తాడు. ప్రపంచం బాగా కాగిన తరువాత ఆ వేడికి జలాలు ఉడికి ఆవిరి అవుతాయి. ఆ ఆవిరిని మేఘ రూపంలో కార్తీకము నుండి ఎనిమిది మాసాల వరకు ఆకాశంలో నిలుపుతాడు **(నిగృహ్ణామి).** వర్షాకాలంలో మళ్ళీ ఆ జలాలను వర్ష రూపంలో భూమిపై పోస్తాడు.

సూర్యుని వల్ల జరిగే ఈ కార్యాలన్నీ సూర్యునిలో పరమేశ్వరుడు అంతర్వర్తిగా ఉండటం చేతనే సాధ్య మవుతున్నాయి. ఈ కార్యాలలో నియతి గోచరిస్తూ ఉండటమే అందుకు నిదర్శనం. నియతి ఉన్న చోట నియంత ఉంటాడు. నియంత సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. కనుక నియంత ఒక్కడే గాని ఇద్దరు నియంతలు ఉండే అవకాశం లేదు. సూర్యుడు, సూర్యమండ లాంతర్వర్తి యైన నారాయణుడు, ఇద్దరూ నియంతలు కాలేరు. అందుచేత భగవంతుడే సూర్యునిలో ఉంటూ ఈ కార్యాలన్నీ నిర్వహిస్తూ ఉన్నాడు.

నియతి ఉంది కనుకనే, వాతావరణ కేంద్రం పని చేస్తోంది. నియతి లేకపోతే అంతా నిరర్థకమే. నియతిలో నియంతే ఉన్నాడు. వేడి, వెలుగు, నీరు, వర్షము - ఇవన్నీ కాలం మీద, ఋతువుల మీద ఆధారపడి ఉన్నాయి. కనుక ఋతువులు, కాలము అన్నీ పరమేశ్వరుడే.

సూర్యుని నుండి తీవ్రము లైన కిరణాలను కదిలించి భూమిని ఉడికించడం, ఆవిరిని పైకి తరలించడం, మేఘంగా ఆకాశంలో నిలపడం, తిరిగి మళ్ళీ భూమిపై వర్షంగా కుమ్మరించడం - ఇదంతా నియతి. ఈ నియతిలో దివ్యంగా నియంత శోభిస్తున్నాడు.

ఇక్కడ కేవలం నియతి ఒక్కటే కాదు. దయ కూడా దోబూచు లాడుతూ ఉంది. వేడి, వెలుగు, నీళ్ళు వర్షం - ఇవన్నీ ఎవరి కొరకు? జీవుల మనుగడకే. అదంతా భగవంతుని ప్రేమ. ఆవిరయ్యే సాగర జలాలు ఉప్పు నీరు. వాటిని సూర్య కిరణాల ద్వారా చేదుకొని, ఆకాశం లోనే ప్రయోగశాలను నిర్మించి, ఉప్పు నీటిని మంచినీరుగా, త్రాగునీరుగా, చల్లని తియ్యని పానీయంగా మార్చి క్రిందికి పోస్తున్న పరమేశ్వరుని దయను వర్ణించడం ఎవరి తరము? ఇది అర్థమైతే, విశ్వరూపోపాసన సహజంగా, సరళంగా, నిరాటంకంగా సాగుతుంది.

**అమృతము - మృతము**

అమృతము, మృత్యువు రెండూ పరమేశ్వరుడే. అమరులైన దేవతలు పానం చేసే అమృతము తానే. మానవులు అనుభవించే మరణమూ తానే *(అమృతం చైవ దైవానామ్ మృత్యుశ్చ మర్త్యానామ్)*.

అమృత పానం చేస్తారు కనుక దేవతలు మరణించరు. అందుచేత వారు అమరులు *(న మ్రియన్తే)*. మర్త్య లోకంలో, అంటే మానవ లోకంలో ఆచరించిన పుణ్యకర్మల ఫలంగా దేవతలై స్వర్గంలో అమృతపానం చేస్తారు. అమృత పానం చేయాలి అంటే పుణ్యం ఉండాలి. పుణ్యం ఉండాలి అంటే పుణ్య కార్యాలు ఆచరించి ఉండాలి. కనుక పుణ్యకార్యాలు, పుణ్యము, పుణ్యఫలమైన స్వర్గము, స్వర్గములో లభించే అమృతము, అన్నీ పరమేశ్వరుడే. దేవతల అమృతము పరమేశ్వరుడై నపుడు, మానవుల మరణ మెవరు? మర్త్యుల మృత్యువు ఎవరు? అదీ భగవంతుడే.

మృత్యువు కూడా పరమేశ్వరుడేనా? అదెలా? ఎలాగో చూద్దాం. పుణ్యాత్ములు స్వర్గంలో అమృతపానం చేసి అమరు లవుతారు. దేవతా శరీరాలను ధరిస్తారు. సరే, బాగుంది. అమృతపానం అనేది పుణ్యకర్మల ఫలం కదా! పుణ్యకార్యాలు ఆచరించేది మానవ లోకంలో అయినపుడు, పుణ్యఫలంగా ప్రాప్తించే అమృతాన్ని ఇక్కడే పానం చెయ్యొచ్చు కదా! చెయ్యొచ్చు. కాని, అది ఇక్కడ లభిస్తే కదా! ఏది ఎక్కడ ఉండాలో అది అక్కడ మాత్రమే ఉండటము కూడా నియతే. మొక్కలో పువ్వు లుంటాయి. నదిలో నీళ్ళుంటాయి. చెట్టులో పళ్ళుంటాయి. స్వర్గంలో అమృతం ఉంటుంది. అక్కడి కెళ్తేనే అది లభిస్తుంది. అక్కడి కెళ్ళాలంటే ముందు ఇక్కడ నుండి కదలాలి. ఇక్కడ మృత మైతేనే అక్కడ అమృతం లభిస్తుంది. ఇక్కడ మానవ శరీరాన్ని త్యజిస్తేనే అక్కడ అమృత పానానికి యోగ్యమైన దేవతా శరీరం ప్రాప్తిస్తుంది. అంటే ఇక్కడ మరణించాలి కదా! అవును. అమృతం పరమేశ్వరుని స్వరూప మైనపుడు అమృత పానానికి ఉపకరించే మృత్యువు పరమేశ్వరుని స్వరూపం కాకుండా ఎలా ఉంటుంది? కనుక మృత్యువు కూడా మంగళమే. మృత్యు రూపంలో ఉండేది కూడా పరమేశ్వరుడే. పుట్టిన ప్రాణులన్నీ గిట్టకుండా ఉండిపోతే, ఆ తరువాత బ్రతికి ఉన్న వాళ్ళకు ప్రత్యేకమైన చావు అవసరమా? బ్రతుకే చావుగా మారిపోదా? కనుక మృత్యువు కూడా మంగళ స్వరూపమే. శివ స్వరూపమే.

మరణం మహేశ్వర స్వరూపము. మరి, మహేశ్వరుడు పిలవకుండానే వస్తే, ముఖం ప్రక్కకు త్రిప్పుకుంటామా? దుఃఖిస్తామా? భగవంతుని రాకను అమంగళంగా భావిస్తామా? అందుకే, మన భారతీయ సంస్కృతిలో తిరునాళ్ళలో పరమేశ్వరుడు ఊరేగుతూ వచ్చి నప్పుడు, మన ఇంటి ముందుకు రాగానే, కొబ్బరికాయ కొట్టి, పూలమాలను సమర్పించి, కర్పూర హారతి ఇస్తాము.

మృత్యు రూపంలో అరుదెంచేది ఈశ్వరుడే కాబట్టి, ఎక్కడ మృత్యువు సంభవించినా, వెంటనే ఆ మృత కళేబరానికి పూలమాల వేసి, కొబ్బరికాయ కొట్టి, తల వద్ద దీపం వెలిగిస్తాతాము. మృత్యువును ఈశ్వర స్వరూపంగా భావించడమే ఈ కార్యాల వెనుక ఉన్న కారణము.

**సద సత్తులు**

**ఇదమస్తి** - ఇది ఉంది అని రూపం చేత గాని, శబ్దం చేత గాని ఏదైతే నిర్దేశింప బడుతూ ఉందో అది వ్యక్తము, కార్యము, నామరూపాత్మకము. అదే సత్తు. దీనికి ఏది కారణమో అది అవ్యక్తము. అదే నామరూపాత్మక మైన సత్తుకు కారణము. కనుక అది అసత్.

వ్యక్తమైంది స్థూలము. అవ్యక్త మైంది సూక్ష్మము. స్థూలమైన సత్ కార్యము. సూక్ష్మమైన అసత్ కారణము.





***సత్ అభివ్యక్త రూపత్వాత్ కార్య మిత్యుచ్యతే బుధైః ।***
***అసత్ అవ్యక్త రూపత్వాత్ కారణం చాపి శబ్దితమ్ ॥***

కార్య రూపంలో అభివ్యక్త మవుతూ ఉంది కనుక అది సత్తు. కారణ రూపంలో అవ్యక్తంగా ఉండేది అసత్తు అని పండిత నిర్ణయము.

సత్తుగా కార్య రూపంలో ఉండే ప్రపంచము, అసత్‌గా కారణ రూపంలో ఉండే ప్రకృతి, లేదా మాయ రెండూ మిథ్యా రూపాలే. పరమేశ్వరుడు సత్యమే గాని మిథ్య కాడు కదా! కనుక, ప్రపంచ రూపంలో కార్యంగా గోచరిస్తున్న సత్, ప్రకృతి రూపంలో కారణంగా తెలుస్తున్న అసత్, ఈ వ్యక్తావ్యక్తములు రెండూ పరమేశ్వరుడు కాడు. వీటికి అన్యమైన సత్యరూపుడే భగవంతుడు.

**అసచ్చ సచ్చైవ చ య ద్విశ్వం సదసతః పరమ్ !**

'అసత్తుగా, సత్తుగా ఏది ఉందో అదే ప్రపంచము. అట్టి సదసత్తుల కంటే అతీతమైన వాడు పరమేశ్వరుడు' అని మహాభారతము.

ఇక్కడే జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. శుద్ధ చైతన్య స్వరూపుడైన భగవంతుడు కార్యకారణాలకు అతీతుడు. మరి సత్ అయిన కార్యరూప ప్రపంచము, అసత్ అయిన కారణరూప ప్రకృతి, ఈ రెండిటికి ఆశ్రయ మేమిటి? ***బ్రహ్మాశ్రయా*** - బ్రహ్మమే కదా ఆశ్రయము! కనుక, సదసత్తులు కూడా తానే. కాని తాను సదసత్తులు కాడు. కుండ మట్టే. కాని, మట్టి కుండ కాదు. ఇదీ అవగాహన. అందుచేత, విశ్వరూ పోపాసనలో అమృత మృత్యువులు, సదసత్తులు కూడా తానే అని ప్రవచించి, బహుధా ఉపాసన విధానాన్ని పదహారవ శ్లోకం నుండి విస్తారంగా బోధించి ఇక్కడ సమాప్తి చేశాడు.

*ఏకత్వోపాసన, పృథక్త్వోపాసన, బహుధా విశ్వరూప ఉపాసనను వివరించిన వాసుదేవుడు, కోరికలతో ఉపాసించే అవివేకులను గూర్చి చెబుతున్నాడు.*

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్య మాసాద్య సురేన్ద్ర లోక మశ్నన్తి దివ్యా న్దివి దేవభోగాన్ ॥ 20

**త్రైవిద్యాః-మాం-సోమపాః-పూతపాపాః-యజ్ఞైః-ఇష్ట్వా-స్వర్గతిం-ప్రార్థయంతే**

**తే-పుణ్యం-ఆసాద్య-సురేంద్రలోకం-అశ్నన్తి-దివ్యాన్-దివి-దేవభోగాన్**

త్రైవిద్యాః = వేదాధ్యయనపరులు
యజ్ఞైః = యజ్ఞముల చేత
మాం = నన్ను
ఇష్ట్వా = పూజించి
సోమపాః = సోమపానము చేసినవారు
పూతపాపాః = శుద్ధి చేయబడిన పాపములు గలవారు
స్వర్గతిం = స్వర్గలోక స్థితిని
ప్రార్థయంతే = ప్రార్థిస్తున్నారు

తే = వారు
పుణ్యం = పుణ్యప్రదమైన
సురేంద్రలోకం = దేవేంద్రలోకమును
ఆసాద్య = పొంది
దివి = స్వర్గములో
దివ్యాన్ = దివ్యములైన
దేవభోగాన్ = దేవతా భోగాలను
అశ్నంతి = అనుభవిస్తున్నారు

**అర్జునా! వేదం తెలిసిన వాళ్ళు సోమపానం చేస్తారు. యజ్ఞాల చేత నన్ను పూజించి, పాపాలు పోగొట్టుకుంటారు.**

**స్వర్గం కోసం ప్రార్థిస్తారు. పుణ్యప్రద మైన సురేంద్ర లోకాన్ని పొంది, స్వర్గంలో దివ్యమైన సుర భోగాలను అనుభవిస్తారు.**

**వ్యాఖ్య**

రాళ్ళు, రత్నాలు ఒక చోట ఉన్నప్పుడు, రత్నాలను విస్మరించి, ఒక వ్యక్తి రాళ్ళను సేకరించుకొని పోయాడు అంటే, అతడు వివేకము లేనివాడై ఉండాలి. అజ్ఞుడై ఉండాలి. రాళ్ళకు రత్నాలకు తేడా తెలియక పోవడమే అవివేకము. రత్నానికి సంబంధించిన జ్ఞానము లేకపోవడమే అజ్ఞానము.

చతుర్విధ పురుషార్థాలలో ధర్మార్థ కామములనే త్రివర్గమును సాధించు కోవడానికి అనువైన విషయ పరిజ్ఞాన మంతా వేదాలలో లభ్య మవుతుంది. పరమ పురుషార్థ మైన మోక్షానికి సంబంధించిన పరమార్థ తత్త్వము కూడా అక్కడే ఉంది. అయినా వేద త్రయాన్ని అధ్యయనం చేసిన వాళ్ళు సైతము ***(త్రై విద్యాః)***, సకాములై, అగ్నిష్టోమ, అతిరాత్రాది యజ్ఞాలు, క్రతువులు మాత్రమే ఆచరించి, వాటి చేత దేవతలను ఆరాధించి స్వర్గాది పుణ్యలోకాలను పొందాలని ప్రయత్నిస్తారు.

వారు ఆచరించే యజ్ఞాలలో దైవానికి అర్పించిన తరువాత ఆ సోమరసాన్ని పానం చేసి పాపాలను పోగొట్టు కుంటారు. శుద్ధి పడతారు ***(తే నైవ సోమపానేన పూతపాపాః శుద్ధ కిల్బిషాః)***. తద్వారా పుణ్యలోక ప్రాప్తిని వాంఛించి పొందుతారు ***(స్వర్గతిం స్వర్గ గమనం ప్రార్థయన్తే)***.

సోమవల్లి అనే తీగ యొక్క రసాన్ని సోమరసం అంటారు. యజ్ఞాలలో దానిని దేవతార్పణం చేసి, శేషించిన రసాన్ని ప్రసాదంగా స్వీకరిస్తారు. అదే సోమరస పానం. సోమరసాన్ని పానం చేసిన వాళ్ళు ***(సోమం పిబన్తి ఇతి సోమపాః)*** పూతపాపు లవుతారు. నిష్పాపు లవుతారు. పాపాలు తొలగిన వారు అవుతారు ***(పూత పాపాః)***.

పాపక్షయం జరిగి, పుణ్యం ప్రాప్తించడం చేత, ఆ పుణ్యము యొక్క ఫలంగా దేవేంద్ర లోకాన్ని చేరి, దేవతలు అనుభవించే భోగాలను అక్కడ, అనగా స్వర్గ లోకంలో అనుభవిస్తారు. వీరు కూడా భక్తులే. సకామ భక్తులు. వేద త్రయాన్ని అధ్యయనం చేసినా, వివేకం లేని కారణంగా మోక్షాన్ని విస్మరించి, స్వర్గ మోహంలో పడి కొట్టుకుపోయే వాళ్ళు.

***స్వర్గే లోకే న భయం కిం చ నాస్తి*** - స్వర్గ లోకంలో ఏ విధమైన భయము ఉండదు. ***స్వర్గే లోకా అమృతత్వం భజన్తే*** - స్వర్గాది లోకాలలో అమృతము లభిస్తుంది. ఈ విషయాలను వేదాల లోని కర్మకాండ ద్వారా తెలుసుకున్న సకాములు స్వర్గాభిలాషులై యజ్ఞయాగాదులలో నిమగ్న మౌతారు.

సాధారణంగా జీవితంలో భయము - మరణము, ఈ రెండే ఎక్కువగా మనుషుల్ని బాధ పెడతాయి. ఏ క్షణాన ఏం జరుగుతుందో, ఉన్నది పోతుందేమో, లేనిది, వాంఛించింది రాదేమో - ఇలాంటి ఉపద్రవాలు, ఈతి బాధలు మనుషుల్ని కలత పెడుతూ ఉంటాయి. ఇవన్నీ స్వర్గంలో ఉండవు అని తెలియగానే మనిషి స్వర్గాన్ని వాంఛించడం ప్రారంభిస్తాడు.

పైగా, స్వర్గ లోకంలో అమృతము ప్రాప్తిస్తూ ఉంది కనుక, మరణం ఉండదు. శోకం లేదు - మరణం రాదు. ఇంకేమి కావాలి? అంతే. యజ్ఞాలు ప్రారంభిస్తారు. సోమరస పానం చేస్తారు. పాపాలను కడిగేసుకొని, పుణ్యాన్ని మూట కట్టుకొని, స్వర్గాభిలాషతో దివిని చేరి, దేవతా భోగాలను అనుభవిస్తూ ఉంటారు.

వేదాధ్యయన తత్పరులైన ఈ సకామ భక్తులకు అర్థం కావలసిన విషయం ఒకటి ఉంది. స్వర్గాన్ని చేరినంత మాత్రాన భయాలు పూర్తిగా నశించినట్లు కాదు. మరణం దూరమైనట్లు కాదు. దివిలో ఉన్నంత





కాలమే ఇవి దూర మవుతాయి. పుణ్యం క్షీణించ గానే పుణ్యలోకాలు కూడా దూర మవుతాయి. అక్కడ నుండి మళ్ళీ భయాలు, మరణాలు దగ్గ రవుతాయి. బ్రహ్మలోకము వరకు ఏ లోకాలను పొందినా, పుణ్య ఫలంగా లభించిన ఆ లోకాలను పుణ్యం క్షీణించ గానే విడిచిపెట్టి జన్మకు రావలసి ఉంటుంది ***(ఆబ్రహ్మ భువనా ల్లోకాః పునరావర్తి నోఽ ర్జున.... 8 వ అ - 16 వ శ్లో)***.

పైగా, సోమపానం వల్ల పాపాలు నశించ వచ్చు. పుణ్యం ప్రాప్తించ వచ్చు. కాని, దాని అర్థం పాపాలు సమూలంగా నశిస్తాయని కాదు. స్వర్గ గమనానికి ప్రతిబంధకంగా ఉండే పాపాలు మాత్రమే నశిస్తాయి. పుణ్యం క్షీణించి, తిరిగి మానవ జన్మకు వచ్చిన తరువాత, శేషించిన పాపాలను అనుభవించక తప్పదు. వివేకం లేని కారణంగా సకాము లైన వారు కర్మ చక్రంలో తగులుకొని పరిభ్రమిస్తూ ఉంటారు. వీరి మనస్సులలో కోరికలే ప్రధానంగా ఉంటాయి **(కామాత్మానః)**. స్వర్గ సుఖాలే ఆంతర్యంలో తిష్ఠ వేసి ఉంటాయి **(స్వర్గపరాః)** అని వీరిని గూర్చి రెండవ అధ్యాయం లోనే భగవంతుడు బోధించాడు *(2 - 43, 44)*.

పుణ్యం అనేది కర్మఫలం. అనుభవించ గానే నశిస్తుంది. పుణ్యం వల్ల ప్రాప్తించే స్వర్గం అనిత్యం. స్వర్గంలో ప్రాప్తించే భోగాలు అశాశ్వతం. అందుకనే, ఈ సందర్భంలో స్వర్గలోకం అనకుండా సురేంద్ర లోకం అన్నాడు. రెండూ ఒకటే అయినా, ఇంద్ర శబ్దం ప్రయోగించడం చేత, అక్కడ లభించే భోగాలు ఇంద్రియ సుఖాలే గాని మరొకటి కాదు అని భావం.

స్వర్గలోకం లోని నాట్యాలు నేత్రాలను, సంగీతాలు శ్రోత్రాలను తృప్తి పరుస్తాయి. ఇంకే ముంది? తెలియక పోవడమే ఉంది. అవివేకమే ఉంది.

వేదాల లోని యజ్ఞాలను ఇక్కడ నిరసిస్తున్నట్లు భావిస్తే, అది పొరపాటు. ఇక్కడ ఉద్దేశ్యం వేరు. వేదం ప్రతిపాదించే యజ్ఞ యాగాదులు కూడా మోక్షార్థమే ఉన్నాయి. ఆత్మజ్ఞానం వైపు నడిపేందుకే ఉన్నాయి. యజ్ఞాల వల్ల పాపక్షయం జరుగుతూ ఉంది. ఇలా శుద్ధి పడిన బుద్ధిని స్వర్గప్రాప్తికి కాకుండా మోక్షార్థము జ్ఞాన లబ్ధికి ఉపయోగించు కోవాలి. వేదాల లోని కర్మోపాసనలు అందుకే ఉన్నాయి. అమృతపానం చేసి అనిత్య లోకాలలో విహరించ మని వేదం బోధించలేదు. ఆత్మజ్ఞానాన్ని పొంది అమృత స్వరూపుడవు కా! అనే ప్రవచిస్తుంది. ఈ సత్యం అర్థం గాక, కామాత్ములు స్వర్గాభిలాషులు అవుతున్నారు.

*మరి, స్వర్గ ప్రాప్తిని పొందిన పూతపాపులు తరువాత ఏమౌతారు? చెబుతున్నాడు.*

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।**
**ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే ॥** 21

**తే-తం-భుక్త్వా-స్వర్గలోకం-విశాలం-క్షీణే-పుణ్యే-మర్త్యలోకం-విశంతి**
**ఏవం-త్రయీధర్మం-అనుప్రపన్నాః-గతాగతం-కామకామాః-లభంతే**

| | | |
|---|---|---|
| తే | = | వారు |
| తం | = | ఆ |
| విశాలం | = | విస్తారమైన |
| స్వర్గలోకం | = | స్వర్గలోక సౌఖ్యములను |
| భుక్త్వా | = | అనుభవించి |
| పుణ్యే | = | పుణ్యము |
| క్షీణే | = | క్షీణించగా |
| మర్త్యలోకం | = | మానవ లోకమును |
| విశంతి | = | ప్రవేశిస్తున్నారు |
| ఏవం | = | ఈ రీతిగా |
| త్రయీధర్మం | = | సకామ కర్మమును |
| అనుప్రపన్నాః | = | అనుష్ఠించే వారు |
| కామకామాః | = | కోరికలు గలవారై |
| గతాగతం | = | జనన మరణములను |
| లభంతే | = | పొందుతున్నారు |

**అర్జునా! వాళ్ళు విశాలమైన స్వర్గ భోగాలను అనుభవించి, పుణ్యం క్షీణించ గానే తిరిగి మానవ లోకంలో పుడుతారు. ఈ విధంగా వేదోక్త మైన కామ్య కర్మలను కాంక్షించే వారు జనన మరణాలలో పడి తిరుగుతూ ఉంటారు.**

**వ్యాఖ్య**

స్వర్గాభిలాషులై అగ్నిష్టోమాది క్రతువులను ఆచరించి, సోమపానం చేసి, పాప విముక్తిని పొంది, పుణ్యమును ఆర్జించి పుణ్య లోకాలను పొందిన వారు, ***యావత్ సంపాత ముషిత్వా*** అనే న్యాయానుసారము, ఎంతవరకు పుణ్య ఫలానుభవము నిర్ణయమై ఉందో అంతవరకు విశాలమైన స్వర్గ లోకంలో ఉండి, స్వర్గ భోగాలను అనుభవించి ***(తం భుక్త్వా స్వర్గ లోకం),*** ఆ పుణ్యం క్షీణించ గానే ***(క్షీణే పుణ్యే)*** తిరిగి మానవ లోకంలో ప్రవేశిస్తారు ***(మర్త్య లోకం విశన్తి).*** ఈ విధంగా వేదం లోని కర్మకాండను కామాభిలాషతో అనుసరించే వారు ఎక్కడికీ చేరరు. జనన మరణాల మధ్య తిరుగుతూ ఉంటారు. రాకపోకల తోనే సరిపెట్టుకుంటూ ఉంటారు. అవే గమనాగమనాలు. గతాగతాలు ***(గతాగతం, గతం చ ఆగతం చ గతాగతం గమనాగమనం).***

ప్రధానంగా వేదోక్త కర్మకాండకు సంబంధించిన పై రెండు శ్లోకాలలో సారభూతంగా గ్రహించ వలసిన విషయం ఏమిటో విశ్లేషించుకుందాం. (1) ఇది వేదత్రయము ప్రతిపాదించే కర్మకాండకు సంబంధించిన విషయం (2) జీవితంలో పొంద దగిన ఉత్కృష్ట మైన గమ్యము కాదు (3) కర్మబద్ధులై జన్మ పరంపరలో పరిభ్రమిస్తూ ఉండటమే దీనికి ఫలము. సూక్ష్మంగా చెప్పుకుంటే ఇదే కేంద్ర విషయం.

స్వర్గలోకాన్ని 'విశాలం' అంటున్నాడు. అంటే చాలా విస్తారమైంది అని అర్థము. ప్రస్తుతము మనం చర్చించే విషయం స్వర్గ భోగానికి సంబంధించింది కావడం చేత, ఇక్కడ విశాలము అనేది భోగానికి సంబంధించిన విషయము. అంటే, మానవ లోకంలో మనం అనుభవించే భోగాల కన్నా చాలా గొప్పవి అని అర్థము. ఇక్కడ లభించనివి అని భావము. సౌందర్యములో, సౌకుమార్యంలో, సౌష్ఠవంలో అసమానంగా, అద్భుతంగా ఉండటమే విశాలం. అంతేగాని భౌగోళికంగా విశాలం అని కాదు. ఏదైతే నేమి? విడిచిపెట్టి రావడానికి విశాల మైతే ఏమి, విఘాత మైతే ఏమి?

సోమరస పానం చేసి, పుణ్యఫలంగా స్వర్గమును చేరిన సోమయాజులు, అక్కడ సాధించే దేమిటి? స్వర్గ వాసుల మని విర్రవీగడమే గాని, అక్కడ తొడిగించుకొనిన కిరీటా లేమున్నాయి? అందరూ కల్లు పిపాసులే, కాంతాదాసులే. ఈ మాత్రానికి అక్కడికి పోయి, తిరిగి చూసే లోగా ఇక్కడికి చేరాలా! ముఖ్యంగా ఈ సోమరసం ప్రసక్తియే చాలా విడ్డూర మైంది. అనిత్య జీవనానికి అద్దం పట్టే వింత రసమది.

సోమవల్లి అనే తీగ శుక్ల పక్షంలో ఆకులు తొడిగి కృష్ణపక్షంలో ఆకులు రాల్చేస్తుందని చెబుతారు. అంటే, అటు చూస్తే ఉన్నట్లే ఉంటాయి. తిరిగి చూసే లోగా పోయినట్లు తెలుస్తాయి. స్వర్గం కూడా అంతే.

కొందరు వేసవిలో ఊటీకి విహారార్థం వెళ్తారు. తీసుకెళ్ళిన డబ్బు జేబులో ఉన్నంత వరకు అక్కడ అన్నీ హాయిగా అనుభవిస్తారు. ఇంకా ఉంటే చార్జీలకు కొరతే అనుకు న్నప్పుడు, తిరిగి వచ్చేస్తారు.

అగ్నిష్టోమాది క్రతువుల నాచరించి పుణ్య ఫలాన్ని ఆర్జించిన వారు స్వర్గాన్ని చేరుతారు. పుణ్యం ఉన్నంత వరకు నందన వనంలో ఆనంద విహారం చేస్తారు. పుణ్యం క్షీణించ గానే తిరుగు ప్రయాణానికి ఆ పుణ్యాన్నే కొంత ప్రక్కన పెట్టుకొని మళ్ళీ మానవ లోకానికే వస్తారు.

పుణ్యం క్షీణిస్తే, స్వర్గంలో క్షణం ఉండనివ్వరు. ఊటీ యాత్ర అయితే, ఒకవేళ మన వద్ద డబ్బు లేకపోతే, తెలిసిన వాళ్ళు ఎవరైనా అక్కడ తటస్థ పడితే, అరువు తీసుకొని అయినా మరికొన్ని రోజులు ఉండి రావచ్చు.



స్వర్గంలో మన లాగే ఎందరో పుణ్యాన్ని ఆర్జించిన వారు ఉన్నా, అరువు ఇచ్చే వారు ఎవరూ ఉండరు. కరువు తీర్చే వారే ఉండరు. ఒక విధంగా చూస్తే మానవ లోకమే నయం. అద్దె వచ్చే నెలలో ఇస్తాము అంటే కనీసం కొంపలో నైనా ఉండ నిస్తారు. స్వర్గంలో అలా కాదు. పుణ్యం క్షీణిస్తే చాలు, క్షణం ఉండనివ్వరు.

మరి దేవతలు అంత దయ లేనివారా? మానవుల కున్న సానుభూతి కూడా వారికి ఉండదా? అని మీరు అనుకోవచ్చు. మన ఆలోచనలు మనవి. వారి జాగ్రత్తలు వారివి. ఇక్కడ ఏదో విధంగా సంపాదించే అవకాశం ఉంది కనుక ఈ నెల అద్దె ఇవ్వలేక పోయినా, వచ్చే నెలలో ఇవ్వొచ్చు. మరి స్వర్గంలో సంపాదించే అవకాశమే లేదు కదా! అది భోగ భూమే గాని కర్మ క్షేత్రం కాదు కదా! ఆ మాత్రం దేవతలకు తెలియదా? మానవ లోకంలో యజ్ఞ యాగాదుల నాచరించి ఆర్జించిన పుణ్యంతో స్వర్గలోకం చేరుతారు. మరి దేవలోకంలో అరువు పుచ్చుకొన్న పుణ్యాన్ని ఎలా తీరుస్తారు? యజ్ఞం చేస్తేనే కదా పుణ్యం వచ్చేది? మరి స్వర్గంలో కూడా పొగ పెడతావంటే దేవతలు ఒప్పుకుంటారా? పుణ్యాన్ని అరు విచ్చినా, తిరిగి తీర్చే అవకాశం లేదనేది ఒక వైపు స్పష్టంగా తెలుస్తూ ఉంటే, కల్లబొల్లి మాటలు చెప్పి నామం పెట్టే వాణ్ణి అక్కడ ఎందుకు ఉంచుకుంటారు? ఆ మాట కొస్తే అక్కడే కాదు, ఎక్కడా ఉంచుకోరు. ఎవ్వరూ ఉంచుకోరు.

కారణం ఉన్నంత వరకే కార్యం ఉంటుంది. పుణ్యం ఉన్నంత వరకే పుణ్య లోకంలో మనుగడ ఉంటుంది. పుణ్యం క్షీణించ గానే తిరిగి మర్త్య లోకంలో ప్రవేశించడం జరుగుతుంది. అలా ప్రవేశించకుండా తరించాలి అంటే, పుణ్యాపాపాలు నశిస్తే సరిపోదు. అజ్ఞానం నశించాలి. అప్పుడే పునర్జన్మ ఉండదు. **మాముపేత్య తు *కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే*** - నన్ను పొందితే, అర్జునా! తిరిగి పుట్టడం ఉండదు (*8 వ అ - 16 వ శ్లో*) అని భగవానుడు చెప్పే ఉన్నాడు కదా! ఇక, ఆ ప్రయత్నమే శ్రేయస్కరము.

*ఎలా చేయాలి? చేసి ఏమి పొందాలి? చెబుతున్నాడు.*

**అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్ ॥** 22

*అనన్యాః-చింతయంతః-మాం-యే-జనాః-పర్యుపాసతే*
*తేషాం-నిత్యాభియుక్తానాం-యోగక్షేమం-వహామి-అహం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అనన్యాః | = | అన్య చింతలు లేక | నిత్యాభియుక్తానాం | = | నిత్యము నా యందు ఏకీభావము కలిగిన |
| మాం | = | నన్ను | తేషాం | = | వారల యొక్క |
| యే | = | ఎట్టి | యోగక్షేమం | = | యోగక్షేమములను |
| జనాః | = | జనులు | అహం | = | నేను |
| చింతయంతః | = | స్మరిస్తూ | వహామి | = | వహిస్తున్నాను |
| పర్యుపాసతే | = | సేవిస్తున్నారో | | | |

**అర్జునా! నిత్యము నా కొరకు ప్రయత్నించే భక్తులు మరో ఆలోచన లేకుండా నన్నే చింతిస్తూ ఉంటారు. కనుకనే, వారి యోగక్షేమాలను నేనే చూసుకుంటాను.**

**వ్యాఖ్య**

**కర్మ ప్రవృత్తి - భక్తి ప్రపత్తి**

ఇహ పరాలలో కర్మ యొక్క స్వభావ స్వరూపాలను, కర్మ అందించే ఫలభోగాలను కొంత వరకు

మనము అర్థం చేసుకున్నాం. కర్మ అనేది - అది లౌకిక మైనా, వైదిక మైనా, అది అందించే ఫలం - అది ఇహ లోక సంబంధ మైనా, పరలోక సంబంధ మైనా అనిత్యమే నని, విషయానుభవమే నని మనకు అర్థమై పోయింది. కర్మ నికృష్టమే గాక, జనన మరణాల మధ్య జీవుణ్ణి త్రిప్పుతూ ఉన్నందున అనర్థ మని కూడా స్పష్టమైంది.

అలాగని కర్మలను గర్హించ నవసరం లేదు. కర్మలన్నీ దుఃఖభూయిష్టాలే నని, అనర్థ దాయకాలే నని భావించ నవసరం లేదు. మన చేతిలో ఉన్నవి కర్మలే. మనస్సులో ఉన్నవి సంకల్పాలే. అవన్నీ గనుక శోక మయమే అయితే ఇక మనం సుఖ పడలేము.

అవగాహన తోడైతే, అనిత్యాలను అధిగమించి అనంతంలో విహరించడానికి, పరిమితాలను దాటి పరిపూర్ణం వైపు పయనించడానికి కర్మలు వాహనా లైతే, సంకల్పాలు ఇంధన మవుతాయి. అనుభవాలు రహదారు లైతే, ఈశ్వరానుగ్రహం దారిదీప మవుతుంది.

ఇది మామూలు ప్రయాణం కాదు. విషయానుభవాన్ని విస్మరిస్తూ, నిర్విషయానందం వైపు అలవోకగా తేలిపోతూ సాగిపోయే అద్భుత అనంత యాత్ర. అనంతం నుండి అనంతం వైపుకు అనంతం లోనే ఆనందంగా పయనించే అలౌకిక ఆనంద యాత్ర.

ఇంద్రియాలు, ఇంద్రియ విషయాలు నిగూఢమైన తమ ఆంతరంగిక సంబంధాన్ని విడిచి పెట్టలేక, కలుస్తూ ఉండటాన్ని మనం కర్మలు అంటున్నాము. భౌతికంగా సాగుతున్న ఈ కర్మల వెనుక నిలిచి, వాటి సంబంధాన్ని గుర్తు చేసే మానస వ్యాపార తరంగాలను సంకల్పాలు అంటున్నాము. విషయాలు బాహ్యంలో ఉన్నట్లు, మనస్సు ఆంతర్యంలో ఉన్నట్లు, ఈ రెండిటి మధ్య ఇంద్రియాలు ఉన్నట్లు మనకు అనిపించినా, వాస్తవానికి ఈ మూడు బాహ్యం లోనే ఉన్నాయి. నీకు బాహ్యం లోనే ఉన్నాయి. నీకు అన్యం గానే ఉన్నాయి. నిన్ను ఆశ్రయించుకొనే ఉన్నాయి. నువ్వు లేకుండా అవేవీ లేవు. అవేవీ లేకపోయినా నువ్వు ఉన్నావు. నువ్వు ఉంటావు.

ఇది అర్థం కాకపోవడం చేత, మన మేదో చేస్తున్నాము అని ఊహించు కుంటున్నాం. మనం చెయ్య వలసింది ఏదో ఉందని, అదేదో మనం చేస్తున్నా మని నిరంతరం ఆలోచిస్తున్నాం. కర్మలు ఎందుకు ఊరేగు తున్నాయో అర్థం గాక వాటిలో పడి మనమూ ఊగిస లాడుతున్నాం. ఇప్పుడే మనం చెప్పుకున్నట్లు, విషయాలకు, ఇంద్రియాలకు ఉండే ఆంతరంగిక సంబంధంతో కర్మలు సాగుతున్నాయి.

ఇంద్రియాలు అనివార్యంగా వెళ్ళి విషయాలలో పడుతున్నాయి *(ఇంద్రియాః ఇంద్రియ విషయేషు వర్తనే).* అంతేగాని, ఇంద్రియాలకు విషయాలు అవసరమై మాత్రం కాదు. ఇది కాస్త అవధానంతో, శ్రద్ధతో అర్థం చేసుకోవలసిన విషయం.

బాహ్యంలో మనం ఏదో ఆశించడం వల్లే కర్మలు సాగుతున్నట్లు స్థూలంగా అనిపిస్తూ ఉంది. కాని, వాస్తవానికి ఆంతర్యంలో ఉన్నది దీనికి పూర్తిగా భిన్నమైన విషయం. ఆశించడం అయితే జరుగుతూ ఉంది. కాని అది బాహ్య విషయాలకు సంబంధించిన ఆశ కాదు. ఆంతర్యంలో స్వరూపానికి సంబంధించిన పిపాస. ఈ స్పృహ లేనపుడు మన నుండి కదిలే కర్మలు లౌకిక మైనా, పారలౌకిక మైనా అనిత్యాలనే చేతికి అందించి, ఆవేదనలను మనస్సులో దించుతాయి.

ఇప్పుడు అర్థమైందా? ఏవి మన కర్మలు? ఎవరు మన దేవుళ్ళు? మన కంటూ కార్యా లేమున్నాయి? మనవి కాని కార్యాలు మనవిగా, మనవి కాని లోకాలు మనవిగా, మనకు లేని సంబంధాలు మనవిగా భావించడం చేత నింగి కెగిరినా నికృష్టాలే నీడల్లా వెంటాడు తున్నాయి. అవే మన కర్మలైతే, స్వరూపం వైపు నడిపేవి అయితే, పాతాళంలో కూడా పరమార్థమే తోడై ఉంటుంది.





కర్మలు గర్హనీయమా? కర్మలు దుఃఖరూపమా? ఆలోచించండి. అర్థం కాకపోతే బంధము. అర్థమైతే, అందము, ఆనందము.

శ్రుత్యుక్త మైన కర్మకాండయే సిద్ధి సాధన మని భావించి, కేవలం కర్మైక నిష్ఠులై, విషయభోగ లంపటు లైన మీమాంసకులు వేదత్రయంలో పండితు లైనా, కామకాములై ఎలా గమనాగమనాలు (జననమరణాలు) పొందుతున్నారో పూర్వ శ్లోకంలో చూశాము.

దానికి భిన్నంగా, నిష్కాములై, అనన్యులై, నిత్యాభియుక్తులై, పరమార్థ జ్ఞాన సంపన్నులైన వారు కర్మయోగు లైనా, జ్ఞానయోగు లైనా సత్యరూపులై శోభిస్తారు. పరమేశ్వరుని పూర్ణ అనుగ్రహానికి పాత్రులై తరిస్తారు.

అన్య మనస్కులై, అనిత్యాల వైపు పరుగులు పెట్టే మీమాంసకులు ఆచరించేవి కర్మలే. అనన్యచిత్తులై, నిత్యాభియుక్తులై సత్య మార్గంలో చరించే భక్తులు, జ్ఞానులు ఆచరించేవి కూడా కర్మలే. అన్నీ కర్మలే. కర్మాయాసం ఎవరికీ తప్పదు. కాకపోతే, మీమాంసకుల కర్మలు బంధహేతువులు కాగా, భక్తుల పవిత్ర కార్యాలు ముక్తికి మార్గాలు.

***యత్సత్యం తదుపాసితవ్యం అథునా సత్యం యతో లభ్యతేఽ సత్యోపాసనయా తథైవ చ ఫలం స్వప్నోత్థ రాజ్యాదివత్! ఆయాసే సదృశేఽ పి తుచ్ఛ ఫలదే మార్గే ప్రవృత్తిః కథం మాయా వైభవ మేత దేవ త దిదం భక్త్యా హరే ర్వాప్యతే!***

సత్యాన్ని ఉపాసించే వారు సత్యాన్నే పొందుతారు. అసత్యాన్ని ఉపాసించే వారు, స్వప్నంలో రాజ్యాధికారాన్ని పొందినట్లు అసత్యాన్నే పొందుతారు. ఆయాసము ఇరువురికీ సమానంగా ఉండే టప్పుడు, తుచ్ఛ ఫలాన్నిచ్చే అనిత్య మార్గంలో ప్రవృత్తి ఎందుకు? ఈ ప్రపంచము మాయామయం. హరిభక్తి కుదిరితే సత్యమే ప్రాప్తిస్తుంది. కనుక, హరిభక్తి ప్రాప్తించే విధానము, హరికృప సిద్ధించే మార్గము ప్రస్తుత శ్లోకంలో చెప్పబడుతూ ఉంది.

## శ్లోక వైభవము

ఇదొక అందమైన శ్లోకము. అద్భుతమైన శ్లోకము. ఉన్నతంగా చరించే వారు దేవతలు. నీచంగా చరించేవి జంతువులు, క్రిమి కీటకాదులు. మనోబుద్ధులు కలిగి, కర్మాచరణంలో ఉంటూ, వివేక వైరాగ్యాలతో పరమ పురుషార్థమైన మోక్షాన్ని సాధించుకొనే శక్తి గల మానవులు మధ్యములు. కేవలం పుణ్యమే గల వారు దేవతలు. పుణ్యపాపాలు లేకుండా కేవలం సహజాతాలతో చరించేవి జంతువులు. పుణ్యపాపాలను రెండిటిని మిశ్రమంగా ఆచరించే వారు మానవులు. ఇలా మధ్యములైన మానవులను ఉద్ధరించేందుకు అవతరించిన ఈ శ్లోకం భగవద్గీత మధ్యలో ఉంది. ఇది గీతా శ్లోక మణిహారంలో మేరువు లాంటిది. తరచుగా వేదికల మీద వినిపించే శ్లోకం. భక్తులను భగవంతుడు కరుణించే వైభవాన్ని వివరించే సందర్భాలలో భక్తులు పరవశించి ఉటంకించే శ్లోక మిది.

భారత మధ్యమున శోభించే భగవద్గీతలో కూడా తొమ్మిదవ అధ్యాయం మధ్యలో ఉంది. అంతే కాదు. తొమ్మిదవ అధ్యాయం మధ్యలో ఈ శ్లోకం ఉంది. ఇంకా చెప్పాలంటే, భగవద్గీత లోని ఏడు వందల శ్లోకాలలో కూడా ఈ శ్లోకం దాదాపు మధ్యలోనే ఉంది. అన్నిటినీ మించి, ఈ శ్లోకం తన స్వరూపమే నని నిర్ధారణ చేస్తూ శ్లోకము యొక్క ఆద్యంతాలలో భగవంతుడే అక్షర రూపంలో శోభిస్తున్నాడు. శ్లోకం లోని మొదటి అక్షరము **అ** కాగా, శ్లోకాంతంలో **హం** ఉంది. ఈ శ్లోకం నా స్వరూపం అంటూ అచ్యుతుడు **అహం** పదంతో భాసిస్తున్నాడు.

మహిమ గల వారే అయినా మహత్తు తెలియని వారు, ముక్తిని పొందని వారు, పొందలేని వారు దేవతలు.

మనోబుద్ధులు లేనందున వివేక శూన్యమైన జంతుజాలము మోక్షానికి అర్హము కాదు. మానవులే మోక్షానికి అర్హులు. కనుక, ప్రశస్తమైన మానవ జన్మ నెత్తి నందుకు మహోన్నతంగా చరించి మానవులు మోక్షరూపులై వెలగాలి. జీవన్ముక్తులై శోభించాలి. నీచాన్ని విస్మరించి, మహత్తునే ఆశ్రయించి కృతకృత్యులు కావాలి ***(నీచాశ్రయం న కర్తవ్యం కర్తవ్యం మహదాశ్రయం).***

సంసారము బాధించదు. సంసారానికి సంబంధించిన చింతే దుఃఖానికి కారణ మవుతుంది. తనను మరచి, తనువును మరచి, జగత్తును విస్మరించి, పరమేశ్వరుని స్మరణలో జీవించ గలిగితే, జీవితంలో బాధలు ఉండవు. జీవికి బంధము ఉండదు. అలా జీవించే దెలాగో ఈ శ్లోకం వివరిస్తూ ఉంది. అదే శ్లోక వైభవము. గీత లోని ప్రధానమైన, ప్రశస్తమైన శ్లోకాలలో ఒకటిగా శోభించడానికి కారణము. అంతే కాదు. గీత ప్రబోధించిన నిష్మాద్వయానికి ఈ శ్లోకం ఊతగా నిలుస్తుంది. సాంఖ్యులకు జ్ఞానపరం గాను, యోగులకు కర్మయోగ పరం గాను దర్శన మిస్తుంది. కనుక, ఈ శ్లోకాన్ని రెండు దృక్కోణాల నుండి వ్యాఖ్యానించాలి. మార్గాలు వేరుగా కనిపిస్తున్నా అద్వయమైన మోక్ష మార్గంలో ఈ రెండు మార్గాలు ఎలా ఏకమై ఉన్నాయో నిరూపిస్తూ ***దేహళీ దీప న్యాయంగా*** ఈ శ్లోకం ప్రకాశిస్తుంది. శ్లోకం లోని యచ్ఛబ్ద ప్రయోగం ***(యే జనాః)*** - 'ఎవరైతే' అని చెప్పడంలో కూడా ఇదే అంతర్భావం. మొదట భక్తి పరంగా చెప్పుకొని, ఆ తరువాత జ్ఞానపరంగా వంట పట్టించుకుందాం.

**అనన్య భక్తి**

అన్యము అంటే వేరైనది. అనన్యము అంటే వేరు కానిది. చింత అంటే చింతనము, లేదా స్మరణము. అనన్య చింత అంటే, భగవంతుని కన్నా అన్యంగా మరొక ఆలోచన లేకుండా ఉండటము అని అర్థము. అట్టి అనన్య చింతనము కల వారే అనన్య భక్తులు. అనన్య భక్తితో ఏ భక్తులైతే పరమేశ్వరుని స్మరిస్తూ ఉంటారో ***(యే జనాః భక్తాః అనన్యాః శ్చింతయన్తః మాం ఈశ్వరం పరమేశ్వరం ఉపాసతే).*** నిరంతరము అలా పరమేశ్వరుని కొరకు యత్నించే అట్టి అనన్య భక్తుల ***(నిత్యాభియుక్తానాం తేషాం)*** యోగక్షేమాలను పరమేశ్వరుడే వహిస్తాడు. ఇది భక్తిపరంగా శ్లోక భావం.

భక్తుని దేహం దేశంలో చరిస్తున్నా, కర్మలలో కదులుతున్నా, భక్తుని మనస్సులో మాత్రం భగవంతుడే ఉంటాడు. భగవంతుడు ఉండటము అంటే, భగవద్భావన ఉండటము అని అర్థం.

భక్తి అనేది పరమ ప్రేమ రూపము ***(సా త్వస్మిన్ పరమ ప్రేమ రూపా).*** ప్రేమ అనన్యము. ప్రేమ అన్య మెరుగదు. రెండిటిలో ప్రేమ ఇమడదు. రెండిటిని ప్రేమ తనలో ఇముడ్చుకో లేదు. వేరొక దానిని ప్రేమిస్తూ భగవంతుని ప్రేమించడం సాధ్యపడే పని కాదు. ఒక వ్యక్తి రెండు పడవలలో ఒకే కాలంలో ప్రయాణం చేయలేడు.

భోజనం ఒక్కడే చెయ్యాలి. అంటే, ఎవరికి వారే చేయాలి. నిద్ర కూడా ఎవరిది వారిదే. ఒకే మంచంపై ఇద్దరు స్నేహితులు పడుకోవచ్చు. అయినా ఎవరి నిద్ర వారిదే. ఒకే నిద్రలో ఇద్దరూ ఒదిగి ఉండలేరు.

దృశ్యము ఒక్కటే అయినా, ఎవరి కళ్ళతో వారు చూడాలి. ఒకరి కళ్ళతో మరొకరు చూడలేరు. చివరికి మృత్యువైనా అంతే. ఎవరి చావు వాళ్ళు చావాలి. చంపడము ఎందరైనా చెయ్యొచ్చు. చావు మాత్రం ఎవరిది వారిదే.

అన్యులు లేకుండా అన్ని కార్యాలు జరిగి పోయేటప్పుడు, భక్తి కార్యంలో మాత్రం అన్యులెందుకు? భక్తి చేసే మనస్సులో భగవంతుడు ఉండేటప్పుడు మరొకడు ఎలా ప్రవేశిస్తాడు? అందుచేత, అన్యుల యందు మనస్సు లేనివారు అనన్య భక్తులు. అనన్య భక్తి కలిగితే, అన్య చింతలు వాటంతట అవే జారి పోతాయి. పారి పోతాయి.





చిన్న పిల్లవాడు భోజనం చేయకుండా మారాం చేస్తూ ఉంటాడు. తల్లి ఎంత బుజ్జగించినా ససేమిరా అంటూ ఉంటాడు. నువ్వు భోంచేస్తే నీకు రూపాయి ఇస్తాను అంటుంది తల్లి. ఇస్తే గాని తినను అంటాడు బిడ్డ. తండ్రిని అడిగి ఒక రూపాయి బిళ్ళ తెచ్చి బిడ్డ కిస్తుంది తల్లి. పిల్లవాడు చేతిలో ఆ రూపాయి బిళ్ళ పట్టుకొని అన్నం తింటాడు.

బిడ్డ అన్నం తినగానే, రూపాయి బిళ్ళ తిరిగి ఇవ్వమని తండ్రి మారాం చేయడం ప్రారంభిస్తాడు. పిల్లవాడు ఇవ్వ నంటాడు. తండ్రి గద్దిస్తూ ఉంటాడు. బిడ్డ ఏడుస్తూ ఉంటాడు. ఎందుకండీ! బిడ్డను అలా ఏడిపిస్తారు? అని నివారించే ప్రయత్నం చేస్తుంది తల్లి. వాడు పారేసుకుంటాడు అంటాడు తండ్రి.

మీరు కాస్త ఊరుకోండి. నాయనా! నువ్వు ఇవ్వొద్దులే. నీ చేతి లోనే ఉంచుకో. నేను జోల పాడతాను, నువ్వు నిద్రపో! అని పిల్లవాణ్ణి నిద్రబుచ్చుతుంది తల్లి. కొంత సేపటికి పిల్లవాడు నిద్ర పోతాడు. అంతే. చేతి లోని రూపాయి బిళ్ళ చేజారి క్రింద పడుతుంది.

భార్య భర్తను పిలిచి, రండి! ఇదిగో మీ రూపాయి బిళ్ళ. తీసుకోండి! పడేసుకుంటాడు అంటూ పిల్లవాడి కన్నా ఎక్కువగా గోల చేశారు. ఇష్టమైన దానిని ఎవరు పడేసుకుంటారు? పడేసే సమయం వచ్చి నప్పుడు ఎవరు ఉంచు కుంటారు? అంటుంది తల్లి. అడిగినా ఇవ్వని పిల్లవాడు నిద్ర లోకి జారుకోగానే రూపాయి బిళ్ళ దానంతటదే చేజారి పోయింది. భక్తులూ అంతే. అనన్య భక్తిలో మనస్సు తన్మయం చెందగానే, ప్రపంచం అప్రయత్నంగా మనస్సు నుండి జారి పోతుంది. అన్య చింతలు పారి పోతాయి. అదే అనన్య భక్తి. ***అన్యాశ్రయాణాం త్యాగః అనన్యతా*** - అన్య ఆశ్రయాలను విడిచి పెట్టి, పరమేశ్వరునే హృదయంలో ఉంచుకోవడం అనన్యత అని వ్యాఖ్యానించాడు నారదమహర్షి.

అనన్య భక్తి వల్ల భక్తుని హృదయంలో సదా భగవంతుడే ఉంటాడు. అంటే, భక్తులు కాని వారి హృదయాలలో భగవంతుడు లేడా? భగవంతుడు అందరి హృదయాలలో ఉన్నాడు. ఉంటాడు *(18 వ అ - 61వ శ్లో).* కాని, భగవంతుడు హృదయంలో ఉన్నాడని అభక్తునికి తెలియదు. భక్తునికి తెలుసు. అదే తేడా.

భక్తుని హృదయంలో భగవంతుడు ఉన్నాడు కనుక, భక్తుడు నిర్భయుడు. ఏ అవసరాలూ లేనివాడు. ప్రతికూలాలు అర్థం కాని వాడు. భక్తుని అవసరాలు భగవంతుని అవసరాలుగా మారాయి. భక్తుని అనన్య చింతనము బ్రతుకులో సర్వ చింతలను దూరం చేసింది. భక్తి భగవంతుణ్ణి భక్తుని అధీనంలో ఉంచుతుంది. భక్తుడు సదా అనన్య భక్తిలో తృప్తి చెందుతూ ఉంటే, భక్తుని అవసరాలను భగవంతుడే చూసుకుంటూ ఉంటాడు. భక్తుని అవసరాలను చూడటం తన బాధ్యతగా భగవంతుడే స్వయంగా ప్రకటించు కున్నాడు కదా! **(యోగక్షేమం వహామ్యహం).**

**యోగ క్షేమాలు**

ప్రాప్తించని దానిని పొందడం యోగము **(అప్రాప్తస్య ప్రాపణం యోగః).** ప్రాప్తించిన దానిని పరిరక్షించు కోవడం క్షేమము **(క్షేమః తద్రక్షణమ్).** బిడ్డ అవసరాలు తల్లికి తెలిసినట్లు, భక్తుని అవసరాలు భగవంతునికి తెలుసు. బిడ్డ అవసరాలను బిడ్డ అడగక పోయినా తల్లి ఎలా తీరుస్తుందో, భక్తుని అవసరాలను కూడా భక్తుడు అడగక పోయినా భగవంతుడే తీరుస్తాడు. బిడ్డ బిడ్డగా ఉండటమే తల్లి ప్రవర్తనకు కారణము. భక్తుడు భక్తుడుగా ఉండటమే భగవంతుని ప్రవర్తనకు కారణము. బిడ్డ తల్లిని బంధించినట్లు భక్తి భగవంతుణ్ణి కట్టి పడేస్తుంది.

ప్రతి ఒక్కరి జీవితంలో యోగక్షేమాలే ప్రధానంగా ఉంటాయి. ఎవరు ఏది ఆలోచించినా, ఏ పని చేసినా యోగక్షేమాల చుట్టే తిరుగుతూ ఉండటం స్పష్టంగా తెలుస్తుంది. నాకు లేనిది - నాకు ఉన్నది, ఇవే ప్రధానమైన

విషయాలుగా ఉంటాయి. కొందరు లేమితో కలవర పడుతూ ఉంటే, కొందరు కలిమితో కుములుతూ ఉంటారు. లేనివి ఒక విధంగా వేధిస్తే, ఉన్నవి మరొక విధంగా బాధిస్తూ ఉంటాయి.

నాకు ఆదాయం లేదు, ఆరోగ్యం లేదు. ఉద్యోగం లేదు, సంతానం లేదు, శాంతి లేదు, ఇల్లు లేదు, పెళ్ళి లేదు, జ్ఞానం లేదు - ఇలా లేని వాటిని తలచుకుంటూ కొందరు బాధ పడుతూ ఉంటారు. అలా లేని వాటిని పొందేందుకు ప్రయత్నిస్తూ ఉంటారు. ఏవేవి ఎవరికి లేవో వాటిని వారు పొందడం యోగం అవుతుంది ***(అప్రాప్తస్య ప్రాపణం).***

కొందరికి ఉన్నవి కొన్ని పోతూ ఉంటాయి. మరి కొన్ని పోతాయేమో అని మనస్సు హెచ్చరిస్తూ ఉంటుంది. ఒత్తుగా ఉన్న జుట్టు క్రమేపి రాలిపోతూ ఉందని కొందరు బాధపడుతూ ఉంటే, బ్యాంకులో నిల్వ చేసిన ధనం మెల్లగా తరిగిపోతూ ఉందని మరి కొందరు ఆవేదన చెందుతూ ఉంటారు. ఆరోగ్యం క్షీణిస్తూ ఉందని కొందరు అలమటిస్తూ ఉంటే, ఇక ముందు క్షీణిస్తుందేమో అని ఊహించుకొని కొందరు కలత చెందుతూ ఉంటారు. ఉన్న ఉద్యోగం ఊడుతుందేమో, అకాల వర్షాలు పడి చేతి కొచ్చిన పంట చేజారి పోతుందేమో! ఇలా ఉన్నవి లేకుండా పోతాయేమో అని కొందరు వ్యథ చెందుతూ ఉంటారు. ఉన్న వాటిని పోకుండా కాపాడుకొనే ప్రయత్నం చేస్తూ ఉంటారు. అదే రక్షణము ***(ప్రాప్తస్య రక్షణం క్షేమః).*** అదే క్షేమము.

అందరూ ఈ విధమైన యోగక్షేమాల వ్యవహారంలో పడి తల మునకలై ఉంటే, భక్తుడు యోగక్షేమాల విషయంలో స్పృహ లేనివాడై ఉంటాడు. ఈ విధమైన నిస్పృహకు ప్రధానంగా రెండు కారణాలు కనబడతాయి. (1) ఏవేవో పొందాలి అనే ఆశ లేకపోవడము (2) మరేవో దూరమౌతా యనే నిరాశ ఉండక పోవడము. భగవంతుడు లేనపుడు ఏది ఉండి ఏమి ప్రయోజనం? అని తనను తాను భక్తుడు ప్రశ్నించు కుంటాడు. అంతే కాదు. భగవంతుడు ప్రాప్తించి నపుడు, అంతకన్నా పొంద వలసింది ఏముంటుంది? అని తనను తాను ప్రశ్నించుకొని సమాధానం పొందుతాడు. తృప్తి చెందుతాడు. సదా తన హృదయంలో భగవంతుని దర్శించుకుంటూ భక్తిలో పరవశించే భక్తునికి ఏవో లేవు అనే యోగానికి సంబంధించిన ఆరాటము ఉండదు. ఉన్నవి పోతాయేమో అనే క్షేమానికి సంబంధించిన ఆవేగమూ లేదు. ఈ విధంగా యోగక్షేమాలను భక్తుడు త్యజించడం చేత, సదా అనన్య భక్తితో తనను ఆరాధించే భక్తుని యోగక్షేమాలను వహించ వలసిన బాధ్యత పరమేశ్వరునిది అయింది.

***యతస్తదీయాః*** - ఈ కారణం చేత భక్తులు భగవంతునికి సంబంధించిన వారయ్యారు. భగవంతునితో నిత్య సంబంధాన్ని కలిగిన వారయ్యారు. తమ అనన్య భక్తి చేత భక్తులు భగవంతునికి ముఖ్యు లయ్యారు ***(భక్తాః ఏకాంతినో ముఖ్యాః).*** అనన్య భక్తి కలిగిన ఏకాంత భక్తులను గూర్చి నారద మహర్షి విశేషంగా వ్యాఖ్యానించాడు.

భక్తులు సదా పరమేశ్వరుని యందే మనస్సును లగ్నం చేసి ఉంటారు కనుక, వారికి అనిత్య మైన ప్రాపంచిక విషయాలతో సంగత్వం ఉండదు ***(సంగం త్యజతి).*** మనస్సును ఖాళీ చేసుకొని, మాధవుని చేతిలో మురళి లాగా భక్తులు పనిముట్లుగా మారుతారు కనుక కర్తృత్వము లేనివారై ఉంటారు. కర్తృత్వము లేనందున కర్మఫలాల యందు దృష్టి లేనివారై ఉంటారు ***(కర్మఫలం త్యజతి).*** మురళి ద్వారా అద్భుతమైన రాగాలను పలికించినట్లు, తన చేతిలో పరికరాలుగా మారిన భక్తుల ద్వారా పరమేశ్వరుడు అసమానమైన, అనితర సాధ్యమైన కార్యాలను ఆవిష్కరిస్తాడు. తన ద్వారా ఏ రాగం పలికినా, అందులో పరమేశ్వరుని వైభవాన్నే మురళి వీక్షించినట్లు, తమ ద్వారా ఎంతటి మహత్తరమైన కార్యాలు జరిగినా, అవన్నీ భగవ దనుగ్రహ ప్రసాదాలుగా భక్తులు భావిస్తారు. ద్వంద్వాలను దాటి పోతారు ***(నిర్ద్వన్ద్వో భవతి).*** ఈ విధమైన ఏకాంత భక్తి ప్రాప్తించ గానే



భక్తుడు యోగ క్షేమాలను మరచి పోతున్నాడు. వాటిని దాటి పోతున్నాడు ***(యోగ క్షేమం త్యజతి).*** మరి, యోగక్షేమాలను కూడా పట్టించుకోకుండా భక్తుడు భగవత్సేవలో పరవశించి ఉంటే, అట్టి భక్తుని యోగక్షేమాలను ఎవరు చూస్తారు? ఎవరో ఎందుకు చూస్తారు? భక్తుడు భగవంతుని కార్యంలో నిమగ్నమై ఉన్నాడు కనుక, భక్తుని యోగక్షేమాలను భగవంతుడే చూడాలి. చూస్తాడు. అదే చెబుతున్నాడు. నిత్యాభియుక్తు లైన భక్తుల యోగక్షేమాలను నేనే చూసుకుంటాను ***(తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్).***

బాలకృష్ణుడు ఊయలలో ఆదమరచి నిద్రిస్తున్నాడు. అందంగా, అమాయకంగా నిద్రిస్తున్న చిన్ని కన్నయ్య మోమును అదే పనిగా వీక్షిస్తూ యశోదమ్మ పరవశిస్తూ ఉంది. ఈ లోగా ఏదో కలవరిస్తూ బాలకృష్ణుడు ఉలికిపడి కళ్ళు తెరిచాడు. తన బిడ్డకు ఏదో పీడ కల వచ్చి ఉంటుందని భావించి యశోద దిష్టి తీస్తుంది. పుత్ర వాత్సల్యంతో బిడ్డకు తల్లి దిష్టి తీసిందే గాని, తన బిడ్డ మామూలు బిడ్డ కాడని, ప్రపంచానికే తండ్రి యని, ఆయనిది ఉలికిపాటు కాదని, భక్తులను తలచుకొని ఆనందించే అలవాటు అని యశోద గ్రహించలేక పోయింది. కన్నయ్య కలవరం లోని కారుణ్యాన్ని దర్శించిన చైతన్య హృదయం భక్తి ప్రేమలతో ఒక వెన్నముద్దను సమర్పించుకుంది.

**కలల మత్తులో ఉలికి పడితి వేల?**
**ఎవరు పిలిచారు కల లోన తొంగి చూచి**
**కలకాలము కూడ భక్తుల మెలకువేనా!**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద. కలకాలము భక్తులను కనిపెట్టుకొని, యోగక్షేమాలను నిర్వర్తించే పరమేశ్వరుడు, కల గనే కాలంలో కూడా భక్తుల వ్యవహారాలనే చక్కబరుస్తూ ఉంటాడు. ఈ ధైర్యం తోనే భక్తులు సదా భగవంతుని సేవలో తృప్తి చెందుతూ ఉంటారు.

**ఆఖ్యాయిక**

కొన్ని శతాబ్దాల క్రితం పండరీపురంలో ఒక భక్తుని జీవితంలో జరిగిన వాస్తవ సన్నివేశము. అనన్య భక్తితో పరమేశ్వరుని సేవిస్తే, యోగక్షేమా లన్నీ పరమేశ్వరుడే చూసుకుంటాడు అనే ఈ శ్లోకం విషయంలో ఆ భక్తునికి ప్రగాఢమైన విశ్వాసము. ఆయన విశ్వాసానికి అనుగుణం గానే జీవితం కూడా సజావుగా సాగుతూ ఉండింది.

నిరంతరము భగవద్గుణ శ్రవణ కీర్తనాదులతో భక్తుడు కాలక్షేపం చేస్తూ ఉండేవాడు. ఏదో ఓ విధంగా అవసరాలు తీరుతూ ఉండేవి. ఆశలు లేని ఆ భక్తుని కుటుంబం అదుపు పొదుపు తెలియకుండా, కుదుపు లేకుండా సాగుతూ ఉండింది.

ఒక కాలంలో ఆ ప్రాంతం తీవ్ర క్షామానికి గురైంది. కరువు కాటకాలతో జన జీవనం కుంచుకు పోయింది. భక్తుని ఇంట్లో పూట గడవటం కష్టసాధ్య మైంది. ఆకలితో భార్యా పిల్లలు అలమటించి పోతున్నారు. పరిస్థితి విషమించింది. అయినా భక్తుడు అనన్య భక్తి లోనే కాలాన్ని సద్వినియోగం చేసుకుంటున్నాడు. భగవంతుని మాట వమ్ము కాదని అతని ప్రగాఢ విశ్వాసము.

రెండు రోజులు వరుసగా ఆహారం లేకపోయే సరికి బిడ్డలు శోషించి పోయారు. ఏమి చెయ్యాలో తోచక భార్య భర్తను సమీపించింది. బిడ్డల దయనీయ పరిస్థితిని వివరిస్తూ భోరున విలపించింది. పిల్లల్ని రక్షించ మని ప్రాధేయ పడింది.

భార్య ఆక్రందనము చూచి భక్తుడు చలించి పోయాడు. ఆమె సలహా ప్రకారము ఎవరినైనా యాచించి, సరుకులు తీసుకొని వద్దామని బయలుదేరాడు. పోతూ పోతూ, క్షణం ఆగి వెను దిరిగి పూజా మందిరం లోకి వెళ్ళాడు.

పాండురంగని ప్రతిమను తదేకంగా చూశాడు. దుఃఖం కట్టలు త్రెంచుకుంది. ఏదో వ్రత భంగం జరిగి పోతున్నట్లు మనస్సు విలవిల లాడింది. ఎవరో గుండెను పిండినట్లైంది. 'పండరినాథా! పాండురంగా! నీ మాట మీద అకుంఠితమైన విశ్వాసంతో ఇంతవరకు జీవితాన్ని కొనసాగించాను. అనన్య భక్తితో జీవించాను. యోగక్షేమాలు నీవే చూసుకుంటా నన్నావు. క్షామంలో పడేసి వినోదం చూస్తున్నావు' అని అభియోగిస్తూ, పూజా పీఠం వద్ద తెరచి ఉంచిన భగవద్గీత తాళపత్ర గ్రంథాన్ని చూశాడు. తెరచి ఉన్న ఆ పత్రంపై దృష్టి సారించాడు. అది తొమ్మిదవ అధ్యాయం - ఇరవై రెండవ శ్లోకం. ***అనన్యాశ్చింత యన్తో మాం*** అనే ఆ శ్లోకాన్ని చూడగానే బాధ రెండింత లైంది. గుండె ముక్కలైంది. 'ఈ శ్లోకం తప్పు. ఇది విశ్వసించ దగింది కాదు' అనుకుంటూ, ఒక ముల్లు తీసుకొని ఆ శ్లోకంపై అటు ఇటు గీకి పడేశాడు. తాళపత్రమే కనుక అది చిరిగి పోయింది. అంతే. ఇక అరువు తోనే కరువు తీరాలనుకుంటూ బరువైన హృదయంతో గ్రామం లోకి వెళ్ళాడు.

భక్తుడు వెళ్ళిన కొంత సేపటికి ఒక పిల్లవాడు రెండు భుజాలకు రెండు బరువైన సంచులను తగిలించుకొని, తలపై ఒక మూట నుంచుకొని, దానిని తన చిన్ని చేతులతో భద్రంగా పట్టుకొని తడబడు అడుగులతో ఇంటికి వచ్చాడు. ఆ సరుకుల మూటలను దించి భక్తుని భార్యకు అప్ప చెప్పి, అయ్యగారు ఇవి మీకు ఇవ్వ మన్నారు అన్నాడు.

భార్య ఆశ్చర్య పోయింది. ఈ లోగా సరుకులు తెచ్చిన పిల్లవాడు వెళ్ళొస్తానంటూ వెను దిరిగాడు. ఆ పిల్లవాడి వీపుపై రక్తం కనిపించింది. ఎవరో బలంగా గీకినట్లు ఉంది. కలత చెందిన ఆ ఇల్లాలు, 'నాయనా! అదేమిటి? ఆ రక్త మేమిటి? ఎవరు అలా చేసింది? ఇంతకీ నువ్వెవరు?' అంటూ ప్రశ్నలు సారించింది.

'అమ్మా! నా పేరు రంగడు. నేను పనులు చేసుకుంటూ బ్రతుకుతుంటాను. మీ వారు మా శేఠ్ వద్ద ఈ సరుకులు తీసుకొని, తొందరగా మీకు ఇచ్చి రమ్మని నన్ను ఆజ్ఞాపించారు. నేను బయలుదేరడంలో కొంత ఆలస్య మైందని ఆగ్రహించి, అక్కడే ఉన్న ముల్లుకర్రతో నన్ను కొట్టారు. ఆ ముల్లు గీసుకుని రక్తం వచ్చింది. అంతే' అన్నాడు ఆ బాలుడు.

'అయ్యో! ఎంత తొందర అయితే మాత్రం పసిబిడ్డను ఇలా కొట్టడమా? ఉండు నాయనా! కాస్త తుడిచి మందు వేస్తాను' అని ఆమె లోపలి కెళ్ళింది. ఆమె తిరిగి వచ్చే లోగా బాలుడు తిరోహితు డయ్యాడు.

ఇల్లాలు మూటను విప్పి చూచింది. అందులో కుటుంబము లోని వారందరికీ బట్ట లున్నాయి. కొన్ని నగ లున్నాయి. కొంత నగదు కూడా ఉంది.

సంచులలో చూస్తే వంట సరుకులు పుష్కలంగా ఉన్నాయి. ఆశ్చర్య పోయిన ఆ తల్లి వెంటనే షడ్రసోపేత మైన పాకం చేయడానికి సిద్ధమై చకచకా చేస్తూ ఉంది.

ఈ లోగా దీన వదనుడై ఇంటి వైపు వస్తున్న భర్తను చూచి, పరుగు పరుగున ఆయనను సమీపించింది. ఆమెను చూడగానే భర్త కన్నీళ్ళను ఆపుకోలేక పోయాడు.

'నా ప్రయత్న మంతా నేను చేశాను. ఎవరిని అడిగినా, ఎంతగా ప్రాధేయ పడినా, ఎవ్వరూ కనికరించ లేదు. ఆకలితో అలమటిస్తున్న బిడ్డలకు కనీసం గంజైనా త్రాగించ లేని నా దారిద్ర్యానికి సిగ్గు పడుతున్నాను' అని ఆ భక్తుడు పసిబిడ్డలా రోదించాడు.



భార్య విస్మయం చెందింది. 'అదేమిటి! మీరు పంపిన సరుకులతో నేను వంట కూడా చేస్తూ ఉంటే, మీరేమిటి అలా మాట్లాడుతారు?' అని ప్రశ్నించింది. 'నేను సరుకులు పంపడ మేమిటి?' అని తిరిగి ప్రశ్నించాడు భర్త.

జరిగిన విషయ మంతా ఆమె పూస గుచ్చినట్లు చెప్పింది. బాలుడి వీపుపై ముల్లుగీత వల్ల ఏర్పడిన గాయాన్ని గూర్చి కూడా చెప్పింది. భక్తుడు నిర్ఘాంత పోయాడు. తీరా వెళ్ళి పూజా మందిరంలో చూస్తే, తాళపత్రంపై ముల్లుగీత లేదు. చిరుగు అసలే లేదు. గ్రంథము మామూలుగా ఉంది.

తన తప్పిదానికి భక్తుడు పరితపించాడు. తీవ్రమైన ఉద్విగ్నతకు లోనయ్యాడు. పాండురంగని దివ్య దర్శనానికి నోచుకున్న అర్ధాంగి అదృష్టానికి పరవశించి పోయాడు.

'భగవాన్! పాండురంగా! నా అజ్ఞానాన్ని క్షమించు. నీ మాట ఎన్నడూ వృథా కాదు. నీ భక్తుడు ఎప్పుడూ వృథా పోడు. గీతపై ముల్లుతో గీస్తే అది నీ దేహంపై గీసినట్లు అయిందా? నాకు కనువిప్పు కలగడానికి నా చేత నువ్వే అలా చేయించావా? నీ గీతా వాక్యం సత్యం కాదని అనుమానించాను. కాని, గీత నీ దేహమే నని, నీ స్వరూపమే నని గ్రహించలేక పోయాను' అని పశ్చాత్తాపం చెంది, పరమేశ్వరుడు అనుగ్రహించిన నగలను, నగదును పేదలకు పంచిపెట్టి, రెట్టించిన భక్తి శ్రద్ధలతో ఆ భక్తుడు అనన్య భక్త్యారాధనకు పునరంకిత మయ్యాడు.

***గీతాశ్రయోஉ హం తిష్ఠామి గీతామే చోత్తమం గృహమ్ ।***
***గీతా జ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకా న్పాలయా మ్యహమ్ ॥***

నేను గీతను ఆశ్రయించుకొని ఉన్నాను. గీతయే నాకు వాస మందిరము. గీతా జ్ఞానమును ఆధారం చేసుకొని నేను ముల్లోకాలను పాలిస్తున్నాను అని వరాహ పురాణంలో భగవానుడు భూదేవికి బోధించాడు.

అనన్య భక్తి అనేది అనేక జన్మల పుణ్యఫల విశేషం. నిరంతరాభ్యాసం వల్ల ప్రాప్తించే భగవదనుగ్రహం. అనన్య భక్తి తత్పరులైన ఏకాంత భక్తుల హృదయాలలో పరమేశ్వరుడు తప్ప మరొకటి ఉండే అవకాశం లేదు. వాళ్ళు కేవలం భగవచ్చరణులు. కనుక వారి యోగక్షేమాలను పరమేశ్వరుడే చూసుకుంటాడు ***(కేవల మేవ భవచ్ఛరణాః తే అతః భగవా నేవ తేషాం యోగక్షేమం వహతి ఇతి).***

అనన్య భక్తిలో రమించే ఏకాంత భక్తులు భగవంతుని కన్నా అన్యమైన సమస్త విషయాలలో ఉపేక్షా భావాన్ని కలిగి ఉంటారు. చివరికి బ్రతుకులో గాని, చావులో గాని చెక్కు చెదరని, మొక్కవోని భక్తి తోనే శోభిస్తూ ఉంటారు ***(న హి తే జీవితే మరణే వా ఆత్మనః గర్హిం కుర్వన్తి!).*** పరమేశ్వరుని క్షణం విడిచి జీవించ లేరు. బ్రతుకులో ఏదైనా జరగనీ. బుద్ధిలో భక్తిని మాత్రమే ప్రధానంగా ఉంచుకుంటారు. క్షణక్షణానికి పెంచు కుంటారు.

పల్లవి: **నీవు లేక నేను లేను - లేను**
**నిన్ను విడిచి నేను ఉండలేను ॥ నీవు ॥**

చరణము: **బ్రతుకు బండలైనా బుద్ధి పండి ఉంది**
**మాధవ మాధవ యనుచు మథన పడుతూ ఉంది**
**కొన ఊపిరైనా**
**తూలుతూ నీ పాదము చేరు ॥ నీవు ॥**

అని చైతన్య గీతిక అనన్య భక్తి రాగాన్ని ఆలపించింది.

ఇంతవరకు మనం భక్తి ప్రధానమైన కర్మయోగానుసారము ఈ శ్లోకానికి వ్యాఖ్యానం చెప్పుకున్నాం. ఇప్పుడు జ్ఞానపరంగా చూద్దాం.

**అనన్య చింతనము**

అనన్యులు అంటే అన్యంగా ఉండని వారు. పరమాత్మ కన్నా తాము వేరు అని భావించని వారు అనన్య చేతస్కులు *(అనన్యాః అపృథగ్భావాః).* పరమాత్మను ఆత్మ స్వరూపంగా దర్శించి ఉపాసించే వారు అని అర్థము. అట్టి వారి యొక్క యోగక్షేమాలను పరమాత్మే వహిస్తాడు. జ్ఞాని పరమాత్మ కన్నా అన్యంగా లేడు కనుక, జ్ఞాని యోగక్షేమాలను స్వయంగా పరమాత్మే చూసుకుంటాడు.

***జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్*** - 'జ్ఞాని నా ఆత్మయే' అని ఏడవ అధ్యాయం - పద్దెనిమిదవ శ్లోకంలో భగవంతుడే చెప్పి ఉన్నాడు కదా! అందుచేత జ్ఞాని యొక్క అవసరాలు పరమాత్మ అవసరాలుగా మారుతాయి. కనుక జ్ఞాని యోగక్షేమాలను పరమాత్మే వహిస్తాడు.

అయితే, ఈ సందర్భములో శ్రీ శంకరాచార్య స్వామి భాష్యంలో ఒక ఆసక్తికర మైన విషయాన్ని వినిపిస్తారు. ***నను అన్యేషా మపి భక్తానాం యోగక్షేమం వహత్యేవ భగవాన్?*** మరి, జ్ఞానులు కాని భక్తుల యొక్క, అనగా కర్మయోగుల యొక్క యోగక్షేమాలను కూడా భగవంతుడు వహిస్తాడు కదా! నిజమే. అది సత్యం. తప్పక వహిస్తాడు *(సత్యం ఏవమ్; వహతి).* మరి భక్తుల యోగక్షేమాలను కూడా తానే వహించే టప్పుడు, తన స్వరూపమైన జ్ఞానుల యోగక్షేమాలను చూసుకుంటాడు అని ప్రత్యేకించి చెప్పడంలో విశేష మేమిటి? అనేది శంక. విశేష ముంది. అదేమిటంటే,

***అన్య యే భక్తాః తే స్వాత్మార్థం స్వయమపి యోగక్షేమం ఈహన్తే; అనన్య దర్శినః తు న ఆత్మార్థం యోగక్షేమం ఈహన్తే*** - భక్తులు తమ యోగక్షేమాలకై తాము ప్రయత్నం చేసుకుంటూనే, పరమేశ్వరుణ్ణి కూడా ప్రార్థిస్తూ ఉంటారు. అనన్య దర్శులైన జ్ఞానులు తమ యోగక్షేమాలను తాము పట్టించుకోరు. అంతటా ఉపేక్షా భావంతో ఉంటారు. ఇదే ఇద్దరి మధ్య భేదము.

ఈ శ్లోక వ్యాఖ్యానంలో మనం చెప్పుకున్న పండరీ భక్తుడు కూడా భార్య సలహా మేరకు ఊళ్ళో కెళ్ళి తన ప్రయత్న మేదో తాను చేశాడు కదా! అదే జ్ఞాని అయితే చేయడు. పూర్ణ విశ్వాసంతో పరమేశ్వరుని యందే బుద్ధిని నిలిపి ఉంచుతాడు. అదే విశేషము.

***శివో భూత్వా శివం భజేత్*** - శివుడవై శివుణ్ణి ఆరాధించు అన్నట్లుగా, జ్ఞానులు తమ ఆత్మే పరమాత్మ అనే బ్రహ్మాత్మ జ్ఞానంతో పరమాత్మను ఉపాసిస్తూ ఉంటారు కనుక, వారి యోగక్షేమాలను పరమాత్మే వహిస్తూ ఉంటాడు.

అన్యమైన విషయాల నుండి దూరంగా పోవాలని ప్రయత్నించే వారు కర్మయోగులు, లేదా భక్తులు. తమలో అన్యమైన విషయాలే లేకుండా చేసుకొనే వారు జ్ఞానులు.

*కదా! అలాంటప్పుడు అన్య*
*మరి, దేవతలు కూడా తన కన్నా అన్యంగా లేరని తానే చెబుతున్నాడు కదా! మరి అనన్య భక్తులు మాత్రమే పరమేశ్వరుణ్ణి పొందడ*
*దేవతోపాసకులు అర్చించేది కూడా పరమాత్మనే కదా! మరి అనన్య భక్తులు మాత్రమే పరమేశ్వరుణ్ణి పొందడ*
*మేమిటి? అన్య దేవతారాధకులు పరమేశ్వరుణ్ణి పొందలేక, స్వర్గాది లోకాలు చుట్టి, తిరిగి జన్మకు రావడ*
*మేమిటి? చెబుతున్నాడు.*

**యేఽప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః ।**
**తేఽపి మామేవ కౌన్తేయ యజ న్త్యవిధిపూర్వకమ్ ॥** 23

*యే-అపి-అన్యదేవతాః-భక్తాః-యజంతే-శ్రద్ధయా-అన్వితాః*
*తే-అపి-మాం-ఏవ-కౌంతేయ-యజంతి-అవిధిపూర్వకం*



| | | |
|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! |
| యే అపి | = | ఎవరయితే |
| అన్యదేవతాః | = | ఇతర దేవతల |
| భక్తాః | = | భక్తులై |
| శ్రద్ధయా | = | శ్రద్ధతో |
| అన్వితాః | = | కూడిన వారై |
| యజంతే | = | ఉపాసిస్తున్నారో |
| తే అపి | = | వారును |
| మాం ఏవ | = | నన్నే |
| అవిధిపూర్వకం | = | క్రమము తప్పి |
| యజంతి | = | పూజిస్తున్నారు |

**కౌన్తేయా! శ్రద్ధతో ఇతర దేవతలను ఆరాధించే భక్తులు కూడా వాస్తవానికి నన్నే ఆరాధిస్తున్నారు. కాకపోతే, దారి తప్పి ఆరాధిస్తున్నారు.**

**వ్యాఖ్య**

**సందర్భము - సందేహము**

సర్వేశ్వరుడైన పరమేశ్వరుని అర్చించి ఆరాధించే భక్తులు, జ్ఞానులు పరమేశ్వరునే పొందుతున్నారు అనేది స్పష్టమైంది. అంటే మోక్షాన్ని పొందుతున్నారు అని అర్థం. అలా కాక, యజ్ఞ యాగాదుల ద్వారా ఇంద్రాది దేవతలను పూజించు భక్తులు పరమేశ్వర స్వరూపమైన మోక్షాన్ని పొందలేక, జనన మరణాల మధ్య ***(గతాగతం)*** పరిభ్రమిస్తున్నారు.

***అహం క్రతుః అహం యజ్ఞః*** అనే పదహారవ శ్లోకంలో యజ్ఞ క్రతువులు, మంత్ర దేవతాదులు తన స్వరూపమే నని, ఏ దేవతను ఆరాధించినా అది తనకే చెందుతుందని కూడా చెప్పడం జరిగింది. అలాంటప్పుడు అనన్యులై పరమేశ్వరుని ఉపాసించే వారికి ముఖ్య ఫలమైన మోక్షం ప్రాప్తించడము, అన్య దేవతలను ఉపాసించే వారికి అవాంతర ఫలాలే అంది, మోక్షము సిద్ధించకుండా జనన మరణాలు ప్రాప్తించడ మేమిటి? అనేది శంక.

ఒక వైపు యజ్ఞాలు, దేవతలు తానే నని చెబుతూ, తన సర్వాత్మత్వమును ప్రతిపాదిస్తూ, మరో వైపు అనన్య భక్తు లైన వారికి మోక్షసిద్ధి, దేవతాంతర భక్తులకు జనన మరణాది అనర్థపాతమును చెప్పడం ఎలా పొసగుతుంది? తన ప్రబోధం లోనే వైరుధ్యము గోచరించడం లేదా? ప్రబోధంలో పరస్పర భావ వైరుధ్యము గోచరించడమే గాక, ప్రమాణ విభేదము కూడా గోచరిస్తూ ఉంది కదా!

***సర్వం హ్యేతద్బ్రహ్మ, ఇంద్రం మిత్రం, ఏకం సత్ విప్రా బహుధా వదన్తి*** - ఇది అంతయూ బ్రహ్మమే. ఇంద్ర సూర్యాదులు కూడా బ్రహ్మమే. అనేక విధాలుగా బుధులు ప్రవచించినా సత్యం మాత్రం ఒక్కటే అనేది శ్రుతి వాక్యము. అలాంటప్పుడు అనన్యులై భగవంతుని ఉపాసించే వారు మాత్రమే కృతకృత్యులు కావడ మేమిటి? ఇంద్రాది దేవతలను ఉపాసించిన వారికి యాతాయాతములు ప్రాప్తించడ మేమిటి? అనేది సందర్భోచిత సందేహము. పార్థుని మనస్సు లోని ఈ సందేహాన్ని ఊహించిన పరమేశ్వరుడు, సింహావలోకన న్యాయము ననుసరిస్తూ, పూర్వ బోధను సమన్వయ పరుస్తూ ప్రస్తుత శ్లోకం నుండి వరుసగా మూడు శ్లోకాలలో సందేహమును పరిహరిస్తున్నాడు.

**భావ శూన్యతే బంధహేతువు**

ఇతర దేవతలను శ్రద్ధతో పూజించే భక్తులు కూడా అవిధి పూర్వకంగా తననే ఆరాధిస్తున్నారు అంటున్నాడు భగవంతుడు. 'అవిధి పూర్వకం' అంటే, దారి తప్పి అని భావం. దేని యందు విధి, అర్థ జ్ఞానము ఉండవో అట్టిది అవిధి పూర్వక మవుతుంది.

సర్వానికి అధిష్ఠానము సర్వేశ్వరుడే కనుక, ఏ దేవతను ఆరాధించినా అది సర్వేశ్వరునికే చెందుతుంది. అలా వారి ఆరాధన సర్వేశ్వరునికే చెందుతూ ఉంది అనే జ్ఞానం దేవతోపాసకులకు ఉందా? లేదు. సర్వేశ్వరునికి చెందుతూ ఉంది అనే జ్ఞానం లేదు, సరే. మరి ఏముంది? తత్సంబంధ మైన అజ్ఞానం ఉంది. మరి వారు చేసే ఉపాసన జ్ఞానయుతమా? లేక అజ్ఞాన పూర్వకమా? అజ్ఞాన పూర్వకమే. అవిధి పూర్వకమే. మరి ముఖ్య ఫలమైన మోక్షం జ్ఞాన స్వరూపం కదా? అవును. మరి అవిద్యోపాసనకు విద్యాఫలం ఎలా ప్రాప్తిస్తుంది? కనుక దేవతాంతర భక్తులు శ్రద్ధతో దేవతలను ఆరాధించినా, సర్వేశ్వరుని విషయంలో జ్ఞానం లేకుండా పూజిస్తున్నారు కనుక అది అవిధి పూర్వకం ***(అవిధిః అజ్ఞానం, తత్పూర్వకం యజన్తే ఇత్యర్థః).*** భగవంతునికి సంబంధించిన అజ్ఞానమును పెట్టుకొని భగవంతుణ్ణి ఎలా పొందుతారు? అందుచేత, దేవతలకు సంబంధించిన లోకాలను పొంది, తిరిగి మళ్ళీ మానవ లోకంలో పుడుతున్నారు.

**భావ శుద్ధి మోక్షహేతువు**

అన్య దేవతారాధనలో భేదదృష్టి ఉంది. ఒక దేవత మరొక దేవత కన్నా భిన్నము అన్న భేదదృష్టి ఉన్నట్లే, అందరు దేవతలు పరమేశ్వరుని కన్నా అన్యులు అనే భిన్న దృష్టి ఉంది. భిన్న దృష్టితో ఆచరించే కర్మలకు ఫలం భిన్నం గానే ఉంటుంది. అభేద దర్శనంతో ఆచరించ గలిగి నప్పుడే అద్వైత ఫలమైన మోక్షం సిద్ధిస్తుంది.

అన్య దేవతా భక్తిని ఎలాగూ శ్రద్ధతో ఆచరిస్తున్నారు కనుక, వారు ఉపాసించే దేవత పరమాత్మయే అనే భావనతో చేయగలిగితే, భావాన్ని గ్రహించే వాడు భగవంతుడు కనుక ***(భావగ్రాహి జనార్దనః).*** ముఖ్య ఫలమైన మోక్షాన్ని అనుగ్రహిస్తాడు. కాని, దేవతాంతర భక్తులకు అట్టి అద్వైత భావం లేదు కనుక వారు గమనాగమనాలను పొందుతున్నారు.

దేవతను మార్చాల్సిన అవసరం లేదు. భావనను సరి చేసుకుంటే చాలు, భవార్ణవం నుండి బయట పడవచ్చు. కనుక, అవిధి పూర్వకంగా అన్య దేవతలను పూజించి, అల్ప ఫలానుభవాన్ని పొంది, జనన మరణాల మధ్య పరిభ్రమించడం కన్నా, పరమార్థ తత్త్వమును గ్రహించి, సర్వేశ్వరుడైన పరమేశ్వరుని ఆరాధించి, అనంత ఫలాన్ని పొంది తరించ వచ్చు.

*మరి, అన్య దేవతారాధకులు అజ్ఞాన పూర్వకంగా (అవిధి పూర్వకంగా) ఎందుకు పూజిస్తున్నారు? అదే తరువాత శ్లోకం.*

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ ।**
**న తు మా మభిజానన్తి తత్త్వే నాత శ్చ్యవన్తి తే ॥** 24

***అహం-హి-సర్వయజ్ఞానాం-భోక్తా-చ-ప్రభుః-ఏవ-చ***
***న-తు-మాం-అభిజానంతి-తత్త్వేన-అతః-చ్యవంతి-తే***

| | | | |
|---|---|---|---|
| అహం హి | = నేను | మాం | = నన్ను |
| సర్వయజ్ఞానాం | = సమస్త యజ్ఞములకు | తత్త్వేన | = తాత్త్వికంగా |
| భోక్తా చ | = భోక్తను | న అభిజానంతి | = ఎరుగరు |
| ప్రభుః ఏవ చ | = ప్రభువును కూడా | అతః | = అందుచేత |
| తు | = అయినను | చ్యవంతి | = పతన మవుతారు |
| తే | = వారు | | |



**అర్జునా! సమస్త యజ్ఞాలకు నేనే భోక్తను. ప్రభువును కూడా. నా తత్త్వాన్ని వాళ్ళు గుర్తించడం లేదు. అందుకే దారి తప్పుతున్నారు.**

**వ్యాఖ్య**

పరమేశ్వరుడు సర్వ దేవతారూపుడు కావడం చేత, సర్వ యజ్ఞాలకు తానే భోక్త. తానే ప్రభువు. ఇక్కడ సర్వ యజ్ఞములు అంటే శ్రౌత స్మార్తములు కూడా అని అర్థం ***(సర్వ యజ్ఞానాం శ్రౌతానాం స్మార్తానాం చ సర్వేషాం యజ్ఞానాం).*** శ్రౌతములు అంటే వేద ప్రతిపాదిత మైన క్రతువులు, యజ్ఞాలు. స్మార్తములు అంటే పూజ, జప, ధ్యాన, ప్రార్థనాదులు. ఈ రెండిటికి భోక్త పరమేశ్వరుడే.

ఇక్కడ భోక్త అంటే యజ్ఞ భోక్త. దేవతల రూపంలో ఉంటూ యజ్ఞాలలో సమర్పించే వాటిని అందుకొనే వాడు, అనుభవించే వాడు భోక్త **(దేవతాత్వేన భోక్తా).** అంతే కాదు. ప్రభువు కూడా తానే. యజ్ఞానికి స్వామి పరమేశ్వరుడే కనుక ఆయనే ప్రభువు. అంటే, యజ్ఞ ఫలాన్ని అనుగ్రహించే వాడు. అందుకొని అనుభవించే వాడు భోక్త. అందుకొని అనుగ్రహించే వాడు ప్రభువు. ఈ రెండూ వాస్తవానికి సర్వేశ్వరుడే. అంటే, దేవతా రూపమున ఉండి యజ్ఞాలలో సమర్పించిన వాటిని గ్రహించే వాడు, గ్రహించిన దానికి ఫలాన్ని అనుగ్రహించే వాడు ఒక్కడే. పరమేశ్వరుడే. అందుచేతనే యజ్ఞస్వామి యైన పరమేశ్వరుని అధియజ్ఞ స్వరూపునిగా ఇదివరకే మనం అర్థం చేసుకొని ఉన్నాం *(8 వ అ - 4 వ శ్లో).*

ఏ దేవతను ఉపాసిస్తూ యజ్ఞ యాగాదులు నిర్వహిస్తారో ఆ దేవతలకే ఆహుతులను సమర్పిస్తారు. కాకపోతే, దేవతలకు సమర్పించినా, అవి దేవతా రూపంలో ఉన్న పరమేశ్వరునికే చెందుతాయి. అలాగే, యజ్ఞ ఫలంగా పరమేశ్వరుడు అనుగ్రహించేది కూడా దేవతల ద్వారానే ఉపాసకునికి అందుతుంది. కాకపోతే, ఈ విషయానికి సంబంధించిన జ్ఞానం దేవతోపాసకునికి లేదు. అందుచేత, యజ్ఞము యొక్క అవాంతర ఫలాలకే పరిమితమై, పూర్ణఫలం నుండి జారి పోతాడు.

ఇక్కడ ఒక సంశయం ఉంది. మీమాంస తలెత్తుతూ ఉంది. యజ్ఞము విష్ణు స్వరూప మని అన్య దేవతారాధకునికి కూడా తెలుసు కదా! తెలియక పోతే, **అగ్నేర్ఘృతం విష్ణో స్తండులాః యజ్ఞోవై విష్ణుః -** అగ్ని, ఆజ్యము, ధాన్యాదులు అన్నీ విష్ణు స్వరూపాలే. యజ్ఞమే విష్ణు స్వరూపము అని ఉపాసకుడు యజ్ఞంలో చెబుతూ ఉండటం మనం వింటూ ఉంటాం. అలాంటప్పుడు అన్య దేవతోపాసకుడు సర్వేశ్వరుని గుర్తించడం లేదు అని చెప్పడం ఎలా పొసగుతుంది? అనేది శంక.

నిజమే. విష్ణువు యజ్ఞ స్వరూపుడు అని అన్యదేవతోపాసకుడికి తెలుసు. లేకపోతే, ఎలా చెబుతాడు? భగవంతుడు యజ్ఞరూపుడు అని తెలుసు. కాని, భగవంతుని యొక్క వాస్తవ స్వరూపం తాత్త్వికంగా తెలియదు **(న తు మాం అభిజానన్తి, తత్త్వేన యథావత్).** విష్ణువు తెలుసు. విష్ణు తత్త్వం అనేదే ఇక్కడ ప్రధానాంశము. దేవత పరిమితం కనుక, ఆ దేవత నుండి తెలియదు. అందుచేత దేవతనే ప్రధానంగా చేసుకొని ఉపాసిస్తాడు. దేవత పరిమితం కనుక, ఆ దేవత నుండి పరిమిత ఫలాన్నే అందుకుంటాడు. అలా అనంత ఫలమైన మోక్షము నుండి జారి పోతాడు **(అతశ్చ అవిధి పూర్వకమ్ ఇష్ట్వా యాగ ఫలాత్, చ్యవన్తి, ప్రచ్యవన్తే తే).**

కనుక, ఉపాసనలో ఏ లోపం లేదు. ఉపాసకుని భావం లోనే లోప ముంది. దేవతా రూపాన్ని ఆరాధించడం జరుగుతూ ఉందే గాని, అంతర్యామి స్వరూపంగా ఉన్న పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానం లేదు. **బ్రహ్మార్పణం బ్రహ్మహవిః** *(4 - 24)* అని నాల్గవ అధ్యాయంలో మనం అర్థం చేసుకున్న జ్ఞానం లేదు. యజ్ఞములో భోక్త, దాత రెండూ దేవత అన్న భావమే గాని, ఆ రెండూ సర్వేశ్వరుడే సర్వము అనే తాత్త్విక జ్ఞానం లేదు.

సర్వేశ్వరుడే అనే జ్ఞానం లేదు. పరిమిత జ్ఞానానికి పరిపూర్ణ ఫలం ప్రాప్తించదు కనుక, అనంత ఫలాన్ని అందుకోలేక జారి పోతాడు.

*కాలము దేశమున్ గ్రతువు కర్మము కర్తయు భోక్తయుం జగ*
*జ్జాలము దైవము న్గురువు సాంఖ్యము మంత్రము యజ్ఞమాహుతు*
*ల్వేళలు విప్రులుం జనన వృద్ధి లయంబుల హేతు భూతము*
*ల్లీలలు దానయై తగ వెలింగెడు నెక్కటి తేజ మీశుడున్ ॥*

కాలము, దేశము, క్రతువు, కర్మ, కర్త, భోక్త ప్రపంచము, దైవము, గురువు, జ్ఞానము, మంత్రము, యజ్ఞ ఆహుతులు, సమర్పించు వేళలు, వేదజ్ఞులు, సృష్టి స్థితి లయాలు - సమస్తము అతని స్వరూపమే అని తెలియుటయే తాత్త్విక జ్ఞానము; పువ్వులు దారములో గ్రుచ్చబడినట్లు, సర్వము సూత్రాత్మ యైన పరమేశ్వరుని యందే నిలిచి ఉంది అని శ్రీమద్భాగవతం - దశమ స్కంధములో పోతనామాత్యుడు మణులను దారములో గ్రుచ్చి మణిమాలను రూపొందించినట్లు, సమస్తాన్ని ఉత్పలమాలలో నింపేశాడు.

పరమేశ్వరుని కన్నా అన్యము లేదని గ్రహించడమే తత్త్వజ్ఞానము. అట్టి తాత్త్విక జ్ఞానాన్ని కలిగి, పరమేశ్వరుని ఉపాసించే వారు పరమేశ్వరునే పొందుతారు. తాత్త్విక జ్ఞానం లేకుండా అన్య దేవతల నారాధించే వారు ఆయా దేవతా లోకాలను చేరి తత్ఫలాలనే అనుభవిస్తారు.

*అదే వివరిస్తూ ఉంది తరువాత శ్లోకం.*

**యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్యాన్తి పితృవ్రతాః ।**
**భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్ ॥** 25

***యాంతి-దేవవ్రతాః-దేవాన్-పితౄన్-యాంతి-పితృవ్రతాః***
***భూతాని-యాంతి-భూతేజ్యాః-యాంతి-మద్యాజినః-అపి-మాం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేవవ్రతాః | = | దేవతల నారాధించు వారు | భూతేజ్యాః | = | భూతములను ఆరాధించు వారు |
| దేవాన్ | = | దేవతలను | భూతాని | = | భూతములను |
| యాంతి | = | పొందుతున్నారు | యాంతి | = | పొందుతున్నారు |
| పితృవ్రతాః | = | పితృపూజ చేయువారు | మద్యాజినః అపి | = | నన్ను పూజించే వారు |
| పితౄన్ | = | పితరులను | మాం | = | నన్ను |
| యాంతి | = | పొందుతున్నారు | యాంతి | = | పొందుతున్నారు |

**అర్జునా! దేవతల్ని ఉపాసించే వారు దేవతలనే పొందుతారు. పితృ పూజ చేసే వారు పితృ దేవతల్ని చేరుతారు. భూతాలను సేవించే వారు భూతాలను పొందుతారు. నన్ను ఆరాధించే వారు నన్నే చేరుతారు.**

**వ్యాఖ్య**

మతిని బట్టి గతి అంటారు పెద్దలు. మతి మార్గాన పడుతుంది. మార్గము గమ్యాన్ని చేరుస్తుంది. మతిని బట్టి మార్గము. మార్గమును బట్టి గమ్యము. ఇదీ పద్ధతి. ఏ విషయములో నైనా సాధన సాధ్యాలు ఇలాగే ఉంటాయి. ఉపాసనా మార్గాలు ఇందుకు విలక్షణ మేమీ కావు.

***తం యథా యథా ఉపాసతే తదేవ భవతి*** - ఉపాసన ఎలా ఉంటే, దాని ఫలం కూడా అలాగే ఉంటుంది.





ప్రస్తుత శ్లోకంలో ఉపాసకులు నాలుగు రకాలుగా చెప్పబడ్డారు. వీరిలో ముగ్గురు అవిధి పూర్వకంగా పరమేశ్వరుని అర్చించే వారు. అంటే పూర్వం మనం చూచినట్లు అన్య దేవతారాధకులు. అజ్ఞానంతో పూజించే వారు. నాల్గవ వారు అనన్యులు. సాక్షాత్తు భగవ దారాధకులు.

అవిధి పూర్వకంగా ఉపాసించే దేవతారాధకులు అంతఃకరణ రూప ఉపాధిగత గుణత్రయ భేదమును బట్టి మూడు విధాలుగా తెలుస్తూ ఉంటారు. సాత్త్వికులు, రాజసులు, తామసులు అని మూడు రకాలుగా ఉంటారు. సత్త్వగుణ ప్రధానులైన సాత్త్వికులు దేవవ్రతులు ***(దేవవ్రతాః).*** రజోగుణ ప్రధానులైన రాజసులు పితృవ్రతులు ***(పితృవ్రతాః).*** తమోగుణ ప్రధానులైన తామసులు భూతేజ్యులు ***(భూతేజ్యాః).*** గుణభేదాన్ని బట్టి ***(గుణభేదాత్)***, కర్మభేదాన్ని బట్టి ***(కార్యభేదాత్)*** ఈ ముప్వురు ఉపాసకులు ఆయా ఫలితాలను పొందుతారు.

దేవతోపాసకు లైన ఈ గౌణ భక్తులు (గుణ ప్రాధాన్యం కలవారు) వారు ఉపాసించే మూర్తులను, కర్మ విధులను బట్టి ఆయా లోకాలను పొందుతారు. లోకాలు ఏవైనా కాలం లోనే పొంద బడతాయి. దేశం లోనే తెలిసి వస్తాయి. కాలగతము, దేశగతము అయినందున ఇవి అనిత్యాలు. కనుక లోకాంతర ఫలాలు ఏవైనా నశించేవే. తిరిగి జన్మను అందించేవే.

అల్ప బుద్ధులు, స్వల్ప బుద్ధులు గల వారు అయిన ఈ గౌణ భక్తులకు లభించే ఫలాలు కూడా అల్పం గానే ఉండి అంతము లవుతాయి *(7 వ అ - 23 వ శ్లో).* అందుచేత, అన్య దేవతోపాసకులు వారి ఆరాధనా ఫలంగా పుణ్యం ఆర్జించి, తత్ఫలితంగా పుణ్య లోకాలలో జీవించి, పుణ్యము క్షీణించ గానే మానవ లోకంలో తిరిగి జన్మిస్తారు *(9 వ అ - 21 వ శ్లో).*

గుణ ప్రధానులై, గుణ భేదాలతో ఉపాసించే ముగ్గురు దేవతారాధకుల్ని గూర్చి ముందుగా తెలుసుకొని, ఆ తరువాత అనన్యులైన భక్తుల విషయం చెప్పుకుందాము.

**దేవవ్రతులు**

దేవతలను ఆరాధించే వారు దేవవ్రతులు. అంటే దేవతల విషయంలో వ్రతము, అనగా నియమము కలవారు ***(దేవేషు వ్రతం నియమః భక్తిర్వ యేషాం తే దేవవ్రతాః).*** అంటే యజ్ఞ దానాది నియమ రూపులు. సత్త్వగుణ ప్రధానులై ఇంద్ర, అగ్న్యాది దేవతల్ని ఆరాధిస్తూ యజ్ఞాలను నిర్వహిస్తారు. వీరు శ్రౌత కర్మలను, అనగా శ్రుత్యుక్త మైన సాధనలను ఆచరిస్తారు. ఇంద్రాది దేవతల్ని తృప్తి పరుస్తారు. తత్ఫలితంగా ఆయా లోకాలను పొందుతారు ***(దేవవ్రతాః దేవాన్ యాన్తి గచ్ఛన్తి).*** వీరు దేవయాజులు. పుణ్యఫలంగా స్వర్గాది లోకాలను పొందుతారు కనుక, పుణ్యం క్షీణించ గానే ఆయా లోకాలను త్యజించి తిరిగి మానవులుగా పుడుతారు.

**పితృవ్రతులు**

పితృవ్రతం కలవారు పితృవ్రతులు. అంటే, పితృ దేవతల యందు భక్తి కలిగి శ్రాద్ధాది కర్మలను, తర్పణ తిలోదకాలను సమర్పించే నియమంతో ఉపాసించే వారు ***(పితృ భక్తాః).*** వీరు రజో గుణ ప్రధానులు. మానవ లోకంలో పితృ కర్మలతో పాటు వీరు ఆచరించే స్మార్త కర్మలైన పూజాదికాలు వీరిని మరణానంతరము పితృలోకం చేర్చుతాయి. కనుక, పితృవ్రతులు పితృలోకాలను చేరుతారు ***(పితృభక్తాః పితౄన్ యాన్తి గచ్ఛన్తి).*** ఇది కూడా కర్మఫలమే కనుక, ఫలం క్షయం కాగానే వీరు కూడా తిరిగి జనన మరణాల చక్రంలో పడిపోతారు.

**భూతేజ్యాలు**

భూత ప్రేతాలను, యక్ష రాక్షస గణాలను ఉపాసించే వారు భూతేజ్యాలు. వీరు తమోగుణ ప్రధానులు.

ఇలా భూతగణాన్ని పూజించే వారు మరణానంతరము భూతాలు వసించే లోకాలను పొందుతారు ***(భూతేజ్యాః భూతానాం పూజకాః భూతాని యాన్తి గచ్ఛన్తి).***

ఈ ముగ్గురు, మిక్కిలి ప్రయాసతో కూడినవి, బహు ధన వ్యయంతో పాటు అధిక దేహ శ్రమ కలవి అయిన వ్రతములను ఆచరించి, స్వల్ప ఫలాన్ని అల్పకాలం అనుభవించి తిరిగి మానవ లోకంలో పుడుతారు.

పైగా, వీరు ఆచరించే నియమ రూప కార్యాలలో కర్మ లోపం జరిగినా, వస్తు లోపం ఏర్పడినా, విధి లోపం కలిగినా, మంత్ర తంత్రాది లోపము సంభవించినా, ఫలితము రాక పోగా, విపరీతమైన ప్రతికూల ఫలాలు వచ్చే ప్రమాదము కూడా లేకపోలేదు.

ప్రయాసం అధికం. ఫలం అల్పం. దీనికి కారణం వీరి ఆరాధనలు అవిధి పూర్వకంగా ఉండటమే. అజ్ఞానంతో కూడి ఉండటమే. ఈ విధంగా గుణ భేదాలతో అన్య దేవతారాధనములో నిమగ్నమై పరమేశ్వరుని అవిధి పూర్వకంగా అర్చించి, అనిత్య ఫలాలను ఈ దేవవ్రత, పితృవ్రత భూతేజ్యాలు అనుభవించి యాతాయాతాలలో పడుతూ ఉంటే, నాల్గవ వారైన అనన్యులు, భగవద్భక్తులు ***(మద్యాజినః)*** తననే పొందుతున్నారు అంటున్నాడు భగవంతుడు ***(మద్యజన శీలాః మామేవ యాన్తి గచ్ఛన్తి).*** గుణ ప్రధానులైన ముగ్గురు దేవతోపాసకుల కంటే అనన్యులైన భక్తులు విలక్షణమైన వారు. వారిని గూర్చి మరి కొంత చెప్పుకుందాం.

**మద్యాజులు**

మద్యాజులు అంటే పరమేశ్వరునే ఆరాధించే అనన్యులు. వీరు పరమేశ్వరుని ఆరాధిస్తారు. పరమేశ్వరుని ఎలా ఆరాధిస్తారు? జ్ఞానపూరితంగా ఉపాసిస్తారు. పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు. అనంతుడు. అనంతుడైన వానిని పొందాలి అంటే, ఏం చెయ్యాలి? ఏది చేసినా అది కర్మే కనుక, కర్మ పరిమితమే కనుక, పరిమితమైన కర్మ ద్వారా అనంతుని పొందలేము.

భగవంతుడు ఒక ప్రదేశంలో ఉండేవాడు అయితే ప్రయత్నించి పొందవచ్చు. అంతటా ఉండేవాణ్ణి చేరుకునే మార్గ మేది? అనంతము అనే దానిలో నీవు వేరుగా ఎక్కడున్నావు? కనుక అనంతుణ్ణి నీవు పొందే ఉన్నావు. పొందే ఉన్న దానిని పొందడానికి నీవు ఏమి ప్రయత్నము చేస్తావు? తెలుసుకుంటావు. అంతే. పొందే ఉన్నాను అనే జ్ఞానాన్ని పొందుతావు.

తాను తియ్యగా ఉండటానికి బెల్లం ఏమి చెయ్యాలి? ఏమీ చెయ్య నవసరం లేదు. తెలుసుకోవాలి. నేను తియ్యగానే ఉన్నాను అని అర్థం చేసుకోవాలి. అదే జ్ఞానం. ఇలా ఉన్న దానిని తెలుసుకోవడం కష్టమా? లేక లేని దానిని పొందడము కష్టమా? ఆలోచించండి. అదే జ్ఞాన వైభవం. కనుక, జ్ఞానంతో పరమేశ్వరుని ఆరాధించే వారు పరమేశ్వరునే పొందుతున్నారు. జనన మరణాల నుండి విడి పడుతున్నారు.

అధిక శ్రమతో అల్ప ఫలాన్ని పొంది జనన మరణ చక్రంలో తగులుకొని దేవతారాధకులు అలమటిస్తూ ఉంటే, అల్ప శ్రమతో అనంత ఫలాన్ని పొంది, జనన మరణ వలయం నుండి విడిపడి అనన్య భక్తులు భగవత్స్వరూపులై శోభిస్తున్నారు. ఇక్కడ భక్తి ప్రాధాన్యమే గాని, కర్మకాండలో లాగా వస్తు ప్రాధాన్యం, కర్మ ప్రాధాన్యం లేవు. అనంతుడైన వానికి మన మేమివ్వగలం? ఆయన ప్రసాదించినవే తిరిగి ఆయనకు నైవేద్యంగా సమర్పించడం కన్నా భక్తులు చేయగలిగింది ఏమీ లేదు.

*ఆ సమర్పణ ఎలా ఉంటుందో చూద్దాం.*

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥** 26





***పత్రం-పుష్పం-ఫలం-తోయం-యః-మే-భక్త్యా-ప్రయచ్ఛతి***
***తత్-అహం-భక్త్యుపహృతం-అశ్నామి-ప్రయతాత్మనః***

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| భక్త్యా | = | భక్తితో |
| పత్రం | = | ఆకునో |
| పుష్పం | = | పువ్వునో |
| ఫలం | = | ఫలమునో |
| తోయం | = | ఉదకమునో |
| మే | = | నాకు |
| ప్రయచ్ఛతి | = | సమర్పించునో |
| ప్రయతాత్మనః | = | నిష్కాముడైన అట్టి భక్తుని యొక్క |
| భక్త్యుపహృతం | = | భక్తిపూర్వకముగా సమర్పింపబడిన |
| తత్ | = | దానిని |
| అహం | = | నేను |
| అశ్నామి | = | భుజిస్తున్నాను |

**అర్జునా! ఆకు అయినా, పువ్వు అయినా, పండైనా, నీళ్ళైనా నాకు భక్తితో సమర్పిస్తే చాలు. భక్తి కలవాడు బుద్ధిగా సమర్పిస్తే, దానిని నేను తృప్తిగా ఆరగిస్తాను.**

**వ్యాఖ్య**

**ప్రేమ చలనాలు**

ప్రేమ పవిత్ర మైంది. భక్తియే ప్రేమకు పరాకాష్ఠ. భక్తిగా మారిన ప్రేమ అమృత స్వరూపమై అలరారు తుంది. భక్తుని హృదయం నుండి నిరంతరం స్రవించే ప్రేమ ప్రవాహము పరమేశ్వరుని చరణాలను చల్లగా తడుపుతూ ఉంటుంది.

భక్తి అనేది ఉత్కృష్టమైన ఉపాసన. విశిష్టమైన ఆరాధన. ప్రేమ స్వరూపమైన భక్తి, బుద్ధిలో భావనా రూపంగా ఉంటుంది. బాహ్యంలో క్రియా రూపంగా వ్యక్త మవుతుంది. ఈ రెండూ కలిసి నపుడే భక్తి ప్రతిక్షణ వర్ధమానమై అనుభవ రూపంగా విలసిల్లుతుంది.

ప్రేమ దాగేది కాదు. భక్తి దాచబడేది కాదు. ప్రేమ రూపమైన భక్తిని హృదయంలో ఉంచి మూత పెట్టలేము. అది కళ్ళ ద్వారా తొంగి చూస్తుంది. మాట ద్వారా బయట పడుతుంది. చేతులను చలింప చేస్తుంది. చేతలలో చిందు లేస్తుంది.

విరబూసిన మల్లెలు వెదజల్లే పరిమళాలను చేతులు అడ్డుపెట్టి ఆపగలమా? భక్తి కూడా అంతే. ప్రేమ ఉంటే ప్రేమ కార్యాలు అనివార్యంగా సాగుతాయి. నీరు పోయక పోతే మొక్క పెరగనట్లు ప్రేమ కార్యాలు లేకుండా ప్రేమ వృద్ధి చెందదు.

మొక్క ఆర్భాటము లేకుండా పెరుగుతుంది. ప్రేమ ఆడంబరము తెలియకుండా తిరుగుతుంది. సూర్యుని నుండి కదిలే నులివెచ్చని లేత కిరణాలు, పువ్వుల లోని రంగుల పొంగులు, చల్లగా, మెల్లగా చలించే కడలి తరంగాలు, గుర్తులు విడవకుండా గగనంలో విహరించే విహంగాలు - ఇవన్నీ మనస్సుపై ప్రకృతి లిఖించే ప్రేమ సంతకాలు. అన్నీ ప్రేమ కార్యాలే. శబ్దం లేకుండా బుద్ధిలో అలజడిని సృష్టించే ప్రేమ చలనాలే, మౌన భాషలో మర్మంగా, రమ్యంగా అచ్యుతుని అడుగు జాడలను తెలిపే ముచ్చట్లే.

ప్రకాశము లేకుండా సూర్యుడు ఉండలేడు. సూర్యుడు, సూర్య ప్రకాశము రెండు కావు. ప్రేమ కార్యాలు లేకుండా ప్రేమ ఉండలేదు. భక్తి కార్యాలు లేకుండా భక్తి నిలవదు. భక్తి, భక్తి కార్యాలు రెండు కావు.

ప్రేమకు ఇవ్వడమే తెలుసు. ప్రకాశాన్ని విరజిమ్మడమే భానుని ప్రభావము. వర్షించడమే మేఘం లోని ఔదార్యం. అన్నం పెట్టడమే అవనికి తెలుసు. ప్రాణం పోయడమే గాలికి తెలుసు. ఇవన్నీ ప్రేమ కార్యాలు

ఇచ్చుకొనే కార్యాలు. మాధవుడు మెచ్చుకొనే కార్యాలు. భక్తులు కూడా పరమేశ్వరుడు మెచ్చుకొనే లాగా ఇచ్చుకొనే కార్యాలలో ముచ్చట పడతారు. ఆ ఇచ్చుకోవడాలే సమర్పణలు.

## సమర్పణల సందడులు

సమర్పణము ప్రేమ కార్యము. సమర్పించే వాడు భక్తుడై ఉండాలి. సమర్పించేది భక్తితో అర్పించ బడాలి. భక్తితో మనం ఏది సమర్పించినా, భగవంతుడు దానిని అక్కడే సమర్పణము సముజ్జ్వలమై శోభిస్తుంది. ప్రేమతో గ్రహిస్తాడు. గ్రహించి అనుగ్రహిస్తాడు.

పరమేశ్వరుని దయతో సర్వమూ సిద్ధిస్తుంది. అదంతా భక్తితో ముడిపడి చేసేది భక్తి. చూపేది దయ. మడతలు విప్పుతూ ఉంటే కొరతలు తప్పుకుంటూ ఉంటుంది. భక్తి కార్యాలలో మడత పెట్టి ఉంటుంది. పోతాయి.

ఈ ప్రపంచంలో ఎవరికి ఏది ఇచ్చినా, ఎంత ఇచ్చినా, మనం తృప్తి పరచిన దాఖలాలు లేవు. వారు తృప్తి చెందిన ఆనవాళ్ళు అగుపించవు. ఏది ఇచ్చినా తృప్తి చెందని వాడు మానవుడు. ఏది సమర్పించినా సంతృప్తి పడేవాడు మాధవుడు.

ఇంతకీ భగవంతునికి సమర్పించడానికి మన వద్ద ఏముంది? మనం ఈ ప్రపంచంలో కాలు మోపిన నాడు మన చేతులు ఏమి పట్టుకొచ్చాయి? మన భుజాలు ఏమి మోసుకొచ్చాయి? రిక్త హస్తాలతో వచ్చాం. మరి మన వద్ద ఏముందని భగవంతునికి సమర్పిస్తాం?

ఏదైనా పరమాత్మ సృష్టించిందే. ఆయన సృష్టి లోని వస్తువే. ఆయన వస్తువునే ఆయనకు సమర్పిస్తున్నాం. వస్తువు పరమేశ్వరునిదే. ఆయన వస్తువునకు మన భక్తిని జోడించి అర్పించడమే మనం చేయదగిన కార్యము. వలువలు ఆయనివే. వలపులే మనవి. పదార్థం పరమేశ్వరునిదే. ప్రేమే మనది. పరమేశ్వరుడు ప్రసాదించిన పదార్థాన్ని ప్రేమ పళ్ళెంలో ఉంచి సమర్పించడమే మన ఆరాధన. ఆయన అనుగ్రహించిన కర్పూరాన్ని మన భక్తితో వెలిగించి త్రిప్పడమే నీరాజనం.

పరమేశ్వరునికి తృప్తి నిచ్చేది ఆయన సృష్టి లోని వస్తువు కాదు; మన హృదయం లోని భక్తి. కనుక, ***భక్త్యు పహృతం*** - భక్తితో సమర్పించడ మొక్కటే మనం చేయవలసిన పూజా కార్యం. కనుక, భగవంతునికి ఏమి సమర్పించాము? అనేది ముఖ్యం కాదు. ఎలా సమర్పించాము? అనేదే ప్రధానం.

మనం సమర్పించేవి భగవంతుడు ఆరగిస్తాడా? ఆరగించడానికి భగవంతునికి ఆకలి ఉందా? ఆకృతే లేని వాడికి ఆకలి ఎలా పుడుతుంది? జనుల ఆకలి తీర్చే జనార్దనునికి మనం ఆహారం పెట్టడమా! మనం పెడితే, ఆయన తింటాడా? తప్పక తింటాడు. తినకపోతే ఎందుకు పెడతాము? ***అహం అశ్నామి*** - నేను తింటున్నాను అని ఆయనే ప్రకటించు కున్నాడు కదా! మరి, మనం సమర్పించే దానిని పరమేశ్వరుడు ఆరగించే టప్పుడు, సమర్పించడం అనే కార్యాన్ని మించిన పవిత్రమైన కార్యం మరొకటి ఉంటుందా?

అందుచేత, సమర్పణ అనేది ఆరాధనలో ప్రధానమైంది. ఎలా సమర్పిస్తున్నాము అనేది అందులోనూ అతి ప్రధాన మైంది. ఏమి సమర్పిస్తున్నాము అనేది ఒక్కటే అప్రధాన మైంది. నువ్వు ఏది సమర్పించావు అనేది భగవంతుడు చూడడు. ఏదైనా అర్పించు. అది ఆకైనా, పువ్వైనా, పండైనా, నీళ్ళైనా, ఏదైనా ఫరవాలేదు. అన్నీ పూజార్హాలే. అన్నీ ఆరగింపులే. అనంతుడైన పరమేశ్వరుడు ఆకలేసి తినడం లేదు. నీ ఆర్తిని చూసి తింటున్నాడు. నీ భక్తికి మెచ్చి ఆరగిస్తున్నాడు.





ఏది ఇచ్చినా భగవంతుడు పుచ్చుకుంటాడు. కాకపోతే, ఇచ్చేవాడు అర్హత కలవాడై ఉండాలి. యోగ్యత కలవాడై ఉండాలి. ఆ అర్హత ఏమిటి? ఆ యోగ్యత ఎలాంటిది? భక్తియే అర్హత. అదే సమర్పించడానికి యోగ్యత. ***భక్త్యా ప్రయచ్ఛతి*** - భక్తితో ఇవ్వాలి. ***భక్త్యు పహృతం*** - భక్తితో సమర్పించ బడాలి ***(భక్త్యా ఉపహృతం భక్తి పూర్వకం ప్రాపితం).*** భక్తి అనే పదాన్ని ఈ విధంగా ప్రస్తుత శ్లోకంలో రెండు సార్లు ప్రయోగించడం జరిగింది. నిష్కల్మషంగా ఆంతర్యంలో భావనా రూపంలో ఉండ వలసింది భక్తి. అలాగే నిష్కామ్యంగా బాహ్యంలో కార్య రూపంలో నిండ వలసింది కూడా భక్తే. బాహ్యాభ్యంతరాలలో కొరత లేని భక్తి, వెలితి తెలియని భక్తి ఉండాలి అని సూచించడమే రెండు సార్లు భక్తి పద ప్రయోగము.

## పత్రం - పుష్పం - ఫలం - తోయం

పత్ర పుష్ప ఫలోదకాలు ఏవైనా సరే, భక్తితో సమర్పిస్తే, పరమేశ్వరుడు ఆరగిస్తాడు. ***అశ్నామి*** - తింటాను అన్నాడు. పండ్లు సరే తినొచ్చు. మరి ఆకులు, పూలు కూడా తింటాడా? అదలా ఉంచినా, నీళ్ళు ఎలా తింటాడు? త్రాగే వాటిని తినడ మంటే, తినే వాటిని త్రాగడము అని అర్థం చేసుకోవాలా?

అదలా ఉంచి, వేదం వైపు తిరిగితే, ***న హ వై దేవా అశ్నన్తి న పిబన్త్యే తదేవామృతం దృష్ట్వా తృప్యన్తి*** - భక్తులు సమర్పించిన వాటిని దేవతలు తినరు. పానం చేయరు. అమృతమును కూడా కళ్ళతో చూచి తృప్తి చెందుతారే గాని త్రాగరు అని వేదం చెబుతోంది. అమృతాన్ని కూడా దేవతలు త్రాగరు అనేటప్పుడు, దేవ దేవుడైన భగవంతుడు ఈ పత్ర పుష్పాలు ఆరగించడ మేమిటి? నదీ జలాలు పానం చేయడ మేమిటి? ఇదంతా ఎందుకు చేస్తున్నట్లు? ***భక్త్యు పహృతం*** - భక్తితో సమర్పించడమే దానికి కారణము. భక్తితో ఇస్తే చాలు, ఏవైనా భగవంతుడు అందుకుంటాడు. భక్తి ఉంటే చాలు, ఏదిచ్చినా గ్రహిస్తాడు. ఎవరి నైనా అనుగ్రహిస్తాడు.

***ఇరువుగ నిసుక లోన బొరలిన యుడుత భక్తికి***
***కరుణించి బ్రోచితి వని నెర నమ్మితి నిన్నే తండ్రి***
***పలుకే బంగార మాయెనా? కోదండ పాణి    ॥ పలుకే ॥***

అంటూ భక్తులను అనుగ్రహించే భక్తవత్సలుడు, కరుణామయు డైన పరమేశ్వరుని పరవశించి కీర్తించాడు భద్రాచల రామదాసు.

ఆకలి తెలియని భగవంతుడు ఆకులు ఆరగించే వాడు కాడు, ఫల పుష్పాదులు తినేవాడూ కాడు. నీళ్ళు త్రాగడానికి ప్రాణ ధర్మమైన దాహం ఆయనకు లేదు. ఆయన ప్రాణనాథుడు. ప్రాణ నిలయుడు. ప్రాణ జీవనుడు.

పువ్వు పువ్వుగా ఉండి పరిమళించడానికి కారణమైన వాడు తాను. ఆకు ఆకుగా ఉండి పచ్చగా కళకళ లాడటానికి హేతువు తానే. పండు పండుగా ఉండి, రసపూర్ణం కావడానికి కారణము తానే. నీరు నీరుగా ఉండటానికి ఉదజని, ప్రాణవాయువుల సమ్మేళనాన్ని రూపొందించింది తానే. అన్నిటికీ ఆధారమైన ఆయనకు ఇవేవీ అవసరం లేదు. ఆయన గ్రహించేది మన భక్తిని మాత్రమే. సాధారణంగా ***అశ్నామి*** అంటే ఆరగించడము అని భావిస్తాము. అక్కడ నుండే పుట్టుకొస్తుంది ఈ మీమాంస. ***అశ్నామి*** అంటే ***గృహ్ణామి*** అని భాష్యంలో అర్థం చెప్పారు శ్రీ శంకరాచార్య స్వామి. ***గృహ్ణామి*** అంటే గ్రహిస్తాను అని అర్థము. ఆయన గ్రహించేది కూడా వస్తువును కాదు. వస్తువును సమర్పించే వ్యక్తి లోని భక్తిని.

## అవే ఎందుకని?

పత్రం పుష్పం ఫలం తోయం - ఎందుకని ఈ నాలుగే సమర్పణ వస్తువు లయ్యాయి? ఇవి కాకుండా మరేవీ ఇవ్వకూడదా? ఇంకేవీ పనికి రావా? ఈ నాలుగే ప్రశస్తములా? పవిత్రములా? ఉత్కృష్టములా? లేక

భగవంతునికి ఇష్టములా? అవేవీ కాదు. ఈ నాల్గుగైతే సులభంగా దొరుకుతాయి, అందరికీ లభిస్తాయని. అవి సులభంగా ప్రాప్తించడమే కాకుండా, సమర్పణమే ప్రధానంగా గల భక్తి కూడా అన్నిటి కన్నా సులభము, సురక్షితము, క్షేమకరము అని సూచిస్తున్నాయి ***(అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ).***

మరి, వీటితో ఈ ప్రపంచంలో ఎవరి నైనా తృప్తి పరచగలమా? ఆకులే అల్లెము అని వడ్డిస్తే అల్లుడు ఒప్పుకుంటాడా? సారెకు బదులు పువ్వులు బిందెలలో నింపి అత్తవారింటికి పోయిరమ్మంటే బింబోష్ఠి గడప దాటుతుందా? కట్న కానుకలు లేవని పొట్లకాయలు చేతిలో పెడితే పెళ్ళిళ్ళు జరుగుతాయా? నీళ్ళను నిధులుగా ఎవరైనా అంగీకరిస్తారా? వీటితో ప్రపంచంలో ఎవరైనా తృప్తి చెందుతారా? కానీ పరమేశ్వరుడు తృప్తి చెందుతాడు. ఎందుకో తెలుసా? ఆయన గ్రహించేది మనం సమర్పించే వస్తువును కాదు, మన భక్తిని.

***పత్రం*** - పత్రం అంటే ఆకు. అన్నయ్యకు అరణ్యంలో ఆడపడుచు అర్పించింది ఆకు గాక మరేమిటి? అర్పించింది ఆకు. అందుకున్నది అక్షయం. చెల్లెమ్మా! నాకు ఆకలిగా ఉంది అన్నం వడ్డించు అన్నాడు ఆక లెరుగని అచ్యుతుడు అరణ్యంలో. అన్నయ్యా! పాత్ర నిండుకున్నది అన్నది ద్రౌపది చిన్నబోయి, సూర్యదత్త మైన అక్షయపాత్రను చూపిస్తూ.

ఆ పాత్ర అంచుకు శాక లేశం అంటుకొని అగుపించింది. అంతే. ఆ శాక లేశాన్ని నోటిలో వేసుకొని, ***విశ్వాత్మా ప్రీయతాం దేవస్తుష్ట శ్చాస్త్వితి యజ్ఞభుక్*** - ఈ శాకంతో విశ్వాత్ముడు, యజ్ఞ భోక్త అయిన భగవంతుడు ప్రీతి చెందు గాక! అని పలికాడు శ్రీకృష్ణుడు.

ఆ పలుకులో పరమార్థం ఏమిటో! పది వేల మంది శిష్యగణంతో వచ్చి, ఆతిథ్యం ఇవ్వమని ఆజ్ఞాపించిన దుర్వాస మహర్షి అభీష్టం నెరవేరడానికి ఆ పలుకే హేతువైంది. సమర్పించింది ఒక ఆకును మాత్రమే. ఆకలి తీరింది పదివేల మందికి. పరమేశ్వరుని పరమ ప్రేమను వర్ణించడం ఎవరి తరము! ***ఓం నమో భగవతే వాసుదేవాయ . . . . పత్రం సమర్పయామి!***

***పుష్పం*** - పత్రం లాగా పువ్వును కూడా పరమేశ్వరునికి అర్పణ చేయవచ్చు. సరోవరము నందు మొసలి గజేంద్రుని పాదమును పట్టుకొని లోనికి ఈడుస్తున్న సమయంలో, బహుకాలం పోరాడి అలసిపోయి, అసువులు బాసే వేళ గజేంద్రుడు శ్రీహరిని ప్రార్థిస్తాడు. గజేంద్రుని మొర ఆలకించి, వైకుంఠపురం నుండి శ్రీహరి బయలుదేరి త్రికూట పర్వతము నందు ఋతుమంత మనే ఉద్యానవనంలో గజేంద్రుని సమీపించ గానే, గజేంద్రుడు శ్రీహరిని దర్శించి, సరోవరము నందలి పద్మమును తొండముతో గ్రహించి, కమలముతో కూడిన తొండమును పైకెత్తి ***(ఉత్క్షిప్య సాంబుజకరం),*** జగన్నాథా! భగవంతా! నీకు నమస్కారము ***(నారాయణాఖిల గురో భగవన్ నమస్తే)*** అని అతి కష్టంగా పలికాడు ***(కృచ్ఛాత్ గిరమ్ ఆహ).*** గజేంద్రుడు సరోవరంలో నిలబడి సమర్పించిన తామర పుష్పాన్ని చూపు తోనే గ్రహించిన శ్రీ మహావిష్ణువు చక్రాయుధమును ప్రయోగించి మకరి శిరస్సును ఖండించి, కరిని ఉద్ధరించాడు. కేవలం పుష్పమును సమర్పించిన గజేంద్రునికి శ్రీహరి ప్రాణదానం చేసి ఉద్ధరించాడు. ***ఓం నమో భగవతే వాసుదేవాయ . . . పుష్పం సమర్పయామి!***

***ఫలం*** - పత్ర పుష్పాలను సమర్పించి ద్రౌపది, గజేంద్రుడు పరమేశ్వరుని అనుగ్రహానికి పాత్రు లైనట్లు, రుచికరమైన ఫలాలను భగవంతునికి భక్తితో సమర్పించి శబరి తరించి పోయింది. శబరీ! నీకు రామ దర్శనం కాగానే నువ్వు తరిస్తావు. అంతవరకు పంపాతీరము నందే నిరీక్షిస్తూ జీవించ మని చెప్పిన గురుదేవుని వచనాలను హృదయంలో నిలుపుకొని శ్రీరాముని కొరకు నిరాశ లేని నిరీక్షణను కొనసాగించింది శబరి.

రాముడు రానే వచ్చాడు. శబరీ! గురుసేవకు ఫలితం లభించిందా? అని ప్రశ్నించాడు. శబరి పరవశించి పోయింది.





***అద్య ప్రాప్తా తపః సిద్ధిః తవ సందర్శనా న్మయా ।***
***అద్య మే సఫలం తప్తం గురవశ్చ సు పూజితాః ॥***

రామా! నేడు నీ దర్శన భాగ్యం లభించింది. నాకు తపస్సిద్ధి ప్రాప్తించిందని భావిస్తున్నాను. నేను చేసిన తపస్సు, నే నాచరించిన గురుసేవ సఫలము లయ్యాయని విశ్వసిస్తున్నాను అంది శబరి.

రాముని సేవించింది. రుచికరమైన ఫలాదులను సమర్పించింది. రామసేవలో సంతృప్తి చెందింది. ***అర్చితోఽహం త్వయా భక్త్యా గచ్ఛ కామం యథా సుఖమ్*** - శబరీ! నన్ను భక్తితో పూజించావు. ఇక పరలోకాలకు సుఖంగా వెళ్ళు అని రాముడు ఆశీర్వదించి పంపించాడు. పక్వమైన ఫలాలను, మధురమైన ఫల మూలాదులను భక్తితో రామునికి అర్పించి ***(ఫలానిచ సుపక్వాని మూలాని మధురాణిచ)*** అర్పించింది శబరి. ఆమె సమర్పించిన ఫలాలను ఆరగించి శ్రీరాముడు ఆమెకు ముక్తిని ప్రసాదించాడు ***(ఫలాన్యాస్వాద్య కాకుత్స్థః తస్యై ముక్తిం పరాం దదౌ)*** అన్నది పద్మ పురాణము. శ్రీరాముడికి ఫలాలను సమర్పించి మోక్ష ఫలాన్ని అందుకున్న శబరి భాగ్యాన్ని ఎంతగానో కీర్తించాడు త్యాగరాజస్వామి.

***ఎంతని నే వర్ణింతును? శబరీ భాగ్య ॥ మెంతని ॥***
***దాంతుల వరకాంతలు జగమంత నిండి యుండగ ॥ ఎంతని ॥***
***కనులార సేవించి కమ్మని ఫలముల నొసగి***
***తనువు పులకరించ పాద యుగములకు మ్రొక్కి***
***ఇనకులపతి సముఖంబున పునరావృత్తి రహిత పద***
***ముని పొందిన త్యాగరాజ నుతురాలి పుణ్యంబును ॥ ఎంతని ॥***

శబరి భాగ్యమే భాగ్యము. ఆ అదృష్టాన్ని ఎవరు వర్ణించ గలరు? ఎందరు యోగులు! మరెందరు పవిత్రమూర్తులు! ప్రపంచంలో ఎందరు సాధ్వీమతల్లులు! అయినా, శబరి అదృష్టమే అదృష్టము!

రాముడికై యెద సౌందర్యంతో ఎదురు చూచింది. తనివి తీరా దర్శించింది. పక్వమైన ఫలాలను సమర్పించింది. పులకరించిన మేనుతో రాముని చరణ పంకజాలకు ప్రణమిల్లింది. రాముని సన్నిధిలో పరంధామం చేరి పోయింది. ఫలం సమర్పించింది. మోక్షఫలం అందుకున్నది. ***ఓం నమో భగవతే వాసుదేవాయ . . . ఫలం సమర్పయామి!***

***తోయం*** - తోయం అంటే ఉదకము. జలము. పత్ర పుష్ప ఫలాదులు సమర్పించలేక పోతే, కేవలం నీళ్ళు అర్పించినా నారాయణుడు తృప్తి చెందుతాడు. అలా ఉదకాన్ని అర్పించి ఉద్ధరింప బడిన మహనీయుడు రంతిదేవుడు.

రంతిదేవుడు ఒక మహారాజు. సర్వులలో సర్వేశ్వరుని దర్శిస్తూ, తన సంపద నంతా జనులకు వితరణ చేసిన ఉదార దానశీలి.

ఒకప్పుడు దేశంలో క్షామం సంభవించింది. రంతిదేవుడు నలభై ఎనిమిది రోజులు ఆహారానికి నోచుకో లేదు. అయినా అతనికి భగవంతునిపై భక్తి శ్రద్ధలు తగ్గలేదు.

ఎట్టకేలకు ఒకనాడు అతనికి ఆహారం లభించింది. తినబోయే సమయానికి అతిథి సమీపించాడు. ***అభ్యాగతః స్వయం విష్ణుః*** - అతిథి సాక్షాత్తు నారాయణుడే అని భావించిన రంతిదేవుడు తన ఆహారంలో సగ భాగమును అతిథికి సమర్పించాడు.

మిగిలిన సగ భాగమును భుజించుటకు భార్యాబిడ్డలతో ఆసీను డయ్యాడు రంతిదేవుడు. ఈ లోగా

మరొక అతిథి అరుదెంచాడు. అందులో సగ భాగమును అతనికి సమర్పించాడు. మిగిలిన నాల్గవ వంతు ఆహారాన్ని ఆరగించబోయే సరికి కొన్ని కుక్కలను వెంట బెట్టుకొని మరొక వ్యక్తి అరుదెంచి, అన్నం పెట్టమని అర్థించాడు. చివరికి మిగిలిన ఆ ఆహారాన్ని ఆ వ్యక్తికి సమర్పించాడు రంతిదేవుడు.

ఆహార మంతా సమర్పించేశాడు. ఇక కేవలం నీళ్ళే మిగిలి ఉన్నాయి. అవే త్రాగి వారి ప్రాణాలను నిలుపుకుందా మనుకున్నాడు. ఈ లోగా ఒక చండాలుడు అక్కడికి వచ్చి, కాస్తంత నీళ్ళిచ్చి ప్రాణాన్ని కాపాడ మని ప్రార్థించాడు. అంతే. ఉన్న ఉదకాన్ని కూడా ఆ పుల్కసునికి అర్పించి, అతనిలో భగవంతుని దర్శిస్తాడు రంతిదేవుడు.

రంతిదేవుని సమర్పణ వైభవానికి సంతృప్తి చెందిన బ్రహ్మాదులు అక్కడ ప్రత్యక్షమై, రంతిదేవుని ఆశీర్వదించి పరమ పదమును అనుగ్రహిస్తారు. *ఓం నమో భగవతే వాసుదేవాయ . . . శుద్ధోదకం సమర్పయామి!*

**నాలుగు కావు - ఒక్కటే**

పత్రం పుష్పం ఫలం తోయం అనేవి నాలుగు కనిపిస్తూ ఉండినా, తాత్త్వికంగా విశ్లేషించుకుంటే ఆ నాలుగు ఒక్క దాని వివిధ రూపాలే. ఆ ఒక్కటే మన అంతఃకరణము. అదే అంతఃకరణ చతుష్టయము అనబడే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

పత్రము ఏదో కాదు, మనస్సే. **చలనాత్మకం మనః** - ఆకు చలించినట్లు నిరంతరం చలిస్తూ ఉండేది మనస్సు. చలన శీలమైన మనస్సు అనే పత్రాన్ని పరమేశ్వరుని పాదాల చెంత సమర్పించడమే పత్ర సమర్పణము.

పుష్పము బుద్ధికి ప్రతిరూపము. సుందర సురభిళమై, విజ్ఞాన సుగంధ పరిమళాలను వెదజల్లే వికాసయుత మైన బుద్ధియే పుష్పము. బుద్ధి లోని భావ సౌరభాలను భవ్యమైన భగవంతుని చరణ కమలాల చెంత సమర్పించడమే పుష్ప కైంకర్యము.

ఫలం అహంకారము. అహం భావనయే ఇక్కడ ఫలం. ***నాహం కర్తా - హరిః కర్తా*** - నేను కర్తను కాను. భగవంతుని చేతిలో పనిముట్టును. ఏదీ లేక, ఏమీ లేక, ఎవరూ లేక ఖాళీ యైన నేను మురళి లాగా పరమాత్మ చేతిలో పరికర మయ్యాను అనే భావనతో అహంకార ఫలాన్ని పరమేశ్వరుని పవిత్ర పద సరోజముల చెంత సమర్పించడమే ఫల నివేదనము.

తోయం అంటే జలము. అదే చిత్తము. **చింతన కర్తృ చిత్తమ్** - నదీ ప్రవాహంలో పాత నీరు పోతూ, క్రొత్త నీరు వస్తూ ఉండినా, నిత్య ప్రవాహం కొనసాగినట్లు, గత స్మృతులను, నేటి భావాలను, రేపటి ఊహలను పెనవేసుకుంటూ సాగే నిరంతర చింతనమే చిత్త మనే తోయం. చిత్తవృత్తు లన్నిటినీ నిరోధించి, చిత్తాన్ని చిద్విలాసుని చరణ పంకజముల చెంత ఉంచడమే ఉదక సమర్పణము. కనుక పత్రం పుష్పం ఫలం తోయం అనే మనోబుద్ధ్యహంకార చిత్తములనే అంతఃకరణ చతుష్టయమును పరమేశ్వరునికి సమర్పించి సంతసించడమే భక్తులు సాధించ దగిన భక్తి కార్యము ***(తదేవ సాధ్యతామ్)***.

అన్య దేవతోపాసకులు ఇంద్రాది దేవతలను తృప్తి పరచడానికి ఆచరించే యజ్ఞ క్రతువులలో క్రియా కలాపాలతో పాటు ద్రవ్య సామగ్రులను, ధన జనాదులను వెచ్చించినా, లభ్య మయ్యేది మాత్రం అనిత్య ఫలమే నని పూర్వ శ్లోకంలో చూశాం. కాని, మహిమాన్వితుడు, మోక్ష ప్రదాత అయిన పరమేశ్వరుని అర్చించడానికి ద్రవ్యోపకరణాలు ఏవీ అవసరం లేదు. పత్ర పుష్ప ఫలోదకా లైనా సరిపోతాయి. ఇది భావ ప్రధానమైన ఆరాధన. ఇక్కడ వస్తు సామగ్రి, కర్మ కలాపాలు ప్రధానం కావు. కేవలం భక్తియే ముక్తిని అనుగ్రహిస్తుంది. శ్రమ అల్పం. ఫలం అనంతం.





క॥ *దళ మైనను, పుష్ప మైనను ఫలమైనను సలిలమైన బాయని భక్తి*
*న్గొలిచిన జను లర్పించిన నెలమిన్ రుచిరాన్నము గను యే ను భుజింతున్ ॥*

అని కుచేలుడు తాను తెచ్చిన అటుకు లనే స్వల్ప పదార్థమును సమర్పించలేక సిగ్గు పడుతూ ఉంటే, తనంతట తాను వాటిని అంది పుచ్చుకున్న శ్రీకృష్ణుడు, పై పద్యమును ఆంధ్ర భాగవతంలో వినిపించాడు. నా యందు భక్తి కలిగిన నా భక్తులు ఆకు అయినా, పువ్వు అయినా, పండు అయినా, నీళ్ళు అయినా , ఏది సమర్పించినా, ప్రేమతో వాళ్ళు సమర్పించే దానిని మధురాన్నంగా భావించి ఆరగిస్తాను అన్నాడు పోతనామాత్యుని భాగవతం - దశమ స్కంధములో శ్రీకృష్ణ పరమాత్మ. అక్కడ కుచేలుడికి చెప్పిందే ఇక్కడ కౌంతేయునికి చెబుతున్నాడు.

ఇచ్చేవాడు భక్తుడు. పుచ్చుకొనే వాడు భగవంతుడు. అందించే వాడు భక్తుడు. అనుగ్రహించే వాడు అచ్యుతుడు. ఆశ్రయించిన వాళ్ళందరూ ఆనందరూపు లయ్యారు. యమునా జలాలు చల్లగా మేనును తడిపాయి. పొన్నచెట్టు తన పుణ్యానికి పొంగిపోతూ పూలు రాల్చింది. గంగిగోవు పులకరిస్తూ గోపాలునికి పాలు ఇచ్చింది. నెమలి నర్తించి నందనందనునికి వినోదాన్ని పంచింది. ఏదీ సమర్పించ లేని చైతన్యుని పేద హృదయం కాపడము పెట్టే సేవకు సిద్ధమైంది.

**ఎంత కందినదో కరము కొండ మోసి**
**ఎంత నలిగినదో కరపద్మము బండి లాగి**
**కాపడము పెట్టెద కరము నందించు తండ్రీ!**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చైతన్యుని మనస్సు చలించింది.

*పూజ నిత్యపూజగా మారాలి. ఆరాధన నిత్యారాధన కావాలి. నిత్యార్చనై శోభించాలి. చదవండి.*

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥** **27**

***యత్-కరోషి-యత్-అశ్నాసి-యత్-జుహోషి-దదాసి-యత్***
***యత్-తపస్యసి-కౌంతేయ-తత్-కురుష్వ-మదర్పణం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = | అర్జునా! | యత్ | = | దేనిని |
| యత్ | = | దేనిని | దదాసి | = | దానము చేస్తున్నావో |
| కరోషి | = | చేస్తున్నావో | యత్ | = | దేనిని |
| యత్ | = | దేనిని | తపస్యసి | = | తపస్సు చేస్తున్నావో |
| అశ్నాసి | = | తింటున్నావో | తత్ | = | దానిని |
| యత్ | = | దేనిని | మదర్పణం | = | నా కర్పింపబడిన దానినిగా |
| జుహోషి | = | హోమము చేస్తున్నావో | కురుష్వ | = | చెయ్యి |

**కౌన్తేయా! ఏదైనా చేసుకో! మరేదైనా తిను. ఏ హోమమైనా చేసుకో! ఏదైనా ఇచ్చుకో! ఏ తపస్సైనా ఆచరించు! కాని, అన్నిటినీ నాకే అర్పించడం అలవరచుకో!**

**వ్యాఖ్య**

పత్రం, పుష్పం, ఫలం, తోయం - ఏదైనా సరే, దానిని అర్పించే వాడు భక్తుడు. ఎవరికి అర్పిస్తున్నాడు?

పరమేశ్వరునికి అర్పిస్తున్నాడు. ఎక్కడ అర్పిస్తున్నాడు? ఎక్కడ భగవంతుడు ఉంటే అక్కడ అర్పిస్తున్నాడు. భగవంతుడు లేని దెక్కడ? సర్వత్ర ఉండేవాడే సర్వేశ్వరుడు ***(ఈశావాస్య మిదం సర్వం).*** మరి, సర్వత్ర ఉండే వాడికి నైవేద్యం ఒక చోట ఎలా పెట్టగలం? సర్వానికి ఆధారమైన సర్వేశ్వరుడు గగన సదృశుడు ***(విశ్వాధారం గగన సదృశం).*** మరి గగన మంతటి వాడికి నైవేద్యం పెట్టడానికి అనువైన, ఘనమైన పళ్ళెం మన ఇంట్లో ఉందా? ఇల్లే ఆకాశంలో ఉంటే, ఆకాశాన్ని తెచ్చి ఇంట్లో ఎలా పెట్టుకోగలం? మరైతే భగవంతుడికి అర్పించే దెలా? ఈ మీమాంస మన కవసరం లేదు. భక్తితో ఇస్తే ***(భక్త్యాప్రయచ్ఛతి)*** గ్రహిస్తాను అని ఆయనే అంటున్నాడు కదా! ***(అహం అశ్నామి గృహ్ణామి).*** పుచ్చుకొనే వాడు సిద్ధంగా ఉన్నప్పుడు, ఇవ్వడానికి ఏం కష్టం? ఏ కష్టమూ లేదు. ఇంతకీ ఆయన ఎక్కడ పుచ్చుకుంటాడు? అంతటా ఉండేవాడు ఎక్కడైనా పుచ్చుకోగలడు. మరి ఆయన ఎక్కడైనా పుచ్చుకోగలిగితే, ఆయన ఎక్కడ పుచ్చుకుంటే అక్కడ ఇవ్వడానికి ఇచ్చేవాడు ఎలా ఉంటాడు? అందుకని, అంతటా ఉండి అర్పించడం పరిమితుడైన ఇచ్చే వాడికి, అనగా భక్తుడికి సాధ్య పడదు కనుక, అంతటా ఉండి పుచ్చుకొనే సర్వేశ్వరుడు ఎక్కడిచ్చినా పుచ్చుకోగలడు కాబట్టి ***(సర్వతః పాణి పాదం తత్ సర్వతోక్షి శిరోముఖమ్ ...*** *13 వ అ - 14 వ శ్లో)* భక్తుడు ఎక్కడ ఉండి భక్తితో అర్పించినా, దానిని సర్వేశ్వరుడు అందుకొని అనుగ్రహిస్తాడు. భక్తుడు అర్పించేది పూజా గది లోనే కదా? పూజా సమయం లోనే కదా? అవును. కనుకనే, భగవంతుడు పూజలు జరిగే చోట వ్యక్త మవుతూ ఉంటాడు. పూజా గదులలో ఉంటాడు. పూజా మందిరాలలో కొలువుంటాడు. పూజా మందిరాలు పరమాత్మ నిలయాలు కనుక, కేవలం పూజా సమయాల లోనే కాకుండా, సాధారణ సమయాలలో కూడా కాళ్ళు కడుగుకోకుండా పూజాగది లోకి గృహస్థులు వెళ్ళరు. సంప్రదాయము గల కుటుంబాలలో ఈ ఆచారం ఇప్పటికీ ఉంది.

సరే, బాగుంది. అర్చన సమయాలలో అర్పణం ఎలా జరుగుతూ ఉందో అర్థమైంది. మరి, అర్చన ఎంత కాలం జరుగుతుంది? ఒక గంట, లేదా రెండు గంటలు. అలా కాలానికి పరిమిత మయ్యే అర్చన నిత్యార్చన అవుతుందా? నిత్యార్చన కానపుడు, కాలానికి పరిమిత మయ్యే అర్చన ద్వారా భక్తునికి భగవంతునితో ఏర్పడే సంబంధము నిత్య సంబంధము ఎలా అవుతుంది? నిత్య సంబంధము కానిది అనిత్య సంబంధమే కదా! అంటే వ్యక్తులతో మన కెలా అనిత్య సంబంధా లున్నాయో, భగవంతునితో ఉండే సంబంధం కూడా అలా అనిత్యమేనా? అనిత్య సంబంధం ద్వారా నిత్యఫలం ఎలా అందుతుంది? నిత్యమైన మోక్షానికి మార్గం ఎలా సుగమ మవుతుంది?

కనుక భగవంతునితో భక్తునికి ఉండే సంబంధం నిత్యమై శోభించాలి అంటే, అది నిత్యార్చన ద్వారానే సాధ్య మవుతుంది. పూజా సమయానికే పరిమితం కాకుండా ఎల్ల వేళల కొనసాగి నపుడే సిద్ధిస్తుంది. పూజాగదిలో ఎలాగూ సాగుతుంది. అది అంతరంగ సాధన. అలా కాకుండా, వ్యవహార ప్రపంచంలో కూడా నిత్యార్చన సాగాలి. కర్మలలో కూడా కొనసాగుతూ ఉండాలి. ప్రపంచమే పూజా మందిరం కావాలి. ఏ కార్యాన్ని ఆచరించినా అది అర్చనే కావాలి. ఆరాధనే కావాలి. పరమేశ్వరా! నేను ఏయే కర్మలు చేసినా, అవన్నీ నీ ఆరాధనలే కావాలి ***(యద్యత్కర్మ కరోమి తత్త దఖిలం శంభో తవారాధనమ్!).*** ఇది బహిరంగ సాధన.

పూజాగదిలో పుష్పాలను చేతులతో అర్పించడం, వాక్కు ద్వారా స్తోత్రాలను వినిపించడం, మనస్సు ద్వారా చింతనము సాగించడం ఎలా జరుగుతుందో, అలాగే విశ్వమందిరంలో ఏది చేసినా, ఏది తినినా, ఏ హోమాదులు నిర్వహించినా, ఎవరికి ఏది పెట్టినా, నిన్ను నీవు ఎలా నిగ్రహించుకున్నా - ఈ సమస్తము పరమేశ్వరునికి ఆరాధనగా మారాలి. అప్పుడే అర్చన సదా కొనసాగి నిత్యార్చనగా మారుతుంది. నిత్యఫలాన్ని ప్రసాదిస్తుంది.





చేసే కార్యాలు వేరు వేరుగా ఉన్నా, ఆ కార్యాలను కదిలించే మనస్సు ఒక్కటే. మనస్సులో నడిచే భావనే కర్మను పూజగా మార్చుతూ ఉందని పూర్వ శ్లోకం లోనే అర్థం చేసుకున్నాం. నువ్వు ఏమి చేశావు? ఏమి చేస్తున్నావు? అని కాకుండా, ఎలా చేశావు? ఎలా చేస్తున్నావు? అనేదే భగవంతుడు ప్రధానంగా చూస్తాడు అని కూడా గ్రహించాము. కనుక, భావశుద్ధిని కలిగి భావగ్రాహి అయిన జనార్దనునికి ప్రీతి కలిగించే విధంగా జీవించ గలిగితే, అట్టి జీవితమే నిత్యార్చనగా మారి నిత్య సంబంధాన్ని స్థిరపరచి, నిత్యఫలాన్ని అనుగ్రహిస్తుంది.

కౌంతేయా! నువ్వు ఏది చేస్తున్నావో ***(యత్ కరోషి),*** ఏది తింటున్నావో ***(యత్ అశ్నాసి),*** ఏది హోమం చేస్తున్నావో ***(యత్ జుహోషి),*** ఏది దానం చేస్తున్నావో ***(యత్ దదాసి),*** ఏ తపస్సు నాచరిస్తున్నావో ***(యత్ తపస్యసి)*** దాని నంతటిని ***(తత్)*** నాకు సమర్పణము గావించు ***(కురుష్వ మదర్పణమ్).*** ఇది పరమేశ్వరుని ఆజ్ఞ.

ఈ విధంగా జీవించ గలిగితే ఒక్క క్షణం కూడా మనం పరమేశ్వరునికి అన్యంగా ఉండలేము. అనన్యులు గానే ఉంటాము. అనన్యులుగా జీవించ గలిగితే, మన యోగక్షేమాలను తానే వహిస్తానని భగవంతుడు ప్రతిజ్ఞ చేసి మరీ చెప్పాడు కదా! *(9 వ అ - 22 వ శ్లో).*

మన యోగక్షేమాలను ఆయనే చూసుకొనే టట్లైతే మనం కర్మలు ఎవరి కోసం చెయ్యాలి? ఆయన కొరకే చెయ్యాలి. మన కొరకు మనం కర్మ లాచరించుకుంటూ ఉంటే, మన యోగక్షేమాలను ఆయనెందుకు చూస్తాడు? రెండవ ఆలోచన లేకుండా, మరొక వ్యాపకం మనస్సులో పెట్టుకోకుండా సదా పరమేశ్వరునే చింతిస్తున్నాము కనుక, అలా నిత్యాభియుక్తులమై భగవంతుణ్ణే సేవిస్తున్నాము కనుక, మన స్వకార్యాలను ఆయన కొరకు త్యజించి ఉన్నాము కనుక మన యోగక్షేమాలను ఆయనే వహిస్తాడు.

అయితే, మనం ఆచరించే కర్మల యొక్క ఫలితాలు మనకు అందవా? ఇక్కడే విషయాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. లేకపోతే చిక్కుముడి పడుతుంది. మనస్సు చిందరవందరై, సాధన వక్రిస్తుంది.

ఇంతకీ మనకు ఏం కావాలి? కర్మఫలమా? లేక మోక్షమా? మోక్షమే. మోక్ష మేమిటి? భగవంతుని పొందడమే మోక్షము. మరి మోక్ష మెక్కడుంది? మోక్షం అనేది జ్ఞానరూపంలో ఉంది. జ్ఞానం లభిస్తేనే మోక్షం సిద్ధిస్తుంది. జ్ఞానం ప్రాప్తించాలి అంటే బుద్ధి శుద్ధి పడాలి కదా! శుద్ధి లేని బుద్ధిలో జ్ఞానం నిలుస్తుందా? నిలవదు. మరి, బుద్ధి ఎలా శుద్ధి పడుతుంది?

అదలా ఉంచండి. బుద్ధిని శుద్ధి చేసుకోవాలి అంటే, అది ఇప్పటికి అశుద్ధమై ఉందని కదా అర్థం? మరి, బుద్ధి ఎలా అశుద్ధ మైంది? మల దోషము చేత. మల దోష మంటే ఏమిటి? రాగద్వేషాలే. మల దోషము తొలగితేనే, అంటే రాగద్వేషాలు మనస్సు నుండి రాలి పోతేనే బుద్ధి శుద్ధి పడుతుంది.

ఇంతకీ రాగద్వేషా లంటే ఏమిటి? నాకు ఇది కావాలి. నాకు అది కావాలి. ఇవి నాకు దూరం కాకూడదు. అవి నా తోనే ఉండాలి. ఇదే రాగము.

నాకు ఇది వద్దు. నాకు అది రాకూడదు. ఇవి నాకు దూరంగా పోవాలి. అవి నాతో ఉండకూడదు. ఇదే ద్వేషము.

మరి, ఉన్నవి, లేనివి అన్నీ కర్మఫలాలే కదా! కర్మఫలాలు ఏవైనా అనిత్యాలే కదా! బంధహేతువులే కదా! బంధము నుండి విడిపడి మోక్షాన్ని పొందాలని కాంక్షించే ముముక్షువు ఆశించ వలసింది కర్మఫలాలనా, లేక మోక్ష సాధనమైన జ్ఞానమునా? జ్ఞానమునే మన మందరమూ కాంక్షిస్తున్నాము. కానీ చిత్తశుద్ధి ఉంటేనే జ్ఞానం

సిద్ధిస్తుంది కనుక, రాగద్వేషాలను, అవి సృష్టించే కర్మఫలాలను విస్మరించాలి. అందుకు ఏమిటి మార్గం? పరమేశ్వరునికి సమర్పించడమే తరుణోపాయం.

అప్పుడు కర్తృత్వ భోక్తృత్వాల నుండి విడిపడి ఈశ్వరార్పణ బుద్ధితో మనం కర్మాచరణంలో ఉంటాము కనుక, కర్మలలో కర్త లేనందున కర్మఫలాలు కర్తను బాధించవు. అదేమిటి? కర్తకు సంబంధించిన కర్మఫలాలు కర్తకు ఎలా దూర మవుతాయి?

***నాహం కర్తా - హరిః కర్తా,*** కర్త శ్రీహరే గాని నేను కాదు. నేను ఆయన చేతిలో పరికరాన్ని. నా నుండి ఏ కర్మ జరిగినా అది పనిముట్టు నైన నా ద్వారా పరమేశ్వరుడు చేసిందే కనుక, ఫలం ఆయనకే చెందుతుంది. అంతా రామార్పణం. కృష్ణార్పణం. ఈశ్వరార్పణం. ఇదే సమర్పణ వైభవం.

కర్మలలో కర్తృత్వ భావన లేనందున నువ్వు కర్తవు కావు. ఫలితాలు ఏవొచ్చినా, నీకు కర్మ ఫలాల మీద ఆశ లేనందున, వాటిని ప్రసాదంగా స్వీకరిస్తావు కనుక నువ్వు భోక్తవు కావు. కర్త, భోక్త లేరు అంటే, రాగద్వేషాలు అదృశ్య మయ్యాయని అర్థము. ఏది వచ్చినా, ఏది పోయినా, మనస్సులో ఏ మార్పూ ఉండదు. బుద్ధి సదా ప్రశాంతంగా ఉంటుంది. జ్ఞానార్హతను పొందుతుంది. ఇదే అంతఃకరణ శుద్ధి. ఇదే కర్మయోగ ఫలం. మోక్షానికి మార్గం.

***అవశ్యం భావినామ్ కర్మణామ్ మయి పరమగురౌ సమర్పణం ఏవ మద్భజనమ్: న తు తదర్థం పృథక్ వ్యాపారః కశ్చిత్ కర్తవ్య ఇతి అభిప్రాయః !***

అవశ్యము చేయవలసిన కర్మములను పరమ గురువైన నా యందు సమర్పించడమే నా ఆరాధనము. అంటే, దాని కొరకు ఇతర వ్యాపారాలు, అనగా సాధనలు ఏవీ చేయ నవసరం లేదు అని అభిప్రాయము అని తమ గూఢార్థ దీపిక వ్యాఖ్యానంలో శ్రీ మధుసూదన సరస్వతీ స్వాముల వారు వ్యాఖ్యానించారు.

'నేను' అనే అహంకారం అదృశ్య మైంది. 'నాది' అనే మమకారం నిర్వీర్యమైంది. పనులన్నీ పూజ లయ్యాయి. పూజాఫలము **పరమేశ్వరప్రీత్యర్థం** సమర్పించ బడింది. ఇటువంటి పవిత్రమైన ఆరాధనలో జ్ఞానానికి ఉపయుక్త మైన అంతఃకరణ శుద్ధి సాధకునికి ప్రాప్తించింది.

*పల్లవి:* **పూజా ఫలము నీకే ఉండనీ**
**పూజే ఫలముగా నాకు మిగలనీ** ॥ పూజా ॥
*అనుపల్లవి:* **సలిలము నిండిన నా నయనాలలో**
**కదలక నీ రూపు నిలిచి పోనీ** ॥ పూజా ॥
*చరణము:* **నేనని నాదని బిగిసిన మనసు**
**నారికేళమై పగిలిపోనీ**
**కలతల గుండెను కుదిపిన మాయలు**
**నీటి ధారలై కారిపోనీ** ॥ పూజా ॥

అని నిత్యార్చనలో సత్య రాగాన్ని ఆలపించింది చైతన్య గీతిక.

ఏదీ లేకుండా రిక్త హస్తాలతో ప్రపంచం లోకి వచ్చి, నాది - నాది అని ఎన్నిటినో పట్టుకున్నా. భగవాన్! నాది - నాది అని నేను చేసిన తప్పును, నీదే - నీదే అని పలికి నా బుద్ధి లోని కల్మషాన్ని కడిగేసు కుంటున్నా. సమర్పణలో సంతృప్తి చెందుతున్నా.





***యత్కరోషి***

***తత్కురుష్వ మదర్పణమ్ -*** చేయదగిన దానిని, చేయవలసిన దానిని చేయాలి. కాని, కర్తృత్వమును, భోక్తృత్వమును త్యజించి, సమర్పణ భావంతో చేయాలి.

***యదశ్నాసి***

***తత్కురుష్వ మదర్పణం -*** ప్రాప్తించిన దానిని ఆరగించు ***(స్వతః ప్రాప్తం యత్ అశ్నాసి).*** ప్రాప్తించింది అంటే భగవ త్ప్రసాదంగా లభించింది అని అర్థము. ప్రసాదము అనేది వస్తువు కాదు, భావన. ప్రసాద భావన ప్రసన్నతను ప్రసాదిస్తుంది. ప్రశాంతతను కలిగిస్తుంది. భోజన సమయాలలో ***బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః*** అనే భగవద్గీతా శ్లోకాన్ని పఠించడం వెనుక ఈ సమర్పణ భావమే ఉంది.

***యజ్జుహోషి***

***తత్కురుష్వ మదర్పణమ్ -*** యజ్ఞ యాగాదులు ఆచరించినా ఈశ్వర ప్రీత్యర్థమే చెయ్యాలి. ఫలాసక్తి లేకుండా ఆచరించాలి. చిత్తశుద్ధి నిమిత్తమే అనుష్ఠించాలి. ధర్మార్థ కామాల ప్రసక్తి ముముక్షువుకు లేనందున, చిత్తశుద్ధి ద్వారా పొందబడే మోక్షార్థమే ఆచరించాలి.

***యత్ దదాసి***

***తత్కురుష్వ మదర్పణమ్ -*** ఎవరికి ఏది ఇచ్చినా, ఏది దానం చేసినా, పుచ్చుకొనే వానిలో భగవంతుని దర్శిస్తూ, 'కృష్ణార్పణం' అనే భావనతో సమర్పించాలి. మనం ఇచ్చేది లేని వాడికి, పేదవాడికి కాదు. సాక్షాత్తు లక్ష్మీపతికి.

***యత్ తపస్యసి***

***తత్కురుష్వ మదర్పణమ్ -*** సంధ్యావందన, వేదాధ్యయన, జప, వ్రతాదులు, ఉపవాస దీక్షలు, ఇవన్నీ తపస్సులే. ఈ విధమైన తపోనిష్ఠను అంతఃకరణ శుద్ధ్యర్థం, దంభ దర్పాదులు లేకుండా ఈశ్వరార్పణంగా ఆచరించాలి.

అహంకార మమకారాల నుండి విడిపడి, రాగద్వేష రహితులై, భగవత్ప్రీత్యర్థం సమర్పణ భావంతో జీవించే వారిని కర్మలు బంధించవు. కర్మఫలాలు బాధించవు. ఐదుగురు దేవతల ద్వారా ఐదు మంది బిడ్డలకు జన్మ నిచ్చినా, కుంతీ మాత పవిత్రతకు భంగం వాటిల్ల లేదు. నాయనా, అర్జునా! కౌంతేయా! కుంతీపుత్రా! మాతృమూర్తి హృదయ సౌందర్యాన్ని అందుకో! అలా చేశావా, నీకు ఏం జరుగుతుందో, అది కూడా చెబుతాను. విను.

**శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।**
**సంన్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి ॥** **28**

***శుభాశుభఫలైః-ఏవం-మోక్ష్యసే-కర్మబంధనైః***
***సంన్యాసయోగయుక్తాత్మా-విముక్తః-మాం-ఉపైష్యసి***

| | | | |
|---|---|---|---|
| ఏవం | = ఈ విధముగ | సంన్యాసయోగయుక్తాత్మా | = సన్యాస యోగయుక్తుడవై |
| శుభాశుభఫలైః | = శుభాశుభ ఫలాలను కలిగించే | విముక్తః | = విముక్తుడవై |
| కర్మబంధనైః | = కర్మబంధముల చేత | మాం | = నన్ను |
| మోక్ష్యసే | = ముక్తు డవుతావు | ఉపైష్యసి | = పొందుతావు |

**అర్జునా! సమర్పణ భావంతో జీవిస్తే శుభాశుభ ఫలాలకు కారణమైన కర్మ బంధం నుండి విముక్తిని పొందుతావు. సన్యాస యోగ యుక్తుడ వవుతావు. చివరికి నన్నే పొందుతావు.**

**వ్యాఖ్య**

పూర్వ శ్లోకంలో ***యత్ యత్*** - ఏది చేసినా, ఏది తినినా, ఏది హోమం చేసినా, ఏది దానం చేసినా, ఏ తప మాచరించినా అని 'ఏది ఏది' (యత్ యత్) అంటూ ఐదు విషయాలను ఉదహరించి, ***తత్*** అనే ఒక్క పదం చేత, 'దానిని అంతయు' ***(తత్)*** నాకు అర్పణము చెయ్యి అన్నాడు. అలా అర్పణం చేయడం వల్ల ***(ఏవం కుర్వతః)*** నీకు ఏం జరుగుతుందో, అంటే నువ్వు ఏమవుతావో ***(తవ యద్భవతి)*** దానిని ఆలకించ మంటున్నాడు. ***బ్రహ్మార్పణం*** అనే సమర్పణ భక్తికి ఫలం ఏమిటో విన మంటున్నాడు ***(తత్ శ్రుణు).*** సర్వ కర్మ సమర్పణ ఫలాన్ని చెబుతున్నాడు.

**మోక్ష ఫలం**

పూర్వ శ్లోక ద్వయంలో చెప్పినట్లు ***(ఏవం)*** సమర్పణ బుద్ధితో కర్మలు ఆచరించడం వల్ల ***(మత్సమర్పణం కుర్వన్)*** మోక్షాన్ని పొందుతావు ***(మోక్ష్యసే)*** అంటున్నాడు. మోక్ష మేమిటి? విముక్తియే మోక్షం. మరి, ఇక్కడ దేని నుండి విముక్తి? బంధము నుండి విముక్తి. ఇంతకీ బంధ మేమిటి? ఏ బంధము నుండి విముక్తి? కర్మబంధము నుండి విముక్తి ***(కర్మ బంధనైః).***

కర్మలు ఎలా బంధనము లయ్యాయి? ఫలితాలను ప్రసాదిస్తాయి కనుక కర్మములు బంధనములు. ఫలం బంధ మెలా అవుతుంది? ఫల బంధమైతే, మోక్షం కూడా ఫలమే కదా! అది కూడా బంధమేనా? బంధమోక్షాలు రెండూ ఒక్కటే ఎలా అవుతాయి?

మోక్షము ద్వంద్వాతీత మైన అద్వయ స్థితి. వాస్తవానికి మోక్షం అనేది కర్మఫలం కాదు. అది స్వరూప స్థితి. జ్ఞానము యొక్క ఫలమే గాని ***(మోక్షాయ జ్ఞాన ప్రవృత్తిః)*** కర్మఫలం కాదు.

కర్మఫలం ఏదైనా అది శుభాశుభ ఫలాలలో ఏదో ఒక దానిని అందిస్తూ ఉంటుంది. శుభాశుభాలు అంటే ఇష్టానిష్టాలు. అవే రాగద్వేషాలు ***(శుభాశుభే ఇష్టానిష్టే ఫలే యేషాం తాని శుభా శుభ ఫలాని కర్మాణి).*** ఈ విధమైన ఇష్టానిష్టా లనే రాగద్వేషాలతో కూడిన ఫలాలే శుభాశుభ ఫలాలు. ఇవే కర్మ బంధములు. వీటి నుండి ***(తైః శుభాశుభ ఫలైః కర్మబంధనైః)*** విడిపడటమే మోక్షము, లేదా విముక్తి ***(మోక్షః).***

**కర్మ బంధము**

కర్మ బంధించదు. రాగద్వేషాలతో నిండి నపుడే కర్మలు బంధిస్తాయి. రాగద్వేషాలు ఉండే టప్పుడు, రాగద్వేష ప్రేరితుడై వ్యక్తి కర్మలు ఆచరిస్తాడు. నా ఇష్టానికి అనుగుణం గానే ఏవైనా జరగాలి. నాకు అయిష్ట మైనవి ఏవీ జరగడానికి వీలు లేదు అనే ఒత్తిడికి లోనై కర్మ లాచరించే కర్త ఉన్నంత వరకు కర్మలు బంధ హేతువులు గానే ఉంటాయి.

కర్మ లాచరించే కర్త ఏదో ఆశించే కర్మ లాచరిస్తాడు. దేనినో పొందాలనే ఆశ తోనే కర్మాచరణంలో ఉంటాడు. ఆశించిన దానిని సాధించడమే కర్మఫలం. కర్మను బట్టే కర్మఫలం ఉంటుంది. ఏ కర్మకు ఆ ఫలితమే వస్తుంది. ఆహారం తీసుకుంటే ఆకలి తీరుతుందే గాని వ్యాధి నయం కాదు. వ్యాధి నయం కావాలి అంటే ఔషధ సేవనం అనే మరొక కర్మను ఆచరించాలి. ఈ విధంగా కర్మలు, కర్మ ఫలితాలు పరిమితంగా ఉంటాయి.





పరిమితాలతో మనిషి తృప్తి చెందలేడు. అదే అసంతృప్తి. అదే బంధము. ఈ విధమైన కర్మబంధం నుండి విముక్తిని పొందాలనే కర్త కర్మలను ఆచరిస్తున్నాడు. బంధ హేతువు లైన కర్మల ద్వారా బంధ విముక్తిని ఆశిస్తున్నాడు. బాగా అర్థం చేసుకోండి. సమస్య అంతా ఇక్కడే కేంద్రీకృతమై ఉంది. బంధానికి కారణమైన కర్మ బంధ విముక్తిని ఎలా కలిగిస్తుంది?

**యదేవ ప్రవృత్తి కారణం తదేవ నివృత్తి కారణం న భవతి!**

బంధాన్ని సృష్టించడానికి ఆరంభమైన కర్మ బంధ విముక్తిని కలిగించ లేదు. ఒకే కర్మ బంధమోక్షాలకు ఎలా కారణ మౌతుంది? అని ప్రశ్నించారు బృహదారణ్యక ఉపనిషద్భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి. కనుక, కర్మ అనేది అజ్ఞానుల చేష్టగా గీతాభాష్యంలో అభివర్ణించారు ఆచార్యులు ***(అవిద్య ద్విషయం కర్మ**; 18 - 66).* కర్మ అజ్ఞాన జనితం. కనుక కర్మఫలాలు బంధహేతువులై సంసార సుడిగుండంలో పడేస్తున్నాయి.

రాగద్వేషాలను తృప్తి పరచుకొనేందుకు కర్మలు చేస్తారు. కర్మలు పరిమితం కనుక, అవి ఇచ్చే ఫలితాలు కూడా పరిమితం గానే ఉంటాయి. పరిమిత ఫలితాలతో తృప్తి చెందని మానవుడు మరో విధమైన కర్మకు శ్రీకారం చుడతాడు. ఫలితం రావచ్చు, రాకపోవచ్చు. వస్తే మాత్రం పరిమితం గానే ఉంటుంది. కాలంలో వస్తుంది కనుక, కాలంలో పోతుంది. కాని, అసంతృప్తి మాత్రం ఎక్కడికి పోదు. అది హృదయంలో స్థిరంగా తిష్ఠ వేసి ఉంటుంది. ఇదే బంధము.

కామము వల్ల కోరిక, కోరిక వల్ల కర్మ, కర్మ ద్వారా ఫలితం, తిరిగి ఆ ఫలితమే నూతన కర్మకు నాంది. ఇలా కర్మచక్రం తిరుగుతూ ఉంటుంది. కర్మఫలము అనుభవించనిదే క్షయించదు. కర్మ ఫలానుభవానికి నూతన జన్మలు ఎత్తవలసి వస్తుంది. జన్మించి నందుకు మరణించక తప్పదు. కర్మ ఫలానుభవము నిరీక్షిస్తూనే ఉంటుంది కనుక, మరణించిన వాడు తిరిగి జన్మించక తప్పదు. ఇవే జనన మరణాలు. శోక వలయాలు. దుఃఖ రూపాలు. ఇదే సంసార చక్రము. కర్మబంధము. ఈ సంసార బంధము నుండి విడిపడటమే మోక్షము.

**ముక్తి మార్గము**

ఇప్పుడు అర్థమైంది కదూ? కర్మ బంధం కాదు. కర్మ ఫలాసక్తియే బంధము. కర్మఫలాల యందు ఆసక్తి లేనపుడు కర్మలు ఆచరించినా, అవి బంధించవు. కర్మఫలము నందు ఆసక్తిని విడిచి, కర్మల యందు ప్రవర్తించే వాడు కర్మ చేసినా చేయని వాడే అని నాల్గవ అధ్యాయం లోనే భగవంతుడు ప్రబోధించాడు ***(కర్మణ్యభి ప్రవృత్తోఽ పి నైవ కించి త్కరోతి సః**; 4 వ అ 20 వ శ్లో).* కనుకనే తాను ఎన్ని కర్మలు చేసినా, ప్రస్తుతం అర్జునునికి గీతను బోధించే కార్యం లోనే ఉన్నా, కర్మలు శ్రీకృష్ణుని అంటలేదు. కారణం, ఆయనకు కర్మఫల స్పృహ లేదు ***(న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా** ;4 వ అ - 14 వ శ్లో).*

కర్మ ఫల స్పృహ లేదు అంటే, కర్మల వెనుక ఇష్టాయిష్టాలు లేవు. రాగద్వేషాలు లేవు. రాగద్వేషాలు లేనందున తన కర్మలంటూ లేనే లేవు. తన కర్మలు లేనందున తనకు ఫలితాలు అందవు. ఫలితాలు బంధహేతువులు అని ఇప్పటికే గ్రహించాము కనుక, ఫలితాలు లేనందున, వచ్చినా అంటనందున బంధము లేదు. బంధము లేకపోవడమే కదా మోక్షము! కనుక సమర్పణ భావంతో కర్మాచరణంలో ఉండే వ్యక్తి నుండి కర్మలు సాగుతాయి. కాని, బంధహేతువులు కాకుండా ఉంటాయి. ప్రస్తుతము ఇక్కడ ప్రధాన విషయం కర్మలు కావు. బంధ హేతువు లైన కర్మలే చర్చనీయాంశము. బంధహేతువులైన కర్మలన్నీ అర్పణ భావంతో ఆవిరై పోతాయి. దీనినే సన్యాస యోగం అంటున్నాడు గీతాచార్యుడు. ఈ విధంగా **(ఏవం)** ఈశ్వరార్పణ

బుద్ధితో కర్మల నాచరించడం చేత, అర్పణ బుద్ధి గల ముముక్షువు సన్యాస యోగ యుక్తాత్మ డవుతున్నాడు. అంటే, సన్యాస యోగముతో కూడిన వాడు అవుతున్నాడు.

**సన్యాస యోగము**

సన్యాస యోగము అంటే సన్యాసము మరియు యోగము అని అర్థము. అదే నిష్ఠాద్వయము. యోగము మరియు సాంఖ్యము అని అర్థము. పరమేశ్వరునికి సమర్పించడము చేత అక్కడ సన్యాసం ఉంది. సన్యాసము అంటే త్యాగమే కనుక, కర్మఫల త్యాగము జరుగుతూ ఉన్నందున అది సన్యాసము. అలా సమర్పణంలో కర్మఫల త్యాగము (సన్యాసము) చేసే భక్తుడు కర్మను కూడా ఆచరిస్తూ ఉన్నాడు కనుక అది కర్మయోగము ***(సన్న్యాస యోగః నామ సంన్యాసశ్చ అసౌ మత్సమర్పణ తయా, కర్మత్వాత్ యోగశ్చ అసౌ ఇతి).*** ఈ విధంగా సన్యాసము, యోగము ఈ రెండిటితో కూడిన అంతఃకరణము కలవాడై నందున అతడు సన్యాస యోగ యుక్తాత్మ డయ్యాడు. పరమేశ్వరుని యందు కర్మఫల త్యాగము సన్యాసము. ఈశ్వరార్పిత కర్మ ద్వారా అంతఃకరణ శుద్ధి చేసుకోవడం కర్మయోగము. ఇలాంటి సన్యాస యోగయుక్తుడు 'బ్రహ్మార్పణం' అనే భావన చేత కర్మలు ఆచరిస్తూ ఉన్నందున అవి ఫలాలను సృష్టించవు. పైగా, అగ్నిలో వేపబడిన బీజాలు ఎలాగైతే మొలకెత్తవో, 'బ్రహ్మార్పణం' అనే సమర్పణ బుద్ధితో సన్యాస యోగమనే అగ్నిలో దగ్ధమైన కర్మలు ఫలాలను ఉత్పన్నం చేయక పోవడమే గాక, నూతన కర్మలను కూడా ఆవిష్కరించవు. ఈ విధంగా సన్యాస యోగ యుక్తాత్ముడు జీవించి ఉండగానే కర్మబంధము నుండి విముక్త డవుతున్నాడు ***(సంన్యాస యోగ యుక్తాత్మా సన్ విముక్తః కర్మబంధనైః జీవన్నేవ).***

**బ్రహ్మైక్యము**

సన్యాస యోగ యుక్తాత్ముడు జీవించి ఉండగానే ముక్తుడు. నేను కర్తను, నేను భోక్తను, నేను సుఖిని, నేను దుఃఖిని అనే భావనల నుండి సంపూర్ణంగా విముక్త డయ్యాడు. ఈ విధంగా విముక్తుడైన వాడు దేహము నందే ఉన్నందున జీవన్ముక్తుడు. జీవించి ఉన్నంత కాలము జీవన్ముక్తుడుగా దర్శనీయు డవుతాడు. మరణించ గానే ఘట భంగము జరిగి నపుడు ఘటాకాశము మహాకాశముగా శోభించినట్లు, దేహ పతనానంతరము జీవన్ముక్తుడు బ్రహ్మ స్వరూపమై భాసిస్తాడు. దీనినే బ్రహ్మైక్యము అంటున్నాము. అవగాహన కొరకు బ్రహ్మైక్యము అన్నా, జీవన్ముక్తుడు వెళ్ళి బ్రహ్మములో కలిసి పోతున్నాడు అనేది దాని అర్థం కాదు. జీవుడే బ్రహ్మము అయినపుడు, మళ్ళీ వెళ్ళి కలిసే దేముంటుంది? ఘటాకాశమే మహాకాశము. అంతేగాని, కుండ పగిలి పోగానే కుండలో ఉండే ఆకాశము విశాలాకాశములో వెళ్ళి కలిసేది ఉండదు. అలా కలవడము, విడిపోవడము, జన్మ లెత్తడము లాంటివి జరగాలి అంటే సూక్ష్మ శరీరం ఉండాలి. సూక్ష్మ శరీరము యొక్క ప్రభావం జీవన్ముక్తుని మీద లేకపోయినా, స్థూలదేహం ఉన్నంత వరకు సూక్ష్మ శరీరము, లేదా లింగ దేహము కూడా అతనికి ఉంటుంది. మరణ సమయంలో అతడి స్థూల దేహంతో పాటు లింగ దేహము కూడా నశించి పోతుంది. అంతవరకు దేహంలో జీవన్ముక్తుడుగా శోభించిన వాడు, ఇప్పుడు సచ్చిదానంద బ్రహ్మరూపుడై భాసిస్తాడు. దానినే 'నన్ను పొందుతున్నాడు' అని ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు అభిభాషించాడు ***(మామ్ ఉపైష్యసి ఆగమిష్యసి).*** ఇదే మోక్షప్రాప్తి. పరమ పురుషార్థ స్థితి.

చివరగా సారభూతమైన విషయాన్ని రెండు మాటల్లో చెప్పుకుందాం. సన్యాస యోగము అనే నిష్ఠా ద్వయము పరమ పురుషార్థమునకు ఉపాయము, లేక సాధనము కాగా, బ్రహ్మాత్మజ్ఞానము అనే సర్వాత్మ దర్శనము పరమ పురుషార్థ సిద్ధియై ఉంది. ఈ లోకంలో సర్వులకు సాధన సాధ్యాలు ఇవే. ఈ సందర్భములో





సాధకుడు సాధించ వలసింది ఏమిటో, ముముక్షువు పొంద దగింది ఏదో సుస్పష్ట మైంది. ఈ విషయాన్ని ఒకే ఒక శ్లోకంలో శాస్త్రం ఎంత అందంగా, అద్భుతంగా ప్రవచించిందో చూడండి!

***ఏతావా నేవ లోకేఽ స్మిన్ పుంస స్స్వార్థః పరస్స్మృతః ।***
***ఏకాంత భక్తి ర్గోవిందే యత్సర్వత్రాత్మ దర్శనమ్ ॥***

గోవిందుని యందు ఏకాంత భక్తి ***(కర్మయోగము),*** సర్వత్ర ఆత్మదర్శనము ***(జ్ఞాన యోగము) -*** ఇది మాత్రమే ముముక్షువునకు పరమ పురుషార్థ సాధనము అనేది శ్లోకార్థము. ఇది చాలా అద్భుతమైన శ్లోకము. నాకు ఎంతో ప్రీతి పాత్రమైన శ్లోకం. ఎప్పుడు చదివానో, ఎక్కడ చదివానో జ్ఞాపకం రావడం లేదు. అందుకే దీని చిరునామాను మీకు అందివ్వలేక పోతున్నాను. ఎంతో కాలంగా నా 'బుద్ధి' బ్యాంకులో 'స్మృతి' లాకర్‌లో భద్రంగా దాచిన దానిని సముచిత సందర్భ మని భావించి వితరణ చేస్తున్నాను.

*మరి, సమర్పణ బుద్ధితో జీవించే భక్తులను భగవంతుడు ఉద్ధరించి, భక్తులు కాని వారిని ఉద్ధరించకుండా ఉదాసీనంగా ఉంటే, భగవంతునికి కూడా రాగద్వేషాలు ఉన్నట్లే కదా! అనే సందేహం కలగవచ్చు. దానిని కూడా పరిహరిస్తున్నాడు.*

**సమోఽ హం సర్వభూతేషు న మే ద్వేష్యోఽ స్తి న ప్రియః ।**
**యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥** **29**

***సమః-అహం-సర్వభూతేషు-న-మే-ద్వేష్యః-అస్తి-న-ప్రియః***
***యే-భజంతి-తు-మాం-భక్త్యా-మయి-తే-తేషు-చ-అపి-అహం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | యే తు | = | ఎవరైతే |
| సర్వభూతేషు | = | సమస్తభూతముల యందు | మాం | = | నన్ను |
| సమః | = | సముడను | భక్త్యా | = | భక్తితో |
| మే | = | నాకు | భజంతి | = | భజిస్తున్నారో |
| ద్వేష్యః | = | శత్రువు | తే | = | వారు |
| న అస్తి | = | లేదు | మయి | = | నా యందు |
| ప్రియః | = | ఇష్టుడును | తేషు చ | = | వారి యందు |
| న | = | లేదు | అహం అపి | = | నేనును |

**అర్జునా! సర్వ ప్రాణుల యందు నేను సమదృష్టి గల వాణ్ణి. నాకు అప్రియుడు లేడు; అలాగని ప్రియుడూ లేడు. ఎవరు నా యందు భక్తి కలిగి ఉంటారో వాళ్ళు నాలో ఉంటారు. నేను వాళ్ళలో ఉంటాను.**

**వ్యాఖ్య**

**సమం**

ప్రపంచం నిరంతరం మార్పు చెందుతూ ఉంది. దృశ్యము లన్నీ మారుతూ ఉన్నాయి. రూపాలు మారు తున్నాయి. మనుషులు మారుతున్నారు. మనసులు మారుతున్నాయి. మార్పు లన్నీ వికారాలు. దోషయుతాలు.

ఈ విధమైన మార్పులకు ఆధార మైనది, మార్పులను గుర్తించడానికి ఆలంబన మైనది మారనిదై ఉండాలి. అలా మార్పు లేనిది నిర్దోషంగా ఉండాలి. సమంగా ఉండాలి. సర్వ వికారాల నుండి విడిపడినదై ఉండాలి. అది కూడా కాలానికి పరిమితం కాకుండా సర్వ కాలాలలో వికార రహితంగా, సమంగా ఉండాలి. అదే బ్రహ్మము.

సర్వవికార రహితము. నిర్దోషము (*5 వ అ - 19 వ శ్లో*). నిర్వికారము. నిర్వికార మైనది స్వరూపము. వికారయుత మైనది ఆరోపము. మార్పులన్నీ ఆరోపానివే. స్వరూపము సత్యము కనుక వికార రహితము. అందుచేత అది సదా సమము **(సమః సర్వ కాలేషు సర్వ వికార రహితత్వాత్).**

**విషమం**

సమము కానిది విషమము. సమము నిర్వికారము. విషమము వికారయుతము. బ్రహ్మమును విడిచి పెడితే, మిగిలినది ఏదైనా విషమమే. సమము సర్వమునకు విలక్షణ మైనది. విషమము వివాదంతో కూడినది.

ఎవరైనా మన కంట పడితే, ఆ వ్యక్తికి సంబంధించిన వృత్తి మన మనస్సులో ఏర్పడుతుంది. అతడు స్నేహితుడైతే మన మనస్సులో స్నేహవృత్తి కదులుతుంది. ఒకవేళ శత్రువైతే, వైరవృత్తి ఏర్పడుతుంది. మొదటిది రాగవృత్తి. రెండవది ద్వేషవృత్తి. వృత్తులు మారుతూ ఉంటాయి. మనస్సు మారుతూ వికార యుతంగా ఉంటుంది కనుక విషమంగా వర్తిస్తుంది.

మనస్సు ఉన్న ఒక్క కారణంగా మనకు స్నేహితు లున్నారు. శత్రువులూ ఉన్నారు. ప్రియు లున్నారు. అప్రియులూ ఉన్నారు. ప్రియులైతే, క్రింద ఉన్న వారిని ఎత్తి భుజాలపై పెట్టుకుంటాము. అప్రియు లైతే, పై నున్న వారిని పట్టి క్రిందికి లాగుతాము. వీటి వెనుక ఏదో లేదు. రాగద్వేషాలను కలిగిన మనసే ఉంది.

సమమైన బ్రహ్మమునకు మనస్సు లేదు. ప్రాణమూ లేదు. మనస్సు లేనందున రాగద్వేషాలు లేవు. ప్రియాప్రియాలు లేవు. ప్రాణము లేనందున శ్వాసలూ లేవు. ద్వేషము ఉండే అవకాశము లేదు కనుక ద్వేష వృత్తి ప్రభావంతో శ్వాసలు పెరిగే ప్రసక్తే లేదు. రక్తమే లేదు కనుక వీటి ప్రభావం వల్ల రక్తపోటు పెరగదు. లేని గుండె ఆగేది ఉండదు. అట్టి సమమైన బ్రహ్మమునకు మన రాగద్వేషాలను అంటగట్టి, మన రక్తపోటును మనం పెంచుకో నవసరం లేదు.

***అప్రాణో హ్యమనా శ్శుభ్రః*** - బ్రహ్మమునకు మనస్సు, ప్రాణము లేవు. అందుచేత ఏ వికారము, దోషము లేనివాడై.పరిశుద్ధంగా ఉన్నాడు అన్నది ఉపనిషత్తు. మనస్సు లేని వానిలో ప్రియత్వ అప్రియత్వ భావనలు ఉండే అవకాశం ఉందా? కనుకనే సమ రూపుడైన తనకు ఎవరి విషయం లోను ద్వేషము లేదు; అలాగే రాగమూ లేదు అంటున్నాడు భగవంతుడు. ఈ కారణం చేత ఆయనకు భక్తులపై ప్రియత్వ ముంది కనుక భక్తులను అనుగ్రహిస్తాడు, అభక్తులను అనుగ్రహించడు ***(భక్తాన్ అనుగృహ్ణాతి న ఇతరాన్ ఇతి)*** అనే అపవాదుకు, అభియోగానికి అవకాశము లేదు.

**సమంలో విషమం లేదు**

భగవంతుడు సమరూపుడు. విషమం తెలియని వాడు. కనుక, ఇచ్ఛాపూర్వకంగా ఎవరినీ ఎత్తుకోడు. ఎవరినీ దించి పెట్టడు. తాను ఎవరికీ దూరంగా లేడు. కనుక, ఏ కొందరికీ దగ్గర కాడు. ఆకాశం ఎవరికి దూరంగా ఉంది? అలాగని, ఏ కొందరికి సమీపంగా ఉంది? ఆలోచించండి. ఆకాశం అందరికీ సమానమే ***(సమః తుల్యః).***

సర్వేశ్వరుడు సమ స్వరూపుడు కనుక పూర్ణ పురుషుడు. పూర్ణంలో పక్షాలు లేవు. విపక్షాలు ఉండవు. ఆయన ఎవరిని ద్వేషిస్తాడు? ఎందుకు ద్వేషిస్తాడు? అలాగే ఎవరిని ప్రేమిస్తాడు? ఎందుకు ప్రేమిస్తాడు? భక్తులపై ప్రేమ ఉంది, అభక్తుల మీద ప్రేమ లేదు అంటారా? సరే. అలాగే అనుకుందాం. ఈ విషయం మీకు ఎలా తెలుసు? మీ అభియోగం పరమేశ్వరుని మీద, అవునా? మరి, పరమేశ్వరుణ్ణి మీరు చూశారా? ఆయన మీకు





తెలుసా? ఆయన ఎవరి నైనా ప్రేమించడం మీరు చూశారా? ఉదాసీనంగా ఉండటం ఎప్పుడైనా దర్శించారా? లేదు కదా! మరి, అపరిచితుని మీద అభియోగా లేమిటి?

అవేమి ప్రశ్నలండీ? గాలిని మనం కళ్ళతో చూశామా? చెట్టు చలిస్తూ ఉంటే గాలిని గుర్తు పడుతున్నామా లేదా? దేవుణ్ణి మేము చూడక పోవచ్చు. కాని, ప్రపంచంలో కొందరు సుఖసంతోషాలతో ఉండగా, మరి కొందరు బాధలతో బ్రతుకుల్ని భారంగా ఈడుస్తూ ఉండటం మనం చూస్తున్నామా లేదా? కొందరికి సుఖా లేమిటి? కొందరికి దుఃఖా లేమిటి? కొందరి కేమో పాయసాలు, మరి కొందరికి గంజినీళ్ళా? ఇదేనా సమత్వ మంటే? ఇక్కడ విషమత్వం లేనే లేదా? ఇవన్నీ మా అభియోగాలకి ఆధారాలు కావా, అని అంటారా?

అయితే వినండి! మీ రిచ్చిన ఉపమానం ప్రకారం చెట్టు చలిస్తూ ఉంది కనుక గాలి ఉందన్నారు. బావుంది. మీరు, నేను గుర్తించాలని చెట్టు చలించిందా? తనను మనం గుర్తు పట్టాలని గాలి వీచిందా? వీచడం గాలి స్వభావము. చలించడం చెట్టు లక్షణం. అదలా ఉంచండి.

ఊగే చెట్టుకు మనం దూరంగా ఉన్నా మనుకోండి. మనకు ఆ చెట్టు గాలి తగుల్తుందా? గాలి కావాలి అనుకుంటే చెట్టు దగ్గరకు మనం వెళతామా? లేక చెట్టు మన దగ్గరకు వస్తుందా? చెట్టును సమీపించిన వారికే హాయిగా గాలి తగుల్తుంది. అంటే, సమీపించిన వారు చెట్టుకు ప్రియులా? అలాగే తరువుకు దూరంగా ఉన్న వారికి చెమటలు పోస్తే అందుకు చెట్టు కారణమా? దూరంగా ఉన్న వాళ్ళ మీద చెట్టుకు ద్వేషం ఉందా?

పరమేశ్వరుడు కూడా అంతే. ఆయనకు రాగద్వేషాలు ఉండవు. సమీపించిన వాళ్ళు సంతోసిస్తారు. దూరమైన వాళ్ళు దుఃఖ పడతారు.

అందించే వాళ్ళ స్థాయి నుండి కాదు చూచి నిర్ణయించ వలసింది. అందుకునే వాళ్ళ స్థాయి నుండి చూడాలి. చెట్టు స్థాయి నుండి చూచి దానికి రాగద్వేషా లున్నాయని చెప్పడం సరి కాదు. బాటసారుల స్థాయి నుండి చూచి నిర్ణయించాలి.

చెట్టు విలక్షణంగా ఉంటుంది. వినియోగం లోనే మనుషులకు ఫలాలు అందుతాయి. చెట్టులో సమత్వమే ఉంది. బ్రహ్మమూ అంతే.

చెట్టును ఆశ్రయించే వారందరూ గాలి కోసమే ఆశ్రయించరు. కొందరు ఛాయార్థం, కొందరు పత్రార్థం, కొందరు పుష్పార్థం, కొందరు ఫలార్థం ఆశ్రయిస్తారు. ఎవరు దేని కొరకు ఆశ్రయిస్తే దానినే పొందుతారు.

భగవంతుణ్ణి ఆర్తులు ఆశ్రయిస్తారు. అర్థార్థులు ఆశ్రయిస్తారు. జిజ్ఞాసువులు ఆశ్రయిస్తారు. జ్ఞానులూ ఆశ్రయిస్తారు. ఎవరు దేని నిమిత్తం ఆశ్రయిస్తారో, వారు దానినే పొందుతారు. ఆశ్రయానికి నోచుకోని వారు అలమటిస్తూ ఉంటారు. ఎవరెలా ఉన్నా భగవంతుడు మాత్రం సమం గానే ఉంటాడు. నిర్దోషం గానే ఉంటాడు ***(నిర్దోషం హి సమం బ్రహ్మ).***

ఎవరు తనలో దిగుతారో వారినే నది చల్లబరుస్తుంది. వారి దప్పిక మాత్రమే తీర్చుతుంది. దూరంగా ఉండి, నదిని సమీపించ లేక ఎవరైనా మరణిస్తే దానికి నది కారణ మవుతుందా? నదికి రాగద్వేషా లున్నాయా?

దగ్గరై వాసన చూచిన వారికే పువ్వు తన సౌరభాన్ని పంచుతుంది. దూరంగా ఉండే వాళ్ళకు పువ్వు పరిమళాలను పంచలేదు. మరి పువ్వుకు ప్రియాప్రియాలు ఉన్నట్లేనా? ఒకవేళ భగవంతుడే సమాధానం చెబితే, ఏమంటాడు?

***అగ్నివత్ అహం. దూరస్థానాం యథా అగ్నిః శీతం న అపనయతి సమీపమ్ ఉపసర్పతామ్ అపనయతి తథా అహం భక్తాన్ అనుగృహ్ణామి న ఇతరాన్*** - 'నాయనా! నేను అగ్ని లాంటి వాణ్ణి. అగ్ని ఎలాగైతే తనకు దూరంగా

ఉన్న వాళ్ళ చలిని పోగొట్టలేదో, తనకు దగ్గరైన వాళ్ళ చలిని మాత్రమే పోగొడుతుందో, అలాగే నేను కూడా నన్ను సమీపించిన భక్తుల్నే అనుగ్రహిస్తాను. ఇతరుల్ని అనుగ్రహించను' అని చెబుతాడు. ఇప్పుడు అర్థమైందా? బ్రహ్మము నిర్దోషము, సమము.

**ఆయన సమం గానే ఉన్నాడు**

**అందరూ సమంగా లేరు**

తరువు అందరి విషయంలో ఎలా సమంగా ఉందో, నది అందరినీ ఎలా సమంగా తృప్తి పరుస్తూ ఉందో, అగ్ని అందరినీ ఎలా సమంగా ఆదరిస్తూ ఉందో, సూర్యుడు అందరి విషయంలో ఎలా సమంగా ప్రవర్తిస్తున్నాడో, పరమేశ్వరుడు కూడా అలా సమం గానే ఉన్నాడు.

నదిలో దిగిన వారు నదిలో ఉన్నట్లు, అర్జునా! ఈశ్వరుడ నైన నన్ను ఎవరు భక్తితో ఆరాధిస్తారో, వాళ్ళు సహజం గానే నాలో ఉంటారు. అంతేగాని, నాకు వాళ్ళ మీద ప్రియత్వం ఉండటం వల్ల మాత్రం కానే కాదు ***(యే భజన్తి తు మామ్ ఈశ్వరం భక్త్యా మయితే స్వభావతః ఏవ న మమ రాగ నిమిత్తం మయి వర్తన్తే).*** అలాగే నేను కూడా స్వభావం చేతనే వాళ్ళలో ఉంటాను. ఇతరులలో ఉండను. అంతమాత్రం చేత నాకు వాళ్ళు అప్రియు లని కాదు ***(తేషు చాపి అహం స్వభావతః ఏవ వర్తే న ఇతరేషు నైతావతా తేషు ద్వేషః మమ).***

పీల్చిన వారి లోనికే గాలి ప్రవేశించినట్లు, పిలిచిన వారి లోనికే భగవంతుడు ప్రవేశించి ఉంటున్నాడు. ఆయన ఉంటే, ఆ దేహము దేవాలయం అవుతుంది. అందుచేతనే దేవాలయానికి వెళ్ళి భగవంతుణ్ణి దర్శించినట్లు, భక్తితో, నిష్ఠతో వెళ్ళి మహాత్ముల్ని దర్శిస్తూ ఉంటాము.

అనర్థ దాయకమైన ఆలోచనలను ప్రక్కన పెట్టి, మనం కూడా సుదాముని లాగా, శబరి లాగా, విదురుని లాగా పరమేశ్వరుని మనసారా పిలిస్తే, ఆయన తప్పక మనలో ప్రవేశించి మనల్ని కూడా ఉద్ధరిస్తాడు.

**పెద్దల మార్గాన నడతునయ్యా**
**చిన్న బుద్ధులు పూర్తిగా విడుతునయ్యా**
**నోరార నిన్ను నేను పిలుతునయ్యా**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చిన్నికృష్ణ శతకములో ఒక వెన్నముద్ద.

*ఇక భక్తి వైభవాన్ని వివరిస్తున్నాడు.*

**అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।**
**సాధురేవ స మన్తవ్యః సమ్య గ్వ్యవసితో హి సః ॥ 30**

***అపి-చేత్-సుదురాచారః-భజతే-మాం-అనన్యభాక్***
***సాధుః-ఏవ-సః-మంతవ్యః-సమ్యక్-వ్యవసితః-హి-సః***

| | | | |
|---|---|---|---|
| సుదురాచారః అపి | = మిక్కిలి దురాచారవంతుడైనా | సమ్యక్ | = చక్కగ |
| అనన్యభాక్ | = అన్యాశ్రయము నభిలషించక | వ్యవసితః హి | = స్థిర చిత్తుడు కనుక |
| మాం | = నన్ను | సః | = అతడు |
| భజతే చేత్ | = సేవిస్తే | సాధుః ఏవ | = సాధువే యని |
| సః | = వాడు | మంతవ్యః | = భావించదగ వాడు |





**అర్జునా! ఎంత దురాచారవంతు డైనా సరే, అనన్య భక్తితో నన్ను సేవించాడా, ఆ క్షణం నుండి వాడు సాధువే ననుకో! మంచి నిర్ణయం తీసుకున్నాడు కదా!**

**వ్యాఖ్య**

అసాధ్యాలను సాధ్యాలుగా మార్చే శక్తి, భక్తికి ఉంది. భక్తి ప్రభావం చేత ఎన్నో బ్రతుకులు అందమైన మలుపులు తిరిగాయి. భక్తి నీడలో దుష్టులు శిష్టు లయ్యారు. లోభులు త్యాగు లయ్యారు. అపవిత్రులు పవిత్రు లయ్యారు. పతనమైన వాళ్ళు ప్రగతి పథంలో చరించారు. దురాచారులు సదాచారు లయ్యారు. రత్నాకరులు వాల్మీకు లయ్యారు.

**సుదురాచారులు**

*ఆచారః* అంటే వ్యవహారము, నడవడి, ప్రవర్తనము అని అర్థము. ప్రవర్తనము ఉండవలసిన విధంగా ఉంటే దానిని సత్ప్రవర్తనము అంటాము. అందుకు భిన్నంగా వ్యవహరించే వారిది దుష్ప్రవర్తనము అంటాము. చేయవలసిన దానిని చేయడము, చేయకూడని దానిని త్యజించడము ఆచారము. అదే సదాచారము.

చేయ వలసింది చేయక పోగా, చేయ కూడనిది చేయడము దురాచారము. మర్యాదను పాటించడము మనిషి ధర్మము. మర్యాదను పాటించక పోగా అమర్యాదను ప్రదర్శించడం దురాచారము. ధర్మమును ఆచరించక పోగా అధర్మంగా చరించడము దురాచారము. అహింసను అవలంబించక పోగా హింసాయుతంగా జీవించడము దురాచారము.

***సు దురాచారః*** అంటే మిక్కిలి దురాచారము ***(సుష్ఠు దురాచారః).*** అంటే, నికృష్టమైన దురాచారము ***(అతీవ కుత్సితాచారః)*** అని అర్థం. అట్టి కుత్సితమైన ఆచారము గల వారిలో అగ్రగణ్యుడు సుదురాచారవంతుడు. బండ బ్రతుకును సాగించే వ్యర్థ జీవి.

***అపిచేత్ -*** అయినప్పటికి ***(యద్యపి),*** అట్టి దురాచారవంతుడు పరమేశ్వరుని యందు అనన్య భక్తిని అలవరచుకొని ***(ఈశ్వరం అనన్యభాక్ అనన్య భక్తిః సన్)*** నిరంతరము భగవంతుని భక్తి చేయ గలిగితే, అతడు సాధువే ***(సాధుః ఏవ)*** అని భావించ వచ్చు ***(మన్తవ్యః జ్ఞాతవ్యః)*** అంటున్నాడు భగవంతుడు.

**సదాచారులు**

మిక్కిలి కుత్సితమైన ఆచారము గల దురాచార వంతులు అనాచారం నుండి బయటపడి సదాచార వంతులు కాగలరా? అయ్యే అవకాశం ఉందా? భక్తి ప్రభావం చేత కాగలరు అనేదే ఇక్కడ ప్రధానమైన విషయము.

సరే. భక్తి వల్ల దురాచారులు సదాచారులు అవుతారనే అనుకుందాం. ఇంతకీ భక్తి చేయవలసింది ఎవరు? దురాచారులే కదూ? దురాచారులు భక్తిని ఎలా చేయగలరు? భక్తి చేయ గలిగితే వారు దురాచారంలో ఎందుకు చరిస్తారు? దురాచారంలో చరించే వారు సదాచారం వైపు తిరిగితే గాని భక్తి చేయలేరు. ఎందుకంటే, భక్తి అనేది సదాచార జీవనము. మరి దురాచారులు సదాచారులుగా పరివర్తన చెందడానికి హేతు వేమిటి? అనేదే ఇక్కడ స్పష్టం కావాలి.

దురాచారవంతులు భక్తి చెయ్యలేరు. ఇందులో రెండవ అభిప్రాయానికి అవకాశం లేదు. అది అసాధ్య మైన విషయం. అసాధ్య మైనది సాధ్యం కావడం అనేది దురాచార జీవనంలో జరిగేది కాదు. కాని జన్మాంతరాలలో ఎక్కడో, ఎప్పుడో, ఏదో విధంగా సంపాదించుకున్న పుణ్య ఫల విశేషము చేతనే సిద్ధించింది అనే సత్యాన్ని

గుర్తించాలి. కేవలం పూర్వ జన్మ సుకృతం వల్లనే దురాచార జీవనంలో సదాచారమైన భక్తి కొద్దిగా అలవడుతుంది. సుకృతం లేనిదే కలగదు *(న లభ్యతే పుణ్యైర్వినా)*.

**సద్విచారము**

పూర్వ పుణ్య విశేషం చేత భక్తి అంకురించ వచ్చు. కాని, అది చిన్న నిప్పురవ్వ లాంటిది. వంటకు ఉపయోగపడే మంట మాత్రం కాదు. చిన్న నిప్పురవ్వను మెల్ల మెల్లగా ఊదుతూ, కొద్ది కొద్దిగా చిదుగులు వేస్తూ పెద్ద మంటగా చేసి వంట ఎలాగైతే చేసుకుంటామో, అలాగే పూర్వజన్మ సుకృత ఫలంగా ప్రాప్తించిన భక్తి అనే నిప్పు రవ్వకు, వివేక మనే చిదుగులు వేసి విచారము అనే వాయువును ఊదితే, భక్తి క్షణ క్షణ వర్ధమానమై సాధు జీవనాన్ని ప్రసాదిస్తుంది.

*అవసర మందరికి ఆచారము*
*లోపల సాగాలి విచారము*
*విచారము లేని ఆచారము*
*విప్పి చూడ అనాచారము*
*చేనుకు కంచే సదాచారము*
*పైరు పెట్టుటే సమాచారము*
*రామ రామ జయ రాజారామ్*
*రామ రామ జయ సీతారామ్*

అని రామజోగి చిట్కా.

**సద్వివేకము**

జన్మ సంస్కారము మెల్లగా భక్తిని కలిగిస్తుంది. నిరంతరాభ్యాసంలో భక్తిని పెంపొందించుకుంటే దుష్టుడు సాధువుగా మారుతాడు. ఇక్కడే, అదృష్టాలు, దురదృష్టాలూను. జన్మ సంస్కార ఫలంగా ఎక్కడో, ఏదో ప్రవచనం ఆలకించి, లేదా ఒక ప్రత్యేకమైన సన్నివేశాన్ని వీక్షించి తమలో నిగూఢంగా ఉన్న సంస్కారాన్ని వ్యక్తం చేసుకుంటారు. ఆ తరువాత, కొందరు వివేక విచారాదుల ద్వారా సంస్కారాన్ని వృద్ధి చేసుకొని సాధు జీవనులవుతారు. వీరు అదృష్టవంతులు. చాలినంత అదృష్టఫలం ఉన్నవారు. పుణ్యం కలవారు.

మరి కొందరు సంస్కారాన్ని వృద్ధి చేసుకోకుండా, దయ్యం పట్టిన వాళ్ళు ఊగినట్లు ఊగిపోతూ భక్తి ప్రచారం చేయాలని, సేవా కార్యక్రమాలు నిర్వహించాలని క్రొత్త అంగడి తెరుస్తారు. అంతే. చిన్న నిప్పురవ్వ మీద నీళ్ళు కాచుకొనే ప్రయత్నం చేస్తే, నీళ్ళు కాగక పోగా, నిప్పురవ్వ ఆరి పోయినట్లు, ఈ వ్యర్థ కలాపాల వల్ల జన్మాంతర సంస్కారం అందించిన పన్నీరు బూడిదలో పడగా, భక్తి దూరమై బ్రతుకు బుగ్గి పాలవుతుంది.

నిత్యాన్నదానము శ్రేష్ఠ మైనదే కావచ్చు. కాని, దానిని అందరూ చెయ్యలేరు. ఆలోచన ఒక్కటే కాకుండా ఆర్థిక స్తోమత కూడా ఉన్నవారే చెయ్యగలరు. అంతేగాని ఆ పనికి బిచ్చగాడు బయలుదేర కూడదు. ఒకవేళ చెయ్యాలి అనేదే గనుక బిచ్చగాడి నిశ్చయ మైతే, వాడు ముందు ధనికుడు కావడానికి ప్రయత్నించాలి. శ్రమించాలి.

వైద్యం చెయ్యడానికి వైద్య సేవ గొప్పది అని తెలుసుకోవడం సరిపోదు. వైద్య విద్య కూడా తెలిసి ఉండాలి. వైద్య విద్య అలవడిన వైద్యుడే వైద్యం చేయగలడు. అర్థరహితమైన ఆవేశాలు బ్రతుకును వ్యర్థంగా మారుస్తాయి.





**సద్భక్తి యుతము**

భక్తి వృద్ధి చెందాలి అంటే, కేవలం దురాచారం నుండి విడిపడితే సరిపోదు. ప్రయత్నించి సదాచారంతో ముడిపడి జీవించడం అలవరచుకోవాలి. పశ్చాత్తాపం పాప పరిహారం అంటూ ఉంటారు. అది విభేదించ దగిన విషయ మేమీ కాదు. కాకపోతే, పొలానికి నీరు పెడితే నేల మెత్త పడినట్లు, పశ్చాత్తాపం వల్ల స్రవించే కన్నీళ్ళతో హృదయం మెత్తబడుతుంది. కొంతవరకు పాపం ప్రక్షాళనం అవుతుంది. కాని, అలాంటి పాపాన్ని తిరిగి చేయను అని నిశ్చయించుకొని, తదనుగుణంగా జీవించి నపుడే దురాచారుడు పవిత్రు డవుతాడు. సాధువు అవుతాడు. సద్భక్తు డవుతాడు.

*కృత్వా పాపం హి సంతవ్య తస్మాత్ పాపాత్ ప్రముచ్యతే।*
*నైవం కుర్యాం పునః ఇతి నివృత్యా పూయతే తు సః॥*

పాపం చేసిన వాడు పశ్చాత్తాపంతో పరితపిస్తే, అతడు పాప విముక్తు డవుతాడు (పరివర్తన కారణంగా). మళ్ళీ అలాంటి పాపం చెయ్యను అని అతడు పాపం నుండి విరమిస్తే పవిత్రు డవుతాడు. పునీతు డవుతాడు (ప్రవర్తన కారణంగా).

పరమేశ్వరుని అనన్య భక్తితో సేవించిన వాడు ఎందుకని సాధువుగా గుర్తింప బడుతున్నాడు అంటే, దానికి కారణాన్ని కూడా పరమేశ్వరుడు వివరించి ప్రవచించాడు. ***సమ్యక్ వ్యవసితః హి యస్మాత్ సాధు నిశ్చయః సః*** - సాధు నిశ్చయము జరిగింది కనుక అతడు సాధువే. మనస్సులో మంచి నడవడికి సంబంధించిన నిశ్చయం జరిగి పోయింది కనుక, బాహ్యంలో అతడి నడవడిక మంచిగానే ఉంటుంది. ***యద్భావం తద్భవతి*** - భావం ఎలా ఉంటే బ్రతుకు అలాగే ఉంటుంది. సాధుభావం సాధు జీవనానికి హేతువు. అట్టి జీవనము సద్భక్తి యుతము. ముక్తికి సోపానము.

*ఈ విధమైన పరివర్తనము యొక్క ప్రభావాన్ని ప్రతిజ్ఞా పూర్వకంగా చెబుతున్నాడు.*

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాన్తిం నిగచ్ఛతి ।**
**కౌన్తేయ ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31**

*క్షిప్రం-భవతి-ధర్మాత్మా-శశ్వత్-శాంతిం-నిగచ్ఛతి*

*కౌంతేయ-ప్రతి-జానీహి-న-మే-భక్తః-ప్రణశ్యతి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| క్షిప్రం | = | శీఘ్రముగా | కౌంతేయ | = | అర్జునా! |
| ధర్మాత్మా | = | ధర్మాత్ముడు | మే | = | నా యొక్క |
| భవతి | = | అవుతున్నాడు | భక్తః | = | భక్తుడు |
| శశ్వత్ | = | స్థిరమైన | న ప్రణశ్యతి ఇతి | = | నాశము పొందదని |
| శాంతిం | = | శాంతిని | ప్రతి జానీహి | = | ప్రతిజ్ఞ చేయి |
| నిగచ్ఛతి | = | పొందుతున్నాడు | | | |

**అర్జునా! ఈ సాధువే తొందరగా ధర్మాత్ముడు అవుతాడు. నిత్య శాంతిని పొందుతాడు. కౌన్తేయా! నా భక్తుడు నశించడని ప్రతిజ్ఞ చేసి చెప్పు.**

**వ్యాఖ్య**

మనస్సులో సాధు నిశ్చయం చేసుకొని ఉన్న సామర్థ్యం వల్ల ***(అన్తః సమ్యక్ వ్యవసాయ సామర్థ్యాత్),***

బాహ్యము నందు దురాచారమును త్యజించి (**ఉత్సృజ్య బాహ్యం దురాచారతామ్**) శీఘ్రంగా ధర్మాత్ము డవుతున్నాడు. అంటే, ధర్మము నందు బుద్ధి కలవాడు అవుతున్నాడు (**క్షిప్రం భవతి ధర్మాత్మా**). పూర్వ శ్లోకంలో సుదురాచారుడుగా మనకు పరిచయమైన వ్యక్తి ఇక్కడ ధర్మాత్ముడుగా గోచరిస్తున్నాడు. ఈ మధ్యలో ఏమి జరిగింది? అని ప్రశ్నించుకుంటే, ఆ వ్యక్తి మనస్సులో మంచి నడవడికి సంబంధించిన నిశ్చయం దృఢంగా ఏర్పడింది (**సమ్యక్ వ్యవసితః**). దాని ప్రభావం చేత బాహ్యంలో మంచి నడవడి కనిపించింది (**సమ్యక్ వృత్తః**). ఈ కారణంగా దురాచారపరుడు ధర్మాత్ము డయ్యాడు.

**శుద్ధి కార్యము**

ఇదొక సంధి కాలము. ఉదయ సంధ్య లాంటిది. చీకట్లు చెదరి పోతూ ఉంటాయి. వెలుగులు పుట్టుకొస్తూ ఉంటాయి. చీకటి తెరలు తొలగిపోతూ, వెలుగు కిరణాలు విస్తరిస్తూ ఉన్న దశలో బ్రతుకు ప్రకాశవంత మవుతుంది.

చేసిన పాపాల కారణంగా పాప ఫలితాలు పుట్టుకొస్తూ ఉంటాయి. కారణము కార్యంగా రూపాంతరం చెందడాన్ని ఎవ్వరూ నివారించ లేరు. పాప కారణంగా ఉత్పన్న మయ్యే పాప ఫలితాలు అనే కార్యాలు ధర్మ జీవనానికి ప్రతిబంధకా లవుతాయి. ఇది అనివార్య పరిస్థితి.

ఇటువంటి ప్రతికూల పరిస్థితుల మధ్య పశ్చాత్తాప హృదయం పవిత్రత కోసం పరితపిస్తుంది. ప్రాకు లాడుతుంది. చేసిన పాపాలను తలచుకొని నిత్యం మనస్సు పశ్చాత్తాపం చెందుతుంది (**శోచేత మనసా నిత్యం**). గతంలో ఆచరించిన దుశ్చర్యలను చింతిస్తూ కుములుతుంది (**దుష్కృతాని అనుచిన్తయన్**). అప్రమత్తమైన చిత్తము తపస్సులో మగ్న మవుతుంది (**తపస్వీ చాప్రమాదీ**). పాపం నుండి మెల్లగా విడి పడుతుంది (**తతః పాపాత్ ప్రముచ్యతే**) అని బౌద్ధాయన ధర్మశాస్త్రము. ఈ విధమైన హృదయ పరివర్తనములో పరమేశ్వరుని కృప సాధకునికి అందుతుంది. అట్టి కృపా విశేషం చేత పాప కారణంగా సాధనలో అవరోధాలుగా నిలిచిన ప్రతిబంధకాలను సాధకుడు అధిగమిస్తాడు. పాప తిమిరాలు తొలగి పోతూ ఉంటాయి. ధర్మజీవన వెలుగులు విరబూస్తూ ఉంటాయి. ఈ సంధి కాలం లోనే దురాచారపరుడు ధర్మాత్ముడు అవుతాడు (**భవతి ధర్మాత్మా ధర్మచిత్తః ఏవ**). ధర్మము నందే మనస్సు కలవాడు అవుతాడు. ఇలా శుద్ధి పడతాడు.

**ఎంత కాలం?**

మరి, దురాచార వంతుడైన పాపి పునీతుడై భక్తుడు కావడానికి ఎంత సమయం పడుతుంది? పాపాలు చేయడానికి సమయం పడుతుందేమో గాని, మనస్సు పెట్టి నిశ్చయంతో సాధన చేసే వారు పాప విముక్తిని పొందడానికి ఎంతో కాలం అవసరం లేదు.

రాత్రి కొన్ని గంటలు ప్రపంచం చీకట్లో మునిగి పోతుంది. అదే ప్రపంచం వెలుగులలో తేరుకోవడానికి ఎంత సమయం పడుతుంది? ఒక గది కొన్ని సంవత్సరాలుగా మూతబడి ఉంది. గది నిండా తిమిరమే తారాడుతోంది. దీపం చేత పట్టుకొని, తలుపు తెరచి గది లోకి ప్రవేశిస్తే, సంవత్సరాలుగా గదిలో ఉన్న చీకటి అదృశ్యం కావడానికి ఎంత కాలం పడుతుంది? ఇదీ అంతే. మనిషి స్వప్న ప్రపంచం నుండి మెలకువ లోకి వచ్చినట్లు, తక్షణమే జరిగి పోతుంది. అందుకనే **క్షిప్రం** అన్నాడు. అంటే శీఘ్రంగా, లేదా తొందరగా అని అర్థము. భౌతిక రోగం నయం కావడానికి సమయం పడుతుందేమో గాని సాధకుని అంతఃకరణము శుద్ధిపడి సిద్ధ పడితే భవ రోగము క్షణాల్లో అదృశ్య మవుతుంది.

**నిత్య శాంతి**

ధర్మము నందు చిత్తము కలవాడు ధర్మాత్ముడు. ధర్మరూపంలో ఉన్నది దైవమే కనుక, ధర్మము నందు ప్రీతి కలిగి ఉండటము అంటే, భగవత్ప్రీతితో జీవించడము అని అర్థము. దైవభక్తిలో నిమగ్నమైన చిత్తానికి, ఇంకా మిగిలి యున్న కొన్ని ప్రతిబంధకాలు అడ్డంకులుగా మారితే, ధర్మజీవన ఫలంగా ప్రాప్తించే పరమాత్మ అనుగ్రహంతో వాటంతట అవే నిస్సారమై, నిర్వీర్యమై, నీరసపడి నిష్క్రమిస్తాయి.





**వికర్మ యచ్చోత్పతితం కథంచి ద్ధునోతి సర్వం హృది సన్నివిష్టః।**

ఏదో ఒక విధంగా సంభవించే నిషిద్ధ కర్మమును సమస్తమును హృదయాంతర్యామి అయిన పరమేశ్వరుడు తొలగిస్తున్నాడు. అంటే భగవత్కృప వల్ల నూతన పాపాచరణము నివారింప బడుతూ ఉంది అని అర్థము.

ఇలా శుద్ధి పడిన బుద్ధి శాంతి నిలయంగా మారుతుంది. శాంతి రెండు విధాలు. అశాంతి కారణాలు తొలగి నపుడు తాత్కాలికంగా ఏర్పడే శాంతి మొదటిది. దీనికి రాకపోకలు ఉంటాయి. అలా కాకుండా నిత్యము భాసించే స్వరూప శాంతి రెండవది. దీనినే **శశ్వత్ శాంతి** అన్నాడు. అంటే నిత్యశాంతి అని అర్థము. అదే తన స్వరూపముగా కలవాడు అవుతున్నాడు. ఈ విధంగా దురాత్ముడు పుణ్యాత్ముడై, ధర్మాత్ముడై, శాంతిరూపుడై శోభిస్తున్నాడు. ఇదంతా భక్తి వైభవము. భగవద్భక్తి వైభవము. ఈ వైభవాన్ని లోకానికి చాటింపు వేసి చెప్పమని అచ్యుతుడు అర్జునుని ఆదేశించాడు.

**దైవ శాసనం**

'అర్జునా! నిశ్చితమైన ప్రతిజ్ఞ చేసి చెప్పు! (**ప్రతిజానీహి**). నా భక్తుడు నశించడు అని చెప్పు' అన్నాడు గీతాచార్యుడు. ***న మే భక్తః ప్రణశ్యతి*** - 'నా భక్తుడు నశించడు' అనే వాక్యం అష్టాక్షరీ మహామంత్రము లాంటిది. అర్జునుని ద్వారా ప్రపంచానికి పరమేశ్వరుడు అభయ ప్రదానం చేశాడు.

**న వాసుదేవ భక్తానాం అశుభం విద్యతే క్వచిత్**

'వాసుదేవుని భక్తులకు అశుభము తెలియదు' అనేది సత్యమైన మాట. కృష్ణ భక్తులు నాశ మెరుగరు. ఈ విశ్వాసము తోనే నేను నా బాల్యము లోనే ***ఓం నమో భగవతే వాసుదేవాయ*** అనే ద్వాదశాక్షరీ మహా మంత్రాన్ని హృదయంలో స్థిర పరచుకొని వాడవాడల కీర్తిస్తూ ప్రచారం చేశాను. నా జీవితంలో నా ద్వారా ఏదైనా లోకానికి జరిగి ఉంటే అదంతా కృష్ణ నామ వైభవమే. కృష్ణ భక్తి అనుగ్రహించిన ప్రసాదమే. తన భక్తుల బ్రతుకులు బాధల పాలు కాకూడదని భావించిన పరమేశ్వరుడు, అర్జునుని లోకానికి ప్రతిజ్ఞ చేసి చెప్పమంటున్నాడు. ఆ మాట భగవంతుడు చెప్పాలా! భగవంతుని కీర్తిని చాటింపు వేయడం కన్నా తృప్తికరమైన కార్యము భక్తునికి మరొకటి ఉంటుందా? కాకపోతే, ఇక్కడ సాక్షాత్తు భగవంతుడే ప్రతిజ్ఞా వచనాన్ని వినిపించడం భక్తుల భాగ్యము. రామభక్తు డైన భద్రాచల రామదాసు కూడా అలాగే చాటింపు వేశాడు. ***భేరికా డాండ డడాండ డాండ నినదంబు లజాండము నిండ మత్త వేదండము నెక్కి చాటెదను దాశరథీ! కరుణా పయోనిధీ!*** - రాముని మించిన దైవము లేదని, మదపు టేనుగు నెక్కి, భేరీ నినాదాలు, నగారాల చప్పుళ్ళు బ్రహ్మాండమును నిండే లాగా చాటి చెబుతాను అన్నాడు రామదాస్. భేష్! భక్తుడంటే అలా ఉండాలి.

*దురాచారు లైనా, పాపులైనా తనను ఆశ్రయిస్తే తరిస్తారు అనే విషయాన్నే కొనసాగిస్తున్నాడు తరువాత శ్లోకంలో కూడా.*

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।**
**స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥** **32**

**మాం-హి-పార్థ-వ్యపాశ్రిత్య-యే-అపి-స్యుః-పాపయోనయః**
**స్త్రియః-వైశ్యాః-తథా-శూద్రాః-తే-అపి-యాంతి-పరాం-గతిం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | తథా | = | అలాగే |
| యే | = | ఎవరు | శూద్రాః | = | శూద్రులును |
| మాం | = | నన్ను | స్యుః అపి | = | అయి యున్నారో |
| వ్యపాశ్రిత్య | = | శరణుబొంది | తే అపి | = | అట్టివారును |
| పాపయోనయః | = | పాపాత్ములు | పరాం | = | ఉత్తమమైన |
| స్త్రియః | = | స్త్రీలును | గతిం | = | గతిని |
| వైశ్యాః | = | వైశ్యులును | యాంతి హి | = | పొందుతారు |

**అర్జునా! పాప సంజాతు లైనా, స్త్రీ లైనా, వైశ్యులైనా, శూద్రులైనా, ఎవ్వరైనా సరే నన్ను ఆశ్రయిస్తే చాలు. ఉత్తమ గతిని పొందుతారు.**

**వ్యాఖ్య**

దురాచారులై, పాప జీవనాన్ని గడిపే వారు కూడా భక్తిని ఆశ్రయించి ఎలా పునీతు లయ్యారో, శాశ్వత మైన శాంతిని ఎలా పొందారో ఇంతవరకు చూశాం. ప్రస్తుత శ్లోకంలో పుట్టుకే పాప భూయిష్టంగా ఉన్నవారు, వారితో పాటు, పరమార్థ తత్త్వాన్ని సాధించుకోలేని వాళ్ళు కూడా భక్తిని కలిగి, పరమేశ్వరుని ఆరాధించి ఎలా తరించి పోతున్నారో తెలుపు తున్నాడు. భగవంతుణ్ణి ఎవ్వరైనా ఆశ్రయించ వచ్చు. ఆశ్రయించిన ప్రతి వారు తరించి పోతారు అనేదే ఈ శ్లోకంలో ప్రధానమైన విషయము.

**పాప యోనులు**

పాప యోనులు అంటే నీచ జన్మ కలవారు. పాప కార్యాలు ఆచరించే తల్లిదండ్రులకు పుట్టిన వారు. పుట్టుకే పాప కార్యాలు ఆచరించే తల్లిదండ్రులతో ముడిపడి ఉన్నందున వారు పాప యోనులు ***(పాపా యోనిః యేషాం తే పాప యోనయః పాప జన్మానః).*** తల్లిదండ్రులు ఇరువురు పాప కార్యాలు చేసేవారు, నేర చరితులుగా ఉంటారు. అట్టి వారికి జన్మించిన వారు పాప జన్మలు. అలాగే జంతు యోనులు కూడా పాప యోనులే కనుక, నీచ జన్మలైన జంతు జన్మములు కూడా పాప జన్మముల క్రిందికే వస్తాయి. ఇంతకీ దీని అర్థం ఏమిటంటే, మోక్షాన్ని పొందడానికి సాధనమైన జ్ఞానమును సాధించుకొనే అర్హతను జన్మ లోనే పోగొట్టుకున్న వారు అని అర్థము. అట్టి వారు కూడా తనను ఆశ్రయిస్తే ***(మాం వ్యపాశ్రిత్య)*** ఉత్తమ గతిని పొందుతారు ***(పరాంగతిమ్ యాన్తి)*** అంటున్నాడు భగవంతుడు.

ఈ విధమైన పాప జన్మలు, మరియు ***(తథా)*** స్త్రీలు, వైశ్యులు, శూద్రులు - వాళ్ళు కూడా ***(తే అపి)*** నన్ను ఆశ్రయించి ఉత్తమ గతిని పొందుతారు అంటున్నాడు గీతాచార్యుడు. ఈ శ్లోకం అనేక అపార్థాలకు అవకాశ మిచ్చి, ఎన్నో అనర్థాలకు ఊత మిచ్చింది. ఈ లోపం మూలానికి సంబంధించింది కాదు. వ్యాఖ్యానాలు ప్రబోధాన్ని మరొక కోణంలో చూపించడం వల్ల అపార్థాలు ఊపందు కున్నాయి. స్త్రీలు, వైశ్యులు, శూద్రులు అనే పదాలకు **పాప యోనయః** అనే పదాన్ని విశేషణంగా గ్రహించడం చేత పాప జన్మలైన స్త్రీలు, వైశ్యులు, శూద్రులు అనే అభిప్రాయం ఏర్పడింది.

నీచ జన్మలైన వారు నన్ను ఆశ్రయించి ఉత్తమ గతిని పొందుతారు. అలాగే స్త్రీ వైశ్య శూద్రులు కూడా





***(తే అపి)*** నన్ను ఆశ్రయించి ఉత్తమ గతిని పొందుతారు అనేదే చక్కని అన్వయము. అంతేగాని, పాపయోను లైన స్త్రీ వైశ్య శూద్రులు నన్ను పొందుతారు అనేది కాదు.

**అందరూ అర్హులే**

జన్మ ఏదైనా, ఎవరి దైనా దుఃఖమయమే. దుఃఖాన్ని ఎవరూ భరించలేరు. జన్మ నెత్తిన వారందరు ఏదో ఒకనాడు జన్మ రాహిత్యాన్ని పొంద వలసిందే. అదే జన్మకు పరమార్థము. రోగమున్న ప్రతివాడు ఔషధ సేవనానికి అర్హుడే. దుఃఖమున్న ప్రతి జీవి జ్ఞానబోధకు సిద్ధ పడాలి. కాకపోతే, జ్ఞానార్హతను పొందేందుకు తీవ్రంగా ప్రయత్నించాలి. అంతేగాని, ఈ విషయంలో ఎవరూ అనర్హులు కారు. శాస్త్రమాతకు అందరూ బిడ్డలే. అందుకే వేదమును శ్రుతిమాత అన్నారు. తల్లికి బిడ్డ లందరూ సమానమే. ధర్మమార్గంలో లేదా మోక్ష మార్గంలో కర్మే ప్రధానం గాని, జన్మ ప్రధానం కాదు. అందుచేత, ఎవరిని నీచ జన్మలుగా మనం పరిగణించామో, ఏ జంతు జాలాన్ని పాప యోనులుగా ముద్ర వేశామో, అట్టి జంతు జాతిలో కూడా తరించిన వారున్నారు. అదే మన చరిత్ర. భారతీయ పవిత్ర చరిత్ర. శాస్త్రాలలో, పురాణాలలో ప్రజ్వలించే మహాత్ముల దివ్య చరిత్ర.

గజేంద్రు డెవరు? జంతువు కాదా? గజేంద్రునికి ముక్తి కలుగ లేదా? గజేంద్ర మోక్షము అదే కదా! జటాయువు కైవల్యం ఏమిటి? జటాయువు పక్షి కాదా! మరి హనుమంతు డెవరు? వానర జాతికి చెందిన వాడు కాడా? వీరందరికి మోక్షం ప్రాప్తించి నపుడు, స్త్రీ శూద్ర వైశ్యాదులకు మోక్షము నిషిద్ధ మవుతుందా? భక్తిలో భేదాలు లేవు. భక్తులకు భేదాలు అర్థం కావు.

**సూ॥ నాస్తి తేషు జాతి విద్యా రూప కుల ధన క్రియాది భేదః।**

భక్తుల యందు ***(తేషు)*** జాతి, విద్య, రూప, కుల, ధన, క్రియాది భేదాలు లేనే లేవు ***(నాస్తి).*** వారందరిది భగవంతుని జాతి. వారందరికి తెలిసింది ఒకే విద్య. అదే భక్తి విద్య. వారందరిది ఋషికులం. వారి సంపదంతా దైవీ సంపదే.

వ్యాస శుకాదులు, కన్నప్ప కనకదాసులు, విదుర విభీషణాదులు, సంజయ గుహాదులు, శబరీ స్వయంప్రభలు - ఎవరు వీరందరు? వీరందరూ ప్రాతఃస్మరణీయులే కదా! ఎందుకో తెలుసా! వీరు దేహాల నుండి పుట్టి ఉండవచ్చు. కాని, వీరిది దేహ సంబంధం కాదు, దైవ సంబంధము. వీరు దేహములతో ముడిపడిన వారు కారు. దేవుడితో ముడిపడి ఉన్నవారు. దేవుడికి సంబంధించిన వారు ***(యత స్తదీయాః).***

***(చండాలోఽపి ద్విజశ్రేష్ఠః హరిభక్తి పరాయణాత్***- హరిభక్తి కలిగిన పుణ్యాత్ముడు చండాలుని గృహంలో పుట్టినా అతడు బ్రాహ్మణ శ్రేష్ఠుడే అన్నది శాస్త్రం.

స్త్రీ వైశ్య శూద్రులు అని ప్రత్యేకించి చెప్పడంలో భక్తిలో భేదం అవాంఛనీయము అని తెలియ జేయడమే ఉద్దేశ్యము. వైశ్య శూద్రులు అని చెప్పడం జాతి భేదాన్ని సూచిస్తూ ఉంది. లింగ భేదానికి సూచకంగా స్త్రీలు చెప్పబడ్డారు. గుణ భేదానికి పాప జన్మలు ఉదహరింప బడ్డారు. జాతి భేదంతో లింగ భేదంతో, గుణ భేదంతో సంబంధం లేకుండా కేవలం భక్తియే ముక్తికి ప్రధాన అర్హత అని చెప్పడమే భగవంతుని ఉద్దేశ్యము. ఎవరైనా సరే, భక్తి ద్వారా తనను ఆశ్రయించి తరించి పోవచ్చు అనేదే భగవంతుని హృదయం.

పురుషులతో సమానంగా శాస్త్ర చర్చలలో, సంధ్యావందనాది క్రియలలో స్త్రీలకు అవకాశ మిచ్చి, 'మాతృదేవో భవ!' అని స్త్రీ మూర్తిని దైవ సమానంగా చూచిన భారతీయ సంస్కృతిలో స్త్రీది పాపజన్మ అని ఎవ్వరైనా అనగలరా? స్త్రీయే గనుక పాపజన్మ ఎత్తి ఉంటే, ఇక పాపులు కాని వారెవరు? ఎవరు జన్మించినా, స్త్రీ

నుండే కదా జన్మించాలి! స్త్రీ పాపి అయితే, స్త్రీ నుండి పుట్టిన వారు ఎలా పాపులు కాకుండా పోతారు? అందరూ పాపులే. అది కూడా జన్మత: పాపులే. ఇది హిందూ ధర్మమేనా? ఆర్ష సంస్కృతేనా? ఆలోచించండి. పునాదులే కదిలి పోతాయి. పరమతాలు పీఠ మెక్కుతాయి.

ప్రాచీన కాలంలో మాతృమూర్తులు యజ్ఞోపవీతమును ధరించి, సంధ్యావందన, గాయత్రీ జపాదులు ఆచరించే వారని శాస్త్ర ప్రమాణాలు అనేకం ఉన్నాయి. ఈ విషయాన్ని రామాయణంలో కూడా మనం చూడవచ్చు.

సీతమ్మ తల్లిని అన్వేషిస్తూ హనుమంతుడు అశోకవనం లోకి ప్రవేశిస్తాడు. అశోకవనంలో తిరుగుతూ అక్కడ ఒకచోట నదీ ప్రాంతాన్ని చూస్తాడు. అందమైన ఆ ప్రదేశంలో కొంత సేపు ఆగి, సీతమ్మ గనుక బ్రతికే ఉంటే ***(యది జీవతి సా దేవీ)*** పవిత్ర జలాలు గల ఈ నది వద్దకు తప్పకుండా వస్తుంది ***(ఆగమిష్యతి సావశ్యం ఇమాం శివ జలాం నదీమ్)*** అనుకుంటాడు. ఇంకా ఏమనుకుంటాడో చూడండి!

***సంధ్యా కాలమానాః శ్యామా ధ్రువ మేష్యతి జానకీ ।***
***నదీం చేమాం శుభ జలాం సంధ్యార్థే వరవర్ణినీ ॥***

'సంధ్యా సమయాన పవిత్ర జలాలు కలిగిన ఈ నది చెంతకు సంధ్యా వందనమును ఆచరించడానికి జానకీదేవి రావచ్చు' అనుకుంటాడు. దీనిని బట్టి రామాయణ కాలంలో కూడా స్త్రీలకు సంధ్యా వందనాది ఉపాసనలు, గాయత్రీ మంత్రాది జపాలు, యజ్ఞోపవీత ధారణలు ఉన్నాయని స్పష్ట మవుతూ ఉంది. మైత్రేయికి యాజ్ఞవల్క్య మహర్షి బ్రహ్మవిద్యను ఉపదేశించినట్లు బృహదారణ్యక ఉపనిషత్తు కూడా చెబుతూ ఉంది.

**సత్యకామ జాబాలి**

సత్యకాముని తల్లి జాబాలి. ఒకనాడు సత్యకాముడు తల్లిని సమీపించి, 'అమ్మా! నేను బ్రహ్మచారిని కావా లనుకుంటున్నాను. అమ్మా! నా కుల మేమిటి? గోత్ర మేమిటి?' అని అడిగాడు.

'నాయనా! సత్యకామా! ఆ విషయం నాకే తెలియదు. నేను యౌవనములో దాసీవృత్తిలో జీవించాను. అనేక చోట్ల తిరిగాను. ఆ సమయం లోనే నిన్ను ప్రసవించాను. నీ కుల మేదో నా కెలా తెలుస్తుంది నాయనా! నీ పేరు సత్యకాముడు కదా! నా పేరు జాబాలి. కనుక, నీవు సత్యకామ జాబాలి వని చెప్పుకో!' అన్నది తల్లి.

తల్లి చెప్పినట్లే, గురుదేవు డైన గౌతమ మహర్షికి సత్యకాముడు విన్నవించి, తనకు బ్రహ్మవిద్యను ఉపదేశించ మని అర్థించాడు. ప్రార్థించాడు.

ఉపనయనము లేనివాడు బ్రహ్మవిద్యకు అధికారి ఎలా అవుతాడు? అందుచేత, ముందుగా గౌతముడు సత్యకామునకు ఉపనయన సంస్కారము చేసి, ఆ తరువాత బ్రహ్మవిద్యోపదేశం చేశాడు.

సత్యకాముడు శూద్రుడే కదా! మరి, గౌతమ మహర్షి అతనికి ఉపనయన సంస్కారము ఎలా చేశాడు? పైగా బ్రహ్మవిద్యను ఉపదేశించాడు కూడా. ఇదేమి కాకమ్మ కథ కాదు. ఉపనిషత్తు. మహత్తర మైన ఛాందోగ్య శ్రుతి.

శూద్రుడు, జాబాలి కుమారుడైన సత్యకామునిలో అనర్హత లేదని నిర్ణయించిన తరువాతే కదా గౌతమ మహర్షి ఉపనయన సంస్కారాన్ని చేయుటకు సిద్ధ పడ్డాడు! ఉపనిష ఛ్రుతిపాదిత మైన ఈ సత్యాన్ని బ్రహ్మసూత్రము ధృవ పరచింది.

**సూ॥ తదభావ నిర్ధారణే చ ప్రవృత్తేః** *(బ్రం. సూ. 1 - 3 - 37)*





దోషము లేదని నిర్ణయించిన తరువాతే గౌతముడు సత్యకామునికి ఉపనయనం చేయించాడు అన్నది బ్రహ్మసూత్రము.

తల్లి యొక్క చరిత్రను దాచుకోకుండా ఉన్నదున్నట్లు సత్యకాముడు గౌతమునికి చెప్పాడు. సత్యం పలికిన కారణంగా సత్యకాముని అధికారిగా గుర్తించాడు గౌతమ మహర్షి. అంతేగాని, జన్మను చూచి నిరాకరించ లేదు. ప్రస్థానత్రయంలో ఉపనిషత్తు, బ్రహ్మసూత్రాలు శూద్రులకు అనర్హతను సూచించ నపుడు భగవద్గీత సూచిస్తుందా? విజ్ఞులు అర్థం చేసుకోగలరు.

శ్రీ శంకరాచార్య స్వామి కూడా తమ మాండూక్యకారికా భాష్యంలో *(4 - 95)* పుట్టుక లేనిది, వినాశము ఎరుగనిది, సమమైనది అయిన బ్రహ్మ విషయము నందు సునిశ్చిత మైన శ్రద్ధ కలవారు స్త్రీలు కనుక బ్రహ్మ విద్యార్జన చేసి పరమార్థమును పొందుతారు అని వ్యాఖ్యానించారు.

ఇలా ఎన్నో చెప్పుకు పోవచ్చు. కాని ఇంతవరకు చాలని భావిస్తున్నాను. దారి తప్పే అవకాశం ఉందని అభిప్రాయ పడటం వల్లనే సందేహ నివారణార్థం ఈ విషయాలను మీ ముందు ఉంచాను. అంతే.

*పరమాత్మను ఆశ్రయించి దురాత్ములు, పాపాత్ములే తరించి పోతూ ఉంటే, ఇక పుణ్యాత్ముల విషయం ప్రత్యేకంగా చెప్పేది ఏముంటుంది? అది కూడా చెబుతున్నాడు. అంతే కాదు. జగత్తు అనిత్యం కనుక జగన్నాథుని ఆశ్రయించి తరించ మంటున్నాడు.*

**కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా ।**
**అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్ ॥** **33**

***కిం-పునః-బ్రాహ్మణాః-పుణ్యాః-భక్తాః-రాజర్షయః-తథా***
***అనిత్యం-అసుఖం-లోకం-ఇమం-ప్రాప్య-భజస్వ-మాం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పుణ్యాః | = | పుణ్యాత్ము లైనట్టి | అసుఖం | = | సుఖము లేనిది |
| భక్తాః | = | భక్తు లైనట్టి | ఇమం | = | ఈ |
| బ్రాహ్మణాః | = | బ్రాహ్మణులు | లోకం | = | లోకమును |
| తథా | = | అటులే | ప్రాప్య | = | పొంది |
| రాజర్షయః | = | రాజర్షులు | మాం | = | నన్ను |
| కిం పునః | = | వేరుగా చెప్పాలా? | భజస్వ | = | భజింపుము |
| అనిత్యం | = | నిత్యము కానిది | | | |

**పార్థా! పుణ్యాత్ములు, భక్తులు అయిన బ్రాహ్మణులు, రాజర్షుల విషయం ఇక ప్రత్యేకంగా చెప్పే దేముంటుంది? ఈ ప్రపంచం నిత్యం కాదు. ఇందులో సుఖం లేదు. నన్ను సేవించి తరించిపో!**

**వ్యాఖ్య**

**అర్హులకే అందలము**

అధికు లైనా, అధము లైనా, పుణ్యాత్ము లైనా, పాపాత్ము లైనా అందరి మార్గము ఒక్కటే. అందరి గమ్యమూ ఒక్కటే. పుణ్యులైనా, అపుణ్యు లైనా భక్తి చేయ వలసిందే. ముక్తిని పొందవలసిందే. ఎవరు ఎలా జన్మించినా అందరూ భక్తి చేయవలసిందే.

పాప యోనుల యందు జన్మించిన వారైనా, పరమార్థ తత్త్వాన్ని అర్థం చేసుకొని పురుషార్థాన్ని సాధించుకొనే

శక్తి లేని వారైనా - అందరూ భక్తి మార్గంలో పయనించి, పరమేశ్వరుని కృపను పొంది ఎలా కృతార్థు లవుతున్నారో పూర్వ శ్లోకంలో చూశాం. ఇక దుర్లభమైన ఆ అవకాశాన్ని అంది పుచ్చుకొని జన్మించిన వారి విషయం ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు. వారే పుణ్యాత్ము లైన జననీ జనకులకు పుట్టిన వారు ***(పుణ్య యోనయః)***, పుణ్యఫలం కల వారు ***(పుణ్యాః)***, భక్తులైన వారు ***(భక్తాః)***. బ్రాహ్మణులు, రాజర్షులు ఆ కోవకు చెందిన వారే.

పుణ్య యోనులు అని ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, సంప్రదాయమును పాటించే కుటుంబాలలో జన్మించిన వారికి బాల్యము నుండే భక్తి శిక్షణ, ఆచార వ్యవహారాల యందు భగవద్భావన ఏర్పడుతూ ఉంటాయి. గత జన్మలలో తయారు చేసుకున్న కొద్దిపాటి పుణ్యంతో పుణ్యాత్ములైన తల్లిదండ్రులకు జన్మించడమే గాక, తెచ్చుకున్న పుణ్యాన్ని హెచ్చుగా పెంచుకొనే అవకాశాన్ని ఇచ్చే ప్రదేశాలలో ఆవిర్భవించడం చేత, చిత్త శోధన, ముక్తి సాధన వారికి సులభ మవుతాయి. అందుకనే, భక్తవత్సలు డైన పరమేశ్వరుని అనుగ్రహంతో దురాచారవంతులే తరించి పోతూ ఉంటే, ఇక ఇలాంటి పుణ్యాత్ములను గురించి చెప్పే దేముంది ***(కిం పునః)***? అంటూ ప్రస్తుత శ్లోకాన్ని ప్రారంభిస్తున్నాడు గీతాచార్యుడు.

పుణ్యము గల వారు, భక్తులు అయిన బ్రాహ్మణులు ***(బ్రాహ్మణాః పుణ్యాః భక్తాః)***, అలాగే పుణ్యము, భక్తి గల రాజర్షులు - ఋషులైన రాజులే రాజర్షులు ***(రాజర్షయః రాజానః చ తే ఋషయశ్చ ఇతి రాజర్షయః)*** - వీరి విషయం ప్రత్యేకంగా చెప్పే దేముంది ***(కిం పునః)***? అంటున్నాడు. బ్రాహ్మణు లైనా, రాజులైనా, భక్తులై ఉండాలి అనేదే ఇక్కడ ప్రధానమైన విషయం. అంతేగాని, జాతి ప్రధానం కాదు. పరమార్థ జ్ఞానము పూర్వము రాజర్షులు గ్రహించే వారు అని నాల్గవ అధ్యాయంలో చెప్పాడు కూడా *(4 వ అ - 2 వ శ్లో)*.

పూర్వ శ్లోకంతో ఈ శ్లోకాన్ని సమన్వయం చేసుకొని అర్థం చేసుకుంటే, సర్వులూ సర్వేశ్వరుని దృష్టిలో సమానులే. జాతి భేదం, లింగ భేదం, గుణ భేదం, పుణ్యాపాప ఫల భేదం - ఇవన్నీ ప్రక్కన పెట్టి కేవలం భక్తి చేతనే ఆనంద మార్గంలో సాగి పోవచ్చు. భక్తి చేసే వారిలో భేదాలు లేవు అని పూర్వ శ్లోకం లోనే తెలుసుకున్నాం. కనుక, భక్తు లందరిపై పరమేశ్వరుని అనుగ్రహం సమానంగా ఉంటుంది. నువ్వు ఎక్కడ జన్మించావు? నువ్వెవరు? అని భగవంతుడు చూడడు. నువ్వు ఎలా ఉన్నావు? అనేదే చూస్తాడు. భక్తిలో ఉన్నావా, లేదా? అనేదే పరిగణిస్తాడు. భక్తులైన వారిపై సమానంగా కృప జూపి రక్షించే భగవంతుడు, భక్తి భావాన్నే చూస్తాడు. భౌతిక స్థితి గతులను కాదు.

***అన్తస్థ భావ భోక్తా యతోఽ న్తరాత్మా యథా మహా మేఘః।***
***ఖధిర శ్చమ్పక ఇతి వా ప్రవర్షణే కిం విచారయతి॥***

ఒక పెద్ద మేఘము వర్షించు నపుడు, అంతటా కుండపోతగా కురుస్తుందే గాని, ఇది చంద్ర చెట్టు, అది సంపెంగ చెట్టు అని చూస్తుందా? అంతరాత్మ అంతరంగము నందలి భావమును చూచి కరుణించే వాడు కనుక, భక్తు లందరిపై సమంగా ఆయన కృపను వర్షిస్తాడు.

**విశ్వ వంతెన**

పరమేశ్వరుని పొందడానికి భక్తి ఒక్కటే అర్హత గాని జాతి కాదని తేలి పోయింది ***(భక్త్యధికారే జాతి నియమః నాస్తి*** - ఆనందగిరి). ఇక ఆలస్య మెందుకు? భక్తియే మన కర్తవ్యం. కాళ్ళ మీద మనిషి నిలబడ వచ్చు. కాని, మనిషికి కాళ్ళు ఉండేది నడవడానికే గాని, ఒకచోట నిలబడటానికి కాదు. నడిచే సమయంలో, నడవ వలసిన కాలంలో నడక మాని నిద్రిస్తే, రేపు కళ్ళు తెరచి నడవాలి అనుకున్నప్పుడు నడవ లేని పరిస్థితి రావచ్చు.

ప్రపంచము అనిత్యము. దానిలో సుఖం అల్పం. స్వల్పం. అందుకే దానిని లోకం అన్నారు. ***లోక్యతే***





***ఇతి లోకః*** - చూడబడుతూ ఉంది కనుక ఈ ప్రపంచాన్ని లోకం అన్నారు. చూడబడేది దృశ్యం. దృశ్యం ఏదైనా అనిత్యమే. వికారమే. వినాశమే. ఈ లోకం క్షణభంగురం. మృత్యుగ్రస్తం.

నదిపై నిర్మించిన వంతెన నదిని దాటేందుకే గాని, ఇల్లు కట్టుకొని నివసించేందుకు కాదు. విశ్వము అనే వంతెన జీవన నదీ ప్రవాహాన్ని దాటేందుకే గాని స్థిరంగా పీట వేసుకొని కూర్చునేందుకు కాదు. అందరూ దాట వలసిన వారే. ఉండి పోవాలి అనుకునే వారు మోసపోతారు.

**శోకమయము లోకము**
**అనుభవించుటే మానవ జన్మము**
**ఆశించడము నిరాశ చెందటము**
**గుండెలు పిండుతు బ్రతకటము**
**లోకము కాదు స్థిరవాసము**
**సొంతము తెలియుట శాంతము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

లోకము అనిత్యమే కాదు, అసుఖం కూడా ***(అనిత్యం అసుఖం లోకం)***. అసుఖ మంటే సుఖం అసలే లేదని కాదు. అల్పంగా ఉంది అని అర్థము. అందుకే 'నసుఖం' అనకుండా 'అసుఖం' అన్నాడు. అల్ప మనేది కూడా ఒక సుఖమేనా? అందుకనే ఉపనిషత్తు, ***నాల్పే సుఖమస్తి, భూమావై తత్సుఖం*** - అల్ప మైనది ఒక సుఖం కాదు. అనంత మైనదే సుఖం అన్నది. అదే పూర్ణ సుఖం. పరమాత్మ వద్ద లభించే సుఖం. విశ్వ వంతెన దాటి చేరవలసిన శాంతి తీరము.

లోకము అంటే రెండర్థాలు. చూడబడే దృశ్యమాన జగత్తు అనేది ఒక అర్థం ***(లోక్యతే ఇతి వా)***. చూపిస్తూ ఉంది కనుక లోకము అని మరొక అర్థం ***(లోకయతి ఇతి లోకః)***.

ఈ కోణం నుండి 'లోకము' అనే దానిని అర్థం చేసుకొంటే, లోకానికి ప్రపంచము అని ఒక అర్థము. దేహము అని మరొక అర్థం.

లోకము చూడబడుతూ ఉంది కనుక దృశ్యమై నశించి పోతుంది ***(లోక్యతే)*** కనుక అది అనిత్యము. కాని, అనిత్యమైన లోకము నిత్యమైన దానిని చూపిస్తూ ఉంది ***(లోకయతి)***. 'అనిత్యమైన నన్ను విడిచిపెట్టి నిత్యుడైన పరమేశ్వరుణ్ణి పొంది తరించు' అని మార్గాన్ని నిర్దేశిస్తూ ఉంది.

అలాగే 'లోక' శబ్దము దేహమునకు కూడా వర్తిస్తుంది. దేహము కూడా కనిపిస్తూ ఉంది ***(లోక్యతే)***. అలాగే అనిత్యమైన దేహము నిత్యమైన దానికి మార్గాన్ని తెలుపుతూ ఉంది ***(లోకయతి)***. 'నేను ఎలాగూ శాశ్వతం కాను. జన్మ మృత్యు జరావ్యాధులతో నిండి ఉన్నాను *(13 వ అ - 8 వ శ్లో)*. కనుక, నిన్ను ఈ జరామరణాల నుండి విడిపించే *(7 వ అ - 29 వ శ్లో)* పరమేశ్వరుని భక్తితో ఆశ్రయించి తరించు' అని చెబుతూ ఉంది. ఆ కార్యాన్నే మనం ప్రారంభిస్తే, తాను సహకరిస్తూ ఉంది కూడా.

నావ చెడక ముందే తీరాన్ని చేరే వారు ధన్యాత్ములు. దేహ మనే నావ ఎక్కడో ఒక చోట, ఏదో ఒక సమయంలో మునిగి పోయేదే. కనుక మునగకుండా క్షేమంగా జీవన నదిని దాటించే నౌక భక్తి నౌక. దానిని ఆశ్రయించి తరించి పోవాలి. అందుచేతనే, అర్జునా! అనిత్యము, సుఖవర్జితము అయిన లోకాన్ని పొంది ఉన్నావు

(దేశము, దేహము కూడా). ఆలస్యానికి ఇది సమయం కాదు. లే! రేపు చేద్దాము అనుకోకు. రేపు చేసేది నేడే చేసేయ్! (*శ్వః కార్యం అద్య కుర్వీత* (కర్తవ్యం)).

**జ్ఞానమె నీ నావ - ధన్యము నీ త్రోవ**
**సంసార జలధిలో మేలైన నావ** ॥ జ్ఞానమె ॥
**నమ్మినవారికి - చల్లని యానము**
**నడిచే వారికి - విలువైన నెలవైన తీరము** ॥ జ్ఞానమె ॥

రేపుకు రూపు ఉంటుందో లేదో! ప్రారంభించు. భక్తిని ఆరంభించు (*మాం భజస్వ సేవస్వ*) అంటున్నాడు భగవంతుడు.

*మరి భగవంతుని ఎలా సేవించాలి? చదవండి.*

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మా మే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥ 34

**మన్మనా-భవ-మద్భక్తః-మద్యాజీ-మాం-నమస్కురు**
**మాం-ఏవ-ఏష్యసి-యుక్త్వా-ఏవం-ఆత్మానం-మత్పరాయణః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మన్మనా | = | నా యందే మనస్సు గల వాడివి | ఏవం | = | ఇట్లు |
| భవ | = | కా! | ఆత్మానం | = | ఆత్మను |
| మద్భక్తః | = | నాకు భక్తుడవు | యుక్త్వా | = | నియోగించి |
| మద్యాజీ | = | నన్నే పూజించు వాడవు | మత్పరాయణః | = | నా యందు మనస్సు గల వాడవై |
| భవ=కా! | | | మాం ఏవ | = | నన్నే |
| మాం | = | నన్నే | ఏష్యసి | = | పొందుతావు |
| నమస్కురు | = | నమస్కరించు | | | |

**అర్జునా! నీ మనస్సును నా యందే ఉంచు. నా భక్తుడివి గా! నన్నే పూజించు. నాకే నమస్కరించు. నేనే పరమ గతి అని భావించు. నా లోనే చిత్తాన్ని నిలుపు. చివరగా నన్నే తప్పక పొందుతావు.**

**వ్యాఖ్య**

రాజవిద్యా - రాజగుహ్యాము అయిన తొమ్మిదవ అధ్యాయములో ఇది చివరి శ్లోకం. ఈ అధ్యాయం పీఠిక లోనే మనం సుదీర్ఘంగా చర్చించు కున్నట్లు, ఏడవ అధ్యాయమైన విజ్ఞాన యోగము ఆరంభంలో ప్రారంభమైన 'జ్ఞాన విజ్ఞాన సహిత'మైన భగవద్విషయం ఈ తొమ్మిదవ అధ్యాయము నందు ప్రస్తుత శ్లోకం వద్ద సమాప్త మవుతూ ఉంది. అర్జునుని ప్రశ్నల కారణంగా ఎనిమిదవ అధ్యాయము ఒక ప్రత్యేక విషయాన్ని ప్రస్తావించినా, ఏడవ అధ్యాయములో ప్రవాహ రూపమున సాగుతూ ఉండిన జ్ఞాన విజ్ఞాన ప్రసంగమును తొమ్మిదవ అధ్యాయారంభం లోనే తిరిగి అంది పుచ్చుకొని అధ్యాయాంతంలో సమాప్తం చేస్తున్నాడు.

ఇది మహైశ్చర్యకర మైన అధ్యాయము. **పశ్యమే 'యోగమైశ్వరమ్'** అంటూ మహేశ్వరుని ఐశ్వర్యాన్ని మహాద్భుతంగా ప్రవచించిన అధ్యాయము. మహిలో మహిమను చూపెడుతూ, మహి లోనే మాణిక్యముల వంటి మహాత్మ్యల్ని వెలికి తీసి కీర్తించిన అధ్యాయము. ***'మయా తత మిదం' సర్వం*** అంటూ మహిమాన్విత మైన స్వరూపాన్ని బుద్ధికి పట్టించిన అధ్యాయము. మర్మాన్ని బట్టబయలు చేసి మాయను తుద ముట్టించిన





అధ్యాయము. 'భంభం' అంటూ మహా ప్రతిజ్ఞా వాక్యాన్ని మిన్ను ముట్టేలా వినిపించిన అధ్యాయము. చివరగా, మహిమను, మంగళమును జోడించి మత్ శబ్దము చేత ఈశ్వరత్వ ప్రకటనంతో దివ్యంగా ముగిసిన అధ్యాయము. *భగనీశార్చనం జన్మ* - భగవంతుని అర్చించని జన్మ వ్యర్థము అన్నది శాస్త్రం.

**మన్మనా భవ**

అర్జునా! నా యందే మనస్సు నుంచిన వాడివి కా! ***(మయి మనః యస్య త్వం మన్మనాః భవ).*** ఏది మనకు ప్రియమో దాని వైపుకే మనస్సు ఆకర్షింప బడుతూ ఉంటుంది. ఒకరికి ప్రియ మైనది మరొకరికి ప్రియం కాక పోవచ్చు. ఎవరికి ఏది ప్రియ వస్తువో దాని వైపే మనస్సును సారిస్తూ ఉంటారు. కాని, ఏదో ఒక సమయంలో, లేదా తరచుగానో అందరూ వారి వారి మనస్సుల్ని భగవంతుని వైపుకు కూడా త్రిప్పుతూ ఉంటారు.

భగవంతుని ఆశ్రయించే వాళ్ళందరూ భక్తులే. కాకపోతే, వాళ్ళు ఎందుకు ఆశ్రయిస్తున్నారు? అనేదే ప్రశ్న. భగవంతుని ఆశ్రయించుకొనే భక్తులు రెండు రకాలుగా ఉంటారు. మొదటి వారు అర్థకామాలను సాధించు కొనేందుకు ఆశ్రయించే వారు. ప్రాపంచికంగా వారు ఆశించేది పొందడానికి వారి శక్తి సరిపో నపుడు, నిస్సహాయులుగా మిగిలి నపుడు, మరొకరు సహకరించే అవకాశం లేనపుడు, ఆ కోర్కెలను ఫలప్రదం చేసుకోవడానికి పరమేశ్వరుని ఆశ్రయిస్తారు. ఇలాంటి వారు నిత్య భక్తులు కారు. కాని, పరమేశ్వరుని ఆశ్రయిస్తూ ఉన్నారు కనుక వారూ భక్తులే. వారి భక్తి అవసరాలు తీరే వరకే ఉంటుంది. వాళ్ళు మళ్ళీ భక్తి చేయాలి అంటే వాళ్ళకు మళ్ళీ అవసరాలు రావాలి.

రెండవ వారు నిత్య భక్తులు. వారికి అర్థకామాల స్పృహే ఉండదు. వాళ్ళు భగవంతుణ్ణి మరొక దాని కొరకు కాకుండా భగవంతుని కొరకే ఆశ్రయిస్తారు. మోక్షార్థమే భక్తి చేస్తారు. ***మనో మోక్షే నివేశయేత్*** - వారి మనస్సు మోక్షమునే లక్ష్యంగా కలిగి ఉంటుంది అని స్మృతి వాక్యము. నిత్య భక్తులు ఎవరిని ఆరాధించినా ఈశ్వర భావనే కలిగి ఉంటారు. ***తదేవాగ్నిః తద్వాయుః తత్సూర్యః తదు చంద్రమాః*** - సర్వ దేవాత్మకు డైన పరమేశ్వరునే సర్వ దేవతల లోను దర్శిస్తారు. ప్రస్తుతం ***మన్మనా భవ!*** అని భగవంతుడు ఆదేశించడంలో నిత్యభక్తితో పరమేశ్వరునే ఆశించి భక్తి చేయాలని అర్థము.

**మద్భక్తో భవ**

మనస్సును పరమేశ్వరుని యందు ఉంచినట్లే, మనస్సు లోని ప్రేమను కూడా పరమేశ్వరుని వైపే సాగించాలి. ***సా త్వస్మిన్ పరమ ప్రేమరూపా*** - భగవంతుని యందు ఉత్కృష్ట మైన ప్రేమను కలిగి ఉండటమే భక్తి. అనిత్యాలను ప్రేమించడం కాకుండా, నిత్యుడైన పరమేశ్వరునే ప్రేమించాలి. అదే భగవద్భక్తి. భక్తి ఉంటే చాలు. పూర్వ శ్లోకాలలో మనం చెప్పుకున్నట్లు జాతి భేదాలు, గుణ భేదాలు, లింగ భేదాలు లేకుండా కేవలం భక్తి తోనే భగవంతుని చేరి పోవచ్చు. కనుకనే భక్తి ఉత్కృష్ట మైంది.

రైలులో ప్రయాణం చేసి గమ్యం చేరాలంటే టిక్కెట్టు ఉండాలి. మరో అర్హత అవసరం లేదు. ధనికు డైనా, దరిద్రుడైనా, స్త్రీ అయినా, పురుషుడైనా, ఆరోగ్యం ఉన్నా, లేకపోయినా, దొంగ అయినా, దొర అయినా - ప్రయాణం చేయడానికి టిక్కెట్టు ఒక్కటే ప్రధానం. మరేవీ కావు. అలాగే, ముక్తిని పొందడానికి భక్తియే అర్హత గాని మరొకటి కాదు. అందుచేత ***మద్భక్తో భవ*** - అర్జునా, నా భక్తుడివి కా! అంటున్నాడు.

**మద్యాజీ భవ**

భగవంతుని పూజించడమే యజనము. భగవత్పూజ యందు అనురాగమును కలిగి ఉండటమే

యజనము. అది కూడా భక్తి కార్యమే ***(పూజాదిషు అనురాగః).*** పూజాగదిలో పరమేశ్వరుని ఆరాధించడం అంతరంగ సాధన అయితే, నిత్యము వ్యవహారాది కార్యాలలో ధర్మబద్ధంగా జీవించడము బహిరంగ సాధన. కనుకనే, సదా నన్ను పూజిస్తూ జీవించు అంటున్నాడు ***(మద్యజన శీలః భవ).*** ఈ విధమైన సాధనల ద్వారా భగవంతునితో ఏర్పడే నిత్య సంబంధం ఫలితంగా ***అహం***ను తొలగించుకొని ***త్వం*** ఒక్కటే ఉందని గ్రహించి, **త్వమేవ ప్రత్యక్షం మమ దేవ దేవ** - అంటూ సమస్తములో సర్వేశ్వరుని దర్శించి తన్మయం కావడమే నమస్కారము.

**మాం నమస్కురు భవ**

నాకే నమస్కరిస్తూ సాగిపో! అంటున్నాడు చివరగా ***(మాం మా మేవ నమస్కురు).*** ఇది వందన భక్తి. ***అహం*** ***త్వం*** తో ఏకం కావడమే నమస్కారము. ***త్వం తత్***తో ఏకం కావడమే నమస్కారము. ద్వైతము అద్వైతంగా శోభించడమే నమస్కారము. రెండిటిని ఏకం చేయడమే నమస్కార వైశిష్ట్యము. అదే రెండు చేతులను ఒకటి చేయడం లోని అంతర్భావం. నది సాగరంలో విలీన మైనట్లు, సాధకుడు సాధ్యములో విలీనమై సిద్ధ స్వరూపంగా భాసించడమే నమస్కారము.

పరమేశ్వరా! నీకు నమస్కరిస్తూ సాగిపోయే నా బ్రతుకు ఎప్పుడూ దారి తప్పదు. ఎక్కడా ఆగిపోదు. నిరంతరం సాగుతూనే ఉంటుంది. నిన్నే దర్శిస్తూ సాగిపోతూ ఉంటుంది. నడిచే శక్తి నీదే. నడిపే శక్తి నీదే. కదిలింది నీ లోనే. కడకు చేరేది నిన్నే. మధ్యలో నా దేముంది? ***నమః*** - నమస్కారము. ***మ*** నాది ***న*** లేదు. ఇదే నమస్కారము.

నేను లేను. అతడు లేడు. ఆమె లేదు. అలా చూస్తే ఎవ్వరూ లేరు. అందరిలో నీవే ఉన్నావు. అందరిలో దివ్యంగా శోభించే ఆత్మవు నీవే ***(సర్వేషాం భూతానామ్ ఆత్మా, పరా చ గతిః).*** నీవే పరమగతివి. పరాయణుడవు.

**పరాయణుడు**

జీవులకు ఉత్తమ మైన గమ్యము పరమేశ్వరుడే కావడం చేత ఆయన పరాయణుడు ***(పరమ్ అయనమ్ పరాయణమ్).*** ***పరం*** అంటే ఉత్కృష్ట మైన స్థానము. సర్వులు చివరగా పొంద వలసిన పరమ గమ్యము. ప్రపంచంలో ఎన్నో గమ్యా లున్నాయి. వాటికి సంబంధించిన గమనాలూ ఉన్నాయి. ఇది అలాంటి గమ్యము కాదు. దేనిని చేరిన తరువాత తిరిగి రావడ మంటూ ఉండదో అట్టి పరంధామ మిది ***(యద్గత్వా న నివర్తన్తే*** - *15వ అ - 6 వ శ్లో).* అది పరంధామము. పరమేశ్వరుని ధామము. జీవు లందరికి గమ్య స్థానము తానై నందున పరమేశ్వరుడు పరాయణుడు.

పవిత్రమైన భక్తి సాధనను అద్భుతంగా వర్ణించిన ఈ చివరి శ్లోకమును చక్కగా అర్థం చేసుకుంటే, అసమానమైన ఈ అపూర్వ సేవనము సాధకుని బ్రతుకును భక్తిమయంగా మార్చేస్తుంది. భగవన్మయంగా తీర్చి దిద్దుతుంది. ఈ దివ్యారాధనలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము - అన్నీ పూజోపకరణాలుగా మారి పోతాయి. అదే ఈ శ్లోకం లోని వైశిష్ట్యము.

***విలిఖిత మివ రూపం చిత్త భిత్తౌ మురారేః సుమన ఇవ మనో యై రర్పితం తత్పదబ్జే।***
***ప్రతిపద ముదయద్భిః సాత్త్వికై రఙ్కితా ఙ్గాస్త ఇహ భవ పయోధేః పారముల్లఙ్ఘయన్తి॥***

పవిత్రులైన భక్తులు ధన్యజీవులు. వారి చిత్తము అనే గోడ మీద (భిత్తిక) మనోహరమైన మురళీకృష్ణుని రూపము చిత్రము వలె లిఖింపబడి ఉంటుంది. ఆ దివ్య రూపము యొక్క పాదారవిందముల చెంత మృదు



మధుర భావ పరిమళాలను వెదజల్లే మనస్సనే పుష్పము సమర్పింపబడి ఉంటుంది. ప్రతిక్షణము అట్టి ఆత్మానంద పారవశ్యంలో మునిగి తన్మయులై ఉన్న ఆ భక్తులలో కలిగే భక్తి భావ స్ఫోరకము లైన గద్గద స్వరం, రోమాంచ ఆనంద బాష్ప విశేషముల చేత వారి దేహము అలంకరింపబడి ఉంటుంది. అట్టి మహాత్ములైన భక్తులు సంసార సాగరాన్ని దాటి ముక్తు లవుతారు. సర్వ జీవుల ఏకైక గమ్యమైన ఆ పరంధాముని పొంది తరిస్తారు అని అర్థము.

ఏడవ అధ్యాయం - విజ్ఞాన యోగంలో విజ్ఞాన సహితమైన జ్ఞాన ప్రసంగమును ప్రారంభిస్తూ, మొదటి శ్లోకం లోనే, ***యోగం యుంజన్ మదాశ్రయః*** - నన్నే ఆశ్రయించుకొని యోగ సాధనను ఆచరించ మని చెప్పాడు ***(యోగం యుంజన్ మనః సమాధానం కుర్వన్, మదాశ్రయః అహమేవ పరమేశ్వరః ఆశ్రయః).*** అక్కడ ప్రారంభించిన జ్ఞాన విజ్ఞాన ప్రబోధాన్ని తొమ్మిదవ అధ్యాయాంతంలో, ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న శ్లోకం వద్ద సమాప్తం చేస్తూ, ***యుక్త్వైవం*** - ఈ విధంగా నా యందే మనస్సును నిలిపి ***(ఏవం యుక్త్వా)*** ఆత్మ నైన నన్నే పొందుతావు ***(ఆత్మానమ్ మామేవ ఏష్యసి)*** అని సమాప్తం చేశాడు. ఏడవ అధ్యాయం మొదటి శ్లోకంలో మనల్ని సాధనలో కదిలించాడు. తొమ్మిదవ అధ్యాయం చివరి శ్లోకంలో, ఇంతదూరం ప్రయాణించి వచ్చిన మనల్ని సాధ్యరూపుడైన తనలో కలుపు కున్నాడు. అక్కడ అధ్యాయారంభంలో మన సాధన ప్రారంభం. ఇక్కడ అధ్యాయ సమాప్తంలో మన యాత్ర పరిసమాప్తం. ఇది కూడా రాజవిద్యలో రాజగుహ్యమే. ఎన్నిసార్లు చదివినా, ఎన్నిసార్లు ప్రవచించినా, నిత్య నూతనంగా భావసుమాలను విరబూయించి నవత్వంతో శోభించే నవమాధ్యాయము.

*శ్లో॥ నిజమాశ్చర్య మైశ్వర్యం భక్తే శ్చాద్భుత వైభవమ్।*
*నవమే రాజ గుహ్యాఖ్యే కృపయాఽ వో చ దచ్యుతః॥*

అద్భుతమైన ఈశ్వర స్వరూప వైభవమును, ఆశ్చర్యకర మైన భక్తి ప్రాభవమును రాజగుహ్యా మనే పేరుతో శోభించే ఈ తొమ్మిదవ అధ్యాయంలో భక్తులకు అనుగ్రహ ప్రసాదంగా అచ్యుతుడు పంచి పెట్టాడు.

అధ్యాయము ఎంత అద్భుతమో, అధ్యాయం లోని విషయము అంత అసమానము. ఇక చివరి శ్లోకం అంటారా! అది ముకుందునికే ముద్దొచ్చే శ్లోకం. లేకపోతే ఒకే శ్లోకాన్ని గీతలో రెండుసార్లు చెబుతాడా? ఏ శ్లోకాన్ని గీత పూర్వార్థం, అంటే తొమ్మిది అధ్యాయాలు సమాప్త మయ్యే సమయంలో బోధించాడో, అదే శ్లోకాన్ని ఉత్తరార్థము చివర, అంటే గీతను సమాప్తం చేస్తూ మళ్ళీ పఠించాడు *(18 వ అ - 65 వ శ్లో).* రెండుసార్లు గీతలో వినపడిన శ్లోకం ఇదొక్కటే. గోవిందుని అనుగ్రహంతో గుహ్యమైన ఈ రాజవిద్య భక్తజనముల హృదయాలలో స్థిరంగా నిలిచి పోవు గాక!

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే రాజవిద్యా రాజగుహ్య యోగో నామ నవమోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు రాజవిద్యా రాజగుహ్య యోగ మనే తొమ్మిదవ అధ్యాయము.**